# అమృతం

ఆంగ్ల మూలరచయిత

## గురూజీ నౌషేర్

తెలుగు అనువాదకులు

## డా. తాడేపల్లి పతంజలి

రచనా కాలం -2017

# అనువాదకుని అనుభూతి

డా॥ తాడేపల్లి పతంజలి

కన్న తల్లిదండ్రులు తాడేపల్లి పార్వతీశ్వర శాస్త్రి, సుశీలమ్మలకు ప్రేమానుభూతితో నిండిన కళ్లతో నమస్సులు

హిమాలయాల్లోని గంగమ్మను దర్శించలేక పోతున్నాననే నా బాధను గమనించి కాబోలు - గంగమ్మ "అమృత్" రూపంలో నన్ను పలకరించింది. అలౌకికత్వానికి, లౌకికత్వానికి మధ్య ఒక అందమైన అక్షరాల పూల వంతెనను కట్టిన గురూజీ నౌషిర్ అమృత్‌ను ఆసాంతం అక్షరాక్షరం కళ్ల కద్దుకొని చదివాను.

మరణంలేని మహాయోగి మహావతార్ బాబాజీ విజ్ఞానము, గురూజీ నౌషిర్ మాటల్లో పరుగులు తీసిన వైనాన్ని తెలుగులో పట్టుకోవటం మామూలు విషయం కాదు. అసలు అనువాదమంటేనే మాటలు కాదు.

ఆంగ్లంలోని కొన్ని పదాలకు తెలుగులో సమానార్థకాలు ఉండవు. మక్కికి మక్కి రాస్తే కృత్రిమమవుతుంది. వాక్య నిర్మాణాలలో సమస్యలు ఉంటాయి. తెలుగులో ఆలోచించి తెలుగులో రాయాలి. వీటన్నింటిని ఈ అనువాదంలో అధిగమించటానికి నా చేతనయినంత వరకు స్వామిదయతో కృషిచేసాను.

గురూజీ నౌషిర్ వచనంలో చీకటి మూలంలోకి వేసిన టార్చిలైటు కనిపిస్తుంది. గురూజీ నౌషిర్ వచనంలో చీకటి మూలంలోకి వేసిన టార్చిలైటు కనిపిస్తుంది. కన్నీళ్లను తుడిచే అభయహస్తం ప్రకాశిస్తుంది. "నీకు మంచి భాగస్వామి దొరికినా, చెడు యజమాని లభిస్తాడు." మొదలైన వాక్యాలలో ఉక్తి వైచిత్రి మిలమిలలాడుతుంది. పురాతన సంస్కృతి వేళ్ల గట్టితనాన్ని ఒక పక్క ఆవిష్కరిస్తునే "యూ ఎయింట్ సీక్ నథింగ్ ఎట్" వంటి రాక్ సంగీత పంక్తులను గూరూజీ పేర్కొన్న వైనం అబ్బుర పరుస్తుంది.

సాధ్యమయినంత వరకు ఆంగ్ల వాక్యాలకు, తెలుగుతనం అద్దటానికి ప్రయత్నించాను. కొన్నిచోట్ల తెలుగు పాఠకులకి అర్థంకావాలని 'వెల్కో' మొదలైన చోట్ల అర్థాలను కుంలీకరణాలలో పక్కన తెల్పే సాహసం చేసాను.

నా ఈ అక్షరతపస్సుకి సహకరించిన మీనాంకితమైన నా కుటుంబానికి, ప్రేరకులయిన శ్రీ గంధం శంకరరావుగారికి, నాకర్మ ఋణాన్ని కొంత ఇలా తీర్చుకోవటానికి కారకులయిన పెద్దలందరికి ధన్యవాదాలు

మహావతార్ బాబాజీ గురించి, గురూజీ నౌషిర్ గురించి నేను ప్రత్యేకంగా చెప్పటానికేముంది? వారి కరుణ ఈ అనువాదానికి సిసలైన చిరునామా!

అక్షరాల ఆంతర్యాన్వేషణలో తడిసిన నా కళ్లు, నా హృదయపు చప్పుళ్లు వాళ్లకు ఎరుకే. 'అక్షరాల' అనుగ్రహించిన వారికి కైమోడ్పు.

## చదివితి దొల్లి కొంత చదివేనింకా గొంత
## యెదిరి నన్నెఱగనూ యెంతైన నయ్యో
## (అన్నమయ్య)

స్వస్తి

## ముందు మాట

శ్రీ గురూజీ నౌషియర్ యొక్క వ్యాసాల సంపుటి ఈ పుస్తకము. వారి యొక్క బ్లాగ్ - జీవితంలో వ్యతిరేకతలను ఎదుర్కొంటున్న వారికి, సంసార సాగరంలో బాధలను అనుభవిస్తున్న వారికి ఒక వైట్ హౌస్ వంటిది. జీవితంలో ఉత్తమ విలువలు సంపాదించుకోవాలి అనుకొన్నవారందరికి - ఈ వ్యాసాలు స్ఫూర్తినిస్తాయి. ఈ బ్లాగులో సూచింపబడిన మార్గదర్శకాలను అనుసరించిన ప్రతి ఒక్కరూ - ( ఏ ఒక్కరికి మినహాయింపు లేదు) ఎంతో ఉన్నతమైన జీవనపు ప్రమాణాలను అందుకొంటారు.

14 సంవత్సరాల క్రితం గురూజీ నౌషియర్ నా జీవితంలో ప్రవేశించారు. నిజం చెప్పాలంటే, గురూజీని విపరీతంగా అభిమానించి అనుసరించే నా భార్య దేవీ నా- గురూజీ "శరణము" నకు నన్ను తీసుకెళ్ళింది. గురూజీ మధురభాషి, అధునాతన వ్యక్తి మరియు స్నేహమర్యాదలు కలిగినవారు. ఆయన ఆధ్యాత్మిక క్షేత్రంలోనేకాదు - ప్రాపంచిక విషయాల్లోనూ పరిపూర్ణజ్ఞానవంతులు. ప్రస్తుత ఆధ్యాత్మిక ప్రకృతి చిత్రంలో - అధునాతన దృక్పధంతో పాటు - గాఢమైన అంతర్దృష్టి కలిగిన - అరుదైన వ్యక్తి వారు. 1999 నుంచి వారు నాకు తెలుసు వారియొక్క హితమైన సాన్నిధ్యంలో - ఆధ్యాత్మిక విషయాల పట్ల వారి నిశిత దృష్టిలో ఎంతోమంది ఎన్నోరకాల ఫలాలను అందుకోగలరు

మొదటి సారి వారిని కలుసుకొన్నప్పుడు, ప్రత్యేకంగా నా జీవితానికి సంబంధించి ఎటువంటి అన్వేషణలేదు. కాని గురూజీతో చాలా కాలం గడిపిన తర్వాత, స్వల్పమైన ఉపయోగానికి - ఈ ఐహిక జీవితాన్ని గడుపుతున్నట్టు అర్థమైంది. గురూజీ బోధనలద్వారా క్రమక్రమంగా - నా జీవితంలో చాలా లోటు ఉందనిపించింది. కాని సంవత్సరాలు గడుస్తున్నకొద్దీ, గురూజీ బోధన ద్వారా జీవితానికి సంబంధించిన సరియైన దృష్టి చూడగల్గాను. ఇప్పుడు అర్థ

వంతమైన, తృప్తికరమైన జీవితాన్ని గడుపుతున్నాను. జీవితాన్ని అనుకూల ఆలోచనలతో, సమృద్ధిగా మలుచుకొన్నాను. శాశ్వత దివ్యస్థానం నుండి వచ్చే నిజమైన ఆనందాన్ని పొందాను. ఇది కేవలం నా స్వంతం. ఇతరులమీద ఆధారపడలేదు. జీవితంలోని ప్రతి పార్శ్వంలో గురూజీ మార్గదర్శనం నాకు ఉపయోగపడింది.

గురూజీకి మహావతార్ బాబాజీ, స్వయంగా అనుగ్రహించిన విజ్ఞానంతో నిండిన అరుదైన సంపుటి ఈ పుస్తకం. మహావతార్ బాబాజీ వంటి ఉన్నత గురువు ద్వారా అనుగ్రహింపబడిన గురూజీ ధన్యులు. బాబాజీ తన కాలావధిలేని విజ్ఞానాన్ని, మానవాళి సంక్షేమం కొరకు, ఆధ్యాత్మిక అన్వేషణా పరులకొరకు - గురూజీ ద్వారా అందించారు. మనం గురూజీ నౌషిర్ ఒక ఆధ్యాత్మిక మార్గదర్శిగా, గురువుగా కలిగి ఉండే అదృష్టాన్ని పొందాం.

చావు అనేది తెలియని ఆశ్చర్యకరమైన వ్యక్తి, సర్వవ్యాపకుడయిన పూర్వ గురువు. నా కుటుంబానికి యుక్తి మరియు నిర్ధారిత మార్గాలలో సాయం చేసారు. అనేక కష్ట సందర్భాలలో - మా కుటుంబంలో - తోడుగా నిలిచి - ఒక ప్రేమమయుడైన నాన్నగా మార్గదర్శనం చేసారు మా జీవితాలలో భయంకరమైన ఆటంకాలు ఎదుర్కొనే సందర్భాలలో మాకు శక్తినిచ్చారు. మేము వారియెడల అంకిత భావంతో ఉన్నామని, వారి బోధలను గురూజీ నౌషియర్ ద్వారా ప్రపంచానికి అందించే కృషిలో ఏం కావాలో అందిస్తామని వారికి తెలుసు.

భారతసైన్యంలో బ్రిగెడియర్ (వాహినీపతి, మేజర్ జనరల్‌కి కింద సేనాధిపతి) గా సేవలందించిన నేను భారతదేశంలోని అన్ని మారు మూల ప్రాంతాలకు వెళ్ళాను. ఆశ్చర్యకరంగా గత పది సంవత్సరాలలో భారతదేశంలో సంభవించిన తీవ్రమైన ఉత్పాతాలలో ఒరిస్సాలో వచ్చిన భయంకరమైన

తుఫాను, భుజ్ భూకంపం, 2008 సునామి - ఇటువంటి వాటిలో మేము సహాయ చర్యలందించాము. కాని - లక్నోలో నాకు పోస్టింగ్ అయిన తర్వాత వ్యక్తి గతంగా నాకు చాలా తక్కువ పని అనిపించింది. కాని అది ఒక బ్రహ్మాండమైన పుణాళికకు సంబంధించిన విరామమని తర్వాత అర్థమయ్యింది. ఆసమయంలో గురూజీ నౌషిర్‌ను తనతో కలవమని చెప్పే వార్తను మహావతార్ బాబాజీ నాకు అందించారు. అప్పుడు నాకు అర్థమయింది లక్నోకి నేను ఎందుకువచ్చానో. గురూజీని మహావతార్ బాబాజీతో కలపటానికి నాకు లక్నో పోస్టింగ్  అయిందని గ్రహించాను. బాబాజీ ఇటువంటి మంచి పని నాతో చేయించినందుకు చాలా సంతోషించాను. ఈ భూమి, వాతావరణం చాలా కష్టతరమైనది మరియు ఊహించనలవికానివి. 2010 ఏప్రియల్ - మే మధ్య సరిహద్దు రహదారి సంస్థ వారు మంచు విపరీతంగా కురిసే శీతాకాలంలో రోడ్లను శుభ్రం చేయాలనే కార్యక్రమం చేపట్టారు. సరిహద్దు రహదారి సంస్థలో ఉన్న నా స్నేహితులవల్ల రోడ్లు ఎప్పుడు తిరిగి ప్రారంభిస్తారనే విషయాన్ని తెలుసుకొన్నాను. రోడ్డు ఫలానా తేదీనాడు తిరిగి తెరవబడుతుందని స్పష్టంగా తెలిపిన తర్వాత - గురూజీ బదరీనాథ్‌కి, ఆ పరిసర ప్రాంతాలకి వెళ్లడానికి తగిన సహాయ సహకారాలందించాను.

గురూజీ - బాబాజీని కలవబోతున్నారనే వార్త తెలిసిన దగ్గరి నుంచి మా అందరిలోను ఒక గొప్ప అనుభూతి. వారిద్దరి కలయిక ద్వారా రాబోయే ఫలితం కొరకు ఉత్కంఠ. తన చిత్రాన్ని తీసుకోవటానికి గురూజీని బాబాజీ అనుమతించారు. అందువల్ల మేమందరం బాబాజీ గారి ఫొటోను బహుమతిగా పొందగలిగాము. ఆ చిత్రం ఇప్పుడు పూనెలో ఉన్న గురూజీ ధ్యానమందిరంలో పూజలందుకొంటోంది. గురూజీని అంకితభావంతో ఆరాధించే శిష్యురాలు డా. సీల ఆ ధ్యానమందిరాన్ని ఇప్పుడు నిర్వహిస్తున్నాడు

ఈ పుస్తకం - శీఘ్రంగా - ఆధ్యాత్మిక పురోగతి కావాలనుకొన్న వారికి- ఒక అరుదైన వ్యాఖ్యానం. ఇందులో ఉన్న విజ్ఞానమంతా ఉన్నత శిఖరాలు అధిరోహించిన గురువైన బాబాజీ ద్వారా గురూజీ మాటల్లో చెప్పబడింది. పూర్వపు ఆధ్యాత్మిక రచయితలు తప్పుగా అన్వయించిన అనేక విషయాలలో, అర్థ సందిగ్ధత సందర్భాలలో ఇప్పుడు సరియైన అన్వయం, వివరణలు ఈ పుస్తకంలో ఉన్నాయి. ఈ విషయాలను తెలుసుకొన్న తర్వాత గురూజీ విస్తారమైన విజ్ఞానం తెరకు అవతలివైపు ఉన్నారని గ్రహిస్తాం. ఏదీ ఎరుగని సాధారణ మానవులమైన మనము అనుగ్రహించ బడ్డాం.

ఈ పుస్తకం ఆధ్యాత్మిక అంచులు చూడాలనే గాఢమైన ఆకాంక్ష ఉన్న వారికి తప్పక చదవదగినది. అశాశ్వతాన్వేషణకు, మానవ దయకు సంబంధించిన అనేక ముఖ్యమైన అందాలు ఈ సంగ్రహరచనలో సమాధానంగా ఇయ్యబడ్డాయి. ప్రతిసారి నువ్వు ఈ పుస్తకం చదువుతున్నప్పుడు, గాఢమైన లో వెలుగుతో పాటు మానవజీవన సాఫల్యతను పొందుతుంటావు.

బ్రిగ్ హర్‌దీప్ ధన్నీ (రిటైర్డ్)
ఎక్స్ ఛీఫ్ ఇంజనీర్ 3 కార్ప్స్, చీఫ్ ఇంజనీర్ లక్నోజోన్,
ఇప్పుడు అమృత్‌గ్రూప్ ఆఫ్ ఇన్‌స్టిట్యూషన్స్‌కి డీన్.
గ్రేటర్ నొయిడా కాంపస్, ఢిల్లీ యన్ సి ఆర్.

## కృతజ్ఞత

ఇప్పుడు మీ చేతుల్లో ఉన్న ఈ పుస్తకం ఎప్పుడో ఏదో అడ్డంకులతో ఆగిపోతోంది. కాని తన ప్రయాణం మొదలు పెట్టలేదు. అయినప్పటికి ఇందులోని వ్యాసాలు నా బ్లాగ్‌లో 2009 నుండి పోస్ట్ చేయబడుతున్నాయి. శివప్రియ హరలాల్ ఈ పుస్తక ప్రచురణ బాధ్యత చేపట్టాక చక్రాలు కదిలాయి. నేను మొదటగా తప్పని సరిగా ఆమెకు, ఆమె భర్త అమిత్‌కి వారి అంకితదీక్షకి కృతజ్ఞతలు చెప్పాలి. ఈ పుస్తక రూపానికి కారకుడై, కావలసిన పనులు, అనుమతులు, డిజైనింగ్, ముద్రణ, - ఇలా ఈ పుస్తకం మీ చేతుల్లో రావటానికి ఏమేమి కావాలో అవన్నీ చేసారు. ఎంతో గొప్ప సహాయము చేసిన రాజీవ్‌రాయ్‌కి కూడా ఈ సందర్భంగా కృతజ్ఞతలు అందిస్తున్నాను.

నా వ్యక్తి గత దినచర్య సహాయకురాలు డా.సీమా ఖైర్ యొక్క సహాయానికి కూడా ధన్యవాదాలు తెలియజేస్తున్నాను. నేను లేకపోయినా అవసరమయిన సహాయసహకారాలు ఈ పుస్తక ప్రచురణకు అమె అందించారు. ఎడిటింగ్, డిజైనింగ్, ముద్రణ మొదలయిన అన్నింటిలో సాయపడిన సయాలీ జోషికి, ప్రూఫ్ రీడింగ్ చూసిన సిద్ధిఖైరీకి నా ధన్యవాదములు. నా హిమాలయాల యాత్రలో నాతో సహా ఉండి, బదరీనాథ్‌లో అందమైన ఛాయాచిత్రాలు తీసిన సోమత్ జోషికి కూడా చివరిగా నా అభినందనలు తెలియజేస్తున్నాను.

ఇప్పుడు అసలైన కఠినభాగం వచ్చింది. చంద్రుడు తనకు వెలుగు నిచ్చిన సూర్యునికి ఎలాకృతజ్ఞత చెబుతుంది? ఈ పుస్తకంలోని మాటలు నావే. కాని ఆలోచనలు గాఢ విరామములోని నా స్ఫృహనుంచి వచ్చాయి. కాని జ్ఞానము మాత్రం గొప్పవారయిన మహావతార్ బాబాజీ ముద్ర మాత్రమే. నేను అంగీకరిస్తాను - విజ్ఞానము ఒక వ్యక్తి లో జ్ఞానోదయం యొక్క వివిధ దశలలో పుష్పిస్తుంది అని. కాని నీ యొక్క కాంతి అలంకరించబడుతుంది.

బలపరచ బడుతుంది ఎప్పుడంటే దైవ సదృశుడైన బాబాజీ లాంటివారు నీతో మాట్లాడినప్పుడు.

అవును. మహావతార్ బాబాజీ జీవనావధిలోని ప్రతి అంశంలో నా గురువు. వారియెడల నా కున్న అంకితభావానికి, అర్పణకి ఎటువంటి హద్దులు లేవు. అనేకమైన పురాగాథలు వారితో ముడిపడిఉన్నాయి. వాటిలో ఒకటి వారి భౌతిక అస్తిత్వ ప్రశ్నకు సంబంధించినది. వారు ఎవరితోటి కలవరు. కాకపోతే వారు ఎవరిని కలవాలనుకొంటారో వారికి సందేశమిస్తారు లేదా కలుస్తారు. మిగతా ప్రపంచానికి వారు చాలా దూరంగా ఉంటారు. అందువల్ల వారి అస్తిత్వాన్ని గురించి అనేకమందికి సందేహం పొటమరిస్తుంటుంది. వారి గురించి అన్నీ వివరించే స్వేచ్ఛ నాకు లేదు కాని నేను రెండు విషయాలు మాత్రం ధృఢపరుస్తాను. మొదటిది గత 2000 సంవత్సరాలుగా వారు అదే శరీరముతో ఉంటున్నారు. నేను నా అపూర్వమైన అదృష్ట విశేషము కొద్ది 2010 లో వారిని వ్యక్తి గతంగా కలిసాను. రెండవది వారి విస్తారమైన మహిమలు. వారి ప్రత్యేకత, ఈ భూ గ్రహములో వారికి సంబంధించిన పని వాస్తవంగా వివరించటానికి - కాదు - కాదు ఊహించటానికి కూడా ఏ ఒక్క వ్యక్తికి సాధ్యం కాదు.

ప్రియమైన పాఠకుడా, ఇప్పుడు నువ్వు చంద్రుడు - సూర్యునికి కృతజ్ఞత చెప్పటంలో ఉండే కష్టాన్ని గమనించి ఉంటావు. కాని నా గురువు యెడల నాకున్నది అపరిమితమైన కృతజ్ఞత. నేను ఎప్పుడు ఏ చిన్న పదం వ్రాసినా అది వారి కృపాకటాక్షమే.

గురూజీ నౌషిర్

## అవతారిక

చాలామందికి జనవరి మొదటి తారీఖు అంటే మరో సంవత్సరానికి మొదటి రోజు అనుకొంటారు. కాని నాకు మాత్రం, 2005లో, నా నూతన జీవితానికి ప్రారంభమయినరోజు. నేను ఆ రోజు నా జీవితాన్ని విపరీతంగా ప్రేమించాను. మళ్లీ మళ్లీ ప్రేమిస్తూనే ఉన్నాను. ఈ విశాల విశ్వంలో దేని కోసం కూడా నా చిన్నికదలికను మార్చుకోలేదు. కొత్త సంవత్సరం నాడు పూనెలో ఒక గదిలో కూర్చుని ఉన్నాను. రెండురోజుల "రేకి" సదస్సుకు హాజరవటానికి కూర్చున్న నా జీవితం పూర్తిగా, స్థిరంగా మారిపోయింది. ఒంటరి తనపు, బాధామయ అస్తిత్వము నుండి నిరంతర ఆనందంతో కూడిన జీవితాన్ని నేను కనుగొన్నాను. భయమునుండి, అజ్ఞానము నుండి నాకు విముక్తి కలిగింది. తెల్లని కుర్తా పైజమా వేసుకొని, ఒక చిన్నపాటి బృందం ముందు కూర్చున్న ఒక శిల్పి తన ప్రేమ పూర్వకమైన చిరునవ్వుతో, నవ్వేకళ్లతో నాలో చైతన్యాన్ని ప్రవహింపచేసాడు. ఆ తర్వాత రెండు రోజులు గురూజీ నౌషిర్ యొక్క గొంతు నా జీవితానికి సంబంధించిన మాయలను, గందరగోళాలను అర్థరహిత సందేహాలను అన్నింటిని పటాపంచలు చేసింది. ప్రతి దానికొరకు ఆరాటపడి నా జీవితాన్ని దౌర్భాగ్య కరంగా మార్చిన నా మనస్సు అకస్మాత్తుగా మారి పోయింది. మొదటిసారిగా నా 35 ఏళ్ల జీవితంలో, నా జీవితంలో పురోగమనం చాలా ఉందనిపించింది.

గురువుతో నా ప్రయాణం మొదలయింది. ఇంచుమించుగా ఒక దశాబ్దం తర్వాత చూసుకొంటే - వారి సమక్షంలో నేను పొందిన ప్రశాంతత, అసంఖ్యాక జనులను చాలా సులభమైన, అనుష్ఠాన వేదాంత మార్గదర్శనం ద్వారా వారు మార్చిన పద్ధతి - ఇవన్నీ గుర్తుకొస్తున్నాయి. వారి అనుష్ఠాన వేదాంతము మరియు జీవనశైలి - వ్యక్తియొక్క ప్రాచీన విశ్వాస వ్యవస్థను తొలగింపచేసి, అతడి మనస్సుపై గాఢముద్ర వేస్తుంది.

'తదేకం' అను గురూజీ సంస్థలో ఉపాధ్యాయినిగా పనిచేసే అవకాశ మొక్కటే కాదు - ప్రపంచంలో అనేక విషయాలు రహస్యంగా ఎలా పనిచేస్తాయో స్వామితో గడిపిన వేలాది గంటల ద్వారా తెలుసుకొన్నాను. గతపది సంవత్సరాలుగా ప్రతిరోజు వారియెడల అంకితభావంతో గడిపాను. అందువలననే - వారి ఆధ్యాత్మిక ప్రయాణాన్ని, తన గురువు బాబాజీతో వారికున్న గాఢానుబంధాన్ని మీతో పంచుకోగలుగుతున్నాను.

గురూజీ నౌషిర్‌కి - బాబాజీ గురించి 1997 లో వారి మొదటి గురువు యోగిరాజ్ మంగేష్‌డ చెప్పారు. మంగేష్‌డ అనేక సంవత్సరాలు హిమాలయాలలో బాబాజీతో తన 15-20 సంవత్సరాల మధ్య గడిపారు. గురూజీ మంగేష్‌డ దగ్గర ఆధ్యాత్మిక గురువు కావటానికి రెండు సంవత్సరాలు శిక్షణ పొందారు. మంగేష్‌డ - గురూజీకి 'రేకి' యొక్క సాంకేతికతను, విజ్ఞానాన్ని స్పర్శద్వారా రోగాలను నయంచేసే శక్తిని విశ్వ వ్యాప్త శక్తి ద్వారా ఎలా పొందవచ్చో చెప్పారు.

జనవరి 2000 సంవత్సరంలో గురూజీ నౌషిర్ 'రేకి' సదస్సులు నిర్వహించుటకు విజయవాడ వచ్చినప్పుడు బాబాజీ మొట్ట మొదటిసారిగా నౌషిర్ ని సంప్రదించారు. సర్వసాధారణంగా గురూజీ స్వభావరీత్యా సందేహపూరితులు (Skeptical) మాధ్యమికాల ద్వారా గాని ఆత్మ సమాచారం ద్వారా గాని అంత సులభంగా ప్రభావితులు కారు. బాబాజీ ఆంగ్లములో స్వయంగా తన చేతి వ్రాతతో ఒక నోట్ వ్రాసి రాత్రి తరువాత గురూజీకి అందేటట్లుగా ఉంచారు. రెండవ రోజు సదస్సుకు సంబంధించి పూజని ఉదయం మొదలు పెట్టబోయే ముందు గురూజీకి - బాబాజీ వ్రాసిన నోట్ కనిపించింది. "ప్రియమైన నౌష్, నీ పనితో నేను చాలా సంతృప్తిగా ఉన్నాను...." ఇలా మొదలయి తరువాత అతను చేయవలసిన సూచనలతో ముగిసింది.

ఆ రోజు నుంచి మొదలుకొని బాబాజీ నుంచి ఒక స్థిరమైన సమాచార ప్రవాహం 'రేకి' కి సంబంధించిన నిర్దిష్టమైన సూచనలతో ఆధ్యాత్మిక విజ్ఞానముతో ప్రవహించసాగింది. బాబాజీ ఎవరికి తన సూచనలు ఇవ్వాలనుకొన్నారో, వాటిని ఖచ్చితంగా గురూజీ ద్వారా అమలు పరిచేవారు. నేను స్వయంగా నా కళ్లతో ఇటువంటి బాబాజీ సందేశాలు అనేకము చూసాను. గురూజీ ఆ సంక్షిప్త నిగూఢ సందేశాలను విశదీకరించి సామాన్య మానవులకు కూడా బాబాజీ ఆధ్యాత్మిక విజ్ఞానాన్ని అందించేవారు ఒకొక్కసారి ఈ సందేశాలు గురూజీ యొక్క స్వీయ ఆధ్యాత్మిక అభ్యాసములలో కూడా వచ్చేవి. ఒకే సమయంలో విపరీతమైన కఠినత్వము, విపరీతమైన ప్రేమ కలబోసుకొన్న ఈ బాబాజీ సందేశాలు చదువుతున్నప్పుడు - నాకు చాలా ఆశ్చర్యం కలిగించేవి.

బాబాజీ స్వయంగా గురూజీకి బోధ చేసేవారు - లేదా - గురువు చెప్పినట్లు మౌనంగా - చదరంగ పావులను - తను కోరుకున్నట్లు కదిపేవారు. ఒకసారి 2003 జనవరిలో గురూజీ బాబాజీని అడిగారు - "వారిని తన గురువుగా అంగీకరించవచ్చా?" అని. సమాధానం 'లేదు' అని వర్గానికి సంబంధించినది. "నువ్వు త్వరలో నీ గురువును కలుసుకొంటావు!" అని బాబాజీ - గురూజీ నౌషిర్‌కి చెప్పారు. అందువల్ల 2003 మార్చిలో అజ్మీర్‌కి సంబంధించిన సూఫీ మతగురువు సూచనలతో - గురూజీ తన రెండవ గురువును తానే వారి ఇంటివద్ద కనుగొన్నారు. బెంగుళూరుకు చెందిన కుండలినీ జ్ఞానయోగ అవధూత శ్రీ గోవిందగిరి స్వామి వారిని గురూజీ - కలుసుకొన్నారు. గురుశిష్యులు ఒకరినొకరు వెంటనే గుర్తుపట్టారు. ఇది గురూజీ జీవితంలో మరో పదిసంవత్సరాల నూతన అధ్యాయాన్ని రచించింది.

శ్రీ గోవిందగిరి స్వామి వారి దయా ప్రేమలతో, గురూజీ నౌషిర్ శక్తిపాతము, కుండలినీ విద్యకు సంబంధించిన జ్ఞానమును సంపాదించారు.

మొట్టమొదటిసారిగా, స్వామిజీ శక్తి పాత దీక్షకు సంబంధించిన శక్తిని, నైపుణ్యాన్ని గురూజీకి అనుగ్రహించారు. గురూజీ నౌషిర్‌ని - స్వామీజీ - కుండలినీ గురువుగా అధీకృతంగా ప్రకటించి - కుండలినీ యోగానికి సంబంధించిన జ్ఞానాన్ని ప్రచారం చేయమన్నారు. గురూజీ ఇప్పుడు కుండలినీ శక్తికి సంబంధించిన ప్రారంభ నిరోధాలను నియంత్రించే శక్తి వంతులైనారు.

ఇక అప్పటినుండి 2009 మధ్యవరకు గురూజీ భారతదేశంలోని నలుమూలలా పర్యటించారు. దుబాయిలో కూడా పర్యటించి, బాబాజీ నుంచి తాను అందుకొన్న ఆధ్యాత్మిక జ్ఞానముతో సహా రేకి సదస్సులు నిర్వహించారు. ఉన్నతమైన ఆధ్యాత్మిక శిఖరాలు అందుకోవాలనుకొన్న వారికి శక్తిపాత దీక్షను ఇచ్చేవారు. ఇప్పటివరకు సుమారుగా 5000 మందికి పైగా ప్రజలు గురూజీ నిర్వహించిన కార్యక్రమాలలో పాల్గొన్నారు. ఈ సమయంలోనే 'తదేకమ్' అను పేర ఒక సంస్థను "అస్వస్థత నుంచి స్వస్థత కొరకు అజ్ఞానము నుండి జ్ఞానము కొరకు" అను నినాదముతో ప్రారంభించారు.

2009 లో గురూజీ క్షణం తీరిక లేకుండా అయ్యారు. అదే సమయంలో తీవ్రమైన తపస్సు చేసుకోవలసిన ఆవశ్యకతను గుర్తించారు. తన నిర్ణయాన్ని గురూజీ తెలియజేసినప్పుడు - బాబాజీ తను చాలా సంతోషించానని వర్తమానం పంపారు. నూతన అధ్యాయం మొదలయింది. తపస్సు చేసే సమయంలో తీసుకోవలసిన నియమ నిష్ఠలను గురించి బాబాజీ - విపులమైన సూచనలను గురూజీకి అందించారు. గురూజీ తను చేస్తున్న ప్రతిదానిని ఖచ్చితంగా విడిచిపెట్టి నవంబర్ 2009లో పూర్తి ఏకాంతములో ధ్యాన నిమిత్తం తీవ్రమైన ఆసక్తితో కూర్చున్నారు. అది వారికి ఫలితాలను వెంటనే సమకూర్చింది.

ఆ తర్వాత ప్రతిరోజు అనేక గంటలు గాఢమైన ధ్యానము చేసిన

ఫలితంగా, వారి కుండలినీ శక్తి సహస్రారాన్ని చేరింది. ఆ తర్వాత నెలవరకు వారి ఈ పరిస్థితికి ప్రత్యక్ష సాక్షిని నేనే. కొంత అధికారంతోనే ఈ విషయం వ్రాస్తున్నాను. గురూజీ శరీరం ఒక మండే కొలిమి అయింది థర్మామీటర్ వారి శరీర ఉష్ణోగ్రత 107 డిగ్రీలు మించినదాన్నిగా చూపించింది. మాత్రలు ఎటువంటి ఫలితం చూపించలేదు. గురూజీ మందుల సహాయము తీసుకోవటానికి తిరస్కరించారు. తన వెనుక భాగముపై కోడిగుడ్డును ఆమ్లెటుగా వేయించుకోవచ్చని వారు చమత్కరించారు. అస్వాభావికమైన శరీర ఉష్ణోగ్రత మరియు గాఢమైన వేడి - తట్టుకోలేని శారీరక బాధలకు కారణమయింది. కాని ఆశ్చర్యకరంగా ఆ శారీరక బాధ కాళ్ళు చేతులకు మాత్రమే పరిమితమయింది. మరే ఇతర శారీరక భాగాలకు లేదు. "నా చేతుల మీద మరియు కాళ్లమీద ఒక పెద్ద ట్రక్కు నడుస్తున్నట్లు, నా ఎముకలను పొడి పొడి చేస్తున్నట్లు అనిపించేదని - గురూజీ చెప్పేవారు. ఆ జ్వరము, బాధ గురూజీని నిద్రకు చాలా నిమిషాలు దూరం చేసేది - ఈ రకంగా చాలారోజులు వారికి నిద్రలేదు. వారు బాబాజీని సాయం అడగగా "విశ్రాంతి తీసుకో! శాంతంగా ఉండటానికి ప్రయత్నించు'' అని బాబాజీ సందేశమిచ్చారు. బెంగుళూర్ లో ఉన్న గోవిందగిరి స్వామికి - గురూజీ ఫోన్ చేయగా గురూజీ ప్రస్తుత తపస్థితికి సంతోషిస్తున్నాని చెప్పారు. కాని ఎటువంటి పరిష్కారము చెప్పలేదు. ఒక వారం తర్వాత గురూజీ పూర్తిగా శుష్కించి పోయారు. 24 గంటలు బాధ శరీరాన్ని దహిస్తుండగా వడలిపోయారు. బాధతో తబ్బిబ్బులవుతున్న ఆసమయంలో షిరిడీ సాయినాధునికి తనకు బాధల నుండి విముక్తి లేదా మరణం ప్రసాదించమని ప్రార్ధించారు. గురూజీ బాబాకు చిన్నతనం నుండి గాఢ భక్తులు. ఒక్క గంటలో గురూజీకి జ్వరాన్ని ఎలా నిరోధించాలో తెలియచేసే సందేశం వచ్చింది. మరుసటి రోజు నుంచి జ్వరము, బాధ తగ్గుముఖం పట్టాయి. కాని పదిరోజుల తర్వాత జ్వర ప్రతాపము వలన తీవ్రమైన బలహీనత వచ్చింది. ఎంత బలహీనత అంటే టీ కప్పును చేతిలోకి

తీసుకోవాలంటే ఊపిరి పోయినంత బాధ. ఒక ఇరవై రోజుల తర్వాత అద్భుతమేదో జరిగినట్లుగా గురూజీ మామూలుగా తయారయ్యారు. సాధారణశక్తి, ఆరోగ్యము - ఇదివరకేమీ జరగనట్లుగా గురూజీకి సమకూరాయి. క్రమక్రమంగా అనేక బలమైన మార్పులు భౌతికంగాను, ఆధ్యాత్మికంగాను తనలో జరుగుతున్నట్లు గురూజీ గుర్తించారు. కాని ఈ రహస్యాలు వెల్లడి చేయ వద్దని నాకు చెప్పారు.

గురూజీ ఈ తీవ్రమైన ధ్యానాన్ని మరో రెండు నెలలు కొనసాగించారు. అకస్మాత్తుగా ఒక రోజు ఫిబ్రవరి 2010వ సంవత్సరంలో బాబాజీ నుండి ఒక సందేశం వచ్చింది. "ఇప్పుడు నువ్వు నన్ను చూడటానికి సిద్ధమయ్యావు. అయితే నువ్వు నన్ను వెతుక్కొని, నా దగ్గరకురా నీ ప్రయాణంలో ఏ చిన్నపాటి సౌకర్యాన్ని నువ్వు ఆశించకు"

ఎటువంటి ఆధారము లేని ఈ సందేశంతో, బాబాజీని కలుసుకోవటానికి గురూజీ బయలు దేరారు. ఆ తర్వాత విచారణలు చేసిన తర్వాత హిమాలయాల హృదయంలో ఉన్న బదరీనాథ్‌లో బాబాజీని కలుసుకోవచ్చని గురూజీ లెక్కించారు. అందువల్ల 2010 మేలో మంచు అంత కరిగి, జనుల కొరకు రోడ్లు తిరిగి తెరవ బడిన తరువాత, గురూజీ బదరీనాథ్ వెళ్లారు. ఆ తర్వాత ఇరవై రోజులు బదరీనాథ్ చుట్టు ప్రక్కల ఉన్న పర్వతాలలో, ప్రమాదకరమైన గుహలలో అతి దూరమైన ప్రదేశంలో బాబాజీ కోసం గురూజీ వెతికారు, తిరిగారు. బదరీనాథ్‌కు 5 కి.మీ. దూరంలో ఉన్న నీలకంఠ శిఖరానికి వెళ్లే రోడ్డులో - బుద్ధ పూర్ణిమనాడు - గురూజీ బాబాజీని కలిసారు. గురూజీ యాత్రలోను మరియు బదరీనాథ్‌లో ఉన్నప్పుడు ఆశ్చర్యకరమైన, అద్భుతమైన సంఘటనలు జరిగాయి. కాని శిఖరాయమానమైన సందర్భం ఏమిటంటే బాబాజీతోటి అద్భుతమైన కలయిక. ఈ మొత్తం కథంతా ఇక్కడ వ్రాయాలంటే

చాలా పెద్దది అవుతుంది. ఏదో ఒక రోజు ఇంకోపుస్తక రూపంలో వ్రాయబడుతుంది. నేను కేవలం ఇక్కడ సూచిస్తాను. ఏదో ఒకరోజు తెలియ జేయబడుతుంది. నేనిక్కడ చెప్పదలుచుకొన్నది - బాబాజీ గురూజీని తనవద్ద ఉంచుకోవాలన్న ప్రణాళికలను మార్చుకొని, ఒక అరగంట సమావేశం తర్వాత తిరిగి పంపించి వేసారని. కాని మొట్టమొదటిసారిగా, తన ఛాయాచిత్రాన్ని (ఫోటోగ్రాఫ్) తీసుకోవటానికి అంగీకరించారు. కేవలం ప్రదర్శనకే కాని, పంపిణీ చేయటానికి అంగీకరించని కఠిన నిబంధనమీద - బాబాజీ తన ఛాయాచిత్రాన్ని తీసుకోవటానికి అంగీకరించారు.

బదరీనాధ్ నుంచి తిరిగి వచ్చిన తర్వాత - బాబాజీ ప్రసాదించిన క్రియాపద్ధతులతో - గురూజీ అధిక ధ్యానం చేసే విధానాలతో, నూతన కార్యక్రమాలతో గురూజీ ప్రజలను ప్రోత్సాహపరిచారు. 'రేకి' బోధించుటకు గురూజీ ఇప్పుడు ఆపు చేసారు. తన అనుయాయులైన కొంతమంది బోధకులకు ఆ 'రేకి' బోధించే బాధ్యతను ఒప్పచెప్పారు.

రెండు సంవత్సరాల తర్వాత, 2012 జనవరిలో, కొత్త గురువు దగ్గర తర్వాత శిక్షణ పొందమనీ ఒక బాబాజీ సందేశం గురూజీకి అందింది. ఇంకొక గురువు గురూజీ దగ్గరకు పంపబడతారని సందేశంలో ఉంది కాని, అది జరగలేదు. అయినప్పటికి 2012 ఆగస్టులో, - ఇంకా రాబోయే సమయాన్ని వృధాపరుచుకోవటానికి వీలు లేదని, ఇంకొక గురువును అత్యవసరంగా అన్వేషించమని ఒక కఠినమైన సందేశాన్ని బాబాజీ - గురూజీ కి పంపారు. ఈ అవకాశాన్ని తన స్వాయిత్తం చేసుకొంటూ - గురూజీ నౌషిర్ - బాబాజీనే తన గురువు కమ్మని విజ్ఞప్తి చేసారు. ఇది చాలా సాహస పూరితమైన నిర్ణయం. ఎందుకంటే బాబాజీ లాంటి వారిని తన గురువుగా కోరుకుంటే, ఏది చెయ్యటానికైనా సంసిద్ధంగా ఉండాలి. కొన్ని రోజుల తర్వాత 2012 సెప్టెంబర్‌లో

గురూజీ నౌషిర్‌ని తన శిష్యునిగా అంగీకరించుటకు అంగీకరిస్తూ బాబాజీ సందేశం పంపించారు. ఆ సందేశంలో 18 కఠినమైన నిబంధనలను బాబాజీ పంపించారు. ఈ నిబంధనలలో ప్రతి ఒక్కదానికి అంగీకరించటానికి గురూజీ ఆనందంగా సంసిద్ధమై ఉన్నారు. మళ్లీ మరోసారి ఒక ఉత్తమ గురువును మరొక సమగ్రమైన శిష్యుడు కలుసుకొన్నాడు.

ఆ తర్వాత జనవరి 2013 నుండి, గురూజీ నౌషిర్ తన తపస్సుయొక్క రెండవ దశను - బాబాజీ ప్రత్యక్ష సూచనలతో, మార్గదర్శకత్వంలో ప్రారంభించారు. తన జీవితకాలంలో జ్ఞానోదయం పొందే ఉత్తమ స్థితికి తాను చేరుకొన్నానో లేదో - నిర్ణయించుట - గురూజీ నౌషిర్‌కి చాలా కష్ట తరమైంది. ఒక సాధారణ వ్యక్తికి అటువంటి పరిస్థితిని దాటుట చాలా బాధాకరమే కాని తన జయ స్వభావంతో, బలమైన వ్యక్తిత్వంతో గురూజీ ఈ స్థితిని దాటారు.

ఈ పరీక్షను అనుసరిస్తూ, బాబాజీ మధ్య మధ్య అనేక నిత్య విరామాలు తీసుకొంటూ సందేశాలిచ్చారు. గురూజీకి నూతన శక్తులు, మరియు పరిణత విజ్ఞానాన్ని అనుగ్రహించారు - అనేక మార్గ దర్శక సూచనలు చేసారు. నేను వ్రాస్తున్న ఈ సమయానికి తపస్సులు ఇప్పటికీ కొనసాగుతున్నాయి. ఎప్పటికి ఈ తపస్సులు ముగుస్తాయో, ఎప్పటికి గురూజీ తన సాధారణ కృత్యాలను అనుసరిస్తారో - తెలియజేసే ఆధారమేదీ నా దగ్గర లేదు.

సాధ్యమైనంత తక్కువ పదాలలో గురూజీ జీవిత చరిత్రను తెలియ జేయడానికి ప్రయత్నించాను. కాని నాకు చాలా అధికమైన ఆనందం కలిగించే విషయము ఏమిటంటే - ఆధ్యాత్మిక వేత్తలైన బాబాజీ, గురూజీ, గురూజీ గోవిందగిరి స్వామిజీల మధ్య అన్యోన్య సహచర్య (ఇంటరాక్షన్) ని దగ్గరగా పరిశీలించటం ప్రధానంగా బాబాజీ, గురూజీల మధ్య అనుబంధం నన్ను

సంభ్రమానికి గురిచేస్తుంటుంది. బుద్ధివిలాసంతో - ఇద్దరు అసహాయశూరులు, విజేతలు చేసే యుద్ధము లాంటిదది. ఆ బుద్ధివిలాసంలో అణువణువున హాస్యము మరియు గాఢ ప్రేమ తొణికిస లాడుతుంటాయి. బాబాజీ స్థిరంగా అన్నిరకాల కఠినములైన పరీక్షలను గురూజీ మీదకు తోసివేస్తుంటారు. గురూజీ ప్రేమతో ఒకదాని తర్వాత ఒకటిగా వాటిని ఎదుర్కొంటుంటారు. ఇంకా నేను ఈ విషయంమీద, ఈ పుస్తకం నియంత వ్రాయాల్సిన విశేష విషయముంది గురూజీ జీవితము అంతా ఆసక్తిమయంగా, దిగ్భ్రాంతికర సంఘటనలతో నిండి ఉంటుంది. ఆ సంఘటనలలో కొన్ని తర్కానికి లేదా సయుక్తిక విచారణకు లొంగవు. వారిజీవితంలో నిస్తేజమయిన, రసహీనమయిన సందర్భమేదిలేదు.

ఇప్పుడు మిమ్మల్ని ఒక గుండెని పట్టుకొనే సంఘటన చెప్పి విడిచిపెడతాను.
ఒకసారి నేను గురూజీని అడిగాను. "మీరెవరో, బాబాజీ ఎవరో వాస్తవంగా తెలిసిన తర్వాత, సాధారణ మానవులతో ఇంత ప్రేమగా, వినయంగాఎలా ఉండగల్గుతున్నారు?" అని. గురూజీ జవాబిచ్చారు. "గర్వము నా స్వభావములో ఇమడదు. ఒకవేళ ఎప్పుడైనా ఆ గర్వఛాయ ఉదయిస్తే, మరుక్షణంలో బాబాజీ గారి మోము నా కళ్లఎదుట కనబడుతుంది. నా స్వంత గురువు బాబాజీ ఊహింపనలవికాని శక్తులు కలవారు. అయినా బాగా వినయవంతులు. వారు ఈ భూమిలో సంపాదించుకొన్న ఆస్తులు ఒక ఉన్ని దుప్పటి మరియు అరిగిపోయిన రబ్బరు చెప్పుల జత. వారు గుహలలో లేదా ఆకాశపు కప్పు కింద జీవిస్తుంటారు. ఇప్పుడు చెప్పు. అటువంటి జీవిత విధానం గడుపుతున్న బాబాజీ శిష్యుడనైన నేను గర్వం పొందటానికి అవకాశముందా?

దీనికి నేను చెప్పే జవాబు "తస్మై శ్రీ గురవే నమః (అటువంటి గురువు కొరకు నమస్కారం)

డా. సీమ

జులై, 12, 2014

## క్రీ.శ. 2010 మార్పు వస్తోంది

గత రెండు సంవత్సరాల నుండి, ముంబాయిలో 'రేకి' వాహికలు సంవత్సరపు చివరిరోజున జరగటం, వాటిలో కొత్త సంవత్సరంలో జరగబోయే వాటి గురించి నేను చిన్న ఉపన్యాసం ఇవ్వటం ఆనవాయితీగా వస్తోంది. ఆ సమాచారము జ్యోస్యము కాదు. కాని ఈ గ్రహానికి సంబంధించి శక్తుల మూల్యాంకనము చేయటంతో పాటు, సంఖ్యా పరమైన విశ్లేషణలు, ఈ భౌతిక ప్రపంచానికి అతీతమైన, ప్రత్యేకమైన కొన్ని విశేషాలు అందులో ఉంటాయి.

ఉదాహరణకి ఈ జనవరి 2009 సంవత్సరం ఉన్నతాలలో ఉన్నతంగా- అధమాలలో అధమంగా ఉంటుందని చెప్పాను ఇది వాస్తవికముగా వినోదాత్మకమైన పార్కులలో, సర్కసులలో ఉండే రోల్ కోస్టర్ ఎక్కినట్లుగా ఉంటుంది. (పై నుంచి కిందకు, కిందనుంచి పైకి తిరిగేది రోల్‌కోస్టర్) ఒక క్షణం ప్రపంచం అత్యున్నతంగాను, మరొక నిమిషంలో అధమాధంగాను ఉంటుందని చెప్పాను. ప్రపంచవ్యాప్తంగా ప్రభావం చూపించే శక్తి, వ్యక్తిగతంగాను ప్రభావం చూపిస్తుందని చెప్పాను. ఎందుకంటే 2009లో అంకెలను వరుసగా కూడితే (2+0+0+9) 11 వస్తుంది కనుక. నా వరకు నేను ఆశ్చర్యపోయాను ఇది నిజమయినందుకు. అనేక మంది ప్రజలు వ్యక్తిగతంగా నన్ను కలిసి నేను చెప్పినది నిజమేనని, 2009వ సంవత్సరం ఒక భారీ రోల్‌కోస్టర్ అని చెప్పారు. నన్ను కలిసిన వారిలో చాలామంది 2009వ సంవత్సరంలో తమ తమ ఆధ్యాత్మిక ఉపకరణాలు అతి తక్కువగ ఉపయోగ పడ్డాయని తమ అనుభవాలు చెప్పారు. 2009వ సం॥ము పూర్తయినందుకు చాలా ఆనందంగా ఉంది. మరి 2010వ సం॥ము ఎలా ఉండబోతోంది?

2009 కంటే 2010వ సం॥ము చాలా ఎక్కువ అభివృద్ధితో ఉంటుంది.

ఎందుకంటే 2010 ని కూడితే వచ్చే (2+0+1+0) '3' అంకె చాలా శక్తిమంతమైనది. ప్రపంచ స్థాయిలో ఆలోచిస్తే - ఇదివరకటికంటే - చాలా ఎక్కువగా - గట్టిగా శ్రమ ఉండబోతోంది. ఇంకొక మాటగా చెప్పాలంటే, ప్రపంచవ్యాప్తంగా కొన్ని సంఘటనలు చాలా ప్రత్యేకంగా - 2009 ఉన్నత పతనాలకంటే - విశిష్టంగా మారబోతున్నాయి. పగ, యుద్ధాలు, హింస, తగాదాలు మొదలయిన విషయాలలో రాజకీయ స్థిరీకరణ ఉన్న అనేక దేశాలలో తగ్గుదల కనబడుతుంది. కొన్ని ఊహించని, ఆశ్చర్యకరమైన సంఘటనలు రాజకీయ చలనాలలో జరుగుతాయి. అవి ప్రాంతీయస్థాయి, ఖండ స్థాయి లేదా మొత్తం ప్రపంచ స్థాయిలో కావచ్చు. కాని ఈ సంవత్సరం చిన్న లేదా పెద్ద స్థాయిలో- శాంతికి సంబంధించిన ఒక విధానము ప్రారంభమవబోతోంది. ఈ శాంతి విధానము ఈ గ్రహము మీద రెండు మూడు సంవత్సరాలలో ఫలించ బోతోంది. ఆ సంకేతాలు ఈ సంవత్సరం మనకు తెలియబోతున్నాయి. ఆ సంఘటనలు, మెలికలు మధ్యతూర్పు దేశాలు, ఇరాన్, ఇండోపాక్, యూరప్ మరియు చైనా దేశాలలో మనం గమనించవచ్చు.

కొన్ని గొప్ప సంఘటనలు ప్రపంచస్థాయిలో తమ గొప్ప తన్నాన్ని నిరూపిస్తూ జరగబోతున్నాయి. అవి మన మానవజీవితాలలో కాని ఆలోచనలలో కాని మార్గదర్శనం చేయబోతున్నాయి.

ప్రకృతి ఉత్పాతాలు - ఇదివరకటిలానే ఈ సంవత్సరం కూడా సంభవించ బోతున్నాయి. వాతావరణము ఉండవలసిన పద్ధతిలో ఉండదు. ఎవరూ ఊహించలేని, భయంకరమైన, నాశయుక్తమైన వాతావపణ పరిస్థితులు ప్రపంచ వ్యాప్తంగా సంభవించి, ప్రతాపం చూపనున్నాయి. ఉండకూడని చోట ఉండకూడని సమయంలో మీరు ఉండటం తటస్థిస్తే అదికేవలం మీ దుర్విధి.

వ్యక్తిగతంగా ఆలోచిస్తే - 2009 కంటే 2010 ఒక గొప్ప వెసులుబాటు కలిగిస్తుంది. వ్యక్తిగత విధికంటే అధికంగా ప్రభావం కలిగయున్నదని మీరు భావిస్తే వెనుకటి సంవత్సరాలలో మీరు మొదలు పెట్టిన, పూర్తికాకుండా ఉన్న పనులు ఈ సంవత్సరంలో ఒక కొలిక్కి వస్తాయి.

2010లో మరొక ప్రత్యేకమైన అంశం ఏమిటంటే - ఎవరు ఇప్పుడు ఉన్న స్థితినుంచి మారాలని భావిస్తారో - వారు వారి ప్రయత్నాల ద్వారా ఈ సంవత్సరం ఆశ్చర్యకరమైన విజయాలను అందుకొంటారు. కనుక ఎవరు తమజీవితాలలో మార్పు రావాలని కోరుకుంటున్నారో, ఉద్యోగాలు-వ్యాపారాలు, బంధుత్వాలు, జీవనశైలిలో మార్పు కోరుతున్నారో - వారి అభిరుచులకు తగ్గట్టుగా ఈ సంవత్సరం ఉంటుంది. ఫలితాలు చాలా వేగంగా, అనుకూలంగా ఉండబోతున్నాయి.

గత రెండు సంవత్సరాలుగా ఆధ్యాత్మిక జీవితాలలో ముందుకు కదలలేక స్తబ్దంగా ఉన్నారనుకొన్న వారికి - ఈ సంవత్సరం మహత్తరం కాబోతోంది. ఈ సంవత్సరంలో **"మార్పు"** ఒక కీలక పదం కాబోతోంది. ముందు సంవత్సరాలలో ఆలోచించిన దానికి భిన్నంగా - ఒక కొత్త పద్ధతిలో - నూతన విషయాన్వేషణలో - వినూత్న పంథాలో - ఈ కొత్త సంవత్సరంలో ఆలోచించండి, కొత్త మార్గాన్ని అన్వేషించండి.

నా బ్లాగులో ఈ నా సందేశాన్ని చదివిన వారందరికి 2010వ సంవత్సరము అద్భుతంగా, ఆశ్చర్యంగా ఉండాలని హృదయపూర్వక శుభాకాంక్షలు తెల్పుతున్నాను.

## 1. ఒక క్రమపద్ధతిలో మీ జీవితము

నిర్ణీతకాలంలో ఒక్కసారి దుమ్ముధూళితో ఉన్న మన ఇల్లును చూసి, శుభ్రంగా ఊడ్చుకోవాలని ఎలా అనుకొంటామో, - అలాగే - మన జీవితాలను కూడా మనం దర్శించాలి.

ఇది చేయటానికి మనకు కావలసినది "ఆత్మ పరిశీలన" - "నేను సకారణంగానే నా జీవితంలో సుఖంగా ఉన్నానా? నా జీవన మార్గంలో ఇంకా కొంత నింపవలసినది ఏమైనా ఉందా?" అని ఆలోచించండి. ప్రశ్నించుకోండి.

మీ జవాబు నిజాయితీగా, వాస్తవికముగా "అవును" అయితే మీరు చాలా అదృష్టవంతులు. ఆశీర్వదింపబడినవారు. నేను కొన్ని మార్గాలను మీకు సూచించగలను. కాని మీ జవాబు "కాదు" అయితే లేదా "అవును - కాదు"మధ్య స్థితిలో ఉన్నట్లయితే మీరు అనేక సంవత్సరాలు బాధ, ఒత్తిడి, కోరిక, లోభము, మానసిక/ఉద్వేగపూరిత అలసట, పోరాటము, నిరాశ మొదలైన వాటిలో అడుగు పెట్టారని అర్థం - లేదా ప్రతిరోజు ఒక కాల పట్టిక లేకుండా, ముందుచూపు లేకుండా గడిపారని అర్థం. అప్పుడు మీరు మేలుకొని, జీవితాన్ని ఒక క్రమపద్ధతిలో అనుసంధానించుకోవాలి.

మొట్టమొదట "అవును" అని సమాధానము చెప్పిన వారి గురించి ప్రస్తావిస్తాను. మీకు చక్కటి జీవితం ఉండి, తృప్తి సమన్వయ స్థాయి కలిగిన జీవితం గడుపుతున్నట్లయితే, అలానే చేరగిలబడి కూర్చోకండి. ఇంకా రా(కా)వాలిసిన వాటిగురించి ఆలోచించండి. ఇదే మీకు సరైన సమయం. ఈ ప్రపంచానికి మీరు ఇవ్వవలసిన దానికి - అనుకూలమైన చురుకుదనానికి ఎవరైతే బాధలలో ఉన్నారో వారి దుఃఖం పోగొట్టడానికి - అనుకూలమైన

మార్గాలు ఎలాగయినా వెతకండి. ఒక్కొక్కసారి వారి బరువుకి మీ భుజాలు నొప్పి పుట్టవచ్చు. చూడండి- మీరు ఒకరి బాధని గాని క్షోభను గాని ఏదో రకంగా తగ్గిస్తే ఆర్థిక సత్కారము (Fat Cheque) చేసినట్లు కారని గుర్తుంచుకోండి. తప్పని సరిగా ఇతరులకు చేసే సాయంలో మిమ్మల్ని మీరు అర్పణ చేసుకోవాలి. మీ సమయం, మీ శాంతం మీరయి - మీ ప్రేమ కూడా కలపాలి. కాసింత మానవ దయను కొన్నిచుక్కలు ఆస్వాదించాలనుకొనేవారు ఈ ప్రపంచంలో చాలామంది ఉన్నారు. ఆకలితో నిద్రపోయే వాళ్ళు, నిరక్షరాస్యులు, మోసగింపబడినవారు, మందులు లేనివారు, తెగించిన ఒంటరితనంతో ఉండేవాళ్లు - వీళ్లని మరిచిపోకూడదు. మొత్తము మీద నేను చెప్పేదేమిటంటే మీ ఆర్థిక పరిస్థితులకు తగినట్లుగా మీ హృదయాలను తెరువండి. తిరిగి ఫలితం పొందాలనుకొనే ఉద్దేశ్యంతో ఆపదలో ఉన్నవారికి సాయం చేసే గొప్పతప్పిదాన్ని చేయకండి ఉదాహరణకి ఇన్‌కంటాక్స్ కలిసి వస్తుందని డొనేషన్ ఇచ్చినట్లు మీరు ప్రజలను మాత్రమే మోసంచేస్తున్నారు.

ఇక - ఇప్పుడు - "కాదు" లేదా "అవును - కాదు" అని జవాబు చెప్పేవారి గురించి కొన్ని మాటలు. వీళ్లు తమకి తాము ఇంతవరకు ఎటువంటి సహాయము చేసుకొన్నవారు కాదు. మీ జీవితానికి సంబంధించి బాధ, పీడనము, ఒత్తిడి, కోపము, క్షోభ రావటానికి ప్రధానకారణమేమిటి? లేదా కారకులెవరు? అనే విషయాన్ని కనుగొనండి. అది వ్యక్తిగతం కావచ్చు లేదా ప్రజల సమూహం కావచ్చు; బంధుత్వము, ఉద్యోగము, డబ్బు, జరిగిపోయిన బాధాకరమైన చేటు. లేదా ప్రస్తుతం మీరున్న మార్గం కావచ్చు సరే - కారణమేమయినప్పటికి - మిమ్మల్ని నడిపే పరమొక్కటే అది "మార్పు". సరిగ్గా ఇదే సమయం మీ జీవితంలో ఒకే ఒక మార్పు తీసుకురావటానికి కొన్ని చిన్న లేదా పెద్ద మార్పులు ప్రతి మానవునికి అవసరమైన కొంత తృప్తి, సంతోషం లాంటి వైపు మిమ్మల్ని నడిపించి మీ జీవితాన్ని మార్చి వేస్తాయి. మీకు, మీ మార్పుకు మధ్య ఏది ఉన్నదో మీకు తెలుసా?

మధ్యన ఉన్న ఆ పెద్ద గోడ పేరు "భయము". కాని పెద్ద ఛలోక్తి ఏమిటంటే ఆ గోడ ఒక మిధ్య. ఒక భ్రాంతి. నువ్వు అనుమతిస్తేనే అది నీ మధ్య ఉంటుంది. అది ఉండటానికి కారణము ఏమిటంటే, నువ్వు ఆధ్యాత్మిక మరియు ప్రాపంచిక శక్తులయెడల చాలా తక్కువ నమ్మకము కలిగి ఉన్నావు కనుక నీకు ఈ కార్యాలు ఎలా జరుగుతున్నాయో అవగాహన లేదు నువ్వు ఏదైనా మార్పు చేయటానికి నువ్వు పూనుకొన్నట్లయితే, అది నీ పద్ధతిలో నీలోనూ సానుకూల దృక్పధాన్ని తీసుకొస్తుంది. ఆ సానుకూల దృక్పధం బుద్ధి పూర్వకంగా ఎవరికీ హాని చేయదు. గాయపరచదు. మొత్తం ప్రపంచమంతా స్థిరంగా నీ వెనక ఉంటుంది.

నువ్వు నన్ను అడగవచ్చు ఇప్పటిదాక ఈ పద్ధతి ఎందుకు పని చేయలేదా అని. ఎందుకంటే నీకు ఆధ్యాత్మికత మీద నమ్మకం లేదు కనుక. నువ్వు నీ జీవితంలో మార్పు తీసుకురాదల్చుకొన్న సందర్భంలో, నీకు సందేహం కలిగే స్థానాన్ని - భయం జయించి ఆ చుట్టూ విజయం సాధిస్తుంది. అప్పుడు అది ముసుగు ప్రభావం అవుతుంది ఒక భయం - ఇతరుల అభద్రతపై గురిపెట్టబడినప్పుడు- చిట్టచివరిగా జరిగేదేమిటంటే నువ్వు మొదలు పెట్టిన దురవస్థ యధాతథంగా ఉంటుంది. ఈ భయమనే గోడని పగులగొట్టడానికి ఉన్న ఒకే ఒక మార్గం.. దైవ సంబంధమైన నమ్మకం సంపూర్ణంగా కలిగ ఉ ండటమే. బాగా గుర్తు పెట్టుకోండి అది నూటికి నూరు శాతం ఉండాలి. నూటికి 99.99 కాదు. ఇక్కడొక చిన్న సూచన చేద్దామనుకొంటున్నాను. నూటికి నూరుశాతం నమ్మకం కలిగి ఉండటమనేది బూరెల మూకుడునుంచి నిప్పులోకి నిర్లక్షంగా దూకటానికి బాహ్య అనుమతి పత్రం (Open License) కాదు. బుద్ధి హీనతతో ఉన్నప్పుడు దైవికమైన నమ్మకం సమానార్ధకం కాదు. భగవంతుడు నీకు ఇచ్చిన వివేచన కల ప్రతిభను నువ్వు ఉపయోగించుకొని, నువ్వు పొందాలనుకొన్న మార్పుకి దానిని ఉపయోగించుకోవాలి. జ్ఞాపకం

ఉంచుకోండి. జాగ్రత్త పడండి, ప్రపంచం - జీవన ప్రయాణానికి సంబంధించి ఎప్పటికప్పుడు మనకు అందించే బాట గుర్తులను ఎప్పటికప్పుడు గమనిస్తుండాలి. చదవాలి. అప్పుడు వేగముగా పట్టుకొనే అవకాశాలు నీ మార్గాన్ని నీకు తెలుపుతాయి. బంధుత్వాలు, సంఘటనలు మరియు నువ్వు - ఈ మూడింటిలో మార్పు తప్పనిసరి.

## బంధుత్వాలు

బంధుత్వాల్లో స్వీకృతమైన మార్పు కలగటం చాలా కష్టం. అదే సమయంలో చాలా సంక్షోభ పరిస్థితి ఎందుకంటే ప్రజలు నిన్ను బాధకు గురి చేస్తారు. మనము అనేక రకాలైన బంధుత్వాలు సంపాదించుకొంటాం. కొన్ని పుట్టుకతో, కొన్ని రక్త సంబంధాలతో, కొన్ని వ్యంగ్య పూర్వక కల్పనలతో, కొన్ని ఎన్నికతో, కొన్ని ఒప్పందాలతో, కొన్ని నిరాశలలోనుంచి (      ) కొన్ని బలవంతాలతో, మరికొన్ని మన శుద్ధమూర్ఖత్వాలతో ఏర్పడతాయి. కాని లక్ష్యం లేక ఎందుకు 'ఈ బంధుత్వాలు సంపాదించుకొంటామో, మనకు ప్రాముఖ్యము లేని సంబంధాల నుంచి ఒకటొకటిగా బయట పడగలమో, మన జీవితాలను ఈ సంబంధాలు సమూలంగా ఎందుకు మారుస్తున్నాయో, దౌర్భాగ్యంగా ఎందుకు చేస్తున్నాయో మూలకారణంతో తెలియటం కష్టం.

ప్రతి మానవుడు త్యజింపదగినవాడు అని మొట్టమొదట గుర్తుంచుకోవలసిన సూత్రం ఒకరిని విడిచి నేను ఉండలేనని నువ్వు అనుకొంటే అది తనని తాను ఓడించుకోవటం మరియు ఆత్మకు ఆపద కలిగించటం. నీకుబాధ, క్షోభ కలిగించే బంధుత్వాల గురించి, నీ జీవితాన్ని జాగ్రత్తగా పరిశీలిస్తూ గమనించు ఆ బాధ, క్షోభ కలిగించే బంధువుని, లేదా బంధుసమూహాలను నువ్వు తేలికగా విడవగలవా అన్నది పరిశీలించు. ఇది సగం వరకు సులభమే - ఇంతవరకు నువ్వు ఆ కార్యక్రమం చేయకున్నట్లయితే,

దానికి చాలా వరకు నీ సోమరితనము మరియు చిన్నపాటి సాంఘిక అభద్రత కారణము. జాగ్రత్తగా ముందుకెళ్లి- ఆ ప్రణాళికను ఆచరించు. ఆ మార్గంలో వచ్చే భయాలకు అనుమతి ఇవ్వకు. పుట్టుక, వ్యంగ్య పూర్వక కల్పన (legal fiction) ఒప్పంద లేదా బలవంతాలకు సంబంధించి ముద్రవేయబడిన (Seal) బంధుత్వాలను గురించి ఒకసారి సమీక్షిద్దాం. వీటిలో చాలా బంధుత్వాలను లెగో ఆటబొమ్మలలా (లెగో గ్రూపునకు సంబంధించిన ఆటబొమ్మలు. బాగా ఆడతాయి) నాశనం చేయలేం. మాసిన దుస్తులను మూలపెట్టెలోకి విసిరివేసినట్లు విసిరివేయలేం. ఈ బంధుత్వాలలో కొన్ని చాలా కష్టతరమైనవి. జటిలమైనవి. ఇప్పుడు నువ్వు బాధ పడుతున్న దానికంటె ఇంకా ఎక్కువగా క్షోభ కలిగించేవి కావచ్చు. మనం సాధారణంగా వాటికి "కర్మలు" అని పేరు పెడదాం. అయినప్పటికి అవి మన జీవితంలో చాలా తీవ్రమైన ముఖ్య పాత్రను వహిస్తాయి. ఇక్కడ నేను మీకు ఒక సామెతను గుర్తు చేస్తాను. "నువ్వు వాటిని కొట్ట లేక పోతే, నువ్వు వాటిలో కలిసిపో" ఒక బాధాకరమైన బంధుత్వాన్ని తటస్థంగా ఉంచే శక్తిమంతమైన మార్గము ఏమిటంటే - హింసాత్మకమైన ఎదుర్కోలు లేకుండా - ధృఢమైన ఆత్మ సమాచారాల చేరవేత. నేను దీనిని చాలామందికి చెప్పాను. వాళ్లు నేను చెప్పిన మార్గం ఉపయోగించారు. నువ్వు ఆత్మ సమాచారపద్ధతిలో విజయం సాధించలేక పోయావంటే - సాంద్రత తగ్గటమో లేదా తీవ్ర ప్రయత్నము లేకపోవటమో - దానికి కారణం.

ఆత్మ సమాచారానికి ప్రత్యేకమైన నేర్పు లేక శిక్షణ అవసరం లేదు. నీ చరవాణి (Cell Phone) లో ఏ సాధారణ సూత్రాలు ఉన్నాయో, అవే సూత్రాలమీద ఆత్మ సమాచారము నడుస్తుంది. నీ ఆలోచనలు, విజ్ఞప్తులు, వాదాలు, చాలా ఎక్కువ గాఢత కలిగిన మానసిక శక్తితో ఎవరికి నీ ఆత్మసమాచారం చేరాలనుకుంటున్నావో - వారికి చేరుతుంది. వారి అజ్ఞేయ మనస్సు (సబ్‌కాన్షస్‌మైండ్) నువ్వు పంపిన విషయాలను గ్రహిస్తుంది. ఇది ఆ

తర్వాత ఆ హింసకుల వ్యక్తిత్వంలో - క్రమేణ - నువ్వు గుర్తుంచుకో దగిన మార్పు తీసుకు వస్తుంది. నీ పట్ల - సాధారణ ప్రజల సమూహాల పట్ల వారి ధోరణిలో మార్పును గుర్తిస్తావు.

మీలో చాలా మంది వెంటనే చెబుతారు. "ఇది చాలా పాత టోపీ అండి, మేము చాలా సార్లు ప్రయత్నించాము. పనిచేయలేదు" అని. మీ పరాజయానికి కారణము స్పష్టము. జ్ఞాపకము ఉంచుకోండి. ఇది ఆత్మ సమాచారము. మీరు సాధారణంగా ఇప్పటి వరకు చేసినది మీ స్వీయ వ్యక్తిత్వంతో. మిగతా మాటల్లో చెప్పాలంటే - ఆత్మ సమాచార వ్యవహారంలో మీ ప్రతినాయకుడు (విలన్) ని మీరు చాలా పవిత్రునిగా, ప్రకాశవంతునిగా, దివ్యమైన అస్తిత్వం కలవానిగా చూడాలి. ఎందుకంటే అలా ఉన్న ప్రతి నాయకునికే మీరు విన్నపము చేసుకోబోతున్నారు. మీరు కోపము, భయము, విచారము, అసూయ లేదా కడుపు మంట. వీటి ఆజ్ఞతో మీ ప్రతినాయకుడిని చూస్తే మీరు ఓడిపోయినట్లే.

ఆత్మ సమాచారానికి సంబంధించిన రెండు లక్షణాలు - చాలా ఆసక్తి కరమైనవి మీకు వెంటనే లేదా సత్వరమే ఫలితాలు లభించాలంటే, ప్రేమ శక్తిపై మీ సమాచారాన్ని పరుగెత్తించండి. అర్థమేమిటంటే - ప్రేమ శక్తి యొక్క పేలుడు (బ్లాస్ట్) ని అనుభూతి చెందుతూ- ప్రతినాయకుని ఆత్మకి మీ సందేశం పంపే వేళ - జత చేయండి. ఎంత తొందరగా మీరు ఫలితాలు పొందుతారో చూడండి. నువ్వు కోరుకున్న ఫలితం వచ్చేదాక ప్రతిరోజూ ఈ సమాచారాన్ని - అధిక పునఃపునరావృతి (ఫ్రీక్వెన్సీ) ద్వారా పంపుతూనే ఉండండి.

ఇంకొక కోణము ఏమిటంటే - ఈ సమస్యకి సంబంధించి మీరు శాశ్వత పరిష్కారము పొందాలంటే - నువ్వు పంపే ఆత్మ సమాచారము -

నియమ నిబంధనలతో సంబంధము లేకుండా క్షమార్పణ యొక్క స్వీకృతి - ప్రతికృతుల లక్షణాన్ని విలక్షణంగా పొంది ఉండాలి. క్షమార్పణ అనేద మన దుఃఖ కర్మల ఫలితాన్ని ముక్కలు ముక్కలుగా ఖండించివేసే అతి పదునైన ఉపకరణము కేవలం గాఢత మీదే ఆధారపడి ఉంటే (క్షమార్పణ లేకుండా), ఉత్తమ ఫలితాలు రావటానికి చాలా కాలం పడుతుంది. చాలా తీవ్రప్రయత్నాలు భరించాల్సివస్తుంది. సంగ్రహంగా చెప్పాలంటే, రహస్యంగా, ప్రేమగా మీ హింసకుని ఆత్మకు మీరు పంపే గాఢమైన ఆత్మ సమాచారం ఉండేటట్లు చూసుకోండి. ఎందుకంటే వాస్తవంలో చెప్పాలంటే - ప్రతినాయకులు అంటూ ఎవరూ లేరు. మనమందరం చాలా గొప్ప నటులం. అంగీకరించిన పాత్రలు నటిస్తున్నాం ఇప్పుడు మిమ్మల్ని అడిగేది ఒక్కటే. మీ పాత్రలను కొంచెం వెనక్కి తిప్పండి

**పరిస్థితులు**

నీ జీవితములో సందర్భములు, సంఘటనలు మారి పోవుట చిన్నపాటి ఉపాయముతో జరుగుతుంది. అతిశయించిన సమస్యల నిర్భంధాలలో లేకపోయినప్పుడు లేక తట్టుకొనే పరిస్థితులు ఉన్నప్పుడు. నీ జీవితంలో బలమైన మార్పులకు నువ్వు కోరకుండా ఉండు. దీనికి కారణము ఇది. నీ జీవితపు నమూనా లేదా విధి - పెరుగుతున్న లేదా సంపూర్ణమైన కర్మ వలన - నీ ఊహకు వ్యతిరిక్తమైన దశలో, గాఢమైన దృక్కోణం నీకు నేర్పుతుంది. అందువలన నేను చెప్పేదేమిటంటే, నీకు బాగా చివరికి వెళ్లాలి అనిపించకపోతే- అనేక సందర్భాలను మార్చుకోవాలని నువ్వు ప్రయత్నించకు.

నేను అంగీకరిస్తాను. కాలాను గుణంగా మన జీవితాలలో రకరకాల మార్పులు వస్తాయి. బాధలు, ఆర్థిక పరిస్థితులు - సామాజిక నమ్మకాలు, అనిరూపిత విశ్వాస నటనలు (Leap of faith) - ఇటువంటివన్నీ మన

జీవితాలలో పూర్తిగా మార్పును తీసుకొస్తాయి. నువ్వు మారటానికి కారణం ఏదయినా - నువ్వు జీవితాన్ని గడుపుతున్న పద్ధతి, జీవనపు ప్రత్యేక సరళి, విశ్వశక్తులతో పని చేసే కృషితో కూడిన నీ విజయగాథ, ఇవన్నీ కలిపి శక్తులను నీ మేలు కొరకు మారుస్తాయి. హ్రస్వ దృష్టిగల నిర్ణయాలను విడిచివేసే ఆలోచనలు - ఒక్కొక్కసారి - నువ్వు ఏదయితే విడవాలని అనుకొంటున్నావో అటువంటి గందరగోళ పరిస్థితులలో - పడవేస్తాయి. ఇది ఎందుకు జరుగుతుందంటే - కేవలం నీ నిర్ణయం మీద ఆధారపడియుండటం వల్ల మరియు సాధ్యమైనంత వరకు సముద్రపు అలలకు వ్యతిరేకంగా ఈదులాడటం వల్ల.

నేను మీకుమీ జీవితంలో ఆనందం పెంచేమార్పులను బాధలను సృష్టించుకోకుండా ఈ విశాల విశ్వానికి అనుగుణంగా పనిచేస్తూ - ఎలా పొందాలో తెలియజేస్తాను. మీ జీవితంలో ఆ రకమైన మార్పును మీరు కోరుకుంటున్నారని ఈ విశాల విశ్వానికి గట్టిగా చెప్పండి. ఇది కేవలం సాధారణమైన మార్గ సమాచారంవల్లగాని లేదా తేలికయిన రోజువారి ప్రార్థనల వల్లగాని జరుగుతుంది. దైవాన్ని మీరు ఏ రూపంలో ఆరాధిస్తున్నారన్నది ప్రశ్నకాదు. ప్రశ్నల్లా ఎంత శక్తిమంతంగా మీ రహస్య జ్ఞానంను (AURA) మీరు పంపగల్గుతున్నారన్నది. ఈ రకమైన "ఆరా" సమాచార చేరవేతకు కొన్ని రోజులు లేదా వారాలు పట్టచ్చు. లేదా దానికి కోర తగిన గాఢతను అందచేయండి. "ఆరా" సమాచారానికి నిర్ణీత వివరములు నింపే పత్రము (ఫార్మాట్) కాని భాష కాని లేదు

ఆ తర్వాత అడుగు కఠినమైనది. విశ్వం తప్పకుండా మీ యెడల స్పందిస్తుంది. ఇందులో సందేహంలేదు. ఏమి జరుగుతుందంటే - మీరు సూక్ష్మతరమైన, అర్థవంతమైన మార్పుకు సంబంధించిన సూచనలు అందుకోవడం ప్రారంభిస్తారు. ఆమార్పు మీకు మంచిదా కాదా అన్నది. మీరు ఆలోచించు

కోవాలి ఇక్కడే సాధారణమానవుని యొక్క లోపము కనబడుతుంది. సూక్ష్మ శరీరపు సూచనలు మరియు సలహాలు చాలా కాలము మనము కోల్పోతాము. ఎందుకంటే మనం (స్థూలశరీరం) ఆలోచించేది సరియైనదని అదే మనకు మంచిదని ఒప్పుకొంటాం. మన మొగంలో స్పష్టంగా సూక్ష్మ శరీరానికి సంబంధించిన గుర్తు కనబడుతున్నా కూడా - దానిని గుర్తించటానికి నిరాకరిస్తాం ఇలా జరగకుండా చూడండి. చాలా జాగ్రత్తగా, తెలివిగా మీరు పొందుతున్న గుర్తుల వివరణకు ప్రయత్నించండి. ఆ **గుర్తులను మీరు వెంటనే ఇష్టపడక పోయినప్పటికి.** ఈ విషయంలో మీరు విజయము పొందితే, ఇక ఎప్పుడు తప్పుచేయరు.

ఇప్పుడు ఆలోచిద్దాం : ప్రపంచవ్యాప్తంగా ఉండే ఆ సూచనలు, అర్థాలు నువ్వు ఎలా తెలుసుకొంటావు! గ్రహిస్తావు. మళ్లీ మనం ఇంకో పాత సామెత స్మరించుకొందాం. తలుపులు మారి కొంచెం బిగుసుకంటే, కొద్దిగా తోసి - ఆ తలుపులను తెరవాలి. నువ్వు ప్రపంచాన్ని సరిగా చదివి ఉంటే **ఎటువంటి భయం లేకుండా** ముందుకు నడు. కాని ప్రతి అడుగులో నువ్వు ఆటంకం ఎదుర్కొంటుంటే- తలుపులను పగలగొట్టి తెరిచే పరిస్థితి వస్తే నువ్వు తప్పు మార్గములో నడుస్తున్నావని అర్థం. జరిగే స్థితి ఏదో (సంభావ్యత) అది తిరస్కరింప బడింది. లేదా విశ్వసంబంధి సూచనలను నువ్వు తప్పుగా అర్థం చేసుకొన్నావు. ఇలాంటి పరిస్థితిలో నువ్వు నీ నిర్ణయాలను కాని - అభిరుచులు, ఇష్టం (Option) మరో సారి సమీక్షించు, కొసమెరుపు : (బాటమ్‌లైన్) నీ జీవితంలో ఘనమైన మార్పులు వస్తున్నప్పుడు విశ్వంతో ఒక భాగస్వామిలా నడు. ఒక్కసారి నీకు చక్కటి సూచనలు అందాయని అనుకొన్నావో - ఎంత వరకు వీలయితే అంత వరకు శక్తిని కూడాదీసుకొని ప్రయత్నించు. పర్యవసానం లేదా పరిణామం గురించి కొద్దిపాటి భయం కూడా వద్దు.

## నిన్ను నువ్వు మార్చుకొనుట

మానవునిగా ఉన్నాను కాబట్టి మనల్ని మనం అతిగా ఊహించుకొనే భ్రాంతుల మీద సహజంగానే - నాకు కూడా - ప్రేమ ఉంటుంది. ప్రతివాడు- లేక ప్రతి ఆమె అనుకొంటాడు - లేదా - అనుకొంటుంది. ఏమంటే - తనలో లోపాలు దాదాపుగా లేవని. తనచుట్టూ ఉన్నవారు చాలా లోపాలు కలిగి ఉన్నారని - మనం వెంటనే వాటిని ఏదోరకంగా సరిదిద్దవలసిన అవసరం ఉందని. అందువల్ల మనం చాలా సమయాన్ని మన చుట్టూఉన్న ఇతరులను మార్చటానికి సున్నాశాతం విజయం ఉన్నా, ప్రయత్నిస్తూ ఉంటాం. కారణం ఏమిటంటే మార్పు తనలో నుంచిరావాలి. మార్పు ఇతరుల ద్వారా బయటి నుంచి పొంది, ఆచరణలోకి తెచ్చుకొంటే - అది ఎప్పుడు తాత్కాలికమే. కాబట్టి నువ్వు చక్కగా మార్చదగిన వ్యక్తి ఈ ప్రపంచంలో ఎవరన్నా ఉన్నారంటే- అది నువ్వే - వేరెవ్వరిని నువ్వు మార్చలేవు.

ఈ గ్రహం మీద బిలియన్ల కొద్దీ (= లక్ష కోట్లు) జీవులు ఉన్నారు. వారిని వారు మార్చుకొనే పద్ధతిని - జీవులందరికి - వారున్న ప్రదేశాలను కలుపుతూ- నేను చెప్పటం కష్టం. అందువల్ల నేను సామాన్యంగా ప్రజలందరికి సంబంధించిన నాలుగు ప్రధాన విభాగాల గురించి వ్రాస్తాను. ఆధ్యాత్మికపు అన్వేషణాతత్పరులై, స్వార్థభ్రాంతుల నుండి చురుకుగా బయటికి రావాలనుకొనేవారికి మరియు ఉత్తమ మానవులుగా ఎదగాలనుకొనేవారికి, ఇప్పుడు నేను చెప్పబోయే విభాగాలు చాలా సన్నిహితమైనవి.

**ఎ. ప్రాథమిక సంబంధము.**

అర్థరహితమైన, అరిగి పోయిన పునరుక్తుల కష్ట వాతావరణ నేపథ్యంలో- ప్రాథమిక సంబంధం గురించి ఒక ప్రశ్న. నువ్వు ఇప్పటికి కావాలని

ఇతర జీవులను బాధపెడుతూ కీడు, కష్టం కలిగిస్తున్నావా? నువ్వు వరుసహత్యలు చేసేవాడివి లేదా ఆత్మహత్యలకు కారణమయ్యే బాంబుల విమానం కానక్కర్లేదు. ఎవరిమీద మనం ప్రేమను వ్యక్తం చేయవలసి ఉందో, వారిని ఆలోచనలేకుండా మనకు బాగా సన్నిహితులయిన వారిని - మనం బాధ పెడుతున్నాం అలా ఇతరులను బాధ పెట్టడం రేజర్ (క్షురిక) పదును కంటే పదునయిన మన నాలుకల వల్ల లేదా మన చర్యల వల్ల కావచ్చు. దీనికి ఒక విరామం ఇవ్వటానికి ప్రయత్నిద్దాం. ఎందుకంటే ఇది నీ ఆధ్యాత్మిక ప్రగతికి అవరోధం మాత్రమే కాదు., ఉన్నత స్థాయికి వెళ్లిన తర్వాత నీ కాలి చీలమండలకు భరించలేని బరువుగా తయారయి నిరాశపరుస్తాయి. నాకు తోచినంతవరకు కావాలని ఇతరులను ఇబ్బంది పెట్టడానికి మూడు కారణాలు 1. నియంత్రణలోని కోపము 2. అదుపులో లేని ఆశ 3. అధికారం లేని దురహంకారం

లొంగదీసుకొన్న కోపం - వ్యక్తిత్వంలో మార్పును లేదా బాధను నయం చేసే ప్రవర్తనను కోరుతుంది. నీ హృదయంలో అత్యధికంగా పెంచుకొన్న దురాశ - నువ్వేం చేస్తున్నావో నీకు తెలియనివ్వదు నీ విధికి సంబంధించిన శక్తిమంతమైన విషయాలను మరుగు పరుస్తుంది కనుక లక్ష్యము లేకుండా నువ్వు చేసే ప్రణాళికలు, ఆలోచనలు, దొంగతనాలు, మోసాలు - వీటన్నింటికి తోడుగా ప్రపంచం నీజీవితం నుండి నీకు ప్రియమైన వాటిని తిరిగి గ్రహించి సమతుల్యత (బేలన్స్) చేస్తుంది. అది కేవలం భౌతిక సంపదే కానక్కర్లేదు. ఏదోరకంగా చివరికి నీ వ్యతిరేక కర్మ ఋణం తీరుతుంది.

**బి. దొంగతనాల బాంబుల విమానము (స్టెల్త్ బాంబర్)**

నాకు ఈ ఉద్వేగాన్ని స్టెల్త్ బాంబర్ అని పిలవాలని ఉంది ఎందుకంటే అది అలానే పనిచేస్తుంది, కాబట్టి. అసూయ వ్యావహారిక పదము. మనలోచాలా

మందిమి ఈ భ్రాంతిలో బతుకుతుంటాము. మన శరీరంలో అసూయ అనే ఎముక లేక పోయినప్పటికి వినోదాత్మకంగా అసూయ అనేది ఏ మాత్రం లేని ఒక వ్యక్తిని నేను కలవాలనుకొన్నాను. నిజం చెప్పాలంటే అలాంటి వ్యక్తి అసలు ఉండడు; కాకపోతే అసూయ యొక్క పరిమాణాలు వేరే ఉంటాయి. అంటే నన్ను నమ్మండి. నాకు తెలిసి చాలామంది ఆధ్యాత్మిక ఔన్నత్యాన్ని పొందామనుకొనేవారు కూడా ఈ స్టెల్త్ బాంబర్ కు లొంగిపోయారు. ఇప్పుడు దీన్ని స్టెల్త్ బాంబర్ అని ఎందుకు నేను అన్నానో చెబుతాను. ఎందుకంటే చాలామందికి ఇది తమలో ఉందని చెప్పినా నిరాకరిస్తారు కాబట్టి. దీని అర్థం ఏమంటే ఇది చాలా ప్రశాంతంగా ఉంటుందని తెలుసుకోండి. నీ రాడార్లు (స్థాన నిర్ణయానికి ఉపయోగించే రేడియోసాధనాలు) ఈ అసూయను తెలుసుకోలేవు. దానినుంచి రక్షించుకొనే కవచాలు లేవు. ఉన్నట్టుండి సంతృప్తీకరణం చెందటానికి కక్ష తీర్చుకోవటానికి, విధ్వంసం చేయటానికి నీ మనస్సులో ఇది బాంబులు కురిపిస్తుంది. గందరగోళం కల్పించి, బాధతో నీ గుండెను ముక్కలు చేస్తుంది. అసూయ ఎంత పని చేస్తుందంటే నిన్ను నాశనం చెయ్యటమే కాదు. సమయం వచ్చినప్పుడు - అస్వాభావిక పద్ధతిలో నీ చేత నటింప చేస్తుంది. నువ్వు జీవితంలో చాలా తేలికగా పరిష్కరించుకొనే వాటిల్లో కూడా - అనవసరమైన చిక్కులను కలిగిస్తుంది.

ఈ అసూయ సృష్టించే విధ్వంసాన్ని తగ్గించాలంటే ఒకే మార్గముంది. ముందుగా నువ్వు అసూయతో ఎదుర్కొనబడి ఉన్నావనే విషయాన్ని గ్రహించాలి. ఇది మర్యాదకు ఫిరంగులు కాల్చే పద్ధతి. ఈ పద్ధతి జీవితకాలంలో ఒకేసారి ఉపయోగపడుతుందని తెలుసుకో. ఇలా అసూయాగ్రస్తులు చాలామంది ఉన్నారు. ఉంటారని కూడా తెలుసుకో. ఈ జనన మరణ చక్రం నుండి విముక్తుడు కావటానికి ముందుగా ప్రతి ఆత్మ ఉత్సాహకరమైన, బాధాకరమైన అనేక అనుభవాలను పొందవలసి ఉంటుంది. అందువల్ల ఎవరో

ఒకరు ఇప్పుడు ఆనందదాయకమైన అనుభవం గ్రహిస్తారు. (అది చూసి నువ్వు అసూయ పడకు) నీ అవకాశం తర్వాత ఆలస్యంగా రావచ్చు లేదా ఈ నీ జీవిత కాలంలోనే రావచ్చు లేదా రాబోయే జన్మలలో రావచ్చు. ప్రతి జీవితాన్ని ఆత్మకు సంబంధించిన తుదిలేని వీరగాథలోని ఒక విభాగంగా చూడు. అంతేకాని ఆత్మకు సంబంధించి ఈ జన్మ ఒక్కటే. ఇదే ఆఖరు అని చూడకు. ఆనందాన్ని, అనుభవాన్ని, లాభాన్ని ఏ రకంగానయినా పొందాలనుకొంటూ అలా పొందేవారిని చూసి అసూయపడకు.

**సి. ఊబి (క్విక్‌సాండ్)**

అనుబంధమంటే ఒక ఊబి. నువ్వు అనేక అనుబంధాలను తగిలించుకొన్నావంటే - నీకు ఒకే దిక్కుంది - అదే పూర్తిగా కిందికి కూరుకు పోవటం. దీనికి ఒకటే కారణం ప్రేమకు, అనుబంధానికి మధ్య తేడా తెలియక చాలా మంది ఈ చిక్కులో పడిపోతాము. పూర్తి వ్యతిరేక లక్షణాలు ఉన్న వ్యక్తుల మధ్య పోలిక - చాక్ అండ్ చీజ్ (సున్నము, జున్ను) లా మనము ఊహించినట్లుగా, ప్రేమకు అనుబంధానికి మధ్య పోలికను మనం ఊహిస్తాము. ప్రేమ సృష్టికర్తనుండి స్వయంగా వచ్చిన శక్తి. అది వ్యక్తికి ఆనందాన్ని అందిస్తుంది. అదే అనుబంధం ఒక గొప్ప భ్రాంతి. ఈ శరీరం నీదే అని భ్రాంతి కలిగిస్తుంది. ఈ జీవిత కాలంలో ఎన్నో కలిగి ఉండాలనే తృష్ణను పెంచుతుంది. కనుక ఈ రెంటికి (ప్రేమకి, అనుబంధానికి) సమాంతరం ఎక్కడ?

నువ్వు నీ జీవితంలో అధికస్థానాన్ని ఆక్రమించి బాధను, లోభత్వాన్ని కలుగ చేసే అనుబంధాన్ని అధిగమించాలంటే - నేను చెప్పబోయే ఒక తీవ్రమైన ఆలోచనను చేయి. ప్రతి వ్యక్తి, లేదా ప్రతి వస్తువు - నీకు స్వాధీనమని నువ్వు అనుకొంటున్నావో - అది వాస్తవికంగా నీకు సంబంధించినది కాదు. నువ్వు ఏమి సృష్టించలేదు. ఈ సృష్టిలోని ప్రతి బిందువు ఆ సృష్టికర్తది. లేదా విశ్వానికి

సంబంధించిన సృజనాత్మక శక్తిది. దాన్ని దేవుడను, సర్వశక్తిమంతుడను, లేదా ఇంకొక పేరుతో పిలు. నీ ఇష్టం. నువ్వు ఈ గ్రహం మీద ఏదయితే సొంతమని కలిగి ఉన్నావో, అనుభవిస్తున్నావో, బాధబడుతున్నావో - దానికి నువ్వు కేవలం సంరక్షకుడివి. సంరక్షకుడెప్పుడూ ఊరికే నామమాత్రంగా తన రక్షణలో ఉన్నవాటిపై స్వాధీనతా హక్కులు కలిగి ఉండడు. ఇంకా సులభంగా చెప్పాలంటే, బ్యాంకులో సేఫ్ డిపాజిట్ ఖజానాలు ఉంటాయి. బ్యాంక్ - ఆ సేఫ్ డిపాజిట్ ఖజానాలకు యజమానిని అని చెప్పుకొంటే చెల్లదు. కేవలం సంరక్షకురాలు మాత్రమే.

కనుక నీ జీవితంలో నీకు తటస్థించే ప్రతి వారితో పుట్టుక నుంచి మరణం వరకు ప్రేమను ప్రదర్శించు. నీ జీవితంలో సంభవించే ప్రతి విషయంలోనూ ఆనందించు. కాని నీకు సంబంధించిన వ్యక్తులతోను, వస్తువులతోను ఒక్క నిమిషంకూడా విశ్వాసం కలిగి ఉండకు.

## డి. రహదారిపై గల అవరోధం (ది రోడ్ బ్లాక్)

నీ ఆత్మకు సంబంధించిన ప్రయణంలో నువ్వు ఒక ప్రత్యేకమైన ఒక రహదారి అవరోధాన్ని ఎదుర్కోవాల్సి వస్తుంది. ఆ రహదారి అవరోధం నీ అభివృద్ధిని, పెంపుదలను నిలుపుదల, ఆలస్యం లేదా నిరాశకలిగించేటట్లు చేస్తుంది. ఆ ప్రత్యేకమైన అవరోధం పేరే అహంకారం (ఇగో) లేదా ఇంకా బాగా అర్థం చేసుకోవలంటే స్వార్థ వ్యక్తిత్వం. ఇగో అన్నది భయంకరమైన శబ్దమేమీ కాదు. అది నమ్మకాన్ని కాపాడుతుంది. దానికి సంబంధించిన ప్రతిదీ వ్యతిరేకమేమీ కాదు. నువ్వు ఎలా అర్థం చేసుకుంటావో, నీ వ్యక్తిత్వానికి అనుగుణంగా ఎలా మలుచుకొంటావో - సరిగ్గా అదే పోలికగా - ఇతర జీవులు కూడా మాట్లాడే ప్రాంతంగా మలచుకొంటారు.

గర్వము లేదా అహంకారం అనేక రూపాలలో వస్తుంది. ఒక్కొక్కసారి అతి సూక్ష్మంగా ఉంటుంది. నిన్ను గర్వి లేదా పొగరుబోతు అని ఎదుటివారు పిలిచినప్పుడు నువ్వు తీవ్రమైన దెబ్బ (షాక్) తినేటంత సూక్ష్మ రూపంలో కూడా అహంకారం ఉంటుంది. ఐశ్వర్యము, అందము, అధికారము, తెలివితేటలు, విద్య, అపక్వమైన ప్రతిభ మరియు స్పష్టమైన బుద్ధిమాంద్యము- ఇలా కొన్ని పెద్ద కారణాలు నీ అహంకారాన్ని ఉబ్బేటట్లుగా చేస్తాయి. తీవ్రమైన అహంకారం కలిగిన వాళ్లు - తమ అహంకారపు బరువు కింద నలగ్గొట్టబడుతూ, తమ ముక్కలను నేల మీద రాస్తున్న దృశ్యాన్ని చూస్తూ ప్రపంచం చాలా ఆనందపడుతుంది. ఇంతకంటే ప్రపంచం మరెప్పుడూ ఆనందపడదు.

మనమందరం కాస్త ఎక్కువో - తక్కువో - సమానమైన తెలివి తేటలు, అందం, నేర్పు కలిగి ఉన్నవాళ్లము అనే వాస్తవాన్ని నువ్వు గ్రహిస్తే నీ అహంకారం అదే పనిగా ఉబికుబికి రాదు. మనలో చాలా మందిమి చాలావరకు నేర్పు సమానంగా కలిగనవాళ్లమే. కాకపోతే మానవజన్మ ఎత్తిన తరువాత - మనకు మనమే కొన్ని పరిమితులు విధించుకొని, మన తెలివిపై లేదా విచక్షణా జ్ఞానముపై రకరకాల ముసుగులు వేసుకుంటున్నాం. తన జీవితకాలంలో ప్రతి ఒక్కరూ నేర్చుకొనే విధంగా రకరకాల జీవితపాఠాలు ఒకే ప్రయోజనంతో ఏర్పాటు చేయబడ్డాయి. నీకంటే ఇతర జీవాత్మలు తక్కువగా ఇస్తే, లేదా తక్కువగా ఇవ్వబడితే - అది వారితప్పుకాదు. ఈ జీవితకాలంలో ప్రకృతి ఇచ్చిన అవకాశాలను తమ విధిరాతను అనుగుణంగా వాళ్లు మలచుకొంటున్నారు. ఐశ్వర్యానికి సంబంధించి ఒక మాట : నగ్నంగా వస్తావు. నగ్నంగా వెళ్లిపోతావు. నగ్నపు రెండు స్థితుల మధ్య ప్రతిదీ అశాశ్వతం. మరియు క్షణికము. సంపద మెరుపులా ఏ క్షణమయినా మాయ మవ్వచ్చు.

**కొస మెరుపు (బొటకు లైన్)**

నీ వ్యక్తిత్వ రక్షణకి తగ్గట్లుగా నీ ఇగోని కలిగ ఉండు. అన్ని పరిస్థితుల్లోనూ నీ ఆత్మ గౌరవాన్ని కాపాడుకో. కాని అదే ఇగో (అహంకారం) నిన్ను నిరంకుశంగా తయారు చేస్తే మాత్రం, నువ్వు పరాభవానికి గుర్తు అవుతావని మాత్రం మరచిపోకు.

## 2. ఈ ప్రపంచంలో జీవిస్తూ ప్రపంచంతో సంబంధం లేకుండా ఉండటం ఎలా?

నేను చాలా సార్లు కోపము, భయము, ద్వేషము, అనుబంధం, అసూయ, దురాశ, మరియు దురహంకారం - ఇలాంటి వాటి గురించి వ్రాసాను. మరియు మాట్లాడాను. ఇవన్నీ వ్యతిరేక ఉద్వేగాలు, గుణాలు. ఉత్తమవ్యక్తిగా మారాలను కొనేవారు తప్పని సరిగా వీటిని విడిచి వేయాలి. ఈ అధ్యాయంలో ఆ గుణాలను నువ్వు అభివృద్ధి చేసుకుంటే - లేదా నీలో తిరిగి కనుగొంటే - ఉత్తమ మానవునిగా అవటానికి నీకు సాయపడవని వ్రాయబోతున్నాను. సంస్కరింపబడిన ఆ గుణాలు నీ మానసిక, ఉద్వేగ, ఆధ్యాత్మిక అభివృద్ధికి మరియు ఆశ్చర్యకరమైన పరిశుద్ధి చేయబడిన స్థితిలోకి తీసుకువెళతాయి. చివరి ఫలితం ఏమిటంటే, నిర్ణీత కాల పరిమితులలో నువ్వు ఐశ్వర్యయుతమైన, తృప్తి నిండిన జీవితంలోకి అడుగుపెడతావు.

**అంతర్గతమైన వేర్పాటు (Inner Detachment)**

అంతర్గతమైన వేర్పాటు అనేది అనుబంధానికి వ్యతిరేకం కాదు. ఒకరు లేదా ఒకటి పోతుందేమో అనే భయంతో ఉండేది అనుబంధం. విజ్ఞానముతో కూడిన నడక, మరియు ఉదాత్త స్థాయిలో అర్థం చేసుకొన్న జీవితం ఈ భయాన్ని పోగొడుతుంది. ప్రపంచానికి సంబంధించిన ఆనందాలు మరియు స్వాధీనాలు వదులుకొనే త్యాగం అనే పదం కూడా "అంతర్గత వేర్పాటుకు" సరియైన పర్యాయపదం కాదు. నిజమైన త్యాగ గుణము చాలా కొద్ది శాతం ఉన్న విశాలమైన పరిణత అంతరాత్మలు గల మహనీయులవల్లే ఆచరింప బడుతుంది. అలాంటి వారు మానవ జన్మ అనే చక్ర భ్రమణంలో అధికమైన- లేదా తక్కువగా పరిభ్రమించేవారు. నన్ను నమ్మండి. అలాంటివారిని కనుక్కోవటం చాలా కష్టం. నేను యధార్థమైన (జెన్యూన్) అనే పదాన్ని వాడాను.

ఎందుకంటే అధికమైన అభిమానులు ఉన్నప్పటికి లేనప్పటికి, నాటకాలు ఆడినప్పటికి, ఆడనప్పటికి - చాలామంది సన్యాసులవటానికి ప్రయత్నిస్తుంటారు. చాలా సంవత్సరాల తర్వాత సరియైన మార్గ దర్శనం లేక సన్యాసాశ్రమం నుంచి తిరుగు ముఖం పడతారు. లేదా బాగా జనాలకు తెలిసినవారై ఆధ్యాత్మిక మత నాయకులై వ్యక్తిగతంగా అపఖ్యాతి వహించిన సంతృప్తి కరమైన జీవితం గడుపుతారు.

కనుక అంతర్గత వేర్పాటు అంటే ఏమిటి? సంతృప్తికరమైన జీవితానికి అది ఎందుకు ముఖ్యమైనది? దానిని చక్కగా వివరించగలిగే ఒకేఒక్క వరం వైరాగ్యం. చాలామంది ఈ వరమంటే భయపడతారు. ఎందుకంటే వైరాగ్యంతో కలిసి ఉంటే జీవితాలు ఖాళీ అవుతాయి. పేదరికం, పరిస్థితులకు తగిన కష్ట సహిష్ణుత, పూర్తిగా శూన్యమైన ఆలోచనలు ఇవి వైరాగ్యంతో కలిసే వచ్చేవని భయం. సత్యం కంటే ఇంకా ముందుకు వెళ్ళేది ఏది లేదు. వైరాగ్యము అంటే పైన చెప్పిన వాటిలో ఏ ఒక్కటి కాదు. దీనికి వ్యతిరేకం మానవుని ఒకే ఒక్క గుణము వైరాగ్యము తప్పని సరిగా సంతోషాన్ని శాంతిదాయకమైన మనస్సుని, లక్ష్యంలేని కఠినమైన బాహ్య వాతావరణాన్ని - విస్తృతపరుస్తుంది. ఒక చిన్న వివరణ దానిని విశదం చేస్తుంది. అంతర్గత వేర్పాటు - నీ హృదయం యొక్క లోతుని నువ్వు చూసేట్టు చేస్తుంది. నీ జీవితాన్ని, ప్రపంచాన్ని, బంధుత్వాలను, నీ భౌతిక సంపదలను అర్థమయ్యేటట్లు చేస్తుంది. ఈ గ్రహంమీద నిజమైన జీవన ఉత్సవాలకు నువ్వు చాలా విముఖుడివయ్యావు. ప్రజలను కలవటంలోను, వారితో గాఢానుబంధాలు పెంచుకోవటంలోను, భౌతిక సంపదల స్వాధీనంలోను అతుక్కుపోయావు. బాధ పెట్టుట, కీడు చేయుట, విచారము - ఇటువంటివన్నీ నీ స్థిరమైన సహచరులు (Companion) అయ్యాయి.

భాగస్వామ్యమవుతూ, జీవితాన్ని భిన్నం చేసే ఈ కోరదగని

సాహచర్యాల నుంచి రక్షణ కొరకు, నువ్వు తప్పని సరిగా పూర్తిగా అవగాహన చేసుకోవాలి. దీని అర్థం ఏమంటే - మానవజన్మని ప్రాతిపదికగా తీసుకొని ఉన్నదున్నట్లుగా నువ్వు ఈ జీవితంలో ఎదుర్కొనే బంధుత్వాల గురించి ఆలోచించు. ఐశ్వర్యము, డబ్బు, భౌతిక సంపదలు సృష్టికర్త వస్తు ప్రణాళికగా తలచు.

ఈ చిన్న భావాన్ని వివరించటానికి ఒక ఉదాహరణ మీకు చెప్పటం మంచి పద్ధతని నేను తలుస్తాను. ఒక అసాధారణమైన ద్వీపములో ఒకవారం పాటు సెలవు దినాలు గడుపుటకోసం ఒక ఏడు నక్షత్రాల రిసార్ట్ ను ఒక వారానికి ఏర్పాటు చేసుకొన్నారను కొందాం. మీరు మీ గమ్యస్థానానికి చేరిన వెంటనే మీరు ఆహ్వానస్థలిలో (రిసెప్షన్) మనఃపూర్వకంగా ఆహ్వానింపబడతారు. మీ గదికి సంబంధించిన తాళం చెవి మీకు ఇవ్వబడుతుంది. అక్కడ పనిచేసే సిబ్బంది మీ విలాసానికి, సౌఖ్యానికి తగ్గట్టుగా ప్రతివిషయంలో సేవలందిస్తామని చాలా వినయంగా చెబుతారు. ఆ వారం రోజుల పాటు ఆ "రిసార్ట్" (సమావేశ స్థలం) లో ఈతమడుగు (స్విమ్మింగ్ పూల్), నాణ్యత గల ఉపాహార శాలలు (రెస్టారెంట్లు) వేడి నీళ్ల సౌకర్యం గల స్నానాల గదులు, వ్యాయామశాలలు (జిమ్), నీటి ఆటలు, భూమి మీద ఆడే ఆటలు - ఇలా మీరు ఏమి అడిగితే అది మీకు లభ్యమవుతుంది. ఆ వారం అయి తర్వాత మీ పెట్టె బేడా సర్దుకొని కొత్త స్నేహితులకు వీడ్కోలు గుర్తు (గుడ్‌బై) పలికి - సందర్శకుల పుస్తకంలో మీ కలల విరామకాలాన్ని వాస్తవం చేసిన సిబ్బందికి, వారిసేవకు ధన్యవాదాలు వ్రాస్తారు. అక్కడి నుండి సంతోషకరమైన జ్ఞాపకాలు మరియు డిజిటల్ కెమేరాలలో (సంఖ్యలకు సంబంధించిన ఛాయాగ్రహా) వందల కొలది ఛాయా చిత్రాలు తీసుకొని మరో సెలవు రోజు తప్పక వస్తానని చెప్పుకొని బయటపడతారు.

ఈ భూగ్రహము పై నీ ప్రవర్తన కూడా అచ్చం అలాంటిదే. దీనిని బాగా ఆలోచించండి. వారం మొత్తం రిసార్ట్‌లోని గదిని వాడుకోవటానికి నీకు సర్వహక్కులు ఉన్నప్పటికీ, వారంలో ఎప్పుడయినా, ఆ గది నా స్వంత ఆస్తి అని ఎప్పుడన్నా అనుకొన్నావా? లేదు. హోటలు మరియు గదికి సంబంధించిన ఉపకరణ సామాగ్రి (ఫర్నిచర్), దర్వాజాలు (ఫిక్సర్స్), సదుపాయాలు (ఎమెనిటీస్) నీవని ఎప్పుడన్నా ఆ వారం రోజులలో అనుకొన్నావా? వాటిని విడిచిపెట్టి వెళుతున్నందుకు నీకు బాధ ఏమన్నా కలిగిందా? లేదు. ఆ వారం రోజులలో పరిచయమైన కొత్త స్నేహితులను విడిచిపెట్టే సందర్భంలో, అక్కడ పనిచేసే సిబ్బందిని వదిలిపెట్టే సందర్భంలో - వియోగ దుఃఖమేమన్నా అనుభవించావా? లేదు.... లేనే లేదు ఎందుకు? ఎందుకని నీకు బాధకాని, కలతకాని లేవు? దుఃఖవ్యతిరేక దిశలో, నువ్వు చాలాహాయిగా ఇంటికి విశ్రాంతిగా, ఆనందంగా, తృప్తిగా వచ్చావు.

ఇందుకు కారణాలు రెండు. ఒకటి, నీకు ఆ రిసార్ట్‌లోని ప్రతిదీ ఒక కంపెనీకో లేదా వ్యక్తులకో సంబంధించినదని, వారే యజమానులని నీకు తెలుసు. ఆ రిసార్ట్ నా సొంతం అనుకుంటే అంతకంటే పిచ్చి, అవివేకం ఇంకొకటి లేదని నీకు తెలుసు. రెండు, అక్కడ ఉన్న స్నేహితులను సిబ్బందిని విడిచిపెట్టే సమయంలో ఎటువంటి బాధా నీకు లేదు. ఎందుకంటే అక్కడ ఉ ండేది. వారమే అని నీకు తెలుసు మళ్లీ ఆ ప్రజలను నువ్వు కలుసుకోలేవని చూడవని తెలుసు. సరిగ్గా **దేవుడు - ఈ భూగ్రహం మీద ఇలానే నిన్ను ఆలోచించమని చెబుతున్నాడు.**

ఈ భూమి మీద నీకు ఏదీ సొంతం కాదు. ఏది ఆశించవద్దు. కాని హోటల్ గదిలా, స్వల్ప కాలానికి ఈ భూమ్మీద సిరిసంపదల వైభోగాలు నీకు ఇవ్వబడ్డాయి. ఇందులో ప్రతిదీ ఆ సృష్టికర్తది అందువల్ల నీది కాని దానిమీద

నీకు ఎందుకు ఇంత అనుబంధం? ఈ సమయము పూర్తయిన పిమ్మట ఇంకొకరు నీ ఆస్తిని, సంపదను అనుభవించటానికి సిద్ధంగా ఉంటారు. ఎలా- హోటల్ గది నువ్వు ఖాళీ చేసిన తర్వాత ఇంకొకరు ఆక్రమిస్తారో - అలా- సంపదలు, ఆస్తులు, భౌతిక పరమైన ధనసామాగ్రి నుండి అంతర్గత వేర్పాటు అంటే - అతి బీదవానిగా, ధనమును దూరం చేసుకొన్నవానికి బతకమని కాదు.

దాని అర్థం ఏమంటే అన్ని రకాలైన సంపదలను - అవి నీకు వారసత్వంగా వచ్చినవి కావచ్చు - నీ కష్టార్జితాలు కావచ్చు - ఈ ప్రపంచం నీకు ప్రసాదించిన వాటిని - ఒక నిర్ణీత కాలావధివరకు నువ్వు అనుభవించు ఆ సంపదలను తీవ్రమయిన ఉత్సాహంతో అనుభవించు, వాటిని పర్యవేక్షించు. అవి నీవికానప్పుడు - నీకు దూరమయినప్పుడు ఏడుస్తూకూర్చోకు. ఆ సంపదలు నీతోనే మొదలు కాలేదు.

ఈ రకమైన స్వభావాన్ని, దృష్టిని పెంచకోవటం చాలా ముఖ్యము మొదటగా - నీ యొక్క దురాశ, ద్వేషము మొదలయిన వాటిలో పెంచుకొన్న వ్యతిరేక కర్మతో ఉన్న అనేకరకాలైన మార్గాలతో ఒక్క దెబ్బతో కూలదోయ బడ్డావు. రెండవది - నష్టము యొక్క బాధతో వాస్తవంగా అవమానపడ్డావు. నీది కానిదానివల్ల నువ్వు బాధపడనవసరం లేదు. ఇదే సమయంలో - నువ్వు సాధారణమైన రీతిలో జీవించు, సన్యాసము యొక్క నీడలోకి వెళ్లకుండా, ఈ సాధారణ పాఠాన్ని నువ్వు నేర్చుకో. ఇది తుట్టతుదకు నువ్వు నేర్చుకోవలసినది. చేయవలసినది.

ఇప్పుడు ఇదే తరహాలో ఉన్న అంతర్గత వేర్పాటుతో ఉన్న ప్రజలతో కలిసి జీవించటం అల్పస్థాయియైనా చాలా కష్టం ఎందుకంటే అనేక బలమైన, క్లిష్టమైన ఉద్వేగాలు ఇందులో ముడిపడి ఉన్నాయి. మరియూ, బంధుత్వాల

విషయంలో మనము బలవత్తరమైన మానసిక స్థితితో జీవిస్తున్నాము. కాని బాగా గుర్తుపెట్టుకో. ప్రతి ఆత్మ తనదైన వ్యక్తిగత ప్రయాణాన్ని పెరుగుదలతో కలిగియుంది. అటువంటి బంధుత్వాలతో పరస్పర అనుభవాల స్వీకృతి కలిగి ఉన్నాము. మనము ఈ గ్రహం మీదికి ఒంటరిగా రాలేదు. ఈ అంటుకొన్న బాధపెట్టే బంధుత్వాలన్నీ, కాలావధి కలవి. హోటల్ రిసార్ట్‌లో మళ్లీ కలుసుకోలేని స్నేహితులు, సిబ్బంది లాంటివి. నువ్వు నీకున్న బాగా దగ్గరి బంధుత్వాలలో - అనేకులలో ఒకనిగా మానవతాదృష్టితో నీ హృదయానికి దగ్గరైన ఒక బంధుత్వాన్ని పరిశీలించు ఆ బంధుత్వము కూడా అనుల్లంఘనీయమైనది కాదు. అవసరమయితే వాడిని విడిచి ఉండలేనంత బంధుత్వం కాదు అది. బాగా నీ హృదయంలో గాఢంగా ఆలోచిస్తే - ఈ ప్రపంచంలో ఎవరూ కూడా నీ ఆనందానికి వదిలివేయరాని వారు కాదని బాధ లేనంతవరకు - ఇద్దరి మధ్య ఉన్న బంధుత్వానికి ఢోకా లేదని గమనిస్తావు అయినప్పటికి, ఇక్కడ నేను ఒకటి జత చేయదలుచుకొన్నాను. ప్రజల నుంచి విడిపోయిన తర్వాత వెన్వెంటనే అభేద దృష్టి, వైరాగ్యము, నిరాలోచనము - ఇలాంటివన్ని వస్తాయనుకోవటం భ్రమ, అంతర్గత వేర్పాటు - పరస్పరముగా ప్రేమ, దయ, కృతజ్ఞత, మానవత - ఇలాంటివి వదులుకోదు. బాధ లేకుండా మరియొక దాని కంటే ఎక్కువగా వాటిలో లీనమవుతుంది.

చివరగా ఏ హద్దులో అయినా వైరాగ్యాన్ని నువ్వు పొందితే అది నిన్ను స్వయంగా లేదా విపరీతంగా యథోచితంగా బాధను, హింసను కలిగిస్తుంది. అదే వైరాగ్యము - నీలో అంతర్గత వేర్పాటును అభివృద్ధి చేస్తే **"ఇది కూడా తప్పకుండా వెళ్లి పోతుంది"** అనే మాటలు నీ కళ్ల ఎదుట తేలి పోతుంటాయి.

## వ్యాఖ్యలు

ప్రశ్న :

నాకు రెండు ప్రశ్నలున్నాయి.

1. ఈ మొత్తం ప్రపంచానికి సమన్వయించి - వినిమయము మరియు భాగస్వామ్య అర్థాలను తెలిపే వేరే పద మేదన్నా ఉందా? (ధనంకాక) తీర్మానము - ఒడ్డునుండి కొంతదూరమున (ఓడలకు చాలునంత) లోతుగల సముద్రభాగములో (Offing) లో ఉంది. అది కూడా జటిలమైనది మరియు ఆర్థిక రాజకీయ విధానాలను తెలిపే మహాప్రయత్నము.

2. నా చుట్టూ ఎప్పుడూ చాలా ఉన్నతమైన సృజనాత్మక ప్రజలు ఉంటారు. వారిలో కొంతమంది ఉద్వేగాల్లోను మరియు క్రుంగదీసిన ధోరణిలో ఉంటారు. వాళ్లు చెప్పేది ఏమిటంటే ఒక్కొక్కసారి ఆ ఉద్వేగపూరిత, అధైర్యస్థితులే తమకళకు, సృజనకు ఆధారమంటారు. ఇలాగే, ఈ ప్రపంచంలోని అన్ని రకాల భయంకరగుణాలు చాలా గొప్పకళకు, గొప్పదైన సంగీత వ్యక్తీకరణకు, బాగా ప్రకాశించే చిత్రాలకు కారణమవుతున్నాయి. గురూజీ ఇలాఎందుకు! ఒక్కొక్కసారి నేను కుంగుబాటుకు గురయినప్పుడు, కారణం లేకుండా ఏడ్చినప్పుడు, ఆ సమయాలలో నా మనస్సు వెనుక భాగంలో నేను చాలా సంతోషపడుతుంటాను. ఈ రకమైన కొత్త ఆలోచనలు, భావాలు నన్ను డోలాయమానస్థితిలో పడవేస్తున్నాయి. దయచేసి నాకు సాయం చేయండి.

గురూజీ సమాధానం :

ఈ ప్రపంచంలో వినిమయానికి సంబంధించి ప్రస్తుతము ధనానికి సంబంధించి వేరే ప్రత్యమ్నాయం లేదు. సమీప భవిష్యత్కాలములో కూడా ధనానికి సరిపోయే ప్రత్యమ్నాయం కనిపించటంలేదు. మనకు ఇష్టమున్నా లేకపోయినా, మనము ధనంతోనే అన్ని వ్యాపారాలు చేయాలి. ఆ సంపదతో

అనేక రకాలైన దుర్గుణాలు, ఇక్కట్లు కలిసి ఉంటాయి. నువ్వు ఈ వ్యవస్థను మార్చలేవు. కాని నువ్వు తప్పనిసరిగా నీ దృష్టిని, దానికి ప్రతిస్పందించే గుణాన్ని మార్చుకోవచ్చు.

అది నిజమే. బాధ అనేది వివిధరకాలైన కళాత్మకరంగాలలో ఒక ముఖ్య ఆరంభ స్థానము మూలము. అది ఎలా పని చేస్తుందో ఇది అదే. కళాత్మకంగా ఆధారిత ప్రజలు - వివేకము గలవారు - తరచుగా - సులభంగా బాధలకు గురవుతుంటారు.

కొంత మంది దుఃఖాన్ని పూర్తిగా ఊరికే వదులు కొంటారు. మరి కొంతమంది తమ బాధను సమయము వచ్చినప్పుడు - తీవ్రంగా తమ కళారంగంలో నింపి, పోగొట్టుకొంటారు. బాధ మరియు తీవ్రమైన వాంచ తరచుగా ఉత్తమమైన కళాఖండాలను సృష్టిస్తాయి. ఈ కళాఖండము - కళాకారునికి తన దుఃఖములో నుంచి విముక్తి కలిగిస్తుంది అనేది వివాదస్పదము కావచ్చేమో కాని, అతని యొక్క సూక్ష్మ బుద్ధికి సంబంధించిన కళాత్మకమైన బహుమతి ఈ ప్రపంచానికి దక్కుతుందనుట నిర్వివాదాంశము.

చిత్రం గీసినప్పుడు నువ్వు ఏడవటానికి ప్రధాన కారణం బహుశా నువ్వు దానివిషయంలో అంత "మృదుత్వం" కలిగి ఉండటం, నీలో ఉన్న దయ- అసమగ్రమైన, అసంపూర్ణమైన, అన్యాయమైన - నీ చుట్టూ ఉన్న ప్రపంచాన్ని చూసి ప్రవాహంలా బయటికి పొంగుతుంది.

ప్రశ్న :

ఒక వ్యక్తి తనతోటి వారిలో ఎక్కువమందితో సంబంధాలు నెలకొల్పుకునే సమయంలో తటస్థీకరణంగా ఎలాఉండగలడు? అతను వారిని

పట్టించుకోవచ్చు లేదా వారితో శ్రద్ధ లేకుండా, లక్ష్యము లేకుండా ఉండవచ్చు. అయితే దానిని అతడు చూపించడు. ఆధ్యాత్మిక వివేచనలో - ఇటువంటి వ్యక్తిగత అభ్యాసనలు - ప్రజల నుండి విడివడే ఉత్తమ అంతర్గత వేర్పాటు'' లను సూచిస్తుందా?

గురూజీ సమాధానం :

అంతర్గత వేర్పాటు అంటే ప్రతివారితో బయటికి చల్లగా ఉండటం తీరా తటస్థంగా ఉండమని కాదు. అలాఉంటే, ప్రేమ దయతో నిండిన మానవుని యొక్క ఉత్తమ దైవీగుణాన్ని పోగొట్టుకుంటావు. నువ్వు తప్పనిసరిగా చివరకు నేర్చుకోవలసిన అభ్యాసము **నియమాలు లేని విశ్వ వ్యాప్త ప్రేమ.** నువ్వు ప్రేమను అభ్యాసిస్తే దానిని ఏదోరకంగా ప్రదర్శించు. లేదా దానివల్ల గ్రహీతకు ఎటువంటి ఉపయోగం ఉండదు. అదేసమయంలో - నువ్వు ప్రేమ చూపించే వారందరిని నీ సొంతమనుకోకు లేదా వారు లేకపోతే బతకలేనని అనుకోకు. అప్పుడే నీలో అంతర్గత వేర్పాటు (Inner Detachment) వస్తుంది.

## తీర్పుపై ఆధారపడని మలుపు

ఆధ్యాత్మికంగా అవగాహన ఉన్నవారికి, లేదా ఆ శక్తిని అభివృద్ధి చేసుకొంటున్న వారికి నిర్ణయం లేదా తీర్పుపై ఆధారపడని మలుపులు ఒక గుణంగా ఉన్నట్లు నా మనస్సుకు తోస్తుంది. చాలా వినోదాత్మకమయిన విషయం ఏమిటంటే ఏ ఒక్కరు కూడా తీర్పుకు సంసిద్ధులు కారు. చాలా మంది పై కప్పులలో నిలబడి - తాము తీర్పుని అంగీకరించని స్థితిలో ఉ న్నామని చెబుతారు. కాని వాళ్లతో పది నిమిషాలు మాట్లాడిన తరువాత నాకు వారి అభిప్రాయాలు లేదా వాదాలు ఎంత ప్రయోజన శూన్యమో అనిపిస్తాయి.

గుణము అభివృద్ధి చేసుకోవటం ఎంత ముఖ్యమో నేను చెప్పబోయే ముందుగా, మీకు ఒక మనసంతా నిండి ఉండే స్థిర భావం గల అలవాటుతో పోలికగల విలువైన తీర్పు ప్రస్తావిస్తాను. చాలా సార్లు దీనిని మనం ద్వితీయ ప్రకృతిగా భావించి అజాగ్రత్తగా చేస్తాము. అందువల్ల చాలా మంది ఇప్పటికి మనం అనవసరంగా ఒకరి దగ్గర తీర్పు పొందవలసి వస్తోందే అనుకొంటారు. అయినా మనం ఆ విషయం ఒప్పుకోం.

పెద్ద సమస్య ఏమిటంటే మనలో ప్రతి ఒక్కరూ పెరిగే వాతావరణ మార్గము. సాధారణంగా ప్రతి వరుస లోని తరము చిన్నప్పటి నుంచి దీనిని విధించుకుంటుంది. మనం భాషను అర్థం చేసుకోబోయే సామర్థ్యం వచ్చిన దగ్గర్నుంచి, మనం మనచుట్టూ ఉన్న వారు - ప్రత్యేకించి - కుటుంబ సభ్యులు ఎంత పాతబడి ఉన్నారో అని పరిశీలన ద్వారా, మాటల ద్వారా అనుకొంటాము. స్థిరంగా మనం తీర్పుఇస్తుంటాం. ఎవరో ఒకరిని విమర్శిస్తుంటాం. వారిని చాలా వారిని చాలా కిందికి - వాళ్ల ఉత్తమ గుణాలతో సంబంధం లేకుండా తోస్తాం.

మొదటి పది నుంచి పదిహేను సంవత్సరాలు చిన్న పిల్లవాడి జీవితంలో చాలా నిర్మాణాత్మకమైనవి. చాలా వేగంగా నేర్చుకొంటారు. మనం ఆలోచిస్తాం ప్రపంచం అంతా అంగీకరించే మానవ స్వభావం చాలా విలువైనదని ఒక నిర్ణయాన్ని వెలువరిస్తాం. ఇంతటితో ఆగము. మనం పెద్దవుతున్న కొద్దీ - రాత్రాను - ఈ రకమైన అలవాటును తోసేస్తాము. రహస్యాత్మకంగా అనుభవాలు పొందటానికి ఉవ్విళ్ళూరుతాం. మన నాలుకతో ఎవరినైనా ముక్కలు ముక్కలు చేయటానికి వెనుకాడం. ఈ రకమైన వితండవాదము చేసే వారి పద్ధతి స్వభావము - వ్యర్థ ప్రసంగాల మిల్లులకు (పిండి విసురు యంత్రము) కావలసిన మేత పుష్కలంగా అందిస్తుంది. కాని అటువంటి వారి స్వభావం - నీకు సంబంధించి ప్రమాదమని గుర్తుంచుకో.

నిర్ణయం లేదా తీర్పు ఆధ్యాత్మిక ఆరోగ్యానికి కీడు కలిగిస్తుందని చెప్పటానికి చాలా రకాల కారణాలున్నాయి. దానిని మొదలు పెడితే ఈ భూమిపై మానవ జీవన సాఫల్యాన్ని గురించి నువ్వెంత అజ్ఞానంలో ఉన్నావో చూపెడుతుంది. అర్థమేమిటంటే - ఇప్పటికి నీకు అర్థం కాలేదు - ఏమిటంటే - ఈ ప్రపంచంలోని ప్రతి జీవాత్మ జన్మను ఎందుకు స్వీకరిస్తుందంటే - పాఠాలు నేర్చుకోటానికి - వ్యతిరేక లక్షణాలను శుద్ధి చేసుకోవటానికి ఈ తప్పించుకోలేని జీవన మరణ చక్రంలో తన చావు భౌతిక ఆనందాలు, బాధ, మాయ, వాస్తవము - ఇటువంటి గుణాలతో కలిసి పోవటానికి కాని మన మానవజీవితము ఏమయిందంటే - ఈ జీవితము ఒకసాటిలేని వాస్తవంగా భావిస్తోంది. ఈ జీవితానికి సంబంధించిన వ్రాత ప్రతి ముందుగానే ఇవ్వబడింది. అందువల్ల మన ప్రమేయం లేకుండానే యంత్ర పద్ధతిలో పుడుతున్నాం. జీవితంలోకి ప్రవేశిస్తున్నాం. ప్రారంభ సూచిక (Ground Zero) దగ్గర, విధి అనే నిర్మాణప్రణాళిక సరి చేయబడుతుంది. దేనితోనంటే

## వ్యక్తిగతమైన స్వేచ్ఛ అనే కోర్కె ద్వారా మరియు తారతమ్యాలను ఎంచి చూడగల మేధాశక్తి ద్వారా.

ఈ మూడు కారణాలు కలిసి వ్యక్తి ఆ విధంగా ఎందుకు ప్రవర్తిస్తాడనే విషయాన్ని క్రమపద్ధతి ద్వారా, క్రమసంఘటనల ద్వారా నిర్ణయిస్తాయి. ఈ నిర్ణయాలు లేదా చేష్టలు - ఒక్కొక్కసారి హింసాత్మకంగా ఉంటాయి. నీతి, మతం, కులం లేదా సాంఘిక సున్నితత్వాలు తప్పని సరిగా నేర్చుకోవలసిన ముఖ్యమైన స్థలాలు లేక ఆధారాలు. ఇవి తోటి మానవునికి పరిణామాత్మక దశలో పరీక్షకు గురిచేస్తుంటాయి. నేను ఇప్పుడు అన్ని రకాల పద్ధతులు, ఆజ్ఞలు, నిబంధనలు, సంభావ్యాలు - నీతి, సాంఘిక, మత నేపథ్యాలలో తరానికి తరానికి, దేశానికి దేశానికి సమాజానికి సమాజానికి మారుతుంటాయా లేదా అనేదాన్ని గూర్చి చెప్పుకోవటం వేరు. ఏ ఒక్క వ్యక్తి, సమూహము లేదా ప్రజల గుంపుని ఏ రకమైన నిర్ణయాన్ని ఇవ్వటానికి దైవసంబంధమైన హక్కులేదని మాత్రమే చెబుతున్నాను.

కాని వ్యక్తి గతంగా ప్రతివారు నిర్ణయాలను శిరసావహించ వలసిందే. ఎందుకంటే పూర్తిగా ప్రతివ్యక్తిలో పనికిమాలిన ఉద్వేగాలు తలెత్తుతుంటాయి. నువ్వు ఇతరులను విమర్శించేటప్పుడు, నిందించేటప్పుడు, గుర్తించనప్పుడునీలో కోపం, ద్వేషం, పగ, విసుగు, ఏవగింపు - నిరాశతో నీలో రహస్యంగా ఎగబాకుతుంటాయి.

ఇటువంటిసమయంలో, నువ్వు ఇంకా కొంచం ప్రమాదకరమైన అడుగు వేస్తావు. నైతికంగా బాగున్నట్లు అనిపించే ధర్మోపన్యాసాలతో నీ యొక్క లక్ష్యం లేని మాటలు తీవ్రమైన గాయాన్ని - కోపం నేపథ్యంలో కల్పిస్తాయి. ఇది తప్పని

సరిగా నీ కర్మ ఋణానికి అనుబంధంగా చేరుతుంది. ఎందుకంటే నువ్వు చేసిన గాయం ఉద్దేశ్యపూర్వకంగా మరియు మన స్ఫూర్తిగా చేసావు కాబట్టి. ఒకరి ఆధ్యాత్మిక స్థాయి ఉత్తమంగా ఉందని చెప్పే సూచిక (Indicator) ఏదంటే - అతడు - లేదా ఆమె యొక్క సామర్థ్యము - ఎప్పుడు - సర్వమానవాళికి సర్వకాల సర్వావస్థలలోనూ ఉపయోగపడే పద్ధతిలో - ఎవరి తీర్పుపై ఆధారపడని విధానంలో ఉత్తమంగా ఉండటం. ఇది తప్పని సరిగా నిన్ను ఈ ప్రపంచంలో జీవింపచేస్తూ-ఆ ప్రపంచానికి సంబంధించని వానిగా ఎదగటానికి సహకరిస్తుంది. అందువల్ల తప్పని సరిగా నీ మానసిక సమస్థితిని జాగ్రత్తగా చూసుకో సరిగ్గా అదే సమయంలో మానవుల అపజయాల పట్ల బాగా వివేకంతో, దయతో ప్రవర్తించు.

**వ్యాఖ్యలు**

ప్రశ్న :

మీ యొక్క అమూల్యమైన మార్గదర్శకత్వానికి ధన్యవాదాలు. నేను దాన్ని చాలా భద్రపరుచుకొన్నాను. నాకు ఇక్కడ ఒక సందేహం ఉంది. మీరు నిర్ణయం లేదా తీర్పుకు సంబంధించిన సన్నిహితులని చెబుతున్నవారు, మాకుటుంబమే కదా! వాళ్లు మా జీవిత నిర్మాణ ప్రణాళికలో విశిష్టమైన పాత్రను నిర్వహిస్తున్నారని తెలిసినప్పుడు - అది జ్ఞప్తిలో ఉన్నప్పుడు - మేము ఎలా చూసే దాని దగ్గర, నిర్ణయం దగ్గర వారివిషయంలో తారతమ్యం తెలుపుతాము?

గురూజీ జవాబు :

దాదాపుగా ప్రతిరోజు మనతో కలిసి ఉండే కుంటుంబం విషయంలో తీర్పుపై ఆధార పడకుండా ఉండే పద్ధతిని అనుసరించటం కష్టమే. కాని, దాని అర్థం ఏమిటంటే మీకు దర్శనానికి సంబంధించి ఒక పద్ధతి లేదనికాని, లేదా తలుపుదగ్గర ఉండే చాప (Door mat) అయ్యారని కాని, ఆ ప్రజలు మిమ్మ

లను తొక్కుతున్నారని కాని - అర్థం కారు. ఎంత వరకు ఇతర ప్రజలయొక్క స్వభావం - నేరుగా మీ జీవితాలపై ప్రభావం చూపించదో - అప్పటి వరకు కఠినంగా ఉండటానికి లేదా తొందరపడి నిందించటానికి ప్రయత్నించకండి. ఎదుటి వాడు ఏదో చేస్తున్నాడనే బలవంతాలను గమనించండి.

ఇక్కడ ఇంకొక విషయం ప్రస్తావిస్తాను. నీ అభిప్రాయాలు ఏవో నువ్వు నీ అంతట నువ్వు తెలియజేసినప్పుడు - పాటిస్తానని చెప్పినప్పుడు - నీ ప్రజలు నీ వల్ల లాభము పొందుతారని నేను వాదించను. ఇతరుల అభిప్రాయాల పట్ల నువ్వు సున్నితమయినప్పుడు, తెలివైనవాడిగా ఉండటానికి ప్రయత్నించు. ఒక సమయం తప్పనిసరిగా వస్తుంది. ఆ సమయంలో చెప్పిన విషయాన్ని వారికి జాగ్రత్తగా అందజేయటానికి యత్నించు.

ప్రశ్న :

మీరు పైన చెప్పిన వివరణ చాలా చిన్న మాటలలో చాలా విశదంగా ఉండి అర్ధమయింది. మనకు దగ్గరి వారితో ఎలా నడచుకోవాలో తెలుసు కొన్నాను. ఆమె/అతడు తమకున్న పరిస్థితిని బట్టి అలా నడుచుకొంటారనే మనం మాత్రం వారి నడతను నిందించకూడదనే మీ మాట తప్పనిసరిగా నా మనస్సులో పెట్టుకొంటాను. కాని పిల్లలకు మంచి చెడు చెప్పేటప్పుడు - వాళ్లకి అర్థం కావాలని - క్రమశిక్షణ, శిక్షణ, నీతి మొదలైనవి కొంత కఠినంగా చెబుతాం. మన కఠినమైన మాటలు / ప్రవర్తనలు వాళ్లని గాయపరుస్తాయి. ఇది మన కర్మకు జతకూడుతుందా? వాళ్లకి అర్థం కావాలని నెమ్మదిగా చెబితే, వాళ్లు వినరు. మనకు కఠినంగా చెప్పడం కంటే ఇంకొక మార్గాంతరం లేదు. మనం అలా కఠినంగా ప్రవర్తించవచ్చా?

ప్రశ్న :

నిజంగా చెప్పాలంటే నిర్ణయాలు - అందులోను - కుటుంబ విషయకంగా చెప్పాలంటే - ఖచ్చితంగా అది ఒక సవాలు వంటిది. ఇతరుల నుండి తీర్పులు స్వీకరించే సమయంలో ప్రశాంతమైన మనస్సు, ఇతరులకు తీర్పునిస్తున్న సమయంలో ఆత్మ విమర్శ చాలా అవసరము. మొదటి విషయము ఏమిటంటే తీర్పులిచ్చే మనం తీర్పులకు అతీతులంకాము. అందువలన మానసికంగా ప్రక్షాళన మొదలు కావాలి.

ఒక తల్లిగా నేను చాలా ఆసక్తిగా, అర్థం చేసుకోవాలనుకొంటున్నాను. నిర్మాణాత్మక సంవత్సరాలలో ఎదిగే పిల్లల విషయంలో ప్రవర్తన, శీలము మొదలయిన విషయాలలో ఎలా ప్రవర్తించాలి. ఆత్మ శక్తి ఒక గొప్ప తాళం చెవి. కాని, కొంత విషయాన్ని మనసులో దాచుకోవాలి. దీన్ని మీరు చెబితే, నేను కృతజ్ఞురాలినై ఉంటాను.

గురూజీ జవాబు :

పై రెండు ప్రశ్నలకు సంబంధించి - తీర్పుపై ఆధారపడని తత్త్వమంటూ నేను వ్రాసినది. - ఎదిగే పిల్లలకు వర్తించదు. పిల్లలు 16-18 సంవత్సరాల వయస్సు వచ్చేదాక వాళ్లని క్రమశిక్షణతో పెంచటం అది మీ బాధ్యత. సాంఘిక విధానాలు, కట్టుబాట్లు మొదలైన వాటిపై వారు అవగాహన కలిగి ఉండాలి. ఇంకా ముఖ్యమైన విషయమేమిటంటే - ఇతరులను ఉద్దేశ్యపూర్వకంగా బాధపెట్టకూడదని, గాయపరచకూడదని పిల్లలను తెలియజేయాలి. బిడ్డలకు ఇచ్చే గొప్ప బహుమతి ఏమిటంటే మార్గం సూచించటం. అందువల్ల వారికి బాధ్యత తెలుస్తుంది. వాళ్లు తమ క్రియలకు, మాటలకు తామే పూర్తి బాధ్యత వహించాలనే విషయం తెలుసుకొంటారు. వాళ్లు తప్పు చేసినప్పుడు, వాళ్లను విడుదల చేయాలని చూడకండి. వాళ్లు చేసిన దానికి ప్రతి ఫలంగా శిక్షను

అనుభవింపజేయనివ్వండి. వాళ్లకు చెప్పండి. దైవికమైన తిరుగు చెల్లింపు - ప్రతిక్రియ - ప్రతిదానికి ఉంటుందని నువ్వు ఇతరులకు వడ్డించినవి - ఏదో ఒక సమయంలో తిరిగి పొందుతావని. చిన్నప్పటినుంచే వాళ్ల చేతకు, క్రియకు మధ్య జాగ్రత్త బాధ్యత వహించాలని చెప్పండి. ఇది చెయ్యండి, మీరు గర్వపడేటంతగా మీ పిల్లలు తయారవుతారు.

ప్రశ్న :

గురూజీ, ఇద్దరు వ్యక్తుల మధ్య, ఒకడేమో ఎప్పుడు ఉత్సాహం లేకుండా, అసంతృప్తిగా ఉంటాడు. ఇంకొకడేమో - ఎదురు దాడి చేయకుండా ఉంటాడు. నాకు తెలుసుకోవాలని ఉంది. ఇవి కర్మ సంపూర్తులా / దృఢమైన శిక్షణలా? లేదా ఎలా కర్మ యొక్క సామాగ్రి పూర్తవుతుంది?

గురూజీ సమాధానం :

రెచ్చగొట్టకుండానే ఒకడు ఉల్లాసకరంగా లేడంటే - దాదాపుగా అది కర్మ యొక్క దృఢమైన శిక్షణ అవుతుంది లేదా నేర్చుకోవలసిన ఒక పాఠమన్నా అవుతుంది. పరిష్కారమేమిటంటే, నువ్వు ఆత్మతో కూడిన ఆత్మ సంభాషణ చేయి. మరియు క్షమాపణ యొక్క ప్రార్థన చేయి. లేదా సాధ్యమయితే, నీ సొంతకుటుంబ సభ్యుడైనా సరే - అతన్నించి నువ్వు దూరంగా, విడిపో, నిన్ను నువ్వు విడిపించుకో. చాలామందిలో ఉన్న సమస్య ఏమిటంటే - వాళ్ల జీవితాలలో - అటువంటివ్యక్తులు విడదీయలేని వారు - అని. ధైర్యం వహించి ఆ హింసించువాడిని నీ జీవితం నుంచి బయటకు తోసేయ్. ఒక్కొక్కసారి మన సాధుత్వాన్ని ఇతరులు ఉపయోగించుకోవాలని చూస్తారు. ఎప్పుడు ఎవరి కాళ్ల కింద తొక్కబడకు.

ప్రశ్న :

మన జీవితంలో అప్పుడప్పుడు నిర్ణయాలు తీసుకొనే పరిస్థితులు వస్తుంటాయి. మనము పరిస్థితిని అర్థం చేసుకొని, నిర్ణయబద్ధులవుతాము. పరిస్థితికి తగ్గట్టుగా మనం నిర్ణయం తీసుకుంటే - మనం ఒకరిని బాధ పెట్టవలసి వస్తుంది. లేదా పరిస్థితి అర్థమయినప్పటికి నిర్ణయాలు తీసుకోకుండా ఉంటే, ఆ ప్రజలు మనము యోగ్యత తక్కువైన జవాబులు ఇస్తున్నామను కొంటారు. ఇటువంటి పరిస్థితిని మనం ఎలా ఎదుర్కోవాలి?

గురూజీ జవాబు :

ఈ చిన్న సందేహస్థితిని మీకు పోగొడతాను. జీవితంలో కూడా, మీ పై ప్రభావం చూపే అటువంటి పరిస్థితులను మదింపు చేసి, తగినట్లుగా నిర్ణయాలను తీసుకోవలసి ఉంటుంది. ఇది నిర్ణయాలకు సంబంధించింది కాదు. ప్రజలు నిన్ను యోగ్యత తక్కువవాడని, మొద్దుబారిన వాడివని అనుకొంటే అనుకోని, నేను ఈ విషయంలో నిర్ణయాత్మకమైన బుద్ధిని వదిలి వేయమంటున్నాను. దాని అర్థం - మీ జీవితాన్ని, మిమ్మల్ని నేరుగా ప్రభావితం చేయని వ్యక్తుల గురించి, సన్నివేశాల విషయంలో - అకారణ విమర్శలను లక్ష్యపెట్టకండి. అయితే, మిమ్మలిని నేరుగా ప్రభావితం చేసే విషయంలో, నువ్వు నీ ఇష్టాలను రక్షించుకొనే సందర్భంలో నువ్వు వ్యక్తిత్వాన్ని, స్థితిని, అభిప్రాయాలను నిలుపుకో. అది నిర్ణయాత్మకమేమీ కాదు.

ప్రశ్న :

మీ జవాబులో ఆ హింసించువాడిని నీ జీవితం నుంచి బయటికి తోసేయమన్నారు. ఇది నా జీవితంలో చేస్తున్నాను. కాని నా చుట్టూ ఉన్న ప్రజలు నాతో నేను అసాధ్యమని (Impractical) మరియు కఠినాత్ముడని నేను విచారము ప్రకటించాలని చెప్పారు. అది చేయకపోతే మన మానసిక,

ఆధ్యాత్మిక ఆరోగ్యానికి హానికరమైనదని నేననుకొంటున్నాను. మనం ప్రతిసారి కర్మను జతపరచుకొంటూ బాధపడుతూ, ప్రతిస్పందిస్తున్నాము. నాకు అనిపిస్తుంది. సోదరుడు, సోదరి, బావలు, మామలు - ఇలాంటి బరువైన అనుబంధాలన్ని ఎప్పటికయినా అదృశ్యమయ్యేవా! మీరేమి చెబుతారు?

గురూజీ జవాబు :

ఇంతకు పూర్వము నేను జవాబు చెప్పిన వాటిలో హింసించువానితో మీకున్న కఠినమైన సంబంధాలు మీకున్న ఒక ఐచ్ఛికాంశంగా చెప్పాను. అయితే ఇది అన్నిచోట్లా అభ్యసించటం కుదరదు. ఈ ఐచ్ఛికాంశంపై - మీ వ్యక్తిగత పరిస్థితుల అధ్యయనము తర్వాత - మీకు ఫోన్ కాల్ చేయబడుతుంది. అప్పుడు కూడా మీ హింసకునితో అనుబంధాల కత్తిరింపు అసహ్యంగా, భరించరానిదిగా ఉంటే మీరు వేరే పద్ధతులు అనుసరించండి. తద్వారా మానసికంగా బలం పుంజుకొని, ఉద్వేగాలలో స్వతంత్రతను, బాధను పోగొట్టుకొని పొందుతారు.

నేను అంగీకరిస్తాను. మీరు గాయపడినప్పుడు, మీరు ఎక్కువగా ప్రతిస్పందించి, మీ వ్యతిరేక కర్మకు మరింత జతపరుస్తారు. అందువల్ల మీ హింసకుని నుంచి (వానితో సంబంధ బాంధవ్యాలు కుదరనప్పుడు) ఎక్కువ ఇష్టమైనదిగా ఒక గొప్ప దూరాన్ని కొనసాగించండని సలహా ఇస్తున్నాను. బంధుత్వాలలో ఆ హింసక అనుబంధాలు బరువైన కలయికలు (హెవీ టాగ్స్) అవుతాయి. సారాంశంగా, చివరిగా నేను ప్రయత్నించి చెప్పేదేమిటంటే- మీ యొక్క నిర్మాణాత్మక ప్రణాళిక భారములు మోపుటవల్ల, ప్రతినాయక పాత్ర పోషించేవారు - సమస్యకు సంబంధించిన సరియైన పరిష్కారాన్ని తెలుసుకొనే మీ హక్కును హరించలేరు. **మీతో ఎవరు కలిసి ఉండాలి అనే విషయాన్ని ఎంచుకొనే స్వేచ్ఛ- మీకున్న హక్కు**- భౌతిక,

మానసిక, ఉద్వేగ, మరియు ఆర్థిక పరిపుష్టులకు సంబంధించిన అన్ని అనుకూల ప్రతికూలాంశ ములు పరిశీలించిన పిమ్మట ఆనిర్ణయాన్ని అమలు పరచవలసి ఉంటుంది.

ప్రశ్న :

నా ప్రశ్నకు స్పందించినందుకు ధన్యవాదాలు. దానిని కల్పించటానికి నేను చాలా ఒత్తిడికి గురయ్యాను. ఒకతనిని బంధువుగా అంగీకరించటం ససేమిరా నాకు ఇష్టం లేదు. కాని ఇంకొకరి సంతోషం కోసం సన్నివేశాన్ని విస్తరించటంకోసం అలా తప్పని సరిగా-అంటే ఇష్టం లేని బంధువును - ఇష్టంగా అంగీకరించవలసివస్తోంది. ఇది నాకు ఊపిరాడకుండా చేస్తోంది. మామూలుగా పనిచేయనీయటం లేదు.

నా స్వంత అనుభవం ద్వారా చెబుతున్నాను. ఒక్కొక్క సారి మీ స్వంత చట్టంలోని కొన్ని సూత్రాలకు మీరు కూడా బద్ధులు. కనుక నేను కూడా ఒక భాగంగా, నా అభిప్రాయంపై నిలబడతాను. నువ్వు లోపల బాధపడుతూ, కల్లోలపడుతూ, ఎదుటివ్యక్తిని సంతోషంగా ఉంచటం ఎలా? నేను దురహంకారిని కానని, నా అహంకారము ఆటలాడటం లేదని మీకు ఎలా నిర్ధారించేది?

గురూజీ జవాబు :

నిజం చెప్పాలంటే ప్రతి అయిదింటిలో ముగ్గురి బంధుత్వాలు ఏదో కారణం చేత నాటకమాడుతుంటాయి. ప్రజలు నకిలీ రూపంలో ఉన్న తమ “శాశ్వత ప్రేమ” ను తమ వ్యక్తిగత ఉద్దేశాల కోసం జీవితాంతం కొనసాగిస్తుంటారు. అయినప్పటికి, ఇది మీకు కొంచెం అననుకూలంగా అనిపిస్తే- ఆ వ్యక్తి- రక్త సంబంధీకుడైనప్పటికీ - సాధ్యమైనంత దూరాన్ని కొనసాగించండి.

ప్రశ్న :

ఇంకొకరి పరిణామాల్ని ఒకరు ప్రతినాయకునిగా ఆడిస్తున్నప్పుడు - వ్యతిరేక కర్మ ఎలా జతపడుతుంది? ఒకరు ఎలా తన స్వీయ ఆకాంక్షను మరియు నిర్ణయాత్మక మేధాశక్తిని ఇటువంటి దుర్ఘటనను తీర్చటానికి ఉపయోగిస్తారు?

గురూజీ జవాబు :

మీరు కర్మ ఋణాలకు సంబంధించిన ఒక ప్రాంతానికి, నిబంధనలకు కట్టుబడని ప్రాంతాన్ని పరిశీలించారు. నమూన పత్రములో సంబంధీకుడై మరియు నెరవేర్చువాడైన ప్రతినాయకుడు వ్యతిరేక కర్మను తనపై తెచ్చిపెట్టుకోడు. కాని సంబంధాలకు అవతలివైపు బాధకలుగచేయు గాయాల సంబంధం మాత్రము కర్మను కొని తెచ్చి పెడుతుంది. మనము ఎప్పుడు సంబంధాలతోనో లేదా మరోరకంగానో ఉన్న బలమైన తాడును తొక్కుతూ నడుస్తుంటామనే విషయాన్ని- నేను- అంగీకరిస్తాను. మనకు తెలియదు మన కర్మ ప్రతినాయకుని రూపంలో తన పాత్రను పూర్తి చేసిందో, లేక కష్టాన్ని పెంచుతుందో తెలియదు. కనుక బాధ, కీడు, మానవాళికి కీడు కలిగంచే వాటిని - మీ మనస్ఫూర్తిగా వదిలేయండి. మీ అభీష్టాన్ని, విచక్షణా మేధాశక్తిని ఉపయోగించండి.

ప్రశ్న :

నాకు చాలా విచారం అనిపిస్తోంది. ఈ విశాల విశ్వం దీన్ని ఆకర్షణగా ప్రదర్శించాలని స్వీయ అనుశీలన చేయాలని కోరుకుంటున్నాను. నేను ఆకర్షణా సిద్ధాంతం గురించి చాలా విన్నాను చదివాను. సిద్ధాంతపరంగా దీన్ని అంగీకరిస్తాను. కాని అభ్యాస పరంగా చూస్తే, ఒక రూపం కల్పిస్తే అంతా విరుద్ధమనిపిస్తోంది. ఇది చాలా ఆశ్చర్యంగా ఉంది. నేను దేన్నయినా

నకారాత్మకంగా దృశ్యమానం చేస్తే, సరిగ్గా సకారాత్మకత వస్తోంది. నేను సకారాత్మకతని ఆలోచిస్తే సరిగ్గా నకారాత్మకత వస్తోంది. ఈ విషయం చాలా ఖచ్చితము మరియు కట్టుదిట్టమయినది. బెదిరింపులకు లొంగనిది. ఒక సకారాత్మకత రావాలంటే సకారాత్మకంగా ఉద్దేశపూర్వకంగా ఆలోచించవలసి వస్తోంది. దయచేసి నాకు మార్గదర్శనం చేయండి. అక్కడ మీరు ఉన్నందుకు ధన్యవాదములు. మీరు చాలా ఉన్నతమైన దృక్కోణం కలవారని, మానవతా వాదం కలవారని, బాగా సమీపస్థులని, బెదిరించే స్వభావం కలవారు కారని అర్థమవుతోంది.

గురూజీ జవాబు :

నేను ఇంకో దృక్కోణంలో ఉన్నానని మీరు చెప్పటం నాకు చాలా వినోదం కలిగిస్తుంది.

చాలా మంది నన్ను వ్యతిరేక వ్యక్తీకరణం గురించి అడుగుతుంటారు. ఆకర్షణ చట్టాల (Laws of Attraction) విషయంలో ఎటువంటి తప్పులేదు. ఆ సమయంలో, అది వ్యతిరేక దిశలోనే పనిచేస్తుంది. ఎందుకంటే తీవ్రంగా దాగియున్న భయముతో. ఉదాహరణకు, సకారాత్మకంగా వ్యక్తీకరిస్తే, ఎదుట జరిగే సంఘటనల పట్ల మీరు తెలియకుండానే భయం ఉన్నది కాబట్టి - సకారాత్మక వ్యక్తీకరణ తీవ్రంగా కనిపిస్తోంది. నువ్వు సకారాత్మకంగా అభివ్యక్తిని తెలియజేస్తే - నీ మనస్సులో ఉన్న విశ్వాసం (Convietion) వలన, సకారాత్మక సన్నివేశం బలంగా నీకు అనిపిస్తోంది. ఆకర్షణ చట్టం (The Law of attraction) బలంగా ఆలోచనలమీద పనిచేస్తుంది. ఎందుకంటే అది నీ నుంచి ప్రసరిస్తుంది కాబట్టి.

(లా ఆఫ్ ఎట్రాక్షన్ గురించి కొంత వివరణ

“లైక్ ఎట్రాక్ట్స్ లైక్” అను సిద్ధాంతమే లా ఆఫ్ ఎట్రాక్షన్. ఈ నమ్మకం ప్రకారం ప్రజలు మరియు ఆలోచనలు రెండుకూడా శుద్ధమైన శక్తి నుంచి తయారవుతాయి. ఒక వ్యక్తి ఒక కవరు తెరవటానికి ముందు అందులో బిల్లు ఉంది అనుకొన్నాడు. ఖచ్చితంగా అందులో బిల్లే ఉంటుంది. లేదా కవరు తెరవటానికి ముందు చెక్ ఉందని అనుకొంటే ఖచ్చితంగా అందులో చెక్ ఉంటుందని లా ఆఫ్ ఎట్రాక్షన్ చెబుతుంది.

-తెలుగు అనువాదకుడు)

"చిరు అహం యొక్క తొలగింపు"

ఒకడు ఎదుర్కొనే అన్నిరకాల కష్టాలకు బాధ్యత వహించే ఇగో (అహంకారం) - బాగా ప్రసిద్ధమైన ఒక నమ్మకంలో చెప్పినట్లు - వ్యక్తి జీవితంలో మొత్తంగా వ్యాపించి శాశ్వతమైన ప్రతినాయకునిగా పాత్ర పోషించదు. "ఇగో" అంటే వేరే- ఏమికాదు- మనిషి యొక్క వ్యక్తిత్వమును మలచినది. ప్రతి ఆత్మ భౌతికరూపంలో అవతరించినప్పుడు తనను తాను ఆవిష్కరించుకోవలసిన అవసరం ఉంది.

అందరూ అంగీకరించే మానవ స్వభావానికి ఆనుగుణ్యంగా లేని నిష్పత్తులు మరియు కొలతలలో 'ఇగో' ఉన్నప్పుడు ఇబ్బందులు వస్తాయి. ఆ 'ఇగో' ని పట్టుకొంటే వంచకుడు వెళ్తాడు. ఇంకొక విషయములో ఒకరు వ్యర్థునిగా పొగరుబోతుగా, అహంకారిగా, నింకుశునిగా లేదా సాదాతుచ్ఛుడు అని పిలువబడుతాడు. పూర్వపు అధ్యాయములో నేను ఈ దురహంకారము మరియు ఉబ్బిన అహంకారము గూర్చి వివరిస్తూ - అహంకారం పెంచుకోవటంలో అర్థం లేదని, దాని పర్యవసానాలు ఎలా ఉంటాయో కూడా వివరించాను. అందువల్ల ఈ వ్యాసములో 'ఇగో' యొక్క ఇంకొక కోణాన్ని ఆవిష్కరించటానికి ప్రయత్నిస్తాను. "ఇగో" (అహంకారము) చాలా సున్నితమైనది. కాని వ్యక్తిని అనేక ఇబ్బందులు కలిగించటానికి కారణమవుతూ సమానమైన సహజ ధోరణిని ప్రదర్శిస్తుంది. నేను దీనిని చిరు అహం (Petty ego) అంటాను.

ఉబ్బిన అహం కంటే, ఈ చిరు అహం - చాలా సూక్ష్మమైనది. అసలు ప్రజలు దీనియొక్క ఉనికిని కూడా గుర్తించలేరు. దీనిని ప్రత్యేకంగా ఒక సమస్య అనుకోరు. కొంత మంది ఈ చిరు అహాన్ని కలిగియుండటాన్ని ఒక గుణంగా

కూడా పరిగణిస్తారు. నేను మాట్లాడబోయే వ్యక్తి ఇతడే - హద్దు మించిన సున్నితత్వము, శీఘ్ర కోపము, ఉద్వేగంగా, పెళుసుగా మాట్లాడే తత్త్వం ఇతనిది. ఇతను క్లిష్టమైన హింసాత్మకతత్వం తో బాధపడుతుంటాడు. నన్ను నమ్మండి. నాశనానికి బాగా చేరువగా ఉండే ఈ జాతులు ఇప్పుడు లేరు.

ఇప్పుడు - ఇతరుల భావాలు- ఖచ్చితంగా సకారాత్మకమే కనుక - వారి భావాలను సున్నితంగా పంచుకొనటం ద్వారా - ఈ చిరు అహం - ఏదైనా చేయగలరనే ఆలోచనాక్షణాన్ని విడవండి. అయినప్పటికి, ఆ చిరు అహం మీలో ఉంటే మాత్రం - కఠినం కండి. "నేను చాలా సులభంగా గాయపరచగలను" అనే స్వభావాన్ని కలిగి ఉండకండి. ఎందుకంటే అది అహాన్ని అనుగ్రహిస్తుంది. విపరీతమైన పెళుసైన స్థితిలోకి తీసుకు వెళుతుంది.

నేను కాదనను- ఎవరైనా అవమానపడినప్పుడు, ఇతరులు చెరిగినప్పుడు, నిందించినప్పుడు, మాటలతో హింసించినప్పుడు - చాలా బాధపడతారు. కాని మీ పెళుసైన అహం కంటే - బాధపడినతనం కంటే - చాలా బలిష్ఠమైనది. కష్టమును సహించగలిగినది - ఒక్క మీ క్షమాగుణము మాత్రమే. అసంతృప్తితో ఉన్నప్పటికీ మారు సంసిద్ధులు కండి. ఎందుకంటే ఎవరు కూడా మీ పెళుసుతనంతో ప్రభావితులు కారాదు.

నేను అంగీకరిస్తాను. మీ వెనుకగా మీ గురించి చెడుగా చెప్పుకొనే రోత మనుషులకు కరువు లేదు. అటువంటి ప్రజల యొక్క పెదవులను మూత పెట్టడానికి ప్రతి నిమిషం మీరు ప్రయత్నించమని చెప్పటం కూడా అర్ధం లేనిది. మీరు భౌతికంగా, నేర్పుగా - అధికార సన్నివేశ ప్రతీకార పరిణామ ప్రకారంగా- ఎలాగయినా ఒక్కోసారి దెబ్బకొడతారు. కాని ఇది సరియైన ఐచ్ఛికాంశం కాదు. ఇది మంచిదైన ఐచ్ఛికాంశం కూడా కాదు. దీని చివరిపరిణామం మీరు నిశ్శబ్ధంగా బాధపడటం.

**"మిమ్మల్ని మీరు తీవ్రంగా తీసుకోకండి"** అనే విషయాన్ని మీకు చెప్పటానికి ప్రయత్నిస్తున్నాను. మొత్తము మీద అవసరమైనప్పుడు మిమ్మల్ని మీరు రక్షించుకోండి - కాని తేలికగా కూడా తీసుకోండి. ప్రతి విషయాన్ని మీకు మీ హృదయానికి వ్యతిరేకంగా ఉందనే దృష్టిలో చూడకండి. మీరు సహజంగానే గట్టితనాన్ని వినే స్వభావం లేకపోతే కొంచం గట్టి చర్మాన్ని కలిగి ఉండటమనే గుణాన్ని మీరు అభివృద్ధి చేసుకోవటానికి యత్నించండి. మీ ఆధ్యాత్మిక సూచన విషయంలో తప్పించి, మిగతా విషయాల్లో కొంచెం చెముడు కలిగే తత్త్వం కూడా ఆనందదాయకమవుతుంది.

మీకు ఇంకా అది పూర్తిగా అవగాహనలోకి రాకపోతే, ఈ ప్రరంచంలో జీవించటమనేది, మీకు చాలా కఠినమైన పని అవుతుంది. ప్రపంచంలో విధులను నిర్వహిస్తూ, ప్రపంచానికి సంబంధించనివారుగా జీవించటం అనేది మానవులకు ఇవ్వబడిన ఒక గొప్ప కఠినమైన కష్టముతో కూడిన పని.

**వ్యాఖ్యలు**

ప్రశ్న :

ప్రతిసారి మీ వ్యాసాలు చదువుతున్నప్పుడు నేను ఒక యంత్రంలా ఊహిస్తుంటాను. కాని మీ మార్గదర్శన సూత్రాలు చదువుతున్నప్పుడు మానవత్వం పొందుతుంటాను. ఈ ఆజ్ఞలు, గందరగోళాలు, అవి చేసే పనులు వీటిని గురించి చాలా ఆలోచిస్తుంటాను. దీనిని బట్టి నాకు అనిపిస్తోంది - ఈ ప్రపంచం - ఒక అందమైన సందేహమార్గంలో విరుద్ధంగా ఉందని - నాకు అర్థం కాక చచ్చిపోతున్నానని. ఎందుకు?

ఇటీవల నేను ఒక గొప్ప అనుభవాన్ని పొందాను. నేను నా శ్వాసమీద దృష్టిని నిల్పినప్పుడు "నువ్వు ఆజ్ఞల గురించి జాగ్రత్త వహించు. ఈ ప్రపంచం గందరగోళాల గురించి జాగ్రత్త వహిస్తుంది'' అని ఎవరో చెప్పగా విన్నాను.

నాకు ఆశ్చర్యంగా ఉంది. ఈ మానవస్థితిని దాటటం నాకు ఎందుకు ఇంత కష్టంగా ఉందని. ప్రతిది శక్తితో కూడుకొని ఉన్నప్పుడు- మానవ శరీరం నుంచి ఆత్మను ఎవరు వేరు చేసారు? ఆత్మ శరీరాలలో ఖచ్చితంగా ఎక్కడ ఉంటుంది? ఆత్మలు కర్మలను అనుసరించి గ్రహాలను మారుస్తాయా! మనం చేస్తున్నట్లే ఇతర గ్రహాలలోని కార్యకలాపాలు కూడా కొనసాగుతుంటాయా! మనం చేస్తున్నట్లే ఇతర గ్రహాలలోని కార్యకలాపాలు కూడా కొనసాగుతుంటాయా! విశ్వవ్యాప్తంగా పిచ్చికి సంబంధించిన ఈ విధానమే జీవితానికి సరిపోతుందా?

గురూజీ సమాధానము :

నేను నీ ప్రశ్నలను చాలా వినోదభరితంగా కనుగొన్నాను. చాలా సంక్షిప్తంగా, తక్కువగా, సాధ్యమయిన త్రోవలో మీ ప్రశ్నలకు జవాబు చెప్పటానికి యత్నిస్తాను. మీ ప్రశ్నలకు సంపూర్ణ న్యాయం చేస్తానని మాత్రం దయచేసి అనుకోకండి.

**1.** గందరగోళ పరిస్థితి మరియు ఆజ్ఞ ఈ రెండూ కూడా విశ్వంలో సహజీవనం చేస్తుంటాయి. ఎందుకంటే ఈ ప్రపంచపు సృష్టిలోని అన్ని రకాల అంశాలు ఒక సమగ్ర వైరుధ్య స్థితిలో ఉన్నాయి. అంటే ఏదయితే మనం వ్యతిరేకం అనుకొంటున్నామో అవి కలిసే ఉంటున్నాయి. తార్కికంగా వాటి అన్వయం కుదరదు. ఈ ధాతురూపాలు సర్వ సృష్టికి సంబంధించిన బీజములో ప్రదర్శితమై ఉన్నాయి. ఈ మొత్తం సృష్టి శూన్యంలోని ఒక గొప్ప ధ్వని నుంచి వచ్చింది. కనుక ఈ ధ్వని మరియు ఈ సృష్టి రెండూ ఒకే సమయంలో ఉన్నాయి. అర్థమవుతోందా?

**2.** మీ రెండవ ప్రశ్న. ప్రతిదీ సూక్ష్మంలో ఉంది. భౌతిక సృష్టి అంతా

శక్తి. ఇది ఆత్మ కాదు. ఆత్మను సంక్షిప్త పదాలలో చెప్పాలంటే విశ్వాధినేత శక్తి యొక్క ప్రతిఫలనము. అందువల్ల శరీరానికి, ఆత్మకు మధ్య తేడా ఏర్పడింది. ఈ శరీరము పంచభూతాల యొక్క సమాహారము మానవుని ఆత్మ గురించి, అది రూపొందిన విషయాల గురించి విపులంగా వివరించటానికి ఇక్కడ నాకు సాధ్యం కాదు.

ఆత్మ (ఎక్కువ శాతం) ఎదురురొమ్ములో పలుచని పొడుగైన ఎముక వెనకాల ఉంటుంది. అందువల్లనే నువ్వు నీ గురించి చెప్పుకొనేటప్పుడు ఆ ప్రదేశంలో చేయివేసి చెబుతావు. అయినప్పటికి సుషుమ్నానాడిలో ఆత్మ అన్ని రకాల కార్యక్రమాలు నిర్వహిస్తుంది.

**3.** అవును, ఇతర గ్రహాల మీద కూడా జీవనం ఉంది. వారు కూడా కర్మ సిద్ధాంతాలను అనుసరించి బతుకుతుంటారు. కాని అవి నా వ్యక్తీకరణకు అందని ప్రదేశాలు. వాటిని గురించి వ్యాఖ్య చేయటానికి నాకు ఎటువంటి అధికారము లేదు.

ప్రశ్న :

నేను నా జీవితంలో చాలా వాటిని ఎదుర్కొంటున్నాను. ఉదాహరణకి డబ్బు, ఉద్యోగము, బంధువులు - ఇలా ప్రతిదీ. బాగా ముఖ్యమయినది ఏమిటంటే మాకు ఉండటానికి సొంత ఇల్లు లేదు. ఇంకో ఇద్దరు కుటుంబ సభ్యులు నాపై ఆధారపడి ఉన్నారు. నేను దేవుడిని నమ్ముతాను నేను దేవునికి సంపూర్తిగా శరణాగతి పొందుతాను. కాని దైవ ధ్యానానికి కూర్చున్న వెంటనే నా సమస్యలన్నీ నాకు నా కళ్లెదురుగా గుర్తుకొస్తున్నాయి. అందువల్ల దేవుని యందు మనస్సు పెట్టలేక పోతున్నాను. నేను అవసరాలలో ఉన్న వారికి సాయం చేయాలనుకొంటున్నాను. కాని నా సమస్యల వల్ల చేయలేక పోతున్నాను.

నా అభిప్రాయము ఏమిటంటే ప్రతివారు ఈ లోకంలో ఇల్లు, కుటుంబం, ఉద్యోగం, ఉద్యోగసంతృప్తి, శాంతి, సంతోషము ఈ జీవితంలోని కనీసావసరాలు కలిగి ఉండాలి. ఈ భౌతికావసరాలు లేకపోతే ఎవరూ కూడా ఆధ్యాత్మికతను అనుసరించలేరు. దేవుని నమ్మలేరు. జీవితంలో ప్రతిదీ నేను కోరుకోవటంలేదు. నా మీద ఆధారపడిన ఇద్దరు కుటుంబ సభ్యుల గురించి నా బెంగ.

మీరు ఈ సందర్భాన్ని గురించి మార్గ దర్శనం చేస్తే అభినందిస్తాను. అతని సహాయం లేని సందర్భంలో, నేను దేవుని ఎలా నమ్మేది?

గురూజీ సమాధానం :

నేను మీరు జీవితంలో ఎదుర్కొంటున్న సన్నివేశాలపట్ల సహానుభూతిని కలిగి ఉన్నాను. ఏ కారణాలవల్ల మనకు అటువంటి కష్టాలు వస్తాయో మనకు తెలియదు. కాని ఈ రకమైన సందర్భాలు ఖచ్చితంగా మన కర్మ ఋణాలను తగ్గిస్తాయి. పాఠాలను నేర్పుతాయి. అందువల్ల మనము ఎదుగుతాం.

ఇప్పుడు మీ ప్రాధాన్యత ఏమిటంటే మీకు, మీ మీద ఆధారపడిన కుటుంబ సభ్యులకు - కనీసావసరాలు కలగాలి. ఇవి భౌతిక పరమైనవి కావు. మీరు వాస్తవంగా చూడండి. దేవునియందు నమ్మకముంచండి. అతడు మిమ్మలిని సృష్టించినవాడు. అతనిని పూజించండి. దేవున్ని మీ గాఢమైన స్నేహితునిగా తలచి మీ కష్టాలన్నీ ప్రతిరోజూ చెబుతుండండి. ఎన్ని రకాల సమస్యలు తీరిపోతాయో మీరే చూద్దురుగాని. వందశాతము విశ్వాసాన్ని ఈ ప్రియమైన మిత్రునిపై (దేవునిపై) ఉంచండి. ఎన్ని అద్భుతాలు మీ జీవితంలో జరుగుతాయో చూడండి. శుభ భవిష్యత్తు కలుగుగాక.

## 3. ఆధ్యాత్మిక అన్వేషణకు ఉపకరించు లేశమాత్రమూలకాలు

ఈ భౌతిక శరీరం కొన్ని అదనపు అవసర పదార్థాలను కోరుతుంది. సాధారణ మాంసకృత్తులు, పిండిపదార్థాలు, విటమిన్లు, చక్కెర - ఇలాంటివన్నీ మానవుని భౌతిక ఉన్నత పటుత్వానికి సహకరిస్తాయి. ఇదే విధంగా ఉన్నతమైన ఆధ్యాత్మిక స్థాయిలకు వెళ్లాలంటే నువ్వు కూడా కొన్ని అదనపు అర్హతలను సంపాదించుకోవటానికి తప్పనిసరిగా పనిచేయాలి. ఈ అధ్యాయంలో మీ ఉన్నతికి సహకరించే కొన్ని ఆధ్యాత్మిక అన్వేషణ లేశమాత్రమూలకాల గురించి వ్రాస్తాను. అవి మీ అభివృద్ధి దశను వేగవంతం చేస్తాయి. అతిముఖ్యమైన విషయం ఏమిటంటే - ఈ ఆధ్యాత్మిక అన్వేషణమూలపదార్థాలు మీ జీవితంలో తట్టుకోలేని ఆనందాన్ని మోయగలిగే దశకు చేరుస్తాయి.

### లేశమాత్రమూలకము - 1

### ధైర్యము చాలా అందమైనది.

నేను "ధైర్యము" అనుపదం అన్నవెంటనే దానికి అనుమతి ఇచ్చే విషయంలో ఆ పదానికి మీరు దూరంగా పోవద్దు. ఇది భయాన్ని అధిగమించే ఇంకొక వ్యాపకం కాదు. ఇది ఆధ్యాత్మిక మార్గంలో ఉన్న వ్యక్తికి కావలసిన ఒక విశిష్టమైన రకానికి చెందిన ధైర్యము. ఈ రకమైన ధైర్యగుణ స్వీకృతిని ఇంతకు ముందు జీవితంలో మీరు ఊహించి ఉండరు. సాధారణ పరిభాషలో ధైర్యమంటే ఒకరికి ఉండే నిర్భీతి. తప్పుగాని - మరేమికాని, ఎవరయితే ప్రమాదము కలిగే అవకాశము ఉన్న విషయాలలో (RISK Throw caution to the wind) ప్రవర్తించటం వారి సాహసస్వీకృతి తెలియజేస్తుంది. అనేకానేక భయాల నుండి మనం విముక్తి కావాలంటే- ఆరకంగా విముక్తి పొందిన వ్యక్తితోకాని, ఆ ధైర్యగుణంతోకాని మనం సహవాసిత్వం చేయాలి. లేకపోతే కొంతమంది తమ జీవితాలనే కాకుండా

పక్క వారి జీవితాలను కూడా - తప్పుడు స్థానంలో చూపిన ధైర్య గుణంతో తక్షణ ప్రమాదాలు తెచ్చుకొని నాశనం చేస్తారు. చేసుకొంటారు.

నేను ఇప్పుడు ఆ విధంగా అయిన వారి ధైర్యపు వివరణలు చేయటం లేదు. ఈ ఆధ్యాత్మిక సందర్భంలో ధైర్యానికి సంబంధించి ఒకానొక అంశం ఉంది. ఇది చాలా కీలకమైనది. కాని చాలా ముందుకు వెళ్లే దాకా దీనిని గుర్తించము. చాలా తక్కువగా దీనిని గురించి వ్రాస్తారు. దీనిని వివరిస్తాను. ఒక పద్ధతికి చెందిన ప్రజలు సర్వకాల సర్వావస్థలలోనూ - ఈ ముట్టడికి దగ్గరగా హాయిగా, రక్షణగా ఉంటారు. వారు ఒక్క అంగుళం కూడా ముందుకు ఏ వైపు కదలరు. తమ చుట్టూ ప్రమాదము జరిగే అవకాశము తక్కువగా ఉన్న సందర్భాలలోను, తమ నిర్ణయాలవల్ల జీవితాలలో అనిశ్చితి ఉన్న వేళలలోనూ చలించరు. నేను అది వివేకమని అంగీకరిస్తాను. మీకు సంబంధించిన వ్యవహారాలలో చాలా జాగ్రత్తగా దూర దృష్టితో వ్యవహరించాలి. కాని ఒక సారి ప్రమాదము సున్నాశాతము కూడా లేదని ఒక్కసారి మీ మనస్సులో భావం వస్తే - మీరు కేవలం మీ పనికి సంబంధించిన మార్గములయొక్క అజ్ఞానమే కాదు - చైతన్యాత్మకమైన మీ ఆధ్యాత్మిక జీవితమును లేదా జీవనంలో సంతోషపు శాతాన్ని పెంచుకోవాలని అనుకోవటం లేదని భావించాలి. ఒక విషయాన్ని మీరందరూ తప్పని సరిగా అర్థం చేసుకోవాలి. ఈ భూగ్రహం మీద జీవిస్తున్న ఎవరికి డబ్బు, ఆస్తులు, బంధుత్వాలు, ఆరోగ్యము, ఉద్యోగాలు, కుటుంబ సభ్యులు, ఇల్లు, లేదా జీవితకాలం - ఇటువంటి విషయాలలో ఎవరూ నూటికి నూరు శాతం హామీ ఇవ్వలేరు జీవితంలో ప్రతి విషయంలో జాగ్రత్త తీసుకొన్నా, ఎంత జాగ్రత్తగా ఆలోచించినా, మీ కృత్యాలకు సంబంధించి ఎంత రక్షణ తీసుకొన్నా- ఈ ప్రపంచాన్ని మీరు ఓడించలేరు. మీ కర్మకు సంబంధించిన నిర్మాణప్రణాళికను మార్చాలేరు. చేసే ప్రతి పని యొక్క ఫలితాన్ని గురించి ఎంత జాగ్రత్తగా ఆలోచించాలో,

తీవ్రమైన క్రూరమైన నిర్ణయాలు తీసుకొనే సందర్భాలను విడిచివేయాలి. ఈ అద్భుతమైన సకారాత్మక మార్పులు మీరు కనుక అవలంబిస్తే- మీ జీవితంలో క్రమంగా అభివృద్ధికరమైన పెరుగుదల వస్తుంది. మీ ఆధ్యాత్మిక అభివృద్ధి నిర్దిష్టంగా పెరుగుతుంది.

సాధారణంగా ఎవరూ అనిశ్చితిని ప్రేమించరు. మన భయంకరమైన సాంఘికమైన, మాతాపితృ సంబంధాల స్థితి- "ఎటువంటి ప్రమాదాలను కొని తెచ్చుకొనే పద్ధతి అవలంబించకు'' అనే మనస్తత్వాన్ని గట్టిపరుస్తోంది. ఇక్కడే నేను అనుకొంటున్నాను ఈ పద్ధతి మారాలని. కొంచెం పాటి ధైర్యం అవలంబించాలని, ఇది నేను ఎందుకు వ్రాస్తున్నానంటే- మన జీవిత పర్యంతము ప్రభావము చూపే చాలా ముఖ్యమైన, జటిలమైన నిర్ణయాలు- ముఖ్యమైన నాలుగురోడ్ల కూడళ్ల దగ్గర మనలిని నిలబెడతాయని. ఈ నాలుగు రోడ్ల కూడళ్లు, మరియు నిర్ణయాలు- వృత్తి, ఉద్యోగము, జీవిత ప్రవృత్తి, భాగస్వామి, కుటుంబము, వివాహము, ఇల్లు, స్వదేశం- వీటిలో ఏ అంశానికి సంబంధించిన వయినా అవచ్చు ఈ పట్టికకు అంతులేదు. ఈ సందర్భంలోనే ధైర్యము యొక్క అవసరముంది. ఎందుకంటే సాధారణంగా ఇబ్బంది కొని తెచ్చుకొనే మార్గంలో మనము వెళ్లటానికి ఇష్టపడం కనుక. మనము మృదువైన ఐచ్ఛికాంశాలను ప్రేమతో ఎన్నుకొందాం. తక్కువ ప్రతిఘటన ఉన్న మార్గాలపై నడవటానికి ఇష్టపడదాం. అందరూ క్షేమంగా ఉండే ఆటను ఆడటంలో తప్పు లేదు. కాని ఒక విషయం గుర్తుపెట్టుకో. నీ జీవితంలో అవకాశాలు సంభవించే కాలాన్ని, సామాన్యత నుంచి గొప్ప విజయాలను పొంది ఉత్సవాలు చేసుకొనే స్ఫూర్తి- నువ్వు దూరం చేసుకొంటున్నావేమో! ఆలోచించు, నీ కలల జీవితములో జీవించటానికి ఉపకరించే అవకాశం కొద్దిలో తప్పిపోతుంది. దారుణంగా ఇప్పటికి - వాస్తవమైన శాంతికి, సామరస్యానికి నీ జీవితంలో తలుపు తెరచి ఆహ్వానం పలికే అవకాశము తప్పిపోతుంది.

ముందే వ్రాయబడిన నీ జీవితపు ప్రణాళిక (తలరాత) ఒక పక్క ఉంటే- ఈ జీవితపు ఆటలో తప్పొప్పులను గురించి ఆలోచించటం కన్నా పరిహాసము ఇంకొకటి లేదనిపిస్తుంది. భయంకర పరిణామాలు సంభవించే ఈ జీవితపు ఆటలో నీ రక్షణ గురించి ఆలోచించటం- ముందే నిర్ణయింపబడిన జీవితపు ప్రణాళికను అనుసరించి- అనవసరమనిపిస్తుంది. కనుక నువ్వు గణించబడిన ఇబ్బందిని (క్యాలిక్యులేటెడ్ రిస్క్) ఎందుకు గ్రహించకూడదు? మెరిసిపోతూ, వైభవంగా ఉండే అనిశ్చితాలతో కూడిన ఊగులాడే ఆశలు నీ ముందు ఉన్నప్పుడు, రసముతో కూడుకొన్న సారవంతమైన అవకాశాలను ఎందుకు వదులుకోవాలి? రక్షణతో కూడిన ఈ గట్టి ముట్టడిని సమర్పించి ఎందుకు నువ్వు తర్వాత జీవితాన్ని చూడవు? కూడా ఊహిస్తూ నువ్వు ఒక చెడు నిర్ణయం లేదా సన్ని వేశాన్ని తప్పుగా అర్ధం చేసుకోవటం ఒకసారి చేసావనుకో. తప్పేముంది. అందులోంచి- కొంత బాధాకరమైనప్పటికి ఒక అనుభవం పొందుతావు. అందువల్ల ఏమవుతుంది?

ఇప్పుడు ఈ ఆధ్యాత్మిక సందర్భంలో, ధైర్యమనేది ఒక తప్పనిసరి విషయము. నువ్వు ధైర్యము లేనిద ఒక్క అంగుళం కూడా ముందుకు కదలలేవు. సవాళ్లు, అత్యధిక దుఃఖాలు లేకుండా ఆధ్యాత్మిక భవిష్యత్తు యొక్క మలుపు ఎప్పటికి రాదు. నిజానికి మనవంతుగా ఆధ్యాత్మిక దిశగా ఒక స్పృహణీయమైన నిర్ణయం ఎప్పుడూ తీసుకోవటం అవసరం. ఈ ఆధ్యాత్మిక మార్గంలో అనేకమైన, కఠినమైన, పరీక్షలు ఉంటాయి. కఠినమైన నిర్ణయాలు ఈ మార్గంపై నడక కొనసాగించేందుకు తోడ్పడతాయి. కనుక ఎవరైతే ఇబ్బంది వస్తుందని అసలు ప్రయత్నమే మొదలు పెట్టనివారు, వారికి భవిష్యత్తు లేదు. అటువంటి వారికి నిరాశా పూరితమైన, ఆధ్యాత్మిక స్తబ్ధత మిగిలి ఉంటుంది.

ఇక్కడ నేను ఒక సూచన కూడా చేయదలుచుకొన్నాను. ఒక గొప్ప

ధర్మానికి (గుణానికి) నేను ధైర్యాన్ని ప్రోత్సహించడం ద్వారా నేను మూర్ఖ సాహసం, నిర్లక్ష్యం ఉండాలని మాత్రం చెప్పటం లేదు. అది జడత్వానికి, మానసిక మాంద్యానికి, సంబంధించిన ఇంకొక అధ్యాయానికి జత అవుతుంది. ఎప్పుడు విచక్షణా సహితమైన మేధాశక్తిని ఉపయోగించండి. చిన్నవి కాని పెద్దవి కాని అవకాశాలను, జీవన సాఫల్యత కోసం గ్రహించండి. పాఠాలు నేర్చుకోండి.

## వ్యాఖ్యలు

ప్రశ్న :

మీ జాబు నాకు బలమైన ఊపును తీసుకొచ్చింది. నేను మిమ్మల్ని ఒక ప్రశ్న అడగదల్చుకొన్నాను. కావలసిన ఫలితం (అవకాశం) కోసం మనం ఎదురు చూస్తున్నాం. చాలాకాలం ఎదురుచూసిన తర్వాత మనకి హఠాత్తుగా ఒక సందేహం వచ్చింది. లభిస్తున్న రెండు మార్గాలలో ఒక మార్గపు ఎన్నికపై ఆ సందేహం. ఆ రెండు మార్గాలలో ఒకటవమార్గం చాలా రక్షణ కలిగిన మార్గం. అధిక కాలం సహనం కలిగిన నిరీక్షణను మనస్సులో పెట్టుకొని- ఈ రెండు మార్గాలలో ఏది స్వీకరిస్తే - బాగుంటుందా సూచించండి. అటువంటి సమయాలలో - కొద్దిగా ఆడంబరమైనదాని కంటె- ఇబ్బందిలేని మార్గములో ఆడుకొంటే రక్షణగా ఉంటుంది కదా!?

ప్రశ్న :

ఇది జాబు కి సరియైన సమయం కాదేమో అనుకొంటున్నాను. మీరు చెప్పిన కూడలిలో నేను చాలా క్రితం ఉన్నాను. అందులో ఒక మార్గం చాలా సులభమైనది అందరూ ఇష్టపడేది. కాని నేను మాత్రం చాలా "తక్కువ మంది ప్రయోగిస్తున్న" నాకు చాలా ఉపయోగపడే మార్గాన్ని ఆశావిశ్వాసాలతో ఎన్నుకొన్నాను. ఒకే యొక్క సందేహం ఉంది. నేను ప్రపంచము చెప్పిన సకారాత్మక గుర్తులను నిర్లక్ష్యము చేసాను. విశ్వం నన్ను- ఆ మార్గాన్ని ఎన్నుకోక

పోయినా- ఒప్పించాలని చూపింది. చాలా సౌకర్యంగా ధ్వనించింది- కాని-నా ఒక్కడిని- తృప్తి పరచలేకపోయింది. "మీరు నిర్ణయం తప్పుగా తీసుకుంటే- కొంత బాధకు గురికాక తప్పదు. దాని నుండి నేర్చు"కొండని మీరు చెప్పారు. కాని నా హృదయం చెబుతోంది- "ఇది సరియైనది. ఇదే సరియైనది"

గురూజీ జవాబు :

మీ హృదయం చెప్పినదానిని మీరు అనుసరించండి. చివరికి ఏది ఎక్కువ ఆనందాన్ని, సంతృప్తిని మీ జీవితంలో కలిగిస్తుందని భావిస్తారో- ఆ- ఐచ్ఛికాంశాన్ని మీరు స్వీకరించండి.

ప్రశ్న :

మీ హృదయం చెప్పిన దానిని అనుసరిస్తూ, మేము స్థిరంగా ఒంటరిగా మార్గంలో ఎందుకు నడవాలిసి వస్తోంది?

మాకు ఆ మార్గంలో నడుస్తున్నప్పుడు అనేక ఎదురు దెబ్బలు (కష్టాలు ఎదురవుతున్నాయి. వాటిని ఎదుర్కోవటానికి మాకు సహకారబలం ఎందుకు లేదు! మేము మంది కోసం మారుతుంటే, ఎక్కువమంది ప్రజలు మమ్మల్ని ఎందుకు అంగీకరించటం లేదు!? వారు మాతో కలిసి నడవటం లేదు. ఒంటరిగా మేము నడవటానికి సహకరించటంలేదు.

గురూజీ జవాబు :

మీరు చెప్పింది నిజమే. సమయం వచ్చినప్పుడు మన చుట్టూ ఉన్నవారు, లేదా మనకు ఆప్తులైనవారు మన ధైర్యప్రయత్నాలకు వెంట ఉన్నామని బలమివ్వరు. ఆ సమయాలలో ఒక్కోసారి మనం బలవంతులమవుతున్నామని ఊహించి అడ్డుతగులుతుంటారు. కాని వారు అలా అవటానికి అభద్రతలు,

భయాలు, అసూయ, బలహీనత- ఇలా ఎన్నో రకరకాల కారణాలున్నాయి. ముఖ్యమైన విషయము ఏమిటంటే ఇది నీ ప్రయాణము. చివరికి నీ పెరుగుదలకి సంబంధించి ఏదిమంచో, శాంతి కారకమో, ఆనందదాయకమో- నువ్వే నిర్ణయించుకోవాలి.

ప్రశ్న :

మనం నేర్చుకొనే పాఠాలు ఉన్నాయని మనకు ఎలా తెలుస్తుంది? ఆ పాఠాలు ఆత్మస్థాయిలోనా? లేక భౌతిక స్థాయిలోనా? మనకు అనారోగ్యము మొదలైన ఎదురుదెబ్బలు తగులుతున్నప్పుడు, మనం పాఠం నేర్చుకొన్నట్టా? లేదా? మనం పాఠం నేర్చు కోకపోతే, చరిత్ర తనకు తానే పునరావృతమవు తుందని నేను అనుకొంటున్నాను. ఉదాహరణకి ఇటీవలే నాకు అనారోగ్యం కలిగింది. దీని నుంచి నేనేమి నేర్చుకోవాలి? ఈ విశాల విశ్వం సూచనలు ఏమైనా ఇస్తోందా? మేము జాగ్రత్తను చెల్లించాల్సి ఉందా? దయచేసి చెప్పండి

గురూజీ సమాధానము :

మన జీవితాలలో కొన్ని సవాళ్లు ఎదురయ్యే దాకా - మనం ఏ పాఠాలు సృష్టి నుంచి నేర్చుకోవాలో తెలిసే మార్గం లేదు. ప్రతిమానవ అవతారానికి మించి- ఆత్మ మనందరికి సంబంధించిన ఎన్నో అనుభవాలను భద్రపరుస్తుంది. అందుకే ఆత్మ స్థాయిలోనే పాఠాలు నేర్చుకోవాలి. మీరు అనారోగ్యము పొందుతున్నారంటే- దానికి కారణాలు-అనేకం. మన వ్యతిరేక కర్మ- మన పూర్వ జన్మలలో చేసిన ఋణాల పెద్ద చిట్టాను- ఇలా శారీరక బాధల ద్వారా- వ్యాధుల ద్వారా- ఎక్కువగా- తెలియచేస్తుంటుంది.

ఇది విశాల కర్మభాగములో ఒక కిటికీ శుభ్రం చేసిన దానితో పోల్చవచ్చు వ్యక్తిగతంగా కనుక కృషి చేయకపోతే- కర్మ పూర్తి కావటం చాలా కష్టం. అయి

నప్పటికి అనుబంధంగా ఉండే అనారోగ్యము, ఆర్థికము, బంధుత్వము- ఇలాంటి పాఠాలను నేర్చుకోవాలి. అన్ని అనారోగ్యాలు కర్మ సంబంధాలైనవి కావు. అనారోగ్యాలలో చాలా మటుకు మానసిక ఉద్వేగ సంక్లిష్టతకు సంబంధించినవే. కర్మ ఋణము కంటే తరచూ పునరావృతమయ్యే అనారోగ్యము ఒక కారణమవటానికి ఆస్కారమవుతుంది. కనుక మీ వంటి పరిస్థితులలో ఉన్నవారు ఉద్వేగస్థితులపై ఒక పట్టు సాధించాలి. లోపలి సంక్షోభానికి కారణమైన మీ చుట్టూ ఉన్న సన్నివేశ సమస్యలనుండి ఒక మార్గాన్ని వెతుక్కోండి.

ప్రశ్న :

కర్మ పాఠాన్ని తెలుసుకోవాలంటే- బాధపడటం ఒకటే మార్గమా? జీవితంలో పునరావృతమయ్యే ధోరణులు ఉదాహరణకి- ఆలస్యంగా కోరుకొన్న ఫలితం నెరవేరటం. దీని అర్థం మన జీవితకాలంలో, బాధ అంటే "ఆలస్యము" నేర్చుకొనే పాఠం "శాంతం" అవునా? విశ్వం- మనకు నేర్పే పాఠాల సూచనలకు సంబంధించి మరింత స్వీకారానికి ఏమి అవసరం? వెంటనే నేర్చుకోవటానికి సహాయం చేయటానికి అవసరమైనవి ఏవి? దయచేసి తెలియజేయండి.

గురూజీ సమాధానము :

బాధ ఒక్కటే పాఠాలు నేర్చుకొనే ఒకే ఒక్క మార్గం కాదు కాని మానవులమైన మనము ఉదాహరణ ద్వారా ఎప్పుడూ నేర్చుకోము. ఎప్పుడూ నేర్చుకొంటాం. బాధద్వారా శాశ్వత పద్ధతులలో దీనిని నేర్చుకొంటాం. పది సంవత్సరాలనుండి నా బోధన యొక్క ఆయువు పట్టు ఇది. మొట్టమొదటి బాధాకరమైన అనుభవం ద్వారానే మనము పాఠాలు నేర్చుకొంటే, లేదా ఇతరుల తప్పుల ద్వారా మన వైఖరి/దృక్పథం/ఆలోచన మారిపోతే- మనం మళ్లీ మళ్లీ బాధలు పునరావృతం కావటానికి ఇష్టపడం. మీరు చూపించిన ఉదాహరణలలో

శాంతము మీరు నేర్చుకోవలసిన పాఠం అన్నారు. బాగుంది. బహుశః మీరు ప్రపంచం ప్రదర్శించే మార్గ సూచులను బాగా చదువుతున్నట్లు లేదు. అసలు సమస్యపై శ్రద్ధ పెట్టకుండా వేరే విషయంలో తీరిక లేకుండా పనిచేస్తున్నట్టున్నారు. (Missing the woods for the trees) చెట్ల కోసం అడవులను వెతకటం లేదు. ఫలితాలు నెమ్మదిగా వస్తున్నాయని తెలిసినప్పుడు ఇంకా బాగా జాగ్రత్త వహించండి. ధైర్యపు మార్పుకోసం సిద్ధం కండి. మీ దగ్గర ఏదో లోపించినట్లు స్పష్టంగా తెలుస్తోంది.

## లేశమాత్ర మూలకం 2
## జీవితాన్ని ఉత్సాహభరితం చేయుట

ముందుగా ఉత్సవానికి (సెలబ్రేషన్) సంబంధించి మీకేమన్నా దురభిప్రాయం ఉన్నట్లయితే నేను సంబంధిత విషయాలు చెబుతాను. ఈ వ్యాసం విచ్చలవిడితనానికి, మరునాటి ఉదయం బార్ స్టూల్‌ని ఒలిచేంతవరకు ఉన్న తాగిన మత్తుల ఉత్సాహాన్ని వర్ణించటానికి కాదు. జీవితాన్ని ఉత్సాహ పరచటం అంటే అది ఆధ్యాత్మిక పెరుగుదలలో ఒక భాగం. ఇంకా ముఖ్యంగా చెప్పాలంటే మానవాభివృద్ధిలో ఒక భాగం వచ్చిన సమస్య ఏమిటంటే- మనం అడగటానికి బోలెడు విషయాలను సిద్ధం చేసుకొంటాం గాని, మన జీవితంలో కలిగి ఉన్నవాటిని అభినందించుకోలేం, అందుకని జీవితాన్ని ఉత్సాహభరితంగా చేసుకోవటం అనేది ఒక స్వభావంగా అలవాటు చేసుకోవాలి. అలానే జీవించాలి.

ఓ! నాకు తెలుసు. మీరు పై పేరాగ్రాఫ్‌ని (రచనాపరిచ్ఛేదన) చదివిన వెంటనే మీరు ఏమి అనబోతున్నారో! "నీకు కేవలం సమస్యల గురించే తెలిసి ఉంటే నేను ఇప్పుడు ఎదుర్కోగలను." "నేను పూర్తిగా ఇరుక్కొన్న దారుణమైన బంధుత్వాలనుండి విడివడితే ఉత్సాహంగా ఉండగలను. నేను ఆ ఉత్సాహపూరితంగా ఎప్పుడు ఉండగలనంటే- నేననుకొన్న పనులను అనుకొన్న

పద్ధతిలో చేయగల్గినప్పుడు" ఒక్కసారి నేను గడియారాన్ని వెనక్కి తిప్పగలిగితే, తప్పులను సరిదిద్దుకోగలిగితే, నేను తీసుకొన్న మూగ లేదా కఠిన నిర్ణయాలను వెనక్కి తీసుకోగలిగితే, నా జీవితంలో ప్రతి అంశాన్ని ఉత్సాహభరితం చేసుకొంటాను.

సమస్య చూశారా? మనం ఎప్పుడు కూడా సముచితమైన ఆదర్శధామ స్థలాన్ని మనం కోరుకొన్నవాటికి, అనుగుణంగా వెతుక్కొంటుంటాం. అప్పుడే మనం మన జీవితాన్ని ఉత్సాహభరితం చేసుకోగలమని భావిస్తాం. కాని నాకు తెలిసినంతవరకు, నువ్వు నీ జీవితంలో ఏమి పొందావు? ఏమి కావాలి? అనే దానితో సంబంధం లేకుండా- సంతోషంగా కృతజ్ఞతగా, ఉత్సాహంగా ఉండాలంటే వందకారణాలున్నాయి. వీటిని పరిగణనలోకి తీసుకోండి.

మీరు గుడ్డి వారు కాదు. చెవిటివారు కాదు. కుంటివారు కాదు. మానసిక వ్యాధి గ్రస్తులు కాదు. ఆసుపత్రిలోని పడకమీద అటుఇటు దొర్లాడటం లేదు. ఒక తీరని వ్యాధితో బాధ పడటంలేదు. ఇంకేం! ఆనందించండి.

ఎలా ఉన్నది అనేదానితో సంబంధంలేకుండా నీ కొక ఇల్లు ఉంది. రెండు పూటల భోజనం చేసే సౌకర్యం ఉంది. బట్టలున్నాయి. చెప్పులున్నాయి. హాయిగా ఆనందించండి. మీరు అక్షరాస్యులు, చదువుకొన్నవారు, జీవనోపాధి మార్గం కలవారు, డబ్బు, స్నేహితులు, కుటుంబం ఉన్నాయి. ఎవరో ఒకరు మాట్లాడ్డానికి ఉన్నారు. ఇంకేం! ఆనందంతో ముందుకు సాగిపోండి.

నా అభిప్రాయం ఏమిటంటే- మనకు లేనివాటి గురించి మనము ఆరోపణలు చేయటానికి సిద్ధంగా ఉన్నాముకాని, మన జీవితాలలో మనం కలిగి ఉన్నవాటి పట్ల కృతజ్ఞతలు చూపటానికి సిద్ధంగాలేము. మన నిర్దేశాలకు

అనుగుణంగా మన జీవితం ఉంటే మనం సంతోషంగా ఉన్నట్లుగా మనం భావిస్తాం. కాని ఇది సంపూర్తిగా జరగనిది. జరగదుకూడా. ఆత్మస్థాయిలో- మనకు లభించని ఆ ప్రదేశాన్ని పొందితే- మనం ఆనందబడతామని మనకు తెలుసు. ఆనందం ఒక క్రమ పద్ధతిలో వస్తూ, పోతుండే విజయం కాదన్న విషయం- మనం పూర్తిగా వదిలేసాం. అది నిజంగా చేతనకు సంబంధించిన ఒక స్థితి అది నీ నిద్రలేచే గంటలపై దినచర్యపై అధిష్ఠానంలా ఉంటుంది. నువ్వు నీ జీవితంలో సంతోషంగా ఉండటానికి అనేక కారణాలున్నాయన్న విషయాన్ని నువ్వు తప్పని సరిగా గుర్తించు. అప్పుడు జీవితాన్ని ఆనందపు చేతనగా ఉత్సాహభరితం చేసుకో.

ఇప్పుడు మీలో చాలా మంది నేను చెప్పినది అంగీకరిస్తారు. “ఇతను నన్నేమి చేయమంటున్నాడు? ప్రతినెలా నేను స్నేహితులకు బంధువులకు ఇచ్చే విందు వినోదాలను మానేయమంటున్నాడా? అలా అని ప్రకటన చేయమంటున్నాడా? అలా చేయటానికి నేనేమి గుడ్డి, కుంటి, దివాళాకోరును కాదుకదా!'' అని మీలో చాలా మంది నిశ్శబ్దంగా భావిస్తున్నారు. మీరన్నది కాదనను. తినటం, తాగటం, నృత్యం చేయటం- ఇవి మాత్రమే ఉత్సాహానికి కారణాలు కాదు. మీ జీవితాన్ని ఉత్సాహభరితం చేసుకొనే కొన్ని పద్ధతులు మీకు వివరిస్తాను.

హాస్యము (నవ్వు) :

మీరు దానితో పుట్టక పోయినా- ఆ హాస్యగుణాన్ని ప్రోదుకిలు అలవాటు చేసుకోండి. పనికిమాలిన తనము, వెకిలితనము లేకపోతే, మీరు చాలా సులభంగా నవ్వటానికి యోగ్యులు. ఈ ప్రాపంచికమైన, తీవ్రమైన సంఘటనలలో- కాసింత హాస్యపు నేర్పు చూపిస్తే మీరు ఎట్టి పరిస్థితుల్లోనూ నిరుత్సాహం పొందరు. నిజం చెప్పాలంటే మన మానవులమందరం నిత్యము

నాటకానికి, వినోదానికి నిర్వచనభూతులం. ఆ ఎక్కువ మొత్తమ్ము, నాటక వినోదాన్ని సహస్రాబ్దులు. మనము దైవత్వంతో ప్రతిపాదిస్తే మనకి మనం కొంత ఆనందము పొందటానికి ఆస్కారముంది. మానవుని యొక్క ఒక తప్పించుకోలేని గుణము ఏమిటంటే- ప్రకాశించే హాస్యము అనే విషయము తెలిసి మీరు ఆశ్చర్యపోవచ్చు దీనిని ఈ సారి ఎవరయినా సాధువుతో సన్నిహితంగా ఉన్నప్పుడు నిర్ధారించుకోండి. ఇక్కడ కొస మెరుపు ఏమిటంటే- నీ ఆనందం నీ నవ్వులో కనబడుతుంది. నవ్వే విషయాలు గురించి తెలుసుకోండి. ఎప్పుడూ తీవ్రంగా, నిరుత్సాహంగా ఉండటం లేదా భయంకరమైనదేదో ముందు పెట్టినట్లు బాధపడటంవల్ల నీ సమస్యలేవీ జీవితంలో తీరవు. దీనికి విరుద్ధంగా నీ హాస్యపు పరిస్థితి నిన్ను కష్టాలనుంచి విముక్తి చేస్తుంది.

తీవ్రమయిన భావావేశం

అభిరుచి (PASSION) :

నీ సంబరాల జీవిత విధానంలో నీ అభిరుచి ఏ విధంగా సరిపోతోందో గమనిస్తే నువ్వు ఆశ్చర్యపోతావు. కాని ప్రతి పుస్తకంలోనూ, ప్రతిరచయితా- స్వీయవ్యక్తిత్వ అభివృద్ధి కోసము నీ తీవ్రభావావేశాన్ని వదులుకోవాలని చెబుతారు. కాని అది నిత్యజీవితంలో ఆచరణీయ సాధ్యం కాదు. అది నిరాశా పూరితమైన సలహా. అది పెనగులాటలో చాలామందికి అనిపిస్తుంది. ఒక సారి నువ్వు ప్రముఖుడు, ఆటలవీరుడు, నమ్మశక్యం గాని సంపద ఉన్న వ్యక్తివి అయితే నీ తీవ్రభావావేశాన్ని జీవించడం చాలా సులభమవుతంది. కాని చాలా మంది మానవులు 99.99% పైన చెప్పిన మూడు విభాగాలలో ఇమడరు. మరి వాళ్ల సంగతేమిటి?

భేదం ఎక్కడుందంటే జీవితంలో నీ అభిరుచిని/భావావేశాన్ని ఎలా

చూస్తున్నావనే దాని మీద ఉంటుంది. నువ్వు నీ జీవితంలో ఏదో ఒకచోట సంతోషాన్ని పొందినప్పుడు, ఆ ఎడ్రినల్ గ్రంథి (మూత్రపిండానికి సమీపంలో ఉండే వాహికలేని గ్రంథి) సందడి చేసినప్పుడు, ఏదో ఒకటి దేనిగురించో మూసివేయాలనిపిస్తుంది. కొద్ది కాలంలోనే ఒంటరిగా నువ్వు ఆనందముయొక్క రహస్యస్థలాన్ని కనుక్కొంటావు.

ఇప్పుడు ఈ ఆనందాన్ని పొందటానికి నువ్వు ప్రప్రథమ రేసర్‌గానో (పందెపు గుర్రము), బంగీ జంపింగ్ వీరుడిగానో (ఎత్తునుంచి దూకే ఆటలో వీరుడు) అయ్యే విధానాన్ని నువ్వేమీ పటించనక్కర లేదు. ఇది ఎంత సులభమైన విషయమంటే తోటపని చేసినంత. స్వచ్ఛమైన గణిత శాస్త్రాన్ని క్లిష్టంగా భావించనంత జీవితంలో నీకు అభిరుచి ఏర్పడాలంటే నేను చెప్పే చిన్న విషయం ఒక్కటే- నీ పని, ఆట, కుటుంబం, సమాజం, కళ, సాహిత్యం, క్రీడలు, పెంపుడు జంతువులు, అలవాట్లు ఇలాంటి వాటిలో ఏదయినా- నీకు సంబంధం లేనిదయినా అభిరుచి ఏర్పరుచుకో. లేదా నువ్వు తమలో ఉన్నావని కాసంతయినా తెలియని వారిపై ప్రేమని పెంచుకో.

మాధుర్యం (తీపితనము) :

మాధుర్యంగా ఉండటమే- నీ జీవితాన్ని మాధుర్య భరితంగా చేసుకోవటమే. నీ జీవిత ప్రత్యేక మార్గాన్ని తెలియజేస్తుంది. దీని అర్థం- నువ్వు ప్రతివారు చెప్పినదానికి “అవునవునని” తల ఊపడమా? లేదా “గాయాలపాలైన” స్థితిలో ఏ ప్రతిక్రియ చేయకుండా ఉండటమా! కాదు. అది బలహీనత. ఖచ్చితంగా మాధుర్యానికి ఒక ప్రత్యేకమైన నిర్వచనముంది. తీపిని కలిగి ఉండటమంటే కొంచెం చిన్న ప్రయత్నాన్ని నీ చుట్టూ ఉన్న ప్రజలపట్ల అవ్యక్తంగా లేదా అచేతన లో చేయటం. నీ జీవితం కూడా చాలా హాయిగా అనిపించటం. నీ చుట్టూ ఉన్నవారికి కొద్దిపాటి ఆనందక్షణాలు ఇవ్వటం, వాళ్లు అర్హత కలిగి

ఉన్నదానికన్నా పిసరంత ఎక్కువగా అభినందించటం, వారి సమస్యల పట్ల సహానుభూతి కలిగి ఉండటం, లేదా నీ మాటలతో వాళ్ల మొగాల మీద నవ్వు తెప్పించటం.

నువ్వు ఈ మాధుర్యాన్ని లెక్కలేనన్ని **చిన్నపాటి మరియు ఒక నిమిష సంకేతాల** ద్వారా పరివ్యాప్తం చేయవచ్చు, అంతేకాని జీవితకాలం మొత్తం మీద ఒకే ఒక్క సారి భూమిని కంపింపచేయకూడదు. దయ, కారుణ్యం, ఇతరుల మంచి యందు దృష్టి మొదలైనవి చూపించాలంటే జీవితంలో చాలా తక్కువ సమయం తీసుకొంటుంది. కాని సమస్య ఏమిటంటే మనలో చాలా మందిమి కఠినత్వంలోను, రోత, అల్ప బుద్ధులలోనూ, ఇప్పటికీ ఆనందం పొందుతున్నాం. ఇలా కనుక ఉంటే, ముందు ముందు ఆత్మ శుద్ధి చాలా కావలిసి ఉంటుంది.

నా ఎన్నిక ఏమిటంటే మాధుర్యంగా ఉండటం వల్ల నువ్వేమి నష్టపోవు. కాని అమితమైన అభిమాన సంపదను పోగుజేసుకొంటావు. నువ్వు చాలా ప్రఖ్యాతి పొందుతావు. ఇతరులపై నీ ప్రభావాన్ని ఎలా చూపించాలి? లేదా స్నేహితులను ఎలా వశపరచుకోవాలి? అనే విషయాలు చెప్పటానికి నువ్వేమి పుస్తకాలు చదవనక్కరలేదు. ఈ మాధుర్య గుణం ఉంటే ఆ అవసరమే రాదు. నీ మార్గంలో బయటికి వస్తున్న మాధుర్యం నీతో చెప్పే మాట ఒక్కటే'' ఈ ప్రపంచం ఎంత అద్భుతంగా ఉంది'' అని.

### వ్యాఖ్యలు

ప్రశ్న :

నాకు, నా ఆత్మకు సంబంధించిన ఆహారాల కొరకు, వాస్తవంగా ఈ

లేశమాత్రమూలన అనుబంధం కావాలనిపిస్తోంది. మీరు చాలా కచ్చితమైన వ్యాధి నిర్ధారణ ఇచ్చారు. కాని నా సమస్య చాలా అది ఎలాగంటే మీరు ఉన్నదానికన్నా పిసరంత ఎక్కువగా అభినందించటం, వారి సమస్యల పట్ల సహానుభూతి కలిగి ఉండటం, లేదా నీ మాటలతో వాళ్ల మొగాల మీద నవ్వు తెప్పించటం.

నువ్వు ఈ మాధుర్యాన్ని లెక్కలేనన్ని చిన్నపాటి మరియు ఒక నిమిష సంకేతాల ద్వారా పరివ్యాప్తం చేయవచ్చు అంతేకాని జీవితకాలం మొత్తం మీద ఒకే ఒక్క సారి భూమిని కంపింపచేయకూడదు. దయ, కారుణ్యం, ఇతరుల మంచి యందు దృష్టి. మొదలైనవి చూపించాలంటే జీవితంలో చాలా తక్కువ సమయం తీసుకొంటుంది. కాని సమస్య ఏమిటంటే మనలో చాలా మందిమి కఠినత్వంలోను, రోత అల్ప బుద్ధులలోనూ, ఇప్పటికీ ఆనందం పొందుతున్నాం. ఇలా కనుక ఉంటే, ముందు ముందు ఆత్మ శుద్ధి చాలా కావలిసి ఉంటుంది.

నా ఎన్నిక ఏమిటంటే మాధుర్యంగా ఉండటం వల్ల నువ్వేమి నష్టపోవు. కాని అమితమైన అభిమాన సంపదను పోగుజేసుకొంటావు. నువ్వు చాలా ప్రఖ్యాతి పొందుతారు. ఇతరులపై నీ ప్రభావాన్ని ఎలా చూపించాలి? లేదా స్నేహితులను ఎలా వశపరచుకోవాలి? అనే విషయాలు చెప్పటానికి నువ్వేమి పుస్తకాలు చదవనక్కరలేదు. ఈ మాధుర్య గుణం ఉంటే ఆ అవసరమే రాదు. నీ మార్గంలో బయటికి వస్తున్న మాధుర్యం నీతో చెప్పే మాట ఒక్కటే'' ఈ ప్రపంచం ఎంత అద్భుతంగా ఉంది'' అని.

## వ్యాఖ్యలు

ప్రశ్న :

నాకు, నా ఆత్మకు సంబంధించిన ఆహారాల కొరకు, వాస్తవంగా ఈ

లేశమాత్రమూలన అనుబంధం కావాలనిపిస్తోంది. మీరు చాలా కచ్చితమైన వ్యాధి నిర్ధారణ ఇచ్చారు. కాని నా సమస్య చాలా అది ఎలాగంటే మీరు సంతోషంలోను, మామూలు పరిస్థితిలోనూ గుర్తుకురావటం లేదు **దయచేసి విస్తరించి చెప్పండి** ఈ సంగతులన్నీ ఎప్పుడు ఎలా గుర్తు పెట్టుకోవాలి- ఆ పడిపోతున్న వాటిని ఎలా విడనాడాలి?

గురూజీ జవాబు :

అవును. నీ ఆత్మకు సంబంధించిన ఆహారం కొరకు ఈ అనుబంధాల పునస్స్మరణ చాలా అవసరం. నేను ఈ మార్గంలో నడుస్తూ నాకు నేనుగా చాలా సార్లు ప్రతి రోజు చెప్పుకొంటాను. నేను చాలా పెద్ద ఆత్మని. ఒక మానవానుభవాన్ని  నా వెంట తీసుకువెళుతున్నాను. ఆ ఒక చిన్న ఆత్మ లోపల అంటే పెట్టుకొన్న మానవచ్చు.?

నేను "జీవనోత్సాహం" గురించి చెప్పదలుచుకొన్నది ఏమిటంటే, మనలో చాలా మందిమి మనజీవితాలలో అర్థం తెలియకుండానే ఆనందం యొక్క చెత్తను నిల్వ వేసే స్థలంలో పడ్డాం. మనకి సంబంధించి ఒక సత్యం ఏమిటంటే తీవ్రతరంలో భారం అయ్యాము. ఒక్కొక్కసారి బాధాకరమైన బంధుత్వాలను బాధ్యతలు, కర్తవ్యాలను మోస్తూ తన సమయాన్ని, శక్తిని వృధాచేసుకొంటున్నారు కొంతమంది నిరాశపూరితమైన తప్పుడు ఉద్యోగాల్లో చేరి తృప్తి లేక బాధపడుతున్నారు. తామే సొంతంగా పెంచుకొన్న దురాశ, అసూయ మరియు అనుబంధాలలో కొంతమంది కష్టాల ప్రయాణం సాగిస్తున్నారు. వీటన్నింటికంటే, కాదు - వీటన్నింటికంటే చాలా ఎక్కువగా, ప్రతి ఆత్మకు సంతోషమనేది జీవితంలో పుట్టుకతో వచ్చిన హక్కు అనేది జీవన సత్యం. కాని మీరు ఈ సత్యాన్ని వెండిపళ్లెం మీద పొందటానికి

ప్రయత్నించటంలేదు. వ్యతిరేక దవడల నుండి ఆనందాన్ని లాక్కోవాలి. అది మీ జీవన గమ్యపు ఆటలో శాశ్వతమైన భాగస్వామి. "జీవనోత్సాహం" కేవలం ఈ ఆటను ఎలా ఆడాలో, ఆ నిబంధనలను నేర్పుతుంది.

లేశ మాత్రమూలకం 3

ప్రసారకుడు కావాలి

ఇది పరిహాసం కాదు. మనమందరం తక్షణ సమాచార సౌకర్యాలతో బతుకుతున్నాం. చరవాణులకు (సెల్ ఫోన్స్) అంతర్జాలం (ఇంటర్నెట్), ఫాక్స్, లాప్ టాప్స్, పామ్ టాప్స్, వీడియో కాన్ఫరెన్స్, - మొదలైనవి ఉన్న ప్రపంచంలో బతుకుతున్నాం. ఒకే ఇంట్లో, ఒకే మంచాన్ని పంచుకొంటున్న ఇద్దరు కూడా తమ మధ్య అవధులు లేని భయంకరమైన అల్పస్థాయి సమాచారం కలిగ ఉన్నారు!? మంచి సమాచారదారు అయ్యే విషయాన్ని గురించి మేనేజ్మెంట్ (నిర్వహణ) నిపుణులు, మానసిక శాస్త్రజ్ఞులు, మరియు రచయితలు ఎంతో మంది వ్రాసారు. బంగారపు ధరలో చెత్తని అమ్మిన ఆ సరుకు మీకు ఎంత ఉపయోగపడింది? మౌనము యొక్క వేగాన్ని పెంచుతూ మీ జీవనాభివృద్ధిని ఎంత వరకు పెంచింది, కాని నా ధోరణి వరకు ఈ సమాచారముపై నాది చాలా విభిన్నమైన స్వీకృతి. డబ్బు, లక్ష్యములు, వ్యాపారము, లేదా సామర్ధ్యములు చేయు లేని సమాచారానికి సంబందించిన కొన్ని విభాగాలను ఇప్పుడు ప్రస్తావిస్తాను. మీ మానవత్వంతో, మా సంతోషంతో- లేదా దైవసాన్నిధ్యంతో - ఇది మీరు తప్పనిసరిగా చేయవచ్చు.

కనుక ముందుగా మానవత్వంతో - సమాచారము ఏం చేస్తుందో చూద్దాం. ఎవడికయితే అసామాన్యంగావినగలిగే సామర్ధ్యము ఉంటుందో వాడు సమాచారానికి సంబంధించని అతిముఖ్యమైన అంశము అవుతాడు. తెలివిలేని విషయాలనుంచి మంచి గాఢమైన విజ్ఞానము వరకు ఎవరయినా మాట్లాడవచ్చు.

కాని విశ్రాంతి తీర్పు లేదా అనంగీకార సూచన లేకుండా ఒకడు చెబుతుంటే ఎంత మంది దానిని వింటూ శాంతం, సమతుల్యత, అంగీకారము చూపగలుగుతున్నారు? మానవత్వంలోచాలా ఉన్నతమైన స్థితిని అర్హతగా ఈ వినగలిగే శక్తిని నేను భావిస్తాను. ఇది దైవసమానమయిన శక్తి. నువ్వు చక్కగా వినగలిగేవాడివయితే, నువ్వు దైవత్వంకోసం కొంత కృషి చేస్తున్నావని చెప్పటానికి నేను ఎటువంటి సందేహ పడటం లేదు. చాలా తరచుగా చాలా మంది ప్రజలు బాధల మధ్య ప్రయాణిస్తూ, తమ జీవితాలలో ప్రత్యేకించి తక్కువ అభివృద్ధిలో వివిధ సవాళ్లను ఎదుర్కొంటూ మాట్లాడటంలో చెలరేగి పోతారు. తమకు సంబంధించిన ఒత్తిడిని తమ మాటల ద్వారా నోరు మూసుకొని **ఊరికే వినటం** మాత్రమే చేసేవారికి వక్తలు సులభంగా పంచిపెడతారు. ప్రజలు ఎప్పుడూ సలహాలు వినాలనుకోరు. అన్నింటిలోనూ- విమర్శ ఒక్కటి- వాళ్ల తీవ్రమైన ఒత్తిడికి జత చేరుతుంది. అవి కొన్ని వేగమైన క్షణాలు. తమకు సంబంధించిన బాధను- శ్రోతకు పంచటం ద్వారా- కష్ట విముక్తి కలిగినట్లు భావిస్తారు వక్తలు ఆశ, బలము పొంది మున్ముందుకు సాగుతారు.

ఇప్పుడు మీ సంతోషాన్ని సమాచారం ఎలా ప్రభావితం చేస్తుంది? ఇక్కడ సంబంధము ఆకర్షణాయుతమైన నిర్వహణ. మీ సంతోషము ఎవరిమీద ఎక్కువగా ఆధారపడియుంటుంది? నా ప్రియతమా! భార్య/భర్త, పిల్లలు, తల్లి దండ్రులు, సోదరసోదరీమణులు, బంధుత్వాలు, గాఢ స్నేహితులు, యజమాని, సహచరులు లేదా ఈ విభాగాలలోకి రాని ఇంకోవ్యక్తి. ఎవరయినా మీ జీవితంలో చాలా ముఖ్యమైన పాత్రని వహిస్తున్నారు. ఇక్కడ కేవలం మీరు ఉత్తమ శ్రోతగా మాత్రమే ఉండాలని మాత్రమే నేను చెప్పటం లేదు. మీ ఆలోచనలు, భావాలను స్పష్టంగా శుభ్రపరచవలసి ఉంటుందని చెబుతున్నాను.

పైన చెప్పిన ప్రజలలో- మీ ఆనందం ఎవరిమీద ఆధారపడి యుంటుందో దానికి సంబంధించి మూడు నిర్దేశితాలపై ఆధారపడి ఉన్నాయి. ప్రాధాన్యతా క్రమాన్ని బట్టి అవి- 1. ధైర్యంగా ఉండు 2. స్వచ్ఛంగా ఉండు 3.స్పష్టంగా ఉండు. చెడు సమాచారం వల్ల చాలా ఎక్కువ మానవసంబంధాలు చెడిపోతున్నాయి. ఇది ఒకే కప్పు క్రింద ఉండే ప్రజల విషయంలో ఇంకా ఎక్కువ.

నువ్వు ఏమి అనుకొంటున్నావో, దాన్ని ఉన్నదున్నట్టుగా ధైర్యంగా చెప్పటం తప్పనిసరి నువ్వు చెప్పేది ఎవరికి చెందుతుందో. దాన్ని గురించి ఆలోచించకు, ఏది అవసరమో అది తప్పని సరిగా చెప్పాలి. వణుకు, ఆందోళన, ఫలితాల పట్ల భయం పుట్టేటి, ఒంటరి తనాన్ని చాలా దీర్ఘతరం చేస్తుంది. జీవితంలో సమృద్ధిగా ఉన్న సమస్యలు మన ఆలోచనలలో క్రమంగా మన మాటల్లో పరిశుద్ధత ఉంటే తప్పని సరిగా దూరమవుతాయి. నువ్వు ఈ సామర్థ్యంతో కలిసి పుట్టలేదు. దీనిని అభివృద్ధి చేయి. దీని లక్ష్యం చాలా సులభం. నువ్వేమి చెప్పిన నేరుగా చేరుతుంది. ఎందుకంటే చుట్టూ ఉన్న ముళ్ల పొదను నువ్వు ఎంత సేపు కొట్టినా, ఇంకా తరువాత దులపవలసిన ముళ్లు ఉంటాయి. చివరగా నేను చెప్పేదేమిటంటే యధార్ధంగా ఉండు. నీ యొక్క మనః పూర్వకమైన ప్రవర్తన- ఇతరులు ఎవరైనా అపాయకరంగా తీసుకొన్న సమయంలో- నిన్ను రక్షిస్తుంది. నా సమాచారము యొక్క ఉపాయము, - గ్రామ్య భాషల పందెంలో కలవరు. కాని తరచుగా చిన్న చిన్న వాటిల్లో కూడా నువ్వు చూడాలంటే చూడగలవు. అప్పుడు ఆ కళను చాలా తొందలగా అభ్యసించటానికి ప్రయత్నించు. కాని ఒక్క విషయం- నువ్వు చెప్పదలుచుకొన్న దాంట్లో స్థిరంగా ఉండు.

ఇప్పుడు దైవత్వంతో సంభాషణ ఎలా ఉంటుందో చూద్దాం. ఇప్పుడు రకరకాలుగా స్వీయవడ్డన గల (సెల్ఫ్-సర్వింగ్) సంస్థలు ఉన్నాయి. దేవుడు

మనకు వందల బిలియన్ల (బిలియన్ అంటే లక్ష కోట్లు) కాంతిసంవత్సరాల దూరంలో ఉన్నాడని చెబుతున్నాయి. *(కాంతి ఒక సెకనుకి 3లక్షల కిలోమీటర్ల వేగంతో ఒక సంవత్సరం పాటు శూన్యంలో ప్రయాణించిన దూరాన్ని కాంతి సంవత్సరం అంటారు)* ఒక ప్రత్యేక నిర్దేశిత ప్రణాళికలో ఉన్న ధ్యానం ద్వారా ఆ దేవుడు మన పిలుపును వింటాడని - ఎన్నుకోబడిన వ్యక్తులు మాత్రమే ఆ మతానికి సంబంధించిన దేవుడిని చేరుకోగలరని ఆ మత గ్రంధాలు చెబుతున్నాయి. అందువల్ల దేవునికి సంబంధించిన ఏ సమాచారమైనా ఆ మతం నెలకొల్పిన ఒక శుభ్రగృహము ద్వారా (చదవండి గుడి, లేదా మీకు ఇష్టమొచ్చిన పేరు పెట్టండి), నియమ నిబంధనల ద్వారా చేరుతుందని చెప్పబడింది లేదా- మీ సమాచారం-దైవారాధనకు తగిన విలువలేనిదవుతుందని నమ్మకం. నేను ఇప్పుడు పూర్తిగా ఆ మత ప్రార్థనలను తక్కువ చేయటం లేదు ప్రత్యేకించి మన వ్యక్తిగత మరియు గ్రహాలకు సంబంధించిన కంపనాలు- ఆలోచనలలో- చాలా తక్కువగా ఉన్నప్పుడు- మత ప్రార్థనలు, మత సంబంధమైన కార్యక్రమాలు, మరియు ఆచారాలు మన పరిణామ చరిత్రలో చాలా ప్రముఖ పాత్ర వహించాయి. దైవానికి సంబంధించి విన్నపము చేసే సమయంలో మళ్లీ మళ్లీ చేసే ఆ ధ్యానాలు,- కష్ట భరితమైన పరిశుద్ధియుతమైన ఆచారాలు- మనకు మిగిలిన ఒకే ఒక దిక్కు. అనాగరిక జాతులకు చెందిన మానవ అస్తిత్వ సమయం నుండి మన మానవాత్మ అనేక అవతారాలలో పరిణామం చెందింది. అనేక శతాబ్దాలు గడిచిన పిమ్మట. లెక్కలేనన్ని పుట్టుకల తర్వాత మనము ఆ ఆధ్యాత్మిక ప్రకంపనలకు ఉద్దీపనము చేసాము. మన ఆత్మలను పరిశుద్ధి చేసుకొన్నాము. మన అజ్ఞానాన్ని వదిలించుకొన్నాం. మన చేతనా క్రమాభివృద్ధి పొందింది. నీకు ఎక్కడా పరిశుద్ధ గృహావసరం లేదు. నీకు సంబంధించిన చెల్లింపులను నువ్వు నేరుగా విద్యుచ్ఛక్తి విశుద్ధి సేవల (ఎలక్ట్రానిక్ క్లీనింగ్ సర్వీస్) ద్వారా చెల్లించవచ్చు. ఇంకో మాటల్లో చెప్పాలంటే పాత పద్ధతి ఇంకా పని చేస్తున్నప్పటికి, అది నెమ్మది. కష్టసాధ్యమైనది మరియు

చేయకుండా వదిలేసిన మానవ తప్పిదాలను, అపజయాలను నేర్పిస్తుంది. ఈ కొత్త పద్ధతి దైవత్వంతో నేరుగా సమాచారాన్ని ఏర్పాటు చేస్తుంది.

ఈ కొత్త దైవ సమాచార వ్యవస్థ యొక్క హాల్ మార్క్ ఉన్న (బంగారము, వెండి మొదలైనవి యధార్థమని నిర్ధారించే అధికార రాజ ముద్ర) అసంబద్ధ సరళత. నువ్వు పూజించే- ఏ అవతారంలో ఉన్న దైవమయినా సరే- అతను/ఆమె నీ ఎదుటగా ఉంటాడు. నువ్వు దీర్ఘ సంభాషణ చేయవచ్చు నీ వ్యక్తిగతము మరియు గ్రహసంబంధమైన కదలిక సుఖానికి అవకాశమిస్తుంది. ఇది మన జీవనకాలంలో ఒక గొప్ప బహుమతి. మీరు పాత పద్ధతిని ఎన్నుకోవటంలో కూడా స్వేచ్ఛ ఉంది. పాత లేదా కొత్త వ్యవస్థలు రెంటిని అనుసరించుట ఎలా ఉంటుందంటే ఒక ఎడ్లబండి మీద ప్రయాణం చేయుటలా ఉంటుంది. లేదా కొత్త వ్యవస్థనే నువ్వు అనుసరిస్తావంటే. అది బుల్లెట్ (తుపాకి గుండు) రైల్‌పై ప్రయాణం చేసినట్లుంది.

అయినప్పటికి దేవునితో నేరుగా చేసే సంభాషణకి సంబంధించి కొన్ని ప్రాథమిక సూత్రాలున్నాయి. ఆ దేవున్ని నువ్వు రూపసహితంగా లేదా రూపరహితంగా చూడు. అది నీ ఇష్టం. కాని ఈ సమాచారం లేదా సంభాషణ లేదా ప్రార్థన తప్పనిసరిగా చాలా చిన్నదిగా ఉండాలి, చాలా గాఢత కల్గి ఉం డాలి. గుండె లోపలినుంచి వచ్చినదై ఉండాలి. నీ వ్యక్తిగత ప్రార్థన తప్పనిసరిగా పైన చెప్పిన నిబంధనలతో సరిపోయి ఉండాలి. ఇక్కడ ఇంకొక చిన్న బహుమతి. నువ్వు ఆరాధించే దైవరూపాన్ని ఇరవైనాలుగు గంటలు మీతో పాటు ఉండే మీ కుటుంబ సభ్యునిగా నిజంగా భావించు. ఇంకొక గ్రహములో ఉండే వానిగా దేవుని భావించటానికి నీకు అనుమతి ఎవరిచ్చారు! నన్ను నమ్మండి. ఇది నా వ్యక్తి గత అనుభవం లోనుంచి చెబుతున్నాను. ఇంకా ఎక్కువగా సర్వకాల సర్వావస్థల్లో దైవత్వాన్ని నువ్వు అనుభవిస్తావు. నువ్వు మానసికంగా దేవుని

నమ్మితే, దేవుడు నీతోటే ఉంటాడు. అప్పుడు నువ్వు చేసేది చాలా శక్తిమంతమైన ప్రార్థన అవుతుంది.

ముగింపులో నేనొక ముఖ్యమైన విషయం చెప్పదల్చుకొంటున్నాను. ఒక రెండు అనుభూతులను నువ్వు తప్పనిసరిగా- తప్పనిసరిగా- నువ్వు- పదాలతో సహా - తరచుగా - దేవున్ని లేదా - ఇంకొక మానవున్ని పలకరించే టప్పుడు వ్యక్తమయ్యేటట్లు చూడు. ఆ రెండు **ప్రేమ మరియు కృతజ్ఞత,** ఆ రెండు చెప్పాలి. ఆ రెండు మాట్లాడాలి. ఈ రెండు అనుభూతులు కలగలిపిన ఏ రాత్రి సమాచారం లేకపోతే - మీ చర్యల గురించి మీరు ఊహించకండి. నన్ను నమ్మండి- దైవత్వం చాలాకాలముగా మీ నుంచి ఇది వినాలని ఉన్నాడు.

## వ్యాఖ్యలు

వ్యాఖ్య :

ఎంత సులభమైన, ఆశ్చర్యకరమైన దైవ సహితమైన మార్గమిది మీరు నమ్మకపోవచ్చు. నేను ఈ సమాచార పద్ధతిని సాధ్యమైనంత ఎక్కువసేపు అనుసరిస్తున్నాను. నేను మిమ్మల్ని కలుసుకొన్న తర్వాత తప్పు ఒప్పుకొంటాను. నాకు అత్యంతవిలువైన **"ప్రేమ మరియు కృతజ్ఞత"**లకు సంబంధించిన ప్రాముఖ్యత తెలిసివచ్చింది. అవి చాలా అద్భుతంగా పనిచేస్తు న్నాయి.

వ్యాఖ్య :

మీ వరుస ఉపన్యాసములకు సంబంధించిన అన్ని విషయాలు చదివాను. నేనొక మానవునిగా ఎదగటానికి అవి ఎంతో ఉపకరించాయి. ఇంకా ఎక్కువ మంది ఈ సందేశం చదవాలి. దీన్ని వ్యాప్తిచేయాలి. ఎందుకంటే దీని ద్వారా జీవితం అర్థమవుతుంది. మీ నోటినుండి వచ్చే మాట నాకు గీతతో సమానము.

వ్యాఖ్య :

దైవత్వంతో కూడిన సమాచారాల భాగస్వామ్యం జీవితముయొక్క విమ్నోన్నతాలను తెలియజేస్తుంది. **దేవునికి** ప్రతివిషయంలో కృతజ్ఞతలు. ఇది ఆ పైన పేర్కొన్న స్వామి యొక్క సర్వాంతర్యామిత్వాన్ని తెలియజేసే మార్గం. అతీతమైన ఒక శక్తి ఉంది. మనమందరం కూడా ఆ అతీత శక్తి యొక్క ఒక చిన్న భాగం. ఇది **ఆ దేవుడు "గురూజీ"** ద్వారా మనందరికి సమాచారమిచ్చాడని దృఢంగా నమ్ముతున్నాను.

వ్యాఖ్య :

అవును. వినుట- సమాచార వ్యవస్థలో ఆధారభూతమైనది. సమాచార శబ్దాలు చాలా తేలికగా ఉంటాయి. కాని ఇప్పటికి కొంతమంది వ్యక్తులు మాత్రమే అనుసరిస్తున్నారు. దైవత్వంతో మనమందరం అనుబంధితులమనే విషయం తెలిసిన దగ్గరినుంచి (మళ్లీ ఒకసారి) చాలా ధైర్యంగా ఉంది. ఇంకా వేరే మధ్యవర్తి అవసరం లేదు.

మీరు చెప్పే ప్రతిసందేశము వేటికదే- ప్రత్యేకము. ఎందుకంటే అది మన ఆధ్యాత్మిక ప్రగతి కళ్లాలు మన చేతుల్లోనే ఉన్నాయని నొక్కి వక్కాణిస్తున్నాయి.

లోకంలో చాలా మంది గురువులుతమ శిష్యులను, సాంప్రదాయిక ఆచారాల వెంట వెళ్లమని చెప్పి ప్రోత్సహిస్తుంటారు. దానితో పాటుగా గురువుల మీద ఆధార పడే లక్షణాన్ని శిష్యులకు నేర్పిస్తారు.

మీ మార్గంలో వెలుగును ఇచ్చేదిగా మీ సూచనలు మీకు సిద్ధంగా ఉన్నాయని ఒక దివ్యానుభూతి.

## 4. ఆచరణాత్మక ఆధ్యాత్మికత
## (సంక్షిప్త కథనము)

నా వ్రాతలు, మార్గదర్శనము, బోధలు వీటన్నింటి వెనకాల ఉన్న నా ప్రధాన ఉద్దేశము ఆధ్యాత్మికతను అభ్యసించే విషయము గురించి నేను కాదనను. పవిత్ర మత గ్రంథాలు, తత్త్వ శాస్త్రము మరియు అదే రకంగా ఉత్తేజాన్నిచ్చే వివిధ పుస్తకాలు చదవటం చాలా మంచిదే. ఇలా చదవటం వల్ల మన దృక్కోణము విశాలమవుతుంది. మన మేధా శక్తి ప్రకాశితమై, ఒక కొత్త చిగుర్లు తొడగవచ్చు. కాని నా అనుభవము మరియు పరిశీలనలో ఒక విషయం తేలింది. నువ్వెన్ని పుస్తకాలు చదివావు!? లేదా ఏ స్థాయి వరకు పుస్తక జ్ఞానాన్ని సంపాదించావు!?- ఇవన్నీ పై పైకి కనిపించే, సమగ్రంకాని బుద్ధికి సంబంధించిన అన్ని రకాల పోషకాలను మాత్రమే పొందుతాయి. ఈ స్థూల శరీరముయొక్క ఆధ్యాత్మిక సమాచారము అనేక రకాలుగా ఉన్న మతగ్రంథాలలో ఉంది. అరుదుగా వడపోత ద్వారా బొట్లుగా కిందకు పడే విధంగా నిత్య జీవన విధానం ఉంది. నేను దీనిని ఒక సన్నివేశంతో పోలుస్తాను. శస్త్రవైద్యుడు అనాటమీ (వివిధ అవయవములు పని చేసే జీవియొక్క రూప స్వరూపాలను వివరించే శాస్త్రము) శస్త్రవైద్యాలకు సంబంధించిన ప్రతి పుస్తకాన్ని చదవచ్చుగాక! కాని అవి చదివేటప్పుడు కాని తన రీతిలో ఎన్నడు శస్త్ర వైద్యానికి సంబంధించిన పదునైన కత్తిని పెట్టుకోడు.

కనుక ఈ వ్యాసంలో అనుష్ఠాన ఆధ్యాత్మికత (సంక్షిప్త కథనము) గురించి అందరూ చేయ గలిగే ఒక చిన్న ఆధ్యాత్మిక అభ్యాసాన్ని వివరిస్తాను. ఇక్కడ వివరించబోయే కొన్ని ఫలితాలు మీ జ్ఞాపక శక్తిని - జతచేయటం కంటే మీ తీవ్ర ప్రయత్నానికి తోడ్పడగలవని ఆశిస్తాను.

## సంబంధం కలిగి ఉండటానికి - సంబంధాన్ని రక్షించుకోవటానికి

మానవుడు ఒక సాంఘిక జంతువు. అందువల్ల పరస్పరం ప్రేమాభిమానాలు కలిగి ఉండాలి. ఇప్పుడు వస్తున్న రకరకాల గేడ్జేట్సు (చిన్నవైన విద్యుచ్ఛక్తి ఉపకరణములు)- అంచులను చెరిపేస్తున్నాయి. మనలిని ఊరిస్తున్నాయి. నువ్వు ఒంటరి తనాన్ని కోరుకున్నప్పటికి, వీటితో సంబంధము లేకుండా ఉండటం చాలా కష్టం. ఇటువంటి స్థిరమైన, త్వరితమైన సంబంధాల స్థితిని దైవత్వంతో కలిగి ఉండాలని నువ్వు ఎప్పుడన్నా ఆలోచించావా! యధార్థంగా అలా ఆలోచించవు. ఎందుకంటే- దైవ సంబంధమనేది చాలా కఠినమని చాలా సమయం తీసుకొంటాయని, మీ ఆలోచన. ఎందుకంటే ఇటువంటి దురభిప్రాయాలతో మా మనస్సంతా నింపిన వారికి కృతజ్ఞతలు. మీరు అటువంటి "పురోగమించే" ఆధ్యాత్మిక కృత్యానికి తగిన అర్హత లేని వారని మీ ఊహ.

ఇప్పుడు నేను నీకు ఈ విశ్వచేతనను హత్తుకోవటం ఎలానో చెబుతాను. దీనిని సాధారణ పరిభాషణలో మనోదేవుడు అంటాను. ఇక్కడ నేను 'మనోదేవుడు' అని ప్రత్యేక పదబంధం ఎందుకు వాడానంటే విశ్వచేతనను గురించి వివరించటానికి మొదలుపెట్టానంటే- అది అనవసరంగా రూపము లేని భౌతిక పరిభాషని వివరించవలసి వస్తుంది. అది వ్యాసము యొక్క లక్ష్యాన్ని దెబ్బ తీస్తుంది.

సంక్లిష్టమైన విషయాలతో సంబంధం లేకుండా- మీరు విశ్వ చేతనతో ఎప్పుడూ సంబంధీకులని- గట్టిగా హామీ ఇస్తున్నాను. కాని మనం 'స్టాండ్ బై మోడ్' (సెల్ ఫోన్ స్విచ్ ఆఫ్ చేసిన స్థితి) లో ఉన్నాము. మీరు 'కాల్' చేస్తారా? 'కాల్ అందుకొంటారా? అది మీ అధీనంలోనే ఉంది. నేను ఇక్కడ (పిలుపు)

మీకు విపరీత పరిణామము. బలముగల మానసిక సంబంధమైన జిమ్నాస్టిక్స్‌ని (వ్యాయామక్రీడలు) అందించుకోవటం లేదు. నమ్మండి... నమ్మకపోండి... విశ్వచేతనాన్ని నొక్కటమంటే సెల్ ఫోకల్ (చరవాణి) వేగంగా డయల్ చేయటమంత సులభం.

విశ్వ మానసముతో సంబంధము పెట్టుకోవటానికి రకరకాల దారులున్నాయి. కాని- నేను ఇక్కడ ఇచ్చిన సాంకేతికత చాలా వేగవంతమైనది, సులభమైనది. దీనిని నేను ఎప్పుడూ ఉపయోగిస్తుంటాను. కాని మనస్సులో మీరొక విషయాన్ని ఎప్పుడూ గుర్తుంచుకోండి. సృష్టికర్త యొక్క మనస్సు విచిత్రమైనది. అపూర్వమైనది.

ఆ మనస్సు అంతటా వ్యాపించిఉంది. ఒకే సమయంలో అన్ని చోట్లా వాస్తవికంగా నిలిచిఉంది. ఈ భూగ్రహాన్ని దానిపై ఉన్న ప్రతి ఒక్క చిన్న విషయాన్ని కప్పి ఉంది. ఆశ్చర్యకరమైన విషయం ఏమిటంటే అది ప్రతి మానవ మనస్సును ధ్వనింపచేస్తోంది. ఆ మానవ మనస్సు ఆధ్యాత్మిక పరిణతి పొందిందా! లేదా అనే విషయంతో సంబంధం లేదు. ఆ విశ్వచేతనలోకి అనుసంధానించడ్డ మానవ మనస్సు స్థిరంగా ఉందా? లేదా చలనస్థితిలో ఉన్నదా? అనేదానితో సంబంధం లేదు. ఈ చేతనని మానసికంగా మాత్రమే గుర్తించగల గమని తెలుసుకోవటం చాలా ముఖ్యం. ఈ చేతన ఆకాశంలాంటిది. ఎప్పుడూ ఉంటుంది. ప్రతి విషయం దాని పరిధిలోకే వస్తుంది.

ఇప్పుడు కొన్ని సామాన్యమైన అంశాలను గమనిద్దాం :

1. నీ శరీరాన్ని పూర్తిగా, హాయిగా, నీకు ఇష్టంగా ఉన్న స్థితిలో ఉంచు. నీ కళ్లు మూయి. నీ శరీరపు ఎరుకను నీకు తెలిసిన ఏదో ఉపాయాన్ని- సాంకేతిక విధానాన్ని - అనుసరించి, కుదించు. నీకు నా సమావేశాలు మరియు ప్రార్థన

స్థలాలలో అటువంటి అనేక పద్ధతులు చెప్పి ఉన్నాను. ఇప్పుడు కొంచెం మీ జ్ఞాపక శక్తికి తిరిగి ఉత్సాహము కల్గించి (Refresh) మీ శ్వాసపై దృష్టి పెట్టండి. ఈ దశలో కొంచెంసేపుండండి. ఎప్పటిదాకా అంటే మీ బరువు తగ్గినట్లు, మీ భౌతిక శరీరం నుండి మీరు బయటికి వచ్చినట్లు తెలిసేటంత వరకూ.

2. ఇప్పుడు మీ ఇష్టము వచ్చిన దైవత్వాన్ని/దైవాన్ని/సృష్టికర్తని - మీ ఇష్టము వచ్చిన స్వరూపంలో ఊహించండి. ఒక విషయం- ఇప్పుడు ఏ రూపాన్నయితే మీరు ఊహిస్తున్నారో, ఆ రూపం మీ హృదయంతో అంటుకొని ఉండాలి. అందువల్ల మీరు స్మరించే రూపం సాధువు/ఋషి/ముని/ప్రవక్త (Prophet) గురువు, తపస్వి లేదా చిత్రకారుడు చిత్రించిన ఒక వాస్తవ చిత్రం లేదా ఒక పురాణ పాత్ర- ఇలా ఏదైనా కావచ్చు. దృశ్యమాన చిత్రం (కాన్వాస్) చాలా పెద్దది. నువ్వు స్మరించే రూపం శాశ్వతంగా ఉండేదా? భౌతికరూపమా!- ఎటువంటి తేడా లేదు. ఏదైనా కావచ్చు.

3. ఇప్పుడు నీ ప్రియమైన స్నేహితుడిని ఆహ్వానిస్తున్నట్లు నువ్వు ఆ రూపాన్ని నీ పక్కన కూర్చోబెట్టుకోవటానికి ఆహ్వానించు. ఈ దైవసంబంధమైన రూపం- నువ్వు చాలా ప్రేమించే వారిలో ఒకరిగా భావించు. ఇప్పుడు వాస్తవంగా ఆ ప్రేమాభిమానాలను తెలియజేయి. నిజంగా నీ హృదయంలో ఆ ప్రేమని భావిస్తున్నావో లేదో పరిశీలించు.

4. నీ ప్రియమైన స్నేహితుని తో నువ్వు ఎలా మాట్లాడతావో- అలా- ఇప్పుడు నువ్వు ఆ దైవరూపంతో మాట్లాడు. సూర్యుని నీడలో ఏదైనా, ప్రతిదీ ఆ రూపంతో మాట్లాడు. నీ సమస్యలు, నీ కష్టాలు, నీ రహస్యనిర్ణయాలు, నీ విజయాలు, వాతావరణం, రాజకీయాలు, ఆటలు, ఉద్యోగం, పరిసరాలు, యజమాని, భార్య/భర్త, పిల్లలు, అత్తామామలు (ఇన్-లాస్)-ఇలా ఏ విషయమైనా

కావచ్చు. నీకేమైనా కొన్ని సందేహాలు, కొంతమార్గ దర్శనం, సలహా కావాలంటే హాయిగా ఆ రూపంతో మాట్లాడి, పరిష్కారం అడుగు ఇక్కడ ఒక ముఖ్యమైన విషయం ఏమిటంటే - ఆ రూపాన్ని నీకు చాలా దగ్గరయినవానిగా, ప్రేమ పాత్రునిగా భావించు. దేవుడంటే భయంకరుడని, ప్రతీకారముతో చిత్రవధ చేసే వ్యక్తి అని (                                    ) నువ్వు చేసిన పాపాలను మానుకొన్నందువల్ల వచ్చిన పాపాలకు (                                    ) తగిన సమయం కోసం వేచి చూస్తూ శిక్షించేవాడని- చెప్పిన సంప్రదాయ స్థితులను నువ్వు ఇప్పుడు పట్టించుకోకు.

5. ఒక తోటి మానవునితో నువ్వు మాట్లాడే వాస్తవ సంభాషణని నువ్వు అనుకొన్న రూపంతో మాట్లాడు. ఆ రూపము నీతో మాట్లాడే ముచ్చట్లను మాటలను ఊహించి, ఆ మాటలను వినటానికి ప్రయత్నించు. నువ్వు ఒక ప్రశ్న అడగబడితే, ఆ ప్రశ్నకు జవాబు ఇవ్వటానికి ఊహించు. ఎంతవరకు సాధ్యమయితే, అంతవరకు ఈ పరస్పర సంభాషణ - మధ్యలో ఎటువంటి ఆటంకము లేకుండా కొనసాగించు.

ఇది చదివిన తర్వాత మీకు చాలా ప్రశ్నలు సందేహాలు వచ్చి ఉంటాయని నాకు తెలుసు. మీరు అడిగే ప్రశ్నలను నేను ముందుగానే ఊహించి, FAQ పద్ధతిలో ఎంతవరకు వీలయితే అంతవరకు జవాబు ఇస్తాను

1 Frequently asked Questions తరచుగా అడిగే ప్రశ్నలు - అనువాదకుడు.

సత్యం మాతాపితా జ్ఞానం, ధర్మో భ్రాతా, దయాసఖా
శాంతి పత్నీ, క్షమా పుత్రాషడైతే మమ బాంధవః

ప్రశ్న :

ఎక్కడ దేవుడు నిజముగా చిత్రములోకి (రంగంలోకి) వస్తాడో, అటువంటి కల్పన (ఊహ) నాకు ఎక్కడ లభిస్తుంది?

జవాబు :

మానవ మనస్సుకు విశ్వ మనస్సుకు సంబంధము ఉండాలి. ప్రారంభంలో అది తనకు తానే చెప్పుకొనే ధ్యానము. కాని చేయగా చేయగా కొంతకాలానికి నువ్వు ఆ రూప సమక్షంలో ఉన్నట్లు భావిస్తావు నువ్వు కూడా ఆ దేవరూపం నుంచి ప్రతిస్పందనలను పొందుతున్నట్లు భావిస్తావు.

ప్రశ్న :

నేను అది ఎలా తెలుసుకోగలను? లేదా ఆ దైవరూప సమక్షాన్ని ఎలా భావిస్తాను?

జవాబు :

ఈ విధానము చేస్తున్నప్పుడు మీరు చాలా ఆనందాన్ని పొందుతారు. ఈ ఆనందమే నిజమైన ఆనందము. నువ్వు ఆనందాన్ని పొందగలవు. ఎప్పుడంటే ఆ సమక్షంలో నిన్ను నువ్వు ప్రతిష్ఠించుకో. నీకు ఇష్టమైన వారిని, కొంతసేపు గడపటానికి ఆహ్వానించి వారి సమక్షంలో ఎటువంటి ఆనందము పొందుతావో, సరిగ్గా అటువంటి ఆనందమే దైవరూప సమక్షంలో పొందుతావు.

ప్రశ్న :

నేను ఏదన్నా సహాయం అడిగితే ఆరూపం నాకు నిజంగా సహాయం చేస్తుందా?

జవాబు:

తప్పకుండా! ఆ రూపానికి సంబంధించిన కొంత శక్తి-మీకు తప్పకుండా సహాయం చేస్తుంది. ఆ దైవస్వరూపం మీ వెంట ఉన్నదని భావిస్తూ, ఆ రూపం పై ప్రేమకలిగి నిండు హృదయంతో ఆహ్వానిస్తే తప్పకుండా మీరు ప్రతిస్పందన పొందుతారు. ఈ అభ్యాసము యొక్క మొదటి దశలలో మొదట మీతో మీరు మాట్లాడుకొంటున్నట్లు అనిపిస్తుంది. కాని రాను రాను మీరెంత బాగా అభివృద్ధి పొందారో, సూచనలు పొందండి, సమస్యలకు పరిష్కారాలు పొందారో-మీకే తెలుస్తుంది.

ప్రశ్న:

నేను ఆ రూపం పక్కన నిశ్శబ్దంగా కూర్చోగలనా?

జవాబు :

తప్పకుండా అయితే మీరు ధ్యానంలో చక్కటి నిష్ఠని పెట్టకపోతే, చాలా తక్కువ సమయంలో- మీరు ధ్యాసని మళ్లిస్తే - ఆ రూపంతో సంబంధం తెగిపోతుంది. ఇది ఎలాగంటే చరవాణి (సెల్ ఫోన్) లో కాల్ (పిలుపు) చేసేటప్పుడు మధ్యలో ఆగిపోవటం.

ప్రశ్న :

ఒక రూపముకాని దైవస్వరూపాన్ని అంటే ముఖము, రూపము లేదా దానిని పిలవటం ఈ ప్ధతిలో సాధ్యమవుతుందా? అంతరిక్షంలోని గోళము యొక్క కాంతిలా భావించటం సాధ్యమా?!

జవాబు :

తప్పకుండా ఇది సాధ్యమవుతుంది. కాని అభ్యాసములో ఇది కష్ట సాధ్యము. గుర్తుపెట్టుకోండి. మనస్సు సంబంధము పెట్టుకొంటుంటే, హృదయము శక్తి నిస్తుంది. అది వివరణకు చెప్పటానికి కొంచెం ఇబ్బందిగానే ఉంటుంది. ఒక జిగేలు మనే కాంతి విషయంలో కాని, లేదా రూపములేని విషయంలోగాని కావలిసినంత అనుభూతిని పొందాలి.

ప్రశ్న :

ఈ పద్ధతి ప్రార్థన వంటిదేనా?

జవాబు :

వాస్తవంగా కాదు. సంప్రదాయప్రార్థనలు- అత్యధికఫలితాన్ని అందివ్వటానికి సాంకేతికతతో ఉంటాయి. మీ ఇంట్లో పెరిగే వ్యక్తిగత విజ్ఞప్తులు, ప్రార్థనలు వీటికి దేవుడు చాలాదూరం. ఎందుకంటే ఆయనతో విడిపోయి ఉంటారు. లేదా భయంతో కూడుకొని ఉంటారు. ఒక్కసారి నేను చెప్పిన పద్ధతిలో దేవుడిని ఒక ఆప్త స్నేహితునిగా లేదా బంధువుగా లేదా నీ స్వంతదారుగా భావించావా- దానంతటఅదే- నీకు- ఆ అత్యధిక శక్తికి మధ్య సంబంధము ఏర్పడుతుంది. నువ్వు ఈ సంబంధాన్ని గమనిస్తావు. ఒకసారి నువ్వు మాట్లాడిన తర్వాత, ప్రతిదీ ఆ రూపంతో చెప్పుతున్నకొద్దీ- అతి తక్కువ కాలంలో- నీ మనస్సులో సమాధానాలు లభిస్తాయి.

ఇక్కడ నా వ్యక్తిగత అనుభవాన్ని మాతో పంచుకోవాలనుకొంటున్నాను. ఈ పద్ధతిని ఎంత వీలయితే అంతవీలుగా ఒకరోజులో అనేక సార్లు మీకు సమయముంటే చేయండి. అప్పుడు మీరు అప్రయత్నంగా దీనిని పొందుతారు. స్థిరమైన మానసిక అభ్యాసం లభిస్తుంది. మీరు మీ జీవితంలో ఇది ఎంత పెద్ద

తేడా తెచ్చిందో గమనిస్తారు. మీరు ఈ రూపాన్ని ఒక నీడగ అనుకోండి. దానిని ప్రతి నిమిషం, ప్రతి సెకను అనుసరించండి. మీరు ప్రతి కదలిక యెడల చాలా జాగ్రత్తగా ఉండాలి. ఎందుకంటే తోటమాలి తన శక్తిమంతమైన తోటలో ఉన్న ఏ ఒక్క మొక్కని కూడా నిర్లక్ష్యము చేయడు. ఇదంతా ఆభ్యాసము ద్వారా మీరు తెలుసుకొంటారు.

## వ్యాఖ్యలు

ప్రశ్న :

దేవునితో సంబంధం కలిగించే అద్భుతమైన సాంకేతిక విధానాన్ని మాతో పంచుకొన్నందుకు ధన్యవాదములు, నేను క్రితం రాత్రి ఈ పద్ధతిని ప్రయత్నించాను. నిజంగానే నేను అద్భుతమైన అనుభవాన్ని పొందాను. నేను నా గదిలో ఒంటరిగా కూర్చున్నాను. కళ్లు మూసాను. ఒక రెండు నిమిషాల పాటు సో2హం (అతడే నేను) అని ధ్యానం చేసాను. నీకు నాకెంతో ప్రేమ పాత్రుడైన **గురువును** రమ్మనమని, నాతో మాట్లాడమని ఆహ్వానించాను. నేను పదే పదే వారిని పిలిచాను, అనేక సార్లు అలాగే పిలుస్తున్నాను. హఠాత్తుగా నా జ్ఞాననేత్రానికి నా చుట్టూ ఏదో జరుగుతున్నట్లు అనిపించింది. నా చెవులకు గాలి యొక్క చప్పుడువినిపించింది. నా గుండె సుత్తితో కొడుతున్నట్లు అనిపించింది. నా గుండె లబ్-డబ్ చప్పుళ్లు మొదటిసారిగా చాలా పెద్ద చప్పుడుతో విన్నాను. నాకు చాలా భయమేసింది. నా **గురువును** సహాయం చేయమని ప్రార్థించాను. నేను ఇప్పుడు భయపడ్డాను. నన్ను భయపెట్టవద్దని వారిని అడిగాను. ఆస్తితిలో నన్ను నేను నిగ్రహించుకోవడం అసాధ్యమైంది. భయంతో నా కళ్లు తెరిచాను. మూసిన కళ్లు తెరచిన తర్వాత కొన్ని సెకన్ల పాటు మీరు చెప్పిన పద్ధతులను వరుసగా చేసాను. ఆ తర్వాత నా **గురువు**తో పదిహేను నిమిషాలకంటే ఎక్కువగా మాట్లాడాను. తర్వాత అవిశ్రాంతంగా

మాట్లాడుతూ వారి ప్రతిస్పందన కోసం ఎదురు చూసాను. మొదట నాకు ఎటువంటి స్పందనా రాలేదు. చివరికి నేను నావైపు నుంచి మాట్లాడటం ఆపి, వారి వైపు నుంచి స్పందన కోసం చూసాను. కొన్ని సెకన్ల తర్వాత ఆశ్చర్యాద్భుతాల మిళితమైన ఒక స్వరం నా ప్రశ్నలకు జవాబు ఇచ్చింది నేను చాలా ఆనందానుభూతిని పొందాను ఆ జవాబులు వినే అదృష్టాన్ని పొందాను. చివరికి, నా **గురువు** కి నాతో ఉన్నందుకు ధన్యవాదాలు చెప్పాను. నాతో ఉన్నందుకు మీకు ధన్యవాదాలు. ఆ రాత్రి నాకు చాలా మంచి నిద్ర పట్టింది. గుండెనిండా విపరీతమైన ఆనందం, సారూప్యము పొందాను. ఇలా ప్రారంభంలో నా అనుభవం చాలా భయంగా ఉంది.

గురూజీ జవాబు :

మీ అనుభవాన్ని పంచుకొన్నందుకు ధన్యవాదాలు. కాకపోతే ఎటువంటి భయాన్ని పొందకండి. ఎందుకంటే ఈ పద్ధతిని చేసేటప్పుడు మీరు పొందే ఆనందాన్ని అది తగ్గిస్తుంది. ఇందులో ఎటువంటి దోషం లేదు. అందువల్ల మీకు ఎలా అనిపిస్తే అలా ఆనందం పొందండి.

రోజంతా చాలా మంది దైవభక్తులైన మునులు ఈ స్థితిలో ఉండేవారు. గొప్ప వాడైన కవిఋషి కాళిదాసు చాలా కాలం ఈ స్థితిలో సమాచార ప్రసరణకు ఇష్టపడేవాడు.

ఇప్పుడు ఋషులకు మాత్రమే తెలిసిన నిధి నందుకొన్న ఆధ్యాత్మిక రహస్యాలను, పోలికగల పద్ధతులను మీ అందరి మేలు కోసం, ఇప్పుడు పంచుకోవాలనుకొంటున్నాను.

ప్రశ్న :

ప్రతిదీ ముందుగానే నిర్ణయించబడినప్పుడు మనం పరిస్థితులకు ఎలా సృష్టికర్తలవుతాం? కారకులమవుతాం? అది చేష్టలను (కర్మలను) కోరుతుంది... నేనేమి చేయను. కాని జీవన నిర్మాణప్రణాళికలో (తలరాత) రాసి పెట్టి ఉన్నప్పుడు నేను చేయకపోయినా అది నిజం కావాలి కదా?

గురూజీ జవాబు :

మీ ముందున్న ఐచ్ఛికాంశాలన్నీ ముందుగానే నిర్ణయించబడినవే. నువ్వు చేసినవే. ఇప్పుడు ఫలితాలుగా వివిధ రకాలుగా ఫలిస్తాయి. మనకున్న ఐచ్ఛికాంశాలలో (ఆప్షన్స్) ఒక దానిని ఎంచుకొని సృష్టించుకొనే ఆ... స్వేచ్ఛ మనకున్నది. కాని ఫలితం మాత్రం నేను చెప్పినట్లుగానే ముందుగానే నిర్ణయించ బడినది. కనుక పరిమితమైన మార్గపు మదింపులో నీ ఇష్టము వచ్చిన వాటికి అనుగుణంగా నీ సొంత పరిస్థితులను నువ్వు సృష్టించుకోవచ్చు. ప్రతిదీ- ఏ ఒక్కటి విడవకుండా- నేరుగా కాని పరోక్షంగా కాని- నీ తలరాతలో ఉన్నట్లుగా నీ జీవితంలో ప్రతిఫలిస్తుంది.

మన తలరాత చాలా గట్టిది. అందువల్ల చాలా సార్లు మనము ఎవరో బలవంతం చేసినట్లు పరిస్థితులు సృష్టిస్తాం. కొన్ని పరిస్థితులు పూర్తయిన తర్వాత కాని మనకు అర్థంకావు. అవి ఎందుకు అలా చేసామా అని పశ్చాత్తాప బడతాం. కాని అటువంటి నిస్సారమైన అనుభవాలు లేదా బాధాకరమైన అనుభవాలు మన కర్మ ఫలానుభవానికి మన ఎదుగుదలకు చాలా మంచివి. నిజం చెప్పాలంటే ఇవన్నీ హాస్యాస్పదమనిపిస్తాయి. కాని చాలా సందర్భాలలో మనమే అవే పాఠాలను రకరకాల మార్గాలలో నేర్చుకొంటాం.

## జీవనపు తలరాతలో
## గమనా గమనము (నావిగేషన్స్)

మానవులకున్న అనేక పెద్ద గందరగోళాలలో ఒకటి- ముందే విధి నిర్ణయించబడిన ప్రకారం అన్ని జరిగి పోతుంటాయి. కనుక మనము ఇక వేరే ఏమీ చెయనక్కరలేదు. జీవితంలో బాధలు, సుఖాలు ఎలా రాసిపెట్టి ఉంటే అలా అనుభవిద్దాం- అని. లేదా- వ్యక్తే అన్నిటికి కారకుడు. మన భవిష్యత్తుకు పూర్తి బాధ్యత మనమే వహించాలి అని. నిజంగా చెప్పాలంటే ఈ రెండు స్థితులలో ఏది మంచి, చెడు- ఏది తెలుపు, ఏది నలుపు అనిచెప్పటానికి వీల్లేదు. దీనికి సంబంధించిన జవాబు ఈ విశాల విశ్వంలో తత్త్వము యొక్క వివిధ ఛాయలలో, దిగ్భ్రాంతి కొలిపేదిగా, రహస్యయుతంగా ఉంది.

నాకు తెలిసినంతవరకు ఏ మానవుడు లేదా దైవ తత్త్వము ఈ విషయాన్ని గురించి సమగ్ర వివరణ ఇవ్వలేదు. ఈ గ్రహం మీద మానవ జీవనయాన మూల ధాతువులను యథాతథంగా ఆవిష్కరించలేదు. ఎంతవరకు 'యజమాని' చెప్పినట్లు వింటున్నాం? ఎంతవరకు ఈ సంక్లిష్ట నాటకంలో స్వేచ్ఛగా మన పాత్ర పోషిస్తున్నాం? జీవితమంటే ఇదే. ఇప్పుడు నా ప్రయత్నమేమిటంటే రహస్యము యొక్క ముడి విప్పాలని. ఆధారం దాటిన శీతలీకరణ తత్త్వోపన్యాసాలను మించి వ్యాపించిన, ఉపయోగ సమాచార గ్రంథాలను దాటిన ఈ రహస్యపు ముడిని విప్పే ప్రయత్నం చేస్తాను.

ఈ జీవన నిర్మాణ ప్రణాళిక (తలరాత) యొక్క గమనాగమనాలను వివరించ బోయే ముందు, ఈ సంక్లిష్ట జీవన పత్రము యొక్క నిర్మాణము, ఉత్పాదకాలు, సంభవకారణాల విధానాలు- ఇటువంటివాటిమీద అన్వేషణ కాంతిని ప్రసరింపచేయటం నాకు చాలా అవసరం. చిన్న చిన్న పదాలలో

చెప్పటానికి ఇది చాలా సుభమైన విషయం కాదు. QED విధానం కంటె మించిన సహజ జ్ఞానం వల్ల తెలిపే గ్రహణ శక్తిని కోరుతుంది. చదువరికి అంతర్దృష్టి ఉంటేనే నేను చెప్పబోయే విషయం అవగతమవుతుంది. (క్యు.ఇ.డి. అంటే క్వాయిడ్ ఎరాట్ డెమాన్‌స్ట్రాండమ్ - లెక్కల్లోనూ, తత్త్వశాస్త్రాల్లోను చివరిగా ప్రదర్శనయుతమైన దేదో చెప్పటానికి ఈ పద్ధతిని వాడుతుంటారు.- అనువాదకుడు). మీ మెదడు కంటె, మీ హృదయాన్ని ఎక్కువగా ఉపయోగిస్తూ ఈ వ్యాసాన్ని నెమ్మదిగా చదవండి.

ప్రతివానియొక్క జీవన నిర్మాణ ప్రణాళిక అసంఖ్యాకమైన అనేకముగా దారులతో కూడుకొని ఉంది. ఆ దారులలో అనేక సంఘటనలు, సందర్భాలు ఉన్నాయి. ప్రతి జీవి తను జీవించి ఉన్నంతకాలము తన జీవన సందర్భాలలో చాలామంది జీవితాలతో పెనవేసుకొని ఉంటాడు. ఈ జీవనపత్రము ఆత్మ-జన్మని తీసుకోబోయే ముందుగానే స్పష్టంగా రాయబడి ఉంది. కాని చాలా ఆశ్చర్యకరమైన విషయమేమిటంటే- ఇది చాలా చలనశక్తి కలది. అంతేకాక అది నీటిమీద తేలే నూనెలా ప్రవాహంలో ఇది తన రూపాన్ని, పరిణామాన్ని మార్చుకొంటుంది. అయితే మొదటి నూనెలో ఉన్న రసాయినిక పదార్థాల సంయోజనము- ఎలా మార్పు పొందకుండా ఉంటుందో- అలానే ఉంటుంది.

ఇప్పుడు ప్రతి వారి తల రాతకు సంబంధించిన లక్ష్యాలు విస్తారంగా వివరిస్తాను

- కర్మకు సంబంధించిన ఋణాలు ప్రతివారు తీర్చుకోవాలి.
- కర్మకు సంబంధించిన గౌరవాలు, లాభాలు ప్రతివారు పొందాలి.
- ప్రతి ఆత్మ తప్పని సరిగా ముఖ్యమైన పాఠాలు నేర్చుకోవాలి. ఆపాఠాలు ఆధ్యాత్మిక కదలికలకు సంబంధించినవి మరియు చివరికి జ్ఞానోదయం కలిగించేవి

-   ఆనందదాయకమైనవి మరియు బాధాకరమైనవి- ఈ రెండు రకాల అనుభవాలు ఆత్మ జ్ఞాపకశక్తిలో నిక్షేపించబడతాయి. ఆ జ్ఞాపక శక్తియే "స్వేచ్ఛకు" (మోక్షానికి) అర్హత కలిగిస్తుంది. ఇంకోమాటల్లో చెప్పాలంటే తప్పని సరియైన ఈ మానవ జన్మ చక్రం నుండి విముక్తి కలిగిస్తుంది.

మానవుని జీవన నిర్మాణ ప్రణాళిక- తలరాతకు- సంబంధించిన నాలుగు ముఖ్యమైన లక్ష్యాల ఫలితాలమొత్తము పైన చెప్పబడ్డాయి. **ఈ ఫలితాల మొత్తము** ఒకసారి నిర్ణయించబడిన తర్వాత జీవితము మొత్తము మీద స్థిరంగా ఉంటుంది. **ఏ ఒక్కరుకాని, ఏ ఒక్క శక్తికాని. దీనిని మార్చలేరు.** కాని పద్ధతి, మార్గము, గాఢత, వరుసక్రమము- మొదలైన వాటిలో తన జీవనకాలంలో జతకూడే అనుభవాలు, పాఠాలతో కలిపి, చివరికి ఫలితాల మొత్తం వైపు ప్రయాణించే జీవన పత్ర నిర్మాణంలో మార్పులకు అవకాశముంది.

ఇప్పుడు మీరు జీవన నిర్మాణ ప్రణాళిక యొక్క రసాయనిక సంయోజనాన్ని పరిశీలిద్దాం. ఇక్కడ చెప్పాలంటే పట్టిక చాలా పెద్దది. అతికష్టమైనది. కాని ముఖ్యమైన పదార్థాలగురించి సంక్షిప్త వివవిరణ కొన్ని పంక్తులలో చేస్తాను. మానవ సంబంధాలను పెంచే నిర్మాణచర్యలు మొదలయిన తర్వాత, అనేక ఆత్మలు నీ జీవితంలో రావటానికి అంగీకరిస్తాయి. నీ జీవన ప్రణాళిక నీ బంధుత్వాలను మరియు బంధువులతో నడవవలసిన విధానాన్ని నిర్ణయిస్తుంది. ఇది రెండు దారుల వీధి. నువ్వు కూడా వారి జీవిత నాటకంలో ఒక పాత్రవి.

ఈ పట్టికలో తర్వాత నేర్చుకొనే పాఠాలకు సంబంధించిన వివిధ గుణాలు :

వ్యక్తిత్వ విశిష్టలక్షణాలు, అహంకారం, శరీరాకృతి మరియు భౌతిక నిర్మాణ రచన మొదలైనవి. ఇంకా అందం. తెలివితేటలు, విద్య, నేర్పులు, సామర్థ్యాలు, సమతుల్యత, ఉద్రేకపడు స్వభావాలు- లేక ఇవేవి కాకుండా మిగిలినవి. ఇంకా భౌతికమైన, మానసికమైన ఆరోగ్యసంబంధాంశాలు, రోగనిరోధక శక్తులు, వైకల్యాలు, అంగవైకల్యాలు, జ్వరాలు- మరియు కీలక అవయవాల లోపాలు, లేదా పంచేంద్రియాలలో ఏదో ఒకటి లోపించుట- ఇక సంపదల విభాగానికి వద్దాం. అది నీ శ్రేయస్సును నిర్ణయిస్తుంది. నీ జీవన విశ్రాంతులలో నువ్వు సంతోషంగా ఉండాలా? లేదా బాధలు అనుభవించాలా అనేది నీ సంపద నిర్ణయిస్తుంది. నీ జీవితంలో సంపద రావటం ఎంత సులభమో, లేక ఎంత కష్టమో చెబుతూ, నీ జీవన నిర్మాణ ప్రణాళిక నీ జీవితంలోకి సంపదను ఎలా రప్పించుకోవాలో తెలియజేస్తుంది.

ఇక ఈ పట్టికలో కొన్ని ముఖ్యమైన సంఘటనల గురించి ప్రస్తావిస్తాను. ఈ ముఖ్యమైన సంఘటనలు చౌరస్తాలో నిలబెట్టి నిన్ను ప్రశ్నిస్తాయి. లేదా అత్యంత క్రియాశీలకమైన పాత్రని నిర్వహిస్తాయి. పెద్ద ప్రమాదము! గొప్ప వారిని కలుసుకోవటం, లాటరీలో గెలుపొందటం, ఇవన్నీ ఆహ్వానించదగినవి. ఈ పట్టిక ఇప్పటికే చాలా పెద్దదయింది. పైన చెప్పిన పట్టిక సమగ్రమైనది. ససేమిరా విస్తృతమైనది కాదు. చివరిగా నేను చెప్పేదేమిటంటే జీవన నిర్మాణప్రణాళిక (తలరాత) ఆధ్యాత్మిక ఎదుగుదలకు కావలసిన శక్తి నిస్తుంది.

ఇప్పుడు మనం జీవన నిర్మాణ ప్రణాళికకు సంబంధించిన నిర్మాణాన్ని, లక్ష్యాలను, పదార్థాలను గురించి తెలుసుకొందాం. వేరే ఏమి లేదుకాని- ఊహించని జటిలమైన మాతృకలు కలిగిన సంఘటనలు, ప్రజలు, సన్నివేశాలు,

చర్యలు- ఇవన్నీ ఒక క్రమ పద్ధతిలో- వయస్సుకి సంబంధించిన కాల నిర్ణయ శాస్త్ర పద్ధతిలో- పుట్టుక నుంచి చావువరకు వ్యక్తిని తీసుకు వెళతాయి. ఇది మానవుని కఠినమైన ముద్ర. దీనినే మనం 'విధి' అని పిలుస్తాం. దీని యొక్క పరిణామం విస్తృతంగా తిరుగు లేనిది. జ్యోతిశ్శాస్త్ర ప్రభావాలు, గ్రహస్థితిగతులు, జన్మచిహ్నాలు మొదలైనవన్నీ- అయస్కాంత ప్రభావం కలిగిన పరికరాలలా- సరిగ్గా జీవననిర్మాణ ప్రణాళికలో అచ్చు గుద్దినట్లుగా అతుక్కుని పోతాయి. జరిగిపోతాయి. ఇదంతా తలరాతకు సంబంధించిన మొత్తము రసాయనిక పదార్థాల సంయోజనము కాదు. ఇంతకు ముందు చెప్పినట్లుగా ఫలితాల మొత్తానికి ప్రత్యామ్నాయాన్ని తలరాత చూపించలేదు గాని, ఉత్పత్తి యొక్క లబ్ధిమూలాలలో కొంచెం మార్పుకి, వైవిధ్యానికి అవకాశం చూపిస్తాయి. ఈ వైవిధ్యాలు మూడు రకాలుగా కనిపిస్తాయి. మొదటిది స్వేచ్ఛ రెండవది గురువు యొక్క అనుగ్రహము. మూడవది ఏ పద్ధతిలోదయినా దైవిక పరమైన జోక్యం. ప్రాథమికంగా ఈ వైవిధ్యము చాలా తీవ్రంగా జీవన నిర్మాణ ప్రణాళిక రూపరేఖల్ని కదుపుతుంది. ఆ కర్మ ఫలితము యొక్క గాఢతను తగ్గించటం/ హెచ్చించటం చేస్తుంది. ప్రస్తుతానికి అనుభవించకుండా భవిష్యత్తులోకి కర్మ ఫలితాలను పంపించుట, లేదా ముందుగానే జీవన పాఠాలను అనుభవించేటట్లు చేయటం, ఫలితాలకు సంబంధించి - ఇప్పుడే అనుభవించ వలసినవాటిని వాయిదా (రీషెడ్యూల్) చేయటం.

ఇది చిన్నదిగా కనిపిస్తోంది కాని చాలా ఎక్కువగా జీవన నిర్మాణ ప్రణాళికలో గుర్తు పెట్టుకోదగిన వైవిధ్య పదార్థము. ఇది చాలా జటిలం చేస్తుంది. ఎన్నో రకాలైన సందర్భాలు, గుణాత్మకంగా ప్రతి రోజు- స్వేచ్ఛ అభ్యసింపబడు తుంటుంది. లేదా ఏదో ఒక రకమైన దైవిక ప్రవేశమయినా జరుగుతుంది.

ఇది జీవన నిర్మాణప్రణాళికలతో పరుగులిడుతున్న అభిప్రాయోద్దే

శ్యాల్ని పెంచేదిగా ఉంటుంది. దానిలో ఉన్న రకరకాల ఐచ్ఛికాంశాలు కూడా దీనికి సాయపడతాయి. కాని సరియైన సమయంలో- నువ్వు ఒకే అనుభవాన్ని మాత్రమే పొందగలవు. అది ప్రతి చౌరస్తా దగ్గర నువ్వు తీసుకొనే నిర్ణయాన్ని అనుసరించి ఉంటుంది. సంగ్రహంగా చెప్పాలంటే జీవన నిర్మాణ ప్రణాళిక అనేది సాటిలేని అంతర్గత మార్పిడి సామర్థ్యం (Fungibility) కలదై రెండింటికి సంబంధించిన అతుకుల సంగమాన్ని క్రమబద్ధం చేస్తుంది. ఒకటి నీతో పని లేకుండా జరిగే కర్మ, రెండు నీ నిర్ణయాలను అనుసరించి జరిగే కర్మ.

గమనాగమనము :

ఇప్పుడు నీకు జీవన నిర్మాణ ప్రణాళిక గురించి అదిచేసే పనులను గురించి ఒకచక్కటి అవగాహన వచ్చిందనుకొంటాను. ఇప్పుడు దానికి సంబంధించిన గమనాగమనాన్ని గురించి మాట్లాడుకొందాం. ఈ ప్రపంచంలో చాలా ఎక్కువ మంది తెలివితేటలు, విద్య లేదా సంపద మొదలైన వాటితో సంబంధం లేకుండా- తమ ఆలోచనలపై కర్మలపై ఎవరిదో ప్రభావం ఉం టుందంటే నమ్మరు. వాళ్లలో విధిని నమ్మేవారు ఉన్నారు. నమ్మనివారు కూడా ఉన్నారు. మనం ఎలా బతుకుతామో అలానే మన గమ్యం ఉంటుందని వారు అభిప్రాయపడతారు. వీళ్లతో సమానంగా చాలా మంది ప్రజలు తాము చేసే ప్రతిదానికి విధితో ముడిపెడతారు. అందుకే బాధ, అప్పీళ్లు శోకం, నవ్వు, ఆనందం మొదలైన వాటి నుంచి శ్రమతో నడిచి వెళుతుంటారు. అవి జీవితంలో సంభవించినప్పుడు ఎలావస్తే అలా స్వీకరిస్తారు. సహజంగానే ధైర్యపు నిర్ణయాలు తీసుకోవటానికి సందేహపడతారు. తాము బతుకుతున్న జీవన విధానానికి విరుద్ధంగా బతకాలంటే ఇష్టపడరు. కాని జీవన నిర్మాణ ప్రణాళిక ఒక అవగాహన గల గమనాగమని అని ఎవరు తెలుసుకొంటారో వారు కనీస నిరోధం గల మార్గాన్ని ఎంచుకొంటారు. కనీసం అనుభవించటానికి సాధ్యమయిన బాధతో కూడిన జీవితంలో మునుముందుకు సాగుతుంటారు. కొంతమంది

పని చేయుటలో వైఫల్యం వల్ల కాని, లేదా జ్ఞానోదయం వల్ల కాని అవగాహనగల ఓడను నడిపే వారవుతారు. కాని మీరు జీవన నిర్మాణ ప్రణాళిక వల్ల విషాద గీతాల బాధపడుతుంటే, అధిక శాతం మేరకు ఈ కింది సూచికలు సహాయపడతాయి.

1. మీ జీవితాన్ని దూరం నుంచి పరిశీలించటం ఎలాగో తెలుసుకోండి. మొట్టమొదటి ముఖ్యమైన పరిశీలన ఏమిటంటే మీ జీవితంలో వస్తున్న సంఘటనలు (ఈవెంట్స్) ప్రజలు, మరియు సన్నివేశాలు- మీ ఆహ్వానం లేకుండానే మీ ప్రయత్నం లేకుండానే వస్తున్నాయా? లేదా? ఇవన్ని కూడా కర్మ ఫలితంగా జరుగుతున్నాయన్న విషయం గుర్తించి, మీ అనుబంధాల్లో ఇవి తప్పనిసరి అనుకోండి. నువ్వు వీటిని ఎంత తెలివిగా వదిలి వేయాలనుకొన్నా అవి నిన్ను వదలవు. అనుభవించు లేదా బాధపడు- కాని కర్మని తొందరగా పూర్తి కానీయ్. వాటితో వచ్చే అనుభవాలను తర్వాత ఉపయోగపడే మంచి పాఠాలుగా నేర్చుకో. నీ జీవన నిర్మాణ ప్రణాళికలో తిరుగులేని భాగాలు గూర్చి బాగా తెలుసుకో. అవి చాలా ఉన్నతమైన చేతన నిర్మాణమని గుర్తించి, జీవనప్రవాహంతో పాటు ప్రయాణంచేయి. ఉద్రేకాన్ని అడ్డుకోవటానికి అలలతో ఎగిసిపడే సముద్రంలో ప్రయాణించటం వల్ల అది నీ జీవితాన్ని జటిలమయం చేస్తుంది. తర్వాత బాధలకి, నష్టాలకి దారితీస్తుంది. ఇవి నీకు అవసరం లేదు. ఇక్కడ దైవహాస్యం చెప్పేదేమిటంటే- కాబట్టి తరచుగా పరమార్ధ విషయంలో నిర్ణయం పరుగులిడుతుంటే, వాస్తవ పరిస్థితుల సమాహారం మిమ్మల్ని- ఐచ్ఛికాంశం వైపు తీసుకు వెళుతుంది. ఇంకా వేరే రకంగా మీరు ప్రయత్నించినా లాభం లేదు. (పరమార్థం అంటే జరగవలిసిన కర్మ)

ఒక్కొక్క సారి అటువంటి సంఘటనలు, ప్రజలు, బలమైన ఉద్వేగాలు నేర్పుగా కాని, ఓడిపోని పరిస్థితుల్లోకి మిమ్ములను ప్రయాణింపచేయ చేస్తే,

ఆ ఐచ్ఛికాంశం - మీకు తప్పనిసరి వాస్తవిక పరిస్థితిని మీ జీవితంలో కల్పిస్తుంది. (అది అనుకూలం కావచ్చు, వ్యతిరేకం కావచ్చు) ఈ భాగం ప్రధానంగా జీవన నిర్మాణ ప్రణాళిక యొక్క సంపూర్తిని మరియు అనుభవాల అంశాన్ని తెలియచేస్తుంది. మరియు సుమారుగా మూడునాలుగుల అనుబంధాన్ని దాచి ఉంచుతుంది.

2. తర్వాత, మీరు చేసే సంకల్పం, ప్రయత్నం లేదా నిర్ణయాల ద్వారా మీ జీవితంలో పాక్షికంగాగాని, పూర్తిగా కాని ఏమి జరుగుతుందో, పరిశీలించి గుర్తించండి. అదృష్టము, ఆరోగ్యము, బంధుత్వాలు, ఉద్యోగము మరియు ఆధ్యాత్మిక అభివృద్ధితో కలిపిన అనేకమైన ప్రత్యేకాంశాలు, సన్నివేశాలు ప్రతి వారి జీవితంలో ఉంటాయి. అవన్నీ కర్మ నిర్దిష్టాలని పూర్తిగా చెప్పలేం. అర్థం ఏమిటంటే ఇక్కడ కర్మ కలిసిపోలేదు అని. వాటి ఉపయోగము ఆత్మ అభివృద్ధిని పరీక్షించటం- లేదా- కేవలం ఆత్మను అవగాహన చేసుకొనుటకు క్రమంగా వివిధ రకాలైన మానవ అనుభవాలను ప్రోది చేయడం. అవి మన జీవితంలో ప్రవేశించటం. మన స్వేచ్ఛ యొక్క పెద్దదైన ఉత్సవము లేదా నిర్ణయాలను తీసుకొనే సామర్థ్యము వల్లనే జరుగుతుంది.

కర్మానుబంధము మరియు జీవన నిర్మాణప్రణాళికలోని ఎదిగే అంశాలకు సంబంధించిన సంచారములో, ఒక ప్రాంతానికి, నిబంధలనకు కట్టుపడని ప్రాంతములో- (గ్రే ఏరియా) మనము ఇప్పుడు ప్రవేశించాము. ఇక్కడ ఎవరయితే స్వేచ్ఛని అభ్యసిస్తారో- వారి కర్మ ఋణాన్ని వెంటనే పెంచుకొంటారు. అందువల్ల చాలా ముఖ్యమైన అంశము ఏమిటంటే సందర్భాలను పరిశీలించు. నీతోటివారికి నువ్వు ఉద్దేశ్యపూర్వక హాని కలిగిస్తున్నావా లేదా పరిశీలించుకో. స్వేచ్ఛ జీవన నిర్మాణ ప్రణాళికకు అను బంధమై విశ్వవ్యాప్త సూచనలను అంతర్దృష్టిని, ప్రార్థనని, శక్తి సామర్థ్యాలకును,

సూచనా మార్గదర్శకత్వాలను, దృఢమైన అభిప్రాయాలను లేదా మంచి నిర్ణయాలు తీసుకోవటానికి కావలసిన సహాయ సహకారాలను నీకు అందిస్తుంది. నీ జీవితంలో అభివృద్ధికి అటువంటి అనుబంధ నిర్ణయాలు తోడ్పడతాయో లేదో ఎవరికి వారు పరిశీలించుకోవాలి. ఈ పెరుగుదల- ఆర్థికంగా, ఆధ్యాత్మికంగా, మానసిక ఉద్వేగపరంగా, స్వచ్ఛమానవుని పరంగా కావచ్చు. నీ జీవన నిర్మాణ ప్రణాళికలో ఉన్న ఉభయ సంభావ్యాలు (Concurrent potentials) నీవు చేసే ఎన్నికల మీద ఆధారపడి ఉంటాయి.

తరువాత మనమిప్పుడు పైన చెప్పిన రెండు అంశాలతో కూడిన జీవన నిర్మాణప్రణాళికను సంయోజనము చేస్తే- అదే - ఆకర్షణా చట్టం అవుతుంది. నువ్వు నీ ఆలోచనలు, పదాలు ద్వారా ఏమి పంపుతావో అవే తిరిగి నీ చేత, జీవితంలో ఆకర్షింపబడతాయి. నీ మొత్తము జీవన నిర్మాణ ప్రణాళికను గుర్తింపును అధిగమించి- ఈ "రహస్య" పద్ధతి ద్వారా నువ్వు ఉపయోగించు. రహస్య పద్ధతినే అభివ్యక్తి, వ్యక్తీకరణమని ఒక్కొక్కసారి పిలుస్తారు. చాలా మంది మంచి పుస్తక విక్రేతలు ఈ అంశం మీద ఇప్పటికే చాలా వ్రాసారు. ఇందులో మంచి పుస్తక విక్రేతలు ఈ అంశం మీద ఇప్పటికే చాలా వ్రాసారు. ఇందులో మంచిమంచి ఐచ్ఛికాంశాలను ఎన్నుకోవటానికి ఆకర్షణా చట్టం నీకు బాగా ఉపయోగపడుతుంది. మంచి పరిష్కారాలు కూడా చూపిస్తుంది. కాని ఆ ఉభయ సంభావ్యాలు మొట్టమొదట నీ జీవననిర్మాణ ప్రణాళికలో ఉండాలి. అవి ఎక్కడి నుంచో కార్యరూపం దాల్చవు. కాబట్టి ఈ ఆకర్షణా చట్టాన్ని ఉ పయోగించి నీ జీవితంలో సమస్యల్ని పరిష్కరించుకో. నీ ప్రయత్నానికి తగిన అనుకూలమైన ఫలితం వచ్చేటట్లుగా తెలుసుకో. కష్ట పరిస్థితుల్లో శక్తిని కూడగట్టుకొని తేలికగా ఒక ఇంద్రజాలంలా దాటు. అయితే ఆకర్షణా చట్టంలోని ఒక లోపం ఏమిటంటే- ఎంతగా నీ బలమైన అభిప్రాయాలను నీ జీవితానికి అనుకూలంగా మార్చుకోవాలని యత్నిస్తావో, అంతగా నీ వ్యతిరేక ఆలోచనలు

నీ జీవన నిర్మాణ ప్రణాళికలో నాటుకొన్న చెడు పనిచేసే శక్తులను ఆకట్టుకొంటాయి.

చివరగా నీ కర్మ లక్ష్యం (విధి) పట్ల నువ్వు మోసగింపబడ్డావని, విడిచివేయ బడ్డావని అనుకోను. నీ దైవిక కర్మ విధిని అంగీకరించు. ప్రవాహంతో పాటు ఈదు. అంతః కరణపూర్వకంగా, మతపరంగా నడుస్తున్న ఏరకమైన బాధని కాని లేదా చర్యలవల్ల, ప్రతిక్రియలవల్ల బాధపడుతున్న విషయాలను కాని విడిచివేయి. ఎక్కడ ఎటువంటి పెరుగుదల లేదా అభివృద్ధి సంబంధిత విషయంలో కనిపిస్తే ఉపయోగించుకో. ప్రతి సంచార సాధనాన్ని నీకు ఇష్టమైన అంశంగా మలుచుకో. ఎక్కడయినా గందరగోళ పడితే, లేదా ఒత్తిడికి గురయితే, నీ కష్టము బయట పడే మార్గాన్ని వ్యక్తీకరించు.

**వ్యాఖ్యలు**

ప్రశ్న :

"అనుభవించు... లేదా బాధపడు.. నీ కర్మని మాత్రం నువ్వు వెంటనే పూర్తి చేయి'' అదే భాగాన్ని చదువుతున్నప్పుడు.....

దయచేసి నాకు జ్ఞానం కలిగించండి. మీరు చెప్పిన బాధలు, ఉద్వేగాల వల్ల వచ్చినవా? లేదా అందరూ వెళ్లే మార్గంలో కాకుండా వేరే మార్గంలో వెళ్లటం వల్ల వచ్చినవా? (ప్రవాహానికి ఎదురీదడం వల్ల)

గురూజీ జవాబు :

నాకు తెలుసు. నేను ఉపయోగించిన కర్మ పరిపూర్తి, ప్రవాహానికి ఎదురీత... ఇటువంటి పదాలు, నా కార్యక్రమాలకు హాజరుకాని చాలా మంది చదువరులకు బాగా అర్థం కాలేదనే విషయం తెలుసు. నేను చాలా విపులమైన

వ్యాఖ్యతో వాటిని వివరించాను. ఇక్కడ నేను కేవలం సంగ్రహంగా వాటిని ప్రస్తావిస్తాను. దానివల్ల వ్యాస సారాంశం మీకు బాగా అవగాహన అవుతుంది.

కర్మ సంబంధమైన ఋణబాధని తీర్చుకోవటానికి, కర్మని పరిపూర్తి చేసుకోవట మొక్కటే పరిష్కారము. ఇక నీ వ్యతిరేక కర్మల శేషపు బాధకూడా రకరకాల ఆధ్యాత్మిక పద్ధతుల ద్వారా పూర్తి చేసుకోవచ్చని నేను బోధించాను. ఆ పద్ధతులవల్ల ఆ వ్యతిరేక కర్మ శేషపు బాధ పూర్తిగానన్నా పోతుంది. లేదా నాటకీయంగా గాఢతను తగ్గిస్తుంది. ఇవన్నీ కూడా పరీక్షించిన పద్ధతులు. వేలాది మంది అద్భుతమైన విజయ స్థాయిలతో ఉపయోగించారు.

ప్రవాహానికి ఎదురీదడం అనేది- చాలా సులభంగా అర్థం చేసుకోవచ్చు. జీవితంలో నువ్వు ప్రయాణం చేస్తున్నప్పుడు కొన్ని తలుపులు చిన్నగా తడితే తెరుచుకొంటాయి. కొన్నింటిని గట్టిగా నెడితే తెరుచుకొంటాయి. ఇదే జీవన నిర్మాణ ప్రణాళికలో- ఎదురీదేటప్పుడు నీకు చేసిన విశ్వవ్యాప్త సూచన. తలుపును అదే పనిగా పదేపదే తోస్తూంటే, దానిని విడగొట్టాలని చూస్తే - అదే ప్రవాహానికి ఎదురీదడం. ఒక కష్టాన్ని నేను సమర్ధంగా ఎదుర్కొన్నాను అని ఒకడు తనంతటతాను ఎలా నిర్ధారించుకోగలడని ఇక్కడ ప్రశ్న మీరు వేసారు. ప్రవాహానికి ఎదురుగా ఈదినప్పుడనేది సరియైన జవాబు. విభిన్న రహదారి చిహ్నాలను నువ్వు గమనించవచ్చు. మార్గదర్శి ఇచ్చిన సమాచారము, లేదా సహజమైన శక్తి మీద ఆధారపడటం- ఇలాంటివి ఆ రహదారి చిహ్నాలు. ఇవి అభివృద్ధి చేస్తాయి. అయితే స్థిరమైన ఎరుక. మరియు కొంత ధ్యాసంతా కలిసిన అభ్యాసము- ఈ రహదారి చిహ్నాలను- చాలా తేలిగ్గా చదవటానికి నీకు సహాయపడతాయి.

## ఆధ్యాత్మిక యుద్ధ రంగం వైపు నడకలు
## ఉత్కంఠభరితమైన శ్వాస (శ్వాసనుండి శ్వాసలేని తనానికి)

చాలా సంవత్సరాలనుండి, శ్వాస సంబంధమైన అభ్యాసాలు ప్రాణాయామం లాంటివి (నాసికా ముఖములతో తిరుగాడే వాయువులను మంత్ర పూర్వకంగా నిరోధించుట (ప్రాణాయామము- అనువాదకుడు) చాలా ప్రసిద్ధి పొందుతున్నాయి. యోగాకి సంబంధించిన అనేక పద్ధతులను అభ్యసింప చేసే వారు- ప్రాణాయామము యొక్క ఒక పద్ధతిని- ఒంటరిగా- లేదా యోగా పద్ధతులకు సంబంధించిన అనేక పరిసరాల ద్వారా కాని- నేర్పిస్తున్నారు. ఇటీవలి పరిశోధనల ద్వారా - ఈ 21వ శతాబ్దంలోని అనేక రుగ్మతలకు ఒత్తిడి, తీవ్రమైన ఆందోళన, భౌతిక సమస్యలు, చెడునడతలు మరియు దీర్ఘకాలిక వ్యాధులు- ఇలాంటి వాటన్నింటికి శ్వాస అభ్యాసాలు సర్వరోగనివారిణులు అని తేలింది. ఈ సందర్భంలో నేను ఆధ్యాత్మిక స్థాయిలో ప్రాణాయామము యొక్క ఉపయోగాలను కొంచెము కూడా ప్రస్తావించను.

ఇది విచారము కలిగిస్తుంది కాని- కాని చాలా వాస్తవము. చాలా మంది మానవులు మంద బుద్ధులు. అందువల్ల చాలా ఎక్కువమంది తెలివైన వారు శ్రవణ దృశ్య పద్ధతుల ద్వారా- బ్రహ్మాండమైన ఐశ్వర్య శోభతో నిండే సంస్థలలో కొన్ని శతాబ్దాల పాటు నిలిపే అనేక ప్రాణాయామ పద్ధతులపై అవగాహన అమ్మకాలు మొదలు పెట్టారు.

ఇళ్ల అమ్మకాలు, ఇళ్లలోని వస్తు అమ్మకాల వ్యాపారాలలాగానే, ఈ సంస్థలు లేదా వ్యక్తులు ప్రాణాయామాన్ని సామూహిక స్థాయిలో (మాస్ స్కేల్) అమ్మకానికి పెట్టారు. కేవలం ప్రాణాయామానికి సంబంధించిన అనుకూలాంశాలు మాత్రమే ప్రచారం చేస్తున్నారు. కష్టాలలో ఉన్నవారిని 'ఆధ్యాత్మిక

పశువుల కాపరి', మారు సూచనలు, ప్రజల యొక్క ప్రతికూల స్పందనలు- మొదలైనవి ప్రాణాయామము అనే ఉత్పత్తి సాధనానికి జోడించి చాలా తెలివిగా అమ్మకాలు చేస్తున్నారు. ఖచ్చితంగా దీనికారణంగానే నేను ఇప్పుడు మొదటి ఆధ్యాత్మిక యుద్ధరంగం వైపు నడకగా **"శ్వాస సంబంధమైన అభ్యాసాలు"** అనే శీర్షికతో మొదటి వ్యాసం వ్రాస్తున్నాను. ఈ అభ్యాసాలు కొన్ని అందమైన తీవ్రమైన భౌతిక మరియు మానసిక ప్రమాదాలు తెచ్చిపెడతాయి.

ఎంత తేలికగా శ్వాస అభ్యాసాలు చేసినా అది ప్రమాదానికి కారణమవు తుందా? దీనికి జవాబు "అవును" అని. దీనికి సంబంధించిన పరిసరాల మరియు పరిస్థితులు. శ్వాసకు సంబంధించిన అన్ని అభ్యాసాలకు ఎంత అద్భుతమైన ఫలితాలను ఇస్తాయో, అంతగా అనాలోచిత సమస్యలు తెచ్చిపెడతాయి. సాధారణంగా శ్వాస అనేది 'ప్రాణానికి' లేదా ప్రాణశక్తి కి సంబంధించింది. 'ప్రాణానిక' లేదా ప్రాణశక్తి కి సంబంధించింది. వైద్య శాస్త్ర పరంగా చెప్పాలంటే శ్వాస మనం జీవించటానికి చాలా అవసరమైన 'ఆక్సిజన్' అనే కీలకమైన ఉత్పాదకాన్ని (vital input) అందిస్తుంది. మన పూర్వీకులైన యోగాభ్యాసకులు వందలాది శ్వాసకు సంభంధించిన అభ్యాసాలను, శ్వాసనిరోధక అభ్యాసాలను అభివృద్ధి చేసారు. వీటివల్ల భౌతిక శరీరంలో కొన్ని నాటకీయమైన మార్పులు వస్తాయి. ఈ అభ్యాసాలు సూక్ష్మ శరీరంపై కూడా పనిచేసి అద్భుతమైన పనులు చేస్తాయి. సూక్ష్మ శరీరమనేది మనచుట్టూ ఉన్న శక్తిని నియంత్రించి, భౌతిక శరీరం తో కలిసి ఉంటుంది. ప్రాథమిక స్థాయిలో ఆ శ్వాస అభ్యాసాలు చైతన్య శక్తి సంస్థలుగా పనిచేయటానికి నిర్మింపబడ్డాయి. మానవునిలో నిద్రాణమై ఉన్న ఆధ్యాత్మిక శక్తిని- ఈ శ్వాస అభ్యాసాలు చైతన్య పరుస్తాయి.

అయితే మీరు అడగవచ్చు. అసలు సమస్య ఎక్కడ ఉంది అని? ఈ సమస్య ప్రాణాయామ అభ్యాసాలలో లేదు. నియంత్రణ లేకుండా, చాలా నిర్లక్ష్యంగా పర్యవేక్షించే యాదృచ్ఛిక ప్రాణాయామ అభ్యాసంలో సమస్యఉంది. ఇది మంచి కంటె చాలా చెడు చేస్తుంది. ఇక్కడ నేను కొన్ని ప్రాణాయామానికి సంబంధించిన వ్రాయబడని నియమనిబంధనలను ప్రస్తావిస్తాను. ఇవి భవిష్యత్తులో మీరు స్వయం కృతంగా చేసుకోబోయే కష్టాలనుంచి రక్షిస్తాయి.

1 వ నిబంధన :

ఎప్పుడూ బాగా నేర్పుకలిగిన గురువు లేదా ఉపాధ్యాయుని నుంచే నేర్చుకావాలి.

ప్రాణాయామము అనేది యోగశాస్త్రానికి చెందిన ఒక శక్తివంతమైన విభాగము "నీకు నువ్వు చేసుకో" విభాగంలోకి ఇది రాదు. నువ్వు శ్వాస సంబంధమైన అభ్యాసాలను గురువు యొక్క సమక్షంలో నేర్చుకోవాలి. గురువు సాంకేతిక ప్రక్రియను ప్రదర్శించటం మాత్రమేకాదు. నువ్వు ఆయన చెప్పినట్లుగా, చేస్తున్నావా లేదా అనే విషయం కూడా ఎంత వీలయితే అంతగా పర్యవేక్షిస్తాడు. ఇక్కడ ముఖ్యమైన విషయం ఏమిటంటే- నువ్వు నేర్చుకొన్న దానికి - ఒకరు బాధ్యత వహిస్తున్నారనే విషయం. కాని నీకు ప్రాణాయామం నేర్చుకోవటానికి పుస్తకాలు, డి.వి.డి.లు (డిజిటల్ వీడియో డిస్క్ / అంకాత్మక దృశ్య బింబములు), అంతర్జాలం, దూరదర్శన కార్యక్రమాలు, బాగా అర్థం చేసుకొనే బంధువులు, స్నేహితులు లేదా ఇరుగు పొరుగు వారు- నీకు ఆధారమయితే మాత్రం నువ్వు పెద్ద సమస్యలో ఉన్నట్లే. కొంతమంది ఉపాధ్యాయులు ఉంటారు. వాళ్లు నేర్చుకొని ఉండవచ్చు. కాని ప్రాణాయామాన్ని సంవత్సరాల తరబడి తాము అభ్యసించారు. అనుభవం పొందరు. అటువంటి ఉపాధ్యాయుల దగ్గర కూడా ప్రాణాయామాన్ని నేర్చుకొవటం మానుకోవాలి.

2 వ నిబంధన :

సూచనలను ఖచ్చితంగా అమలు పరచాలి.

ఒక మంచి గురువు దగ్గర నువ్వు ప్రాణాయామం నేర్చుకొన్న తర్వాత, నువ్వు సాధారణంగా నీ స్వంత అభ్యాసము మొదలు పెడతావు. ఇక్కడ నువ్వు చాలా జాగ్రత్తగా ఉండాలి. దారి తప్పిన నీ ఉత్సాహము తొందరగా ఫలితాలు రాబట్టాలని నీచేత అధికంగా అభ్యాసాలు చేయించగలరు. ఇది విరుద్ధమైన నిజమే. ఏ శ్వాస అభ్యాసమైనా చేయవలసిన దానికంటె ఎక్కువగా గట్టి ప్రయత్నంతో, చేస్తుంటే చెడు ఫలితాలు- భౌతికంగా, మానసికంగా ఉద్వేగాల పరంగా వస్తాయి. అందువల్ల సూచనలను ఖచ్చితంగా పాటించాలి. అవాస్తవమైన ఆధారము లేదా అమాయకుడైన ఉపాధ్యాయుడు మంచి కంటె చెడు ఎక్కువగా చేస్తాడని నేను చెప్పటానికి ఇది ఇంకొక కారణము.

3వ నిబంధన :

ఒక పరిమాణం అన్నింటికి సరిపోతుంది.

పొట్టి మేజోళ్లకు (సాక్స్) మరియు చెమట పట్టిన చొక్కాలకు ఏది పనిచేస్తుందో అది ప్రాణాయామానికి పని చేయదు. ప్రతి శ్వాస అభ్యాసము- అందరికి ఒకే రకంగా సరిపోదు. నిజమే. ఈ శరీర ధర్మం ఉన్నవారికి ఈ అభ్యాసము సరిపోతుంది. అని చెప్పే ఒక విజ్ఞాన సర్వస్వం లేని మాట నిజమే! ఆ శ్వాస అభ్యాసము సరిపోతుందా లేదా అనేది ట్రయల్ అండ్ ఎర్రర్ పద్ధతిలోకి వస్తుంది. (అనేక ప్రయత్నాలు చేసి ఓడిపోతున్నా, చివరికి విజయం సాధించటం ట్రయల్ అండ్ ఎర్రర్) ఏదైనా వ్యతిరేక సూచనలు (నిషేధాలు) వస్తున్నట్లు గమనించిన వెంటనే, రోజువారి జరుగుతున్న అభ్యాసాన్ని ఎంచుకోవాలి. ఇది బాగా తెలుసుకోవలసిన విషయం. ప్రాణాయామము లాంటి యోగాభ్యాసాలు కొనసాగిస్తే అవి జీవన శైలిలో కూడా కలిసి పరివ్యాప్తి చెందుతాయి. లేదా మారు ఉత్పాదకాలుగా తయారవుతాయని నా ఆలోచన ఎక్కడ సామూహిక

అమ్మకంగా ఈ విజ్ఞానము ఉంటుందో అక్కడ ఈ ఇబ్బంది తప్పదు.

మారు సూచనలు మరియు ప్రాణాయామము యొక్క అనుకోని ఇబ్బందులు

ఎప్పుడు కూడా ఈ పట్టిక సూచనాత్మకమే గాని కూలంకషము కాదు.

ఎ. వివాదభరితమైన మానసిక కల్లోలాలు,- ప్రధానంగా కోపాలు, పట్టలేని కోపాలు, ఒత్తిడులు

బి. ఆసక్తి లేనట్టుగా విషయాల భావన, సంబంధం లేనివిగా, నమ్మకం కోల్పోయినట్లు భావించటం

సి. ప్రతి విషయంలోను, ప్రతిదానిలోను విపరీతమైన చిరాకు.

డి. తరచుగా తలనొప్పులు, రక్తపు పోటు, జీర్ణ కోశసమస్యలు

ఇ. విపరీతమైన వేడి ఒంట్లో చేరుతున్న భావనతో (హాట్ ) అనియతమైన శరీర ఉష్ణోగ్రత

ఎఫ్. శ్వాసక్రియలోను మరియు సక్రమం కానటువంటి గుండె చప్పుళ్ల లోను కష్టాలు

పైన చెప్పిన సమస్యనే కాకుండా నా మనస్సుకు తోచిన ఇంకొక తీవ్రమైన ఇబ్బంది ఉంది. అది అనాలోచితంగా మండి పోయే కుండలినీశక్తి. కొన్నిరకాల

శ్వాస అభ్యాసాల కారణంగా, ముఖ్యంగా శ్వాసను నిలుపుచేసే నాసికారంధ్రాల లోని ప్రత్యామ్నాయ ప్రాణాయామము వల్ల ఈ కుండలినీ శక్తి మండుతుంది. ఈ రకంగా అధికారం గల గురువు సమక్షంలో లేకుండా కుండలినీ శక్తి మండి పోవటం వల్ల చాలా తీవ్రమైన ప్రతిధ్వనులు, పరోక్ష ఫలితాలు కలుగుతాయి.

చివరిగా, నేను ఎవరిని ప్రాణాయామము చేయవద్దని నిరుత్సాహ పరచను. కాని అటువంటి శక్తిమంతమైన అభ్యాసానికి ఉన్న వ్యతిరేక పార్శ్వాన్ని కూడా గమనించమని, జాగ్రత్తగా ఉండమని మాత్రమే నేను చెబుతున్నాను.

## స్వచ్ఛమైన విపత్తు

నేను చెప్పబోయే విషయము యొక్క గాంభీర్యము మీకు బాగా తెలియటానికి నేను ఒక పోలిక ముందుగా చెబుతాను. ఇది అందరకు తెలిసిన విషయమే. సమృద్ధమైన ధార్మిక శక్తి గల తెల్ల లోహమూలక కడ్డీలను (Uranium rods) అణు ప్రతి చర్యకాలు (న్యూక్లియర్ రియాక్టర్స్) ఇంధనంగా చేసుకొని విద్యుచ్ఛక్తిని పుట్టిస్తాయి. ఒక సారి అణుచక్రము- కడ్డీలను న్యూక్లియర్ ఫ్యూయల్ కోసం ఖర్చు చేసిన తర్వాత- ఆ- నిల్వ మరియు. పారవేసే పదార్థము రెండూ కూడా న్యూక్లియర్ శక్తి సంస్థలలో చాలా విలువైన ముఖ్యభాగాలు. ఖర్చు పెట్టిన న్యూక్లియర్ ఫ్యూయల్- రేడియో ధార్మికత గా మారిన తర్వాత సరిగ్గా కనుక నిర్వహణ చేయకపోతే, కప్పిఉంచకపోతే, సరిగ్గా తీసివేయకపోతే వేలవేల సంవత్సరాలు మానవుల ఆరోగ్యానికి ఎంత కీడు చేస్తాయో- చెప్పటానికి- ఏ విజ్ఞాని మనకు అక్కరలేదు. సంక్షిప్తంగా చెప్పాలంటే న్యూక్లియర్ ఫ్యూయల్‌తో ఉన్న మురికి రాబోయే మానవ విపత్తు.

వ్యక్తి గత సూక్ష్మ స్థాయిలో పైన చెప్పిన ఉదాహరణ- స్ఫటికాల

వినియోగంలో వాస్తవంగా ప్రతిబింబములా ఉంటుంది. ఈ రోజు స్ఫటికాలకు కూడా అంత వ్యామోహం, విభ్రాంతి ఉన్నాయి. జ్యోతిశ్శాస్త్రవేత్త, రేకి గురువు, పేకముక్కలతో జ్యోతిష్యం చెప్పేవాడు (టారట్ రీడర్), తిరోగామి, సంఖ్యా శాస్త్రవేత్త, ఇంధనశక్తిదారు, ఆటోరైటర్, ఆధ్యాత్మికంగా సలహాలు చెప్పువారు, ఆధ్యాత్మికతతో వ్యాపారం చేసేవారు, వీళ్లందరూ కూడా ఈ రోజు అన్నింటిని ఆకట్టుకొనే స్ఫటికాన్ని ఉపయోగం లేదని, తిరస్కరించటానికి సిద్ధంగా ఉన్నారు. మరి ఎందుకు స్ఫటికానికి ఈ రోజు ఇంత ప్రచారం వచ్చింది? నేను న్యూక్లియర్ ఫ్యూయల్ తో దానిని ఎందుకు పోలిక చేసాను. దీనికోసం మీరు స్ఫటికాలకు సంబంధించిన కొన్ని ప్రాధమిక సత్యాలు తెలుసుకోవాలి.

మానవులమైన మనందరికి స్ఫటికాల గురించి పూర్తిగా తెలుసా? లేదనే చెప్పాలి. ఆశ్చర్యకరంగా ఈ రోజు మైక్రోప్రాసెసర్ పరిశ్రమలలో క్వార్జ్ స్ఫటికాన్ని (కంప్యూటర్లలో ప్రధానమైన ఇంటిగ్రేటెడ్ సర్క్యూట్‌లో వాడేది)- ఈ రోజు విజ్ఞానశాస్త్రము వాడుతోంది. ఆధ్యాత్మిక సంస్థలలో స్ఫటికవైద్యంలో నేర్పు కల వాళ్లమని చెప్పుకొనే వాళ్లు, వేరే రకంగా స్ఫటికాలను వినియోగించేవాళ్లు వాటి మొదలు - తుద తెలియనివాళ్లే. "స్ఫటిక నేర్పరి" ఒక జీవి అతడు ఈ గ్రహం మీద ఇమడలేడు. ఇంతవరకు స్ఫటికాన్ని గురించి ఒక సమగ్రమైన అధ్యయనం లేదు. వివిధ రకాలుగా స్ఫటికావగాహనలు లేవు. ప్రహేళికా యుతంగా ఉండి, వివిధ రకాలైన ప్రమాదాల పదార్థాలు కలిగిన స్ఫటికాల వివరణ చెప్పే సంస్థలు కాని, వ్యక్తులు కాని లేరు.

నిజం చెప్పాలంటే స్ఫటికాల గురించి నాకున్న జ్ఞానము కూడా పరిమితమైనదే. కాని అది ప్రజల జీవితంలో చేస్తున్న విధ్వంసం (HAVOC) గురించి మాత్రం తెలుసు. మళ్లీ చెబుతున్నాను. ఇది పుస్తక విజ్ఞానముకాదు. అనేక సందర్భాలలో స్ఫటికాల గురించి తెలియక, వాటిని ఎలా వాడాలో చెప్పేవారు లేక బాధలకు స్వయంగా కల్పించుకొన్న స్త్రీ-పురుషులను వారి పొగచూరిన భాగ్నాలనుంచి - బయటికి లాగిన అనుభవం ఉంది.

ఈ స్ఫటికాల గురించి ఒక చిన్న సమాచారాన్ని మీతో నేను పంచుకోవాలనుకొంటున్నాను. దీనివల్ల ముఖ్యమైన వినియోగదారులు తమ జీవితాలను ప్రమాదభరితం కాకుండా కాపాడుకోవచ్చు. ఇప్పుడు మీరు కిటికీ అవతలికి పింగాణి పాత్రల సముదాయము యొక్క ప్రతి అంశము, అరుదైన పాత కాలం నాటి పాత్రలు- స్ఫటికానికి సంబంధించిన ప్రతిదీ- పారేయాలనుకొంటున్నారు కదూ! ఒక చిన్న విషయం ఇక్కడ నేను మాట్లాడదలచుకున్నాను. అది స్పష్టంగా ఉండనీ, స్ఫటికంలా పారదర్శకంగా కనబడనీ,- కాంతినిరోధకమవనీ- రకరకాల రంగులలో ఉండనీ- కాని- అది సహజం కావాలి. కృత్రిమంగా తయారు చేసినది కాదు. కనుక దయచేసి గుర్తు పెట్టుకోండి. అన్ని కాచపు (గ్లాసు) ఉత్పత్తులు, కాచపు (గ్లాసు) కత్తిరింపులు, పింగాణి పాత్రలు- అవి మూలస్థితిలో కాని లేదా ఒత్తిడి చేసినదికాని- అది కృత్రిమమయిన స్ఫటికమయితే మంచిదే. ఫ్యాక్టరీలలో తయారయిన, లేదా కృత్రిమంగా తయారయిన స్ఫటికాలు ప్రమాదకరాలు కావు. వాటిని హాయిగా వాడుకోవచ్చు. అనుకూల లేదా అననుకూల ప్రభావాలు ఏవీ చూపించవు.

స్ఫటికము, కాంతినిరోధకము- ఇలాంటిది ఏదైనా- సహజపరిస్థితులలో కనబడినవి, కొన్ని అందమైన ఆశ్చర్యకరమైన గుణాలు కలిగి ఉంటాయి. ఇవి హేతుబద్ధమైన కారణాలకు లొంగవు. మిగతావాటిల్లో- ఈ సహజ స్ఫటికము చిత్రానికి సంబంధించిన ఏకైక ఆస్తిని ప్రదర్శిస్తుంది. వ్యతిరేక కదలికలకు ఈ సహజ స్ఫటికాలను పీల్చుకొంటాయి. శక్తిమంతమైన అయస్కాంతం ఇనుమును తనవైవపుకి ఎలా లాక్కుంటుందో వ్యతిరేక శక్తిని ఈ సహజ స్ఫటికం అలా ఆకర్షిస్తుంది. అందుకనే ప్రతి శక్తి వైద్యుడు(రాలు)కి ఈ సహజస్ఫటికము

ఒక సవాలు. ప్రత్యేకంగా ఒక సహజ స్ఫటికాన్ని రకరకాల ఆకృతులలో కత్తిరించినప్పుడు- పదును పెట్టినప్పుడు- ఆ సహజ స్ఫటికం- భౌతికపరమైన బాధలను పోగొడుతుంది. సులభం చేస్తుంది. రోగాలకు, ఆరోగ్య
సమస్యలకు కారకులైన శక్తి సంబంధమైన ప్రతిష్టంభనాలను నివారిస్తుంది. ఈ స్ఫటికాలను ఉపయోగించి- అమ్మేవారికి ఈ స్ఫటికం వ్యతిరేకశక్తులను ఆకర్షించటంలో ఒక పరిమితి లేనిదని- ఎంతమంది శక్తి వైద్యులకు తెలుసు? ఒకసారి శక్తి పుంజుకొన్నతర్వాత- వ్యతిరేక దిశలో కూడా రోగాలను నయం చేయటంలో ఎంత శక్తిని చూపిస్తుందో - అంతశక్తిని చూపిస్తుంది. అదే స్ఫటికము- రోగాలను నయంచేయటంలో చేసిన అద్భుతాలను- వ్యతిరేకదిశలో వెలువరిస్తుంది. ఇది అధికమైన విద్యుచ్ఛక్తి ప్రభావంలా- ఆశ్చర్యంగొల్పుతుంది. తనలో ఉన్న వ్యతిరేకశక్తిని వెయ్యిరెట్లుగా పర్యావరణంలోకి పంపిస్తుంది. స్ఫటికం ఉపయోగంలో ఉన్నా, లేకున్నా, ఈ వ్యతిరేకశక్తి ప్రభావం ఉంటుంది. ఒకమాటుంది. ఈ స్ఫటికాన్ని ఉ ప్పునీటిలో కడిగితే శుభ్రమవుతుందని, రెండవసారి వాడుకోవచ్చని ఒక సిద్ధాంతం. ఇది ఉ త్తిమాట. అణుశక్తి రేడియో ధార్మికతత్వము (న్యూక్లియర్ రేడియేషన్) ఒక సబ్బు ముక్కతో కడిగితే పోతుందని చెప్పినట్లు. కనుక ఇటువంటి మోసపూరితమైన స్ఫటికంతో ఎలాఉ ండాలి? అణు ఇంధనము విషయంలో ఎలా ఉండాలో అలానే ఉండాలి. భూమిలో లోతుగా దానిని పాతివేయాలి. అందువల్లనే దీనితో రేడియోధార్మిక ఇంధనంతో పోలిక ఇచ్చాను. అయితే అభ్యాసమువల్ల ఇది సంభవించదు. ఒక వ్యక్తి విలువైన ఈ సహజ స్ఫటికాన్ని- ఏ ఉపయోగం కోసమైనా సరే- కొన్న తర్వాత అతి కొద్దికాలంలోనే దానిని దూరంగా పారవేయవలసి వస్తుందని ఏనాడూ ఊహించడు. వాళ్లు ఈ సహజస్ఫటికాలను కొన్నప్పుడు- ఇవి జీవితకాలానికి ఉపయోగపడతాయని చెబుతారు. కాని ఆ స్ఫటికాలు దగ్గర ఉ ంచుకోవటమంటే గొప్ప ఆపదను కాపాడటమే. అదే స్ఫటికాలను అదే పనిగా వాడుతుంటే అది విపరీతమైన వ్యతిరేక ఉత్పాదకాలను ఇస్తుంది.

సంపత్కారకమంటూ, అదృష్టమంటూ ఇంకొక సహజ స్ఫటికము కారణ రహితంగా ఆరాధించబడుతుంది. వలా చేపలను తనలోకి లాక్కున్నట్లుగా
ఈ సహజస్ఫటికమూ భూతాత్మలను తనలోకి లాక్కుంటుంది. అయితే నేను దీనిని విజ్ఞాన శాస్త్రం ఆధారంగా నిరూపించలేను కానీ కారణము మాత్రం ఆకర్షణే. అందుకనే

అనేకమంది సోది చెప్పేవారు, జ్యోతిష్కులు, ఆత్మలతో సంబంధము పెట్టుకొనేవారు, లేదా ఆ భూతాత్మల ప్రపంచముతో గడిపేవారూ ఈ సహజ స్ఫటిక బంతులకు (క్రిస్టల్ బాల్స్) స్ఫటికరాతి నిర్మాణాలను (క్రిస్టల్ పిరమిడ్స్) వాడతారు. ఈ ఆత్మలతో వచ్చే సమస్యఏమిటంటే అవి తొందరగానే లోబడతాయి. అవి వచ్చేటప్పుడు తక్కువ కంపనాలతోనే ఉంటాయి. సహజంగానే అవి హానికారకాలు. దిగువ పితృలోకాలనుండి మలినాలను సరఫరా చేస్తాయి. ఇవి "లోకాతీతశక్తులుగా" పిలువబడు తుంటాయి. ఈ హానికారకాలైన "ఆత్మలు" నువ్వు కొన్న, లేదా ఇంట్లో చేరినా సహజస్ఫటికాలలో స్వతంత్రంగా, లేదా అస్వతంత్రంగా చేరతాయి. నీ జీవితంలోను, ఇంట్లోను నాశనమయిన శిధిలాలను మిగిలిస్తాయి.

ఒక విద్యుత్ సూక్ష్మ దర్శిని (ఎలక్ట్రాన్ మైక్రోస్కోప్) కింద ఈ సహజస్ఫటికాన్ని పరిశీలిస్తే- ఇంచుమించు- మన గుండెచప్పుడులా- కొట్టుకుంటున్న నాడి స్పందనను గమనించవచ్చు. ఇది ఎంత మందికి తెలుసు? నేను ఇక్కడ ఏమి చెప్పేదేమిటంటే, మనకు ఈ స్ఫటికాల గురించి చాలా తక్కువగా తెలుసు. ప్రాథమిక రోగ విముక్తి గొల్పే శక్తి ఉ ందంటూ ఒక ఎండమావిలా- భ్రమపడి- ముందున్న ఆపదను మరచి- దానిని మనవెంట తీసుకు వెళతాం. కాని ఇవి అన్నీ వ్యతిరేకాలుకావు. భవిష్యత్ కాలంలో- విజ్ఞాన శాస్త్రం స్ఫటికాల యొక్క నిజమైన సామర్థ్యాన్ని కనుక్కోవచ్చు. అవి వాస్తవంగా, శాశ్వతంగా ఈ గ్రహంలోని ప్రతిదానిని మార్చవచ్చు. ఆరకంగా మనం జీవిస్తూ, ఈ మానవ జీవన చరిత్రలో భాగస్వామ్యం కావచ్చు.

ఇప్పుడు మాత్రం ఈ స్ఫటిక విపత్తులను, ఒక చిన్న పట్టిక ద్వారా
మీకు అందజేస్తాను. మీ జీవితాలలో స్ఫటికాలు కలిగిఉంటే ఈ ఆపదలు మిమ్మల్ని వ్యక్తిగతంగా, లేదా సామూహికంగా మిమ్మల్ని ప్రభావితం చేయవచ్చు

ఎ. మీ ఇంట్లో అంతులేని ఆరోగ్యసమస్యలు వస్తాయి. లేదా మీయింట్లో ఉన్న కుటుంబసభ్యులెవరైనా జీవితాని భయపెట్టే జ్వరాలు/వ్యాధులు రావచ్చు, అందరికి సామాన్యంగా ఈ స్ఫటికం తెచ్చే బాధ ఏమిటంటే తీవ్రమైన ఒత్తిడి. ఒకరు లేదా చాలా మంది కుటుంబ సభ్యులు- ఈ స్ఫటికాలను చురుకుగా వాడుతుంటే తప్పనిసరిగా బాధలు అనుభవించవలసిందే. ఇది ఇంట్లో స్ఫటికాలు ఉంటే కలిగే తక్షణ ఫలితము.

బి. ఆర్థికంగా అస్థిరతా దీర్ఘకాలికంగా కొనసాగుతుంది. ఆర్థిక పరిస్థితి తలకిందులై, దివాలాదారి తీస్తుంది.

సి. ప్రేమపూర్వకమైన, ఆత్మీయసంబంధాలు విచ్ఛిన్నమవుతాయి. కలిగే వినాశము ఇంతా అంతా అని లెక్కపెట్టడానికి వీలులేకుండా ఉంటుంది.

డి. దురదృష్టము అడుగడుగునా నిన్ను వెంబడిస్తూ గుచ్చి గుచ్చి బాధిస్తుంది. అనేక అవకాశాలు పోతాయి. అశుభసమయాలు, చెడు సమయంలో, చెడుప్రదేశంలో ఉండుట జరుగుతాయి. వినాశాలకుప్పలో కూలిపోవటం జరుగుతుంది.

నేను హాస్యంగా ఇది చెబుతున్నానని మీరు అనుకొంటే, నేను పైన చెప్పిన విషయాలు నిజమని చెప్పటానికి డజన్ల కొద్ది ప్రజలను మీకు ప్రమాణంగా చూపిస్తాను. వాళ్ల ఇళ్లనుంచి, వాళ్ల జీవితాలలో నాటకీయ పరిణామాలు జరిగాయి. సరే- ఏదయినప్పటికి- నిర్ణయం మీదే. కాని ఒక విషయం గుర్తు
పెట్టుకోండి. మీరు లోక ప్రసిద్ధమైన పులిమీద ఎక్కి స్వారీ చేస్తున్నప్పటికి, చివరికి అది మిమ్మల్ని మింగివేస్తుంది.

**వ్యాఖ్యలు**

ప్రశ్న :

గురూజీ! మీరు చెప్పినదంతా నిజమే. చక్కటి సమాచారయుక్తంగా ఉంది. కాని అదేసమయంలో స్ఫటికాలను కొనే వ్యక్తులను గందరగోళంలో పడేసింది. ఈ స్ఫటికాలను రకరకాలుగా వారు వాడతారు. ఒకసారి వాడిన స్ఫటికాలుకూడా ఈ కొట్లలో మళ్లీ అమ్మకానికి సిద్ధంగా ఉంటాయి. ఒక సానుకూల శక్తి రావటానికి తగిన స్వచ్ఛ స్ఫటికాన్ని ఎంత మంది సేకరించగలరో చెప్పటం- ఆశ్చర్యంతో కూడిన విషయం.

గురూజీ జవాబు :

స్వయంగా గనులలో తవ్వి తీస్తే తప్పా శక్తులను తనలో పీల్చుకోని, ఒక స్వచ్ఛమైన

స్ఫటికాన్ని నువ్వు పొందటమనేది నిజంగా చాలా కష్టం. వాణిజ్యపరంగా అమ్మే వ్యక్తులు లేదా దుకాణాలూ వీరిదగ్గర ఉండే స్ఫటికాలు మళ్లీ మళ్లీ వాడబడతాయి. అవి రకరకాలుగా వేరే దారులలో సానుకూలశక్తి కొరకు వాడబడి ఉంటాయి. ఎందుకు నిప్పుతో ఆడుకోవటం?

ప్రశ్న :

వజ్రాలు కూడా స్ఫటికాలే కదా? వాటిని వాడటం మానేయమంటారు? దయచేసి సలహా ఇవివ్వండి. ఆ విషయంపై తెలుసుకోవటానికి చాలా ప్రయత్నించాము. కాని మాకు స్పష్టమైన అవగాహన రాలేదు ధన్యవాదములు.

ప్రశ్న :

మీరు చాలా సమాచారయుక్తమైన వ్యాసాన్ని అందించినందుకు ధన్యవాదములు. పసుపురంగురత్నాలు, నీలం రంగు రత్నాలు, పచ్చలు. కెంపులు, వజ్రాలు, ఇవన్నీ పుష్యరాగాలు, రత్నాల, స్ఫటికాల రకాలా? ధన్యవాదాలు.

గురూజీ జవాబు :

నేను ఇటువంటి ప్రశ్న వస్తుందని ఊహించాను. చాలా మంది ఆడవాళ్లకి, కొంతమంది మగవాళ్లకి కూడా హాయిగొల్పే ఒక మాట- విలువైన రత్నపు రాళ్లేవి- స్ఫటికాలు కావు. హాయిగా మీ స్వంతమైన, వాడుతున్న నగల సంపదను కొనసాగించండి. ఎటువంటి దుష్పరిణామాల భయాలు లేవు. వజ్రాలు, కెంపులు, పచ్చలు, ఇంద్రనీలాలు లేదా పుష్యరాగాలు- వీటివల్ల ఎటువంటి దుష్ప్రభావాలు లేవు.

## "ఆత్మ" యొక్క లింగం
## మగ లేదా ఆడ

అసలు ఆత్మకు లింగభేదముందా? ఇటీవల ఈ ప్రశ్న నా ముందు ఉంచబడింది. కొంచెం ద్వైధీ భావంతోటి (డిక్టామస్) అధిభౌతికమైన (అప్రత్యక్షమైన) వివరణతో ఆసక్తి గొల్పేదిగా ఉన్నది కనుక అందరూ చదువుతారని మీ ముందు దీని జవాబు ఉంచుతున్నాను.

మానవుని యొక్క ఆత్మకు లింగభేదముందా? దీనికి జవాబు **'లేదు'** అని లింగభేదం లేకుండా ఆత్మ ఉండగలుగుతుందా' దీనికి కూడా జవాబు మళ్లీ **లేదు** అని. ఇప్పుడు స్పష్టంగా నేను- పూర్తిగా విరుద్ధంగా ఉన్న రెండు
ప్రకటనలు చేసాను. కొంత ఈ విషయంలో మీకు అవగాహన రావటం కోసరా సాధ్యమైనంత సులభంగా ఆత్మ యొక్క ఏర్పాటు, నిర్మాణం తదితర విషయాలు ప్రస్తావిస్తాను.

మనము సాధారణంగా 'ఆత్మ' ని "జీవుడు" అంటుంటాం లేదా వ్యక్తమైన మహోన్నతమైన ఆత్మ యొక్క ప్రతిబింబమే జీవుడు. ఒక్కొక్కసారి దీనిని దైవం యొక్క తళుకు లేదా స్వచ్ఛాత్మ అని కూడా పిలుస్తుంటారు.

ఇప్పటి వరకు ఈ జీవుడు లింగభేదం లేనివాడు, సజాతీయమైనవాడు. విభిన్నమైన రెండు ధ్రువాలుగల వివేకాన్నిఅనుసరించి, 'ఆధ్యాత్మిక హృదయము' లేదా 'చిత్తము' అనుభూతులను అనుభవించటానికి ఉపకరిస్తుంది. దీనికి వివేకము ఒక చివరకాగా, ఆలోచన (కోరికలు తీరాలి అనే వాంఛ) ఇంకో చివర.

ఈ హృదయము లేదా రెండు ధ్రువాలుగల వివేకాన్ని 'మానసము' లేదా మనస్సు అంటారు. ఈ మొత్తం జీవుని యొక్క వ్యక్తిత్వాన్ని నిల్పుతుంది. అహంకారము లేదా వ్యక్తిత్వంతో కూడిన 'నేను' (ఇగో) మళ్లీ జన్మిస్తుంది. ఈ రసమిశ్రమం (అమాల్గమ్) శాశ్వతమైనది మరియు నాశనరహితమైనది. ఇది విశ్వవ్యాప్త చంక్రమణానికి (దాటుటకు) జీవాత్మగా లేదా వ్యక్తిగత ఆత్మగా సిద్ధమవుతుంది.

ఈ అంశం వరకు ఆత్మ అనేది పూర్తిగా లింగభేదం లేనిది కాని వ్యక్తి గతమైనది. తర్వాత ఇది సిగ్గుమాలిన తనంలోకి పతనమవుతుంది. అనేకరకాల గుణాలు, సంపదలు, కోశాలు- ఇలాంటివన్ని స్వీకరించి భౌతిక శరీరమవుతుంది. ఈ భౌతిక శరీరం కావటమనేది కూడా ఏడు కోణాలలో ఒకటిగా ఉండి పనిని
నిర్వహిస్తుంటుంది. భౌతిక కోణమనేది అన్నింటి కంటె చివరిది మరియు అధమమైనది.

ఈ అంశం నుండి మొదలుకొని ఆత్మ లింగభేదాన్ని కోరుకుంటుంది. దానిలోని కోణాన్ని అనుభవంలోకి స్వీకరిస్తుంది. అది లింగభేదం లేని స్థితిలో ఉండలేదు. ఈ లింగభేదమనేది అవసరం. ఎందుకంటే పునరుత్పత్తి- పిల్లలను కనటమనేది వ్యక్తమైన దైవాంశ యొక్క అయిదు అత్యున్నత లక్షణాలలో ఒకటి మనమందరం కూడా దానియొక్క ప్రతిబింబమే. దాని యొక్క అన్ని లక్షణాలను మనలో జీర్ణింపచేసుకొన్నాం. పునరుత్పత్తి- అనేదాన్ని ఒక విశాలమైన వివరణాదృక్పథంలో మనం అర్థం చేసుకోవాలి. ఎందుకంటే రూపం లేని దైవత్వానికి శివుడు మరియు శక్తి (లేదా స్థిరమైన మరియు గతిశీలమైన అంశములు) వ్యక్త స్వరూపులు. ఈ విశ్వవివరణ చేయాలంటే ఈ వివరణ చాలా అవసరం.

ఇక ప్రేతాత్మ కోణంలో ఆలోచిస్తే ఆత్మా ఈ విశ్వవ్యాప్త ఉపాయ ప్రణాళికలో తనకు సంబంధించిన సహజమైన, సొంతమైన, ప్రకృతిని లేదా చేసిన కర్మని అనుసరించి లింగాన్ని ఎన్నుకొంటుంది. ఈ నిర్ణయము ఎక్కువగా శాశ్వతంగా ఉంటుంది. కాని విభిన్న కాణాలకు సంబంధించిన నిబంధనల చేత ఈ నిర్ణయం మారవచ్చు. లేదా తలక్రిందులు కావచ్చు. కనిష్ఠంగా ఈ ప్రేతాత్మ నిర్ణీతమైన కోణాలకు దిగువగా చేరిపోతుంది. లింగభేదము యొక్క అవసరము మరియు ప్రాముఖ్యత చాలా ప్రధానమైన కోణము.

ఇప్పుడు మానవులమైన మనకు సంబంధించిన ప్రాథమికమైన రెండు కోణాలు పరిశీలిద్దాం అవి 1. యాతనాదేహము 2. భౌతిక దేహము. ఇక్కడ నిబంధనలు చాలా స్పష్టం. (భౌతిక శరీరానికి అంటిపెట్టుకొని, సామాన్యదృష్టికి
కనబడకుండా, సాధకులైన కొందరికి మాత్రమే కనబడే విధంగా ఉండే దానిని యాతనా దేహము (ఆస్ట్రాల్ బాడి) అంటారు. అనువాదకుడు) ఈ భౌతిక జగత్తులో ఆత్మ **తప్పనిసరిగా** లెక్కలేనన్ని సార్లు జన్మను స్వీకరించవల సిందే. అది ఆడ లేదా మగ కావచ్చు. ఈ భౌతికలోకంలో అందించే ప్రతి అనుభవం ఒక్కొక్క జన్మకి కారణమవుతుంది. ఈ భూలోకం అందించే కర్మానుభవాల సంపూర్తి అవటానికి, ఆత్మ బోధ అయ్యేటంతవరకు ప్రతి వారికి ఇది తప్పనిసరి.

ప్రేతలోకము లేదా పితృలోకంలో ఈ నిబంధనలు కొంచెం మారతాయి చనిపోవటానికి ముందు భూలోకంలో ఏ లింగభేదముందో- అదే లింగ భేదం ఈ ప్రేతాత్మకు కూడా ఉంటుంది. కాకపోతే మానవ లోకంలోని జీవాత్మలా- ఈ ప్రేతాత్మకు పునరుత్పత్తి చేసే శక్తి ఉండదు. ఈ ప్రేతలోకంలో ఉన్నంత కాలం- అది కొద్దిరోజులు కావచ్చు. లేదా మిలియన్ల సంవత్సరాలు కావచ్చు- ప్రేతాత్మకు అదే లింగభేదం- ఆ ప్రేత శరీరంలో ఉన్నంత కాలం ఉంటుంది. ఆత్మ మళ్లీ జన్మను పొందినప్పుడు- ప్రేతము తన ప్రేతకోశ విముక్తిని లింగ భేదంతో సహా పొందుతుంది. ఇప్పుడీ కొత్త జన్మలో ఆడా- మగా అనే లింగ భేదాన్ని - అతని/ఆమె కొత్త జీవన నిర్మాణప్రణాళిక (తలరాత), కర్మఫలితాలు నిర్ణయిస్తాయి. ఒక ఆసక్తి కరమయిన నిజం ఏంటంటే- ఏడు ఉపలోకాలలో- ఉన్న లెక్కలేనన్ని ప్రేతాత్మలు రకరకాల ఆకృతులలో ఆటలాడుతుంటాయి. కాని మానవజన్మను స్వీకరించలేవు. అనిశ్చితమయిన కాలందాకా- తాము చనిపోయేటప్పుడు ఉన్న లింగభేదంతోనే గడుపుతాయి. ఇది వాళ్ల యొక్క కర్మతో, స్వాభావికతతో, నిర్ణయించబడుతుంది. ఇప్పటి వరకు చెప్పిన దానిని సంక్షిప్తంగా మనం చెప్పుకోవాలంటే- ఈ అంతులేని జీవన ప్రయాణంలో- ప్రతి ఆత్మ తమ స్వభావాలకు అనుగుణంగా, పరిణామాలపై ఆధారపడి- ఆడ- మగ- అను లింగభేదాలను కాలానుగుణంగా పొందుతుంటాయి.

**వ్యాఖ్యలు**

ప్రశ్న :

స్వలింగసంపర్కుల విషయమేమిటి? ఈ గ్రహము మీద తటస్థ లింగభేదంతో పుట్టిన వారి సంగతి చెప్పండి?

మన సమాజం వారి విషయంలో అంత దయ చూపించటంలేదు. కాని నాకు నమ్మకమేమిటంటే- వాళ్లు ఈ లోకంలో ఇలా పుట్టారంటే దానికొక కారణం తప్పక ఉండి ఉంటుంది. పెద్ద పెద్ద విషయాలలో వ్యవహరించేటప్పుడు వాళ్ల పాత్ర ఎలా ఉండాలి? వాళ్ల జీవన ప్రయాణాలు ఎలా ఉండాలి?

గురూజీ జవాబు :

లింగభేదం కంటె నపుంసకుల విషయరా చాలా పెద్ద ప్రశ్న. నేను రెండు కారణాలవల్ల సాధారణంగా లైంగిక (సెక్సువాలిటీ) విషయాలకు సంబంధించి వ్రాయటం కాని మాట్లాడటం కానీ చేయను. నిలుపుదల చేస్తుంటాను. మొదటి కారణం ఈ 'ఆత్మల' ప్రపంచాలలో

నిజంగా ఆలోచిస్తే మానవ లైంగిక భేదాలు ఎంతవరకు గమనించబడుతున్నాయో, నాకు బాగా తెలుసు. ఒక ఉన్నతమైన దృక్కోణం నుంచి ఆలోచిస్తా ఈ స్త్రీ పురుష వివక్ష విషయంలో మన మధ్యతరగతి వ్యక్తుల నైతికత ఎంత డొల్లగా ఉందో తెలుసు కాబట్టి. ప్రపంచవ్యాప్తంగా ఇప్పుడు మనం అనుసరిస్తున్న "నైతికత" మత సంస్థలూ గత వేయిసంవత్సరాలుగా వికసించి, సంపాదించిన అద్భుత శక్తులతో కూడినది. ఈ మత సంస్థలు ప్రధానంగా మెడిటెర్రనీయన్ ప్రాంతానికి మరియు యూరప్ ప్రాంతానికి సంబంధించినవి. (మెడిటెర్రనీయన్) అంటే భూ మధ్యస్థమైనా ఇది ఒక సముద్రపు పేరూ అనువాదకుడు). కాని ఈ తియ్యని కేక్ (కుకీ) ఎంత పొడిపొడిగా రాలిపోతోంది? రోమన్ పట్టణములో పోప్ అనే ప్రధాన గురువుగారి నగరం వాటికన్ బ్రహ్మచర్యం గురించి ఉపన్య సిస్తుంటుంది. గర్భ స్రావాలను (అబార్షన్) నిందిస్తుంది. సంతాన నిరోధ కత్వాలను, స్వలింగ సంపర్కులను కూడదంటుంది. వీటి ప్రచారం కోసరా లక్షల కోట్లాదిగా డాలర్లను ఖర్చుపెడుతోంది. పూజారులలో విపరీతంగా ప్రబలిన "పెడొసిలియా"ను (సెక్సువల్ ఫీలింగ్ డైరెక్టెడ్ టువాడ్స్ చిల్డ్రన్ అనువాదకుడు) తుడిచి పెట్టడానికి చేసిన ప్రక్రియా దాచిపెట్టడానికి చేసిన తంత్రరా చాలా స్వల్ప విజయం సాధించింది. నా మనస్సుకు సంబంధించినంత వరకు చిన్న పిల్లలపై లైంగిక అత్యాచారమనేదానికీ హత్య చేసే ముందస్తు ఆలోచనకు మధ్య తేడా లేదు. రెండూ ఒకటే. ఇది కేవలం ఒక ఉదాహరణ మాత్రమే కాని ఇంచుమించు ప్రతి సాంఘిక మతసంస్థా తమ కపటత్వానికీ ద్వంద్వ ప్రమాణాల అనుసరణకి సిగ్గుపడాలి.

రెండవ కారణము ఏమిటంటే నా అభిప్రాయాలన్నీ ఆధ్యాత్మిక వాస్తవికత పై ఆధారపడి ఉన్నాయి. ఇవి ఎప్పుడూ సాంఘిక కట్టుబాట్లను అనుసరించవు. ఈ పరిస్థితిలో లైంగికత్వం మీద నేను మాట్లాడితే- నేను ఏదో లైంగిక స్వైరతని (ప్రొమిక్స్విటీ) ప్రచారం చేసినట్టు అనిపించటం సహజం. కాని నాపని, నా ఉద్దేశాలు దీనికంటే చాలా విభిన్నమైనవి. (అందుకే లైంగిక విషాయలు మాట్లాడను అని గురూజీ అన్నారు.- అనువాదకుడు)

కాని మీ కుతూహలాన్ని తృప్తి పరచటానికి- ఒక చిన్నమాట ఎవరు కూడా స్వలింగ సంపర్కులుగా పుట్టరు. కొజ్జాగా మారటమనేది పెద్దయిన తర్వాత వివిధ విషయాలపై ఆధారపడి ఉంటుంది. ఇలా కొజ్జాగా మారిన వారికి ఆధ్యాత్మిక పరమైన భావము (ఇంప్లికేషన్)

లో సకారాత్మక, నకారాత్మక ధోరణులు, వారి వారి విభిన్న అనుభవాలపై ఆధారపడి ఉంటాయి. కనుక కొజ్జాగా మారటమనేది దైవానికి వ్యతిరేకం కాదు. అది తయారయిన ఒక సృష్టి. ఎవరయితే ఎదుటి లింగభేద విషయంలో బలమైన వ్యక్తిత్వ గుణాలు, విశిష్టలక్షణాలు తమలో కలిగి ఉంటారో- దానికి కారణం - వాళ్ల కర్మఫలితము.

కాని ఇది ఒక సాధారణ ప్రక్రియ. మన ఆత్మ ఆడ-మగ- అను రెండు లింగభేద విషయాలలో అనుభవాలను పొందుతుంది. కనుక అంకుర దశలో మనము ఈ అనుభవాలను రెండు పాత్రలలోనూ అనుకూలంగా అన్వయించు కొంటాము.

## పరిణామము యొక్క మూడు దశలు

'ఆత్మ' పరిణామాలను గురించి తెలుపుమని నాకు ఒక ప్రశ్నను పంపించారు. అందువల్లనే మానవాత్మ (జీవాత్మ) లోని వివిధ స్థాయిలను తెలియజేసే ఈ చిన్న వ్యాసాన్ని వ్రాస్తున్నాను. ఈ భూ గ్రహంగా పిలువబడే మనోహరమైన విద్యాసంస్థలో- పదిలక్షలకు పైబడిన సంవత్సరాల ప్రయాణంలో ఆత్మ తన ప్రయాణంలో ఎటువంటి అనుభవాలను పొందుతుందో తెలియజేసే ఈ చిన్న వ్యాసం- మీకు చాలా ఆసక్తిదాయకంగా ఉంటుందని భావిస్తాను.

అత్యాధునికమైన ఎప్పుడు విస్తరిస్తుండే ఈ భౌగోళిక ప్రపంచంలో గొప్పదైన, ఉత్సాహభరితమైన, ధైర్యభరితమైన వాతావరణంలో ప్రవేశించి భాగస్వామ్యంకావాలనే 'ఆత్మ' నిర్ణయంతో ఈ పరిణామ క్రమం మొదలు పెడతాను. ఇంకోమాటలో చెప్పాలంటే - ఆత్మ భౌతిక రూపాన్ని స్వీకరించటానికి అంగీకరించి, ఈ గ్రహంతో కలిసి జీవించటానికి ఒప్పుకొంటూ, మానవ రూప జీవితాన్ని ఒప్పుకొంటుందని భావం. వీటన్నింటిని మనం సులభంగా చెప్పుకోవాలంటే- మనం ఊహించవచ్చు- ఏడు లక్షల కోట్లకు పైబడిన ఆత్మలు ఈ భూగ్రహంలోని అనుభవాలను, ఆనందాల సంబంధాలను పొందటానికి సిద్ధమవుతాయి. మానవ జీవనాన్ని సమర్థించే ఈ భూగ్రహము ఒక విద్యాసంస్థలా తన పాత్రని - అనియమిత కాలానికి- అంటే- లక్షల కోట్ల సంవత్సరాలు వహించటానికి సిద్ధమవుతుంది. ఆత్మ- ఈ నిర్ణయం ఎందుకు తీసుకుంటుందన్న విషయం చర్చించటానికి అనేక కారణాలున్నాయి. తనకు తాను దైవికానుభూతిని పొందటానికి సాయపడటానికి ఆత్మ ఈ మానవ రూపం ధరిస్తుంది! లేదా భౌతిక రూపంలోనే తన వాంఛల అనుభవాలకు వీలుంటుంది. మరియు

పూర్ణ ఆనందాల వ్యక్తీకరణకు సాధ్యమవుతుంది అన్నదృష్టితో ఈ మానవరూపం పొందుతుంది. లేదా- ఆత్మలు- పరస్పరంగా తమలో - అంతర్లీనంగా ఉన్న- అన్వేషణ మరియు స్వీయ ఆవిష్కరణలను తృప్తి పరచటానికి, నెరవేర్చటానికి ఈ మానవరూపం ధరిస్తాయి.

ఆత్మ మానవ జనన మరణ చక్రాన్ని ప్రారంభించబోయే ముందు- ప్రయాణం చేయబోయే ముందు- ఆత్మ ప్రయాణించే - మూడు గొప్పవైన దశలు ఉన్నాయి. చాలా ముఖ్యమయిన విషయం ఏమంటే ప్రతి ఆత్మకి- కొన్ని వందల సంవత్సరాల నుండి- కొన్ని పది లక్షల కోట్ల సంవత్సరాలవరకు - తన ప్రయాణం కాలం కొన "సాగే" సమయం ఉంటుంది. ఈ విధానం పరోక్షంగా గ్రహము యొక్క పరిణామ చక్రమైన 'యుగము'తో ప్రభావం కలిగి ఉంటుంది. ఇటువంటి యుగం నిజానికి ఒక శకం. ఇది వివిధ సంవత్సరాల పరిమితితో ఉంటుంది. 24000 భూసంత్సరాలు కలిపితే ఒక శకం అవుతుంది. ఇది సౌర పద్ధతిలో ఒక దీర్ఘవృత్తాకార కక్ష్యని పూర్తి చేసినట్లు.

సరే తిరిగా ఆత్మ పరిణామపు మూడు దశల విషయంలోకి మళ్లీ వద్దాం. ఈ దశలు లేదా స్థాయిలూ వేటికవి ప్రత్యేకభాగాలు, విడివిడి భాగాలు కావు. (వాటర్ టైట్ కంపార్ట్‌మెంట్స్). ఈ స్థాయిల్లోని కాలంలో గుర్తు పెట్టదగిన అతి వ్యాప్తి, మినహాయింపుకు మించి ఉంటుంది.

మొదటి దశ :

ఈ దశలో ఆత్మ జనన మరణ చక్రాన్ని ప్రారంభిస్తుంది. అందువల్ల ఈ దశలో లెక్కలేనన్ని భౌతిక స్వరూపాలు (జన్మలు) ఉంటాయి. మొదటి
జన్మల వరుసల్లో ఆత్మ చాలా ఆసక్తిగా అనుభవాల కోసం ఎదురు చూస్తుం టుంది. సంవేదనాత్మక ఆనందాల్లో పూర్తిగా అతుక్కుపోతుంది. ఎక్కువగా తన ఇష్టంకొద్ది- ఎత్తిన ఈ జన్మలలో తన మౌలిక వాంఛల పరిపూర్తికి ఆత్మ తపిస్తుంది. సంఘర్షణలు, పందాలు, అన్నిరకాలుగా వ్యాధి ఉద్భృతాలు, ఆహార వస్త్ర నివాసాలనే మనుగడ సమస్యలు- ఈ స్థాయిలో బాగా ఉంటాయని వర్ణించవచ్చు.

అయితే గమనించదగిన తేడా ఏమిటంటే- ఈ "నూతన" "ఆత్మ" ఈ స్థాయిలో తన అధమాధమ విషయ వాంఛలను తీర్చుకోవటానికి ఎంత లోతుకు వెళ్లాలో అంత లోతుకి వెళుతుంది. తన వాంఛలను తీర్చుకొనే సమయంలో తన తోటి మానవులకు బాధ, కీడు, నష్టం- ఇలాంటివి జరుగుతున్నా "ఆత్మ" పట్టించుకోదు. తన వాంఛ ముఖ్యము. బహుశా ఇది సృష్టి నిర్మాణ చట్రాలకు లోబడి ఉంటుందేమో! కర్మల పునరావృతి మొదలవుతుంది. ఒక్కసారి ఈ కర్మ ఋణ పాశ బద్ధుడయ్యాడా!- ఇక అంతే- ఆత్మ- ఈ భూ గ్రహానికి మరియు ప్రేతలోకానికి అనుసంధానితమవుతుంది. సకారాత్మక మరియు నకారాత్మకమైన కర్మ ఋణము మొత్తము తీరిపోయే దాక నిర్ణీత కాలం వరకు ఆత్మ సంధానించబడుతుంది. ఇది జీవన మరణ చక్ర పరిభ్రమణం ఆగిపోవటానికి ఏర్పరుచుకొన్న ఒక ముందస్తు నిబంధన.

ఈ మొదటి స్థాయిలో ఆత్మకి సంబంధించిన అనుభవాల కాంక్షితాలైన బలమైన దురాశ, రూకల మీద అత్యాశ, తీవ్రమైన లైంగిక వాంఛ, ద్వేషం, క్రూరత్వం, హింస, విపరీతమైన అసూయ, తక్కువస్థాయిలో వివేకము. ఇవన్నీ ఆధ్యాత్మిక ఉనికి లేని వాతావరణంలో ఉంటాయి. ఒకవేళ ఆత్మ తన భౌతిక తృప్తిని దాటి దేనినయినా వెతికితే అది తేలికగా కర్మకాండల ప్రభావం పొందుతుంది. చాలా తేలికగా మత లేదా రాజకీయసిద్ధాంతాల ప్రభావానికి
గురవుతుంది. ఒక జన్మకు మరొక జన్మకు మధ్య ఉన్న సమయము చాలా తక్కువ. ఆసమయంలో ఆత్మ భౌతిక వాంఛలకు, లైంగిక మరియు ఆహార వాంఛలకు తనకు గా ఎంచుకొని పరితపిస్తుంది. ఇది రెండంచుల కత్తిలాంటిది. ఒక పక్క- జీవిత కాలంలో- చాలా గాఢమైన కష్టాలను, బాధలను అనుభవిస్తూ, తర్వాత కర్మ ఋణాన్ని తొందరగా తీర్చుకుంటుంది. ఇంకొక పక్క- అదే సమయంలో - ఆత్మ తన అజ్ఞాన వ్యతిరేక చర్యల వల్ల - వ్యతిరేక కర్మల భారీ సామానును మూటగట్టుకుంటుంది. ఈ స్థాయిలో ఆత్మ యొక్క యాత్ర స్వీయ రక్షణ మరియు స్వీయ తృప్తి ద్వారా విశేషంగా చెప్పబడుతుంది.

రెండవ స్థాయి :

ఈ రెండవ స్థాయిలో ఆత్మ ప్రాథమికమైన భౌతిక స్థాయి నుండి, మానసిక అభివృద్ధిని పొందుతుంది. చాలా జన్మలు ఈ స్థాయిలో తమ ప్రచారము, కీర్తి, కూడబెట్టుట, సంపద పేరుకుపోవడం, విద్యాసాధన, శక్తి సముపార్జన, విజ్ఞాన శాస్త్ర అధ్యయనము మరియు స్వీయ అభివ్యక్తి అను విషయములలో గడుపుతారు. వాళ్ల వాళ్ల కర్మ ఫలితాలను బట్టి- కష్టాలను మించి, భౌతిక కోణాలకు సంబంధించే సంపదలను అనుభవించటంలో తృప్తి పొందుతారు. ఇది మొదటిస్థాయిలో చెప్పినట్లు చావక బతికి ఉండే స్థితి (సర్వైవల్) కాదు. ఈ స్థాయిలో కూడా, ఇంకా ఆధారపడిన ప్రవృత్తులయొక్క- ప్రవాహ సదృశమైన ప్రభావం ఉంటుంది. ఇవి హద్దుకు లోబడిన మార్పులో ఉంటాయి. తెలివి తేటలు, చట్టానికి కట్టుబడిన నిబద్ధత, నెమ్మదిగా అభివృద్ధవుతున్న ఆధ్యాత్మిక విచారణ- ఇవన్నీ హద్దు తెలిపిన మార్పుల మార్గంలో ఉంటాయి. ఈ జన్మలలోని ఈ మధ్యస్థాయి మండుతున్న ఆశయాలకు మద్దతు పలుకుతుంది. ఇతరులను అధిగమించాలనే కోర్కెతో పాటు, ప్రతి పద్ధతిలో తన అహాన్ని పాలుపంచుకోవాలనిపిస్తుంది. పూర్తిగా జీవితాన్ని అనుభవిస్తున్నా ఈ దశలో ప్రత్యేక మైన ఆధ్యాత్మికపు పెరుగుదల
కూడా ఉంటుంది. అంకితభావము, పూజ, త్యాగము మరియు దానము బలంగా వేళ్లూనుకొంటాయి. మొదటి స్థాయిలో నకారాత్మకత ఎక్కువ ప్రాముఖ్యత వహిస్తే, ఈ స్థాయిలో కర్మల ఋణ శేష పత్రం- సకారాత్మక, నకారాత్మక కర్మల మధ్య హోదాలో కొంత సమానత కలిగిన బాహ్యరూపాన్ని చూపిస్తుంది.

మూడవ స్థాయి :

బాధలనుంచి, కష్టాలనుంచి విముక్తి కావాలనే తపనతో, కొన్ని వందల లేదా కొన్ని వేల జన్మల తర్వాత- ఆత్మ ఈ మూడవ స్థాయిలోకి ప్రవేశిస్తుంది. అది స్వీయ నిర్వచనం, స్వీయాన్వేషణ, స్వీయవిచారణ మరియు స్వీయ పరిపూర్ణతల ద్వారా తనని తను వెతుక్కొంటుంది. ఒక్కోసారి ఆత్మలో ఉన్న ఆ ప్రత్యేకమైన ఖాళీ- ఈ భౌతిక ప్రపంచం ఇచ్చే దేనివల్లాగాని- ఎవరివల్లాగాని నింపబడదు. తనలో తను వెతుక్కోవటమే ఆత్మ ముందున్న కర్తవ్యం. కారణం ఏదయినా- ఈ చివరిస్థాయి ప్రతివారి జీవితంలో ఒక ఆధ్యాత్మిక అభివృద్ధి కలిగిస్తుంది. జీవన నిర్మాణ ప్రణాళిక (తలరాత) ఆత్మకి తన అభివృద్ధిని వెతుక్కోవటానికి రకరకాల అవకాశాలు చూపిస్తూ తలుపులు తెరుస్తుంది. మనం ఈ

తలుపులలో ఒక్కదానిని తెరచినా కూడా- మనం బాధల నుంచి అజ్ఞానం నుంచి శాశ్వత విముక్తి కలిగే మార్గంలో ప్రవేశిస్తాం.

మనం ఈ స్థాయిలో ఎక్కువ జన్మలను పొందటం వల్ల మన జీవితాలు సాధారణంగా బలమైన ధోరణిని ముందు చెప్పబోయే పరిస్థితులవల్ల కలిగి ఉంటాయి. చాలా చిన్నవైన భౌతిక సమస్యలే కాని ఎక్కువగా ఉద్వేగ పరీక్షలు, కర్మల సంపూర్తి తొందరగానే పూర్తవుతుంది- కాని కొన్ని అదనపు చేర్పుల ద్వారా, జీవన సన్ని వేశాలు భౌతికంగా కంటె కూడా మానసిక బలాన్ని పరీక్షిస్తాయి, మతసంబంధమైన పిడివాదాలు మరియు సిద్ధాంతాలవల్ల విపరీత భ్రాంతులు, కట్టు బాట్లు విస్తృతమైన ఆవేశాల వల్ల అణచివేయబడినట్లు అనిపిస్తుంది, తెలియని దానిని తెలుసుకోవాలని చాలా అత్యాశగల దాహం, భౌతిక సంపదలను దాటి నిజమైన ఆనందం ఉన్నదనే గాఢమైన విశ్వాసం. భూతదయ, ఔదార్యము, సున్నితత్వము, సహనం మరియు కరుణ మొదలైన గుణములను ఆత్మ పెంచి ప్రదర్శించటం వల్ల- ఇవి కూడా జన్మానుబంధాలవుతాయి. అత్యధికంగా స్పందనాతీత స్థితిలో సంసిద్ధంగా ఉన్నట్లు అనిపిస్తే, చుట్టూ ఉన్నదంతా సమానంగా కనిపిస్తే- ఓటమి కలుగునట్లు చేసే బాధ మీద బలమైన విరక్తి కలిగితే - ప్రేమను ప్రకటించటానికి అపరిమితమైన శక్తి ప్రదర్శిస్తే - ఆత్మ మూడవ దశలోకి అడుగు పెట్టినట్లుగా భావించవచ్చు.

ప్రశ్న :

ఆత్మ తన నిర్ణయానుసారము, అనుభవాల కొరకు వస్తుందనే నేపథ్యాలలో మనము ప్రపంచము యొక్క పెరుగుతున్న జనాభాను ఎలా వివరించగలము? నా అర్ధం ఏమంటే- కొన్ని సంవత్సరాల క్రితం, కొన్ని ఆత్మలు ఈ భూమ్మీద ఉన్నాయనుకొందాం. ప్రతిరోజూ సంఖ్య పెరుగుతుందికదా! ఆ సంఖ్యకి తుది ఎక్కడ! ఎందుకని చాలా మంది ఆత్మలు ఇప్పుడు భూమి మీదికి రావాలనుకొంటున్నాయి?

గురూజీ జవాబు :

నా సరస్సులలో సాధారణంగా అడిగే ప్రశ్నలలో ఒకటి- ఈ జనాభా పెరుగుదల ప్రశ్న. ఇటువంటి భావం మీకు రావటం-నాకు చాలా ఆశ్చర్యం కలిగిస్తోంది. భూతాత్మల

ప్రపంచమనేది విపరీతంగా భూతాత్మలతో కూడుకొన్న అధిక సంఖ్య కల ప్రపంచము. సాధారణంగా వాటిని ఆత్మలనే అంటుంటాం. అజ్ఞానము యొక్క వివిధ దశలలో - అభౌతికమైన స్థితిలో అవి ఉన్నాయి. నిజంగా ఈ ఆత్మలు ఎన్ని ఉన్నాయనే విషయం ఏ “జనాభాలెక్క” (సెన్సస్)
మనకు ఇవ్వలేదు. కాకపోతే అది వందల లక్షల కోట్లు ఉండవచ్చుననేది నాఊహ. వీటిల్లో కొంతశాతం భూతాత్మలు మాత్రమే ఈ భూగ్రహంతో సంబంధం కలిగి, పుట్టుక అవకాశాన్ని తీసుకొని, భౌతిక రూపంలో జీవితాన్ని అనుభవిస్తాయి కారణాలు అనేకము. కాని ప్రధానంగా స్వీయన్వేషణ ద్వారా మాత్రమే అవి లభ్యమవుతాయి.

మానవజన్మలపై ఆధారపడి - తాత్కాలిక నివాసములో- పాత్రపొందిన ఈ భూతాత్మల విషయాన్ని జననమరణ చక్రంతో కూడిన జ్యోతిష్యకోణంలో పరిశీలించాలి. నిజంగా ప్రతి ఆత్మ ఒకే సమయంలో జన్మించదు. ఆ పితృలోకానికి సంబంధించి కొన్ని నిబంధనలున్నాయి. వాటిని తప్పక పరిశీలించాలి. అయినప్పటికి ప్రేతలోకంలో ఉన్న ప్రతి ఆత్మ లేదా జీవాత్మ - భౌతిక రూపాన్ని ధరించి, అనుభవాలు పొందాలనుకుంటే - అది రాని పరిణామానికి కారణమవుతుంది. తర్వాత జన్మను గూర్చి ఆలోచిస్తుంది. మీకు ఈ మాట వింటే మనస్సు వికలమవుతుందేమో! (యు మే బి షాక్డ్) కొన్ని భూతాత్మలు వందల కొలదిగా వేలకొలదిగా మానవజన్మలు పొందాయి. ఇంకా కొన్ని “కొత్త” ఆత్మలు ఇంకా మానవజన్మను పొందటానికి రానున్నాయి. ఇప్పుడు ఈ మాట విన్న తర్వాత- కొంతమంది భౌతిక అస్తిత్వంలో జీవనం గడపటానికి తగినంత ధైర్యం కోల్పోయారేమో! దానికి సంబంధించిన కష్టాలను అదే భరిస్తుంది.

కనుక ఈ గ్రహం మీద జనభా ఎంతగా పెరుగుతుంటో అక్కడ పితృ లోకములో జనాభా అంతగా తగ్గుతుంటుంది. బహుశా 2012లో వచ్చే శక్తి మార్పు కోసంా అనేక ఆత్మలు మానవ శరీరాన్ని ధరించడానికి నిర్ణయించుకొని ఉంటాయి.

### ఆట, సరైన స్థితి మరియు అసమతుల్యత

నా మనస్సుకు తోచినంతవరకు, మానవజీవి తన జీవితంలో తీసుకొనే

రెండుముఖ్యమైన, జటిలమైన నిర్ణయాలు చర్చింపదగినవి. మొదటిది జీవన ప్రగతికి (కెరీర్) సంబంధించినది కాగా రెండవది జీవనభాగస్వామి(ని) ఎంపిక. ఈ రెండు కూడా విధి మరియు జీవన నిర్మాణ ప్రణాళిక (తలరాత)ల ప్రభావంతో ఉంటాయని కొంతమంది అనుకోవచ్చు. నిజమే - కాని ఆ జీవన నిర్మాణ ప్రణాళికలో చాలా రకాల ఐచ్ఛికాంశాలు ఉంటాయి. వాటిల్లో జీవన ప్రగతికి, భాగస్వామికి సంబంధించి మనము ఎన్నుకొనే అవకాశము ఉంటుంది. అయినప్పటికి ఎక్కువమంది విషయంలో ఏమి జరుగుతుందనేది నేను ఇక్కడ వివరించదలుచుకొన్నాను. మన విధి- ఫలానా జీవన ప్రగతి లేదా ఫలానా భాగస్వామితో ఆనందం లేదా దుఃఖం మనము అనుభవించాలని రాసిపెట్టి ఉంటే - అది బలవత్తరమైతే - బాహ్య పరిస్థితులు- మన ఎంపిక మీద ప్రభావం చూపించి- విధి రాసిపెట్టినదాన్నే అనుసరిస్తాం. ఒక్కొక్కసారి మనము ఉద్వేగాల వల్ల గుడ్డివాళ్లమవుతాం. మసకబారిన తర్కముతో మన మెదడు కొన్ని అందమైన మూగ నిర్ణయాలు తీసుకోవటానికి సాయపడుతుంది. వాటి ఫలితమేమిటో, అవి అనుభవించిన తర్వాత మనం అర్థం చేసుకొంటాం.

భయపెట్టే పరిస్థితుల్లోను (గన్‌పాయింట్), బెదిరించి సంపాదించే (బ్లాక్ మెయిల్డ్) పరిస్థితుల్లోను తప్పా జీవిత భాగస్వామిని ఎంపిక చేసుకొన్న సందర్భంలో, ఎప్పుడూ నాజూకుతనం మొదలైన ఐచ్ఛికాంశాలు భాగస్వామికి ఉంటాయి. ప్రపంచంలోని చాలా ప్రాంతాల్లో పెళ్లి చేసుకోవటమనేదీ పెళ్లి చేసుకొనే ఇద్దరికి మాత్రమే సంబంధించిన అంశం. కాని మన దక్షిణాసియా ప్రాంతంలో ప్రత్యేకించి మన భారత దేశంలో కుటుంబవ్యవస్థ పెళ్ళిళ్లను ఏర్పాటు చేస్తుంది. కులము, మతము, సంపద, విద్య మొదలైన వాటిని లక్ష్యం
చేసుకొని సమాజంలోని అత్యధికశాతం ప్రజలు వివాహాలు చేసుకొంటున్నారు. ఈ రకంగా విద్యతోటి, అంతర్జాతీయ అవగాహనతోటి సంబంధం లేకుండా ఆచార వ్యవహారాలు నడుస్తున్నాయి. ఇక్కడ పెళ్లికొడుకు / కూతురు తమ జీవితభాగస్వామి ఎంపికకు సంబంధించిన విశేషాధికారం తమ తల్లి దండ్రులకు, కుటుంబానికి మాత్రమే ఉ ందనుకొంటారు. పెళ్లికొడుకు / కూతురికి నిర్ణయాధికారం చాలా తక్కువ. ఇలా నేను చెబుతున్నానంటే సొంత నిర్ణయాలతో పెళ్లిళ్లు చేసుకొనే ప్రేమ వివాహాలు లేవని కాదు. ఇవి క్రమక్రమంగా అభివృద్ధి చెందుతున్నాయి. రాబోయే తరంలో ఇక స్వతంత్ర నిర్ణయాలే ఉ

ండ బోతున్నాయి. కాని ప్రస్తుత గణాంక శాస్త్రం (స్టాటిస్టిక్స్) ఎవరన్నా పరిశీలిస్తే- ప్రేమ వివాహాలు ఇంకా బాధాకరంగా (హోప్‌ఫుల్) అల్పసంఖ్యాక వర్గంగానే ఉన్నాయి.

ఏమయినా నా అంశం ప్రేమ వివాహాలూ పెద్దలు ఏర్పాటు చేసిన వివాహాల గురించి కాదు. చివరి దశలో ఏ ప్రభావాలు, ఎవరి స్వీకృతులు ఉంటాయ నే దానిమీద నా చర్చ. ప్రేమ విషయంలో ఒక అస్పష్టమైన తర్కం మొత్తాన్ని నిర్వహిస్తుంది. కుటుంబం, స్నేహితులు, సమాజరా ప్రపంచరా ఎలా పోతే అలా పోనీ ఆ ఇద్దరు ప్రేమికులు ఒకటి కావాలని నిర్ణయించుకొన్న తర్వాత దేనిని లెక్క చేయరు. ఇక పెద్దలు ఏర్పాటు చేసిన పెళ్లిళ్లలో అనేకమైన సంబంధంలేని విషయాలు చోటుచేసుకుంటాయి. చాలామంది రకరకాల అభిప్రాయాలు వ్యక్తం చేస్తారు. వాళ్లందరిలోనూ కుటుంబ పురోహితుడు (జ్యోతిష్కుడు) చెప్పినదానికే విలువఎక్కువ. అన్నికూడా అవాస్తవమైన వివక్షతను (          ) నిర్ణయాలు తీసుకోవడంలో పోషిస్తాయి. (కాల్ నో ద షాట్స్)

ఇక్కడ కొంచెం సేపు వివాహాలనుండి జ్యోతిష్యం వైపుగా సంబంధంలేని విషయం వైపు నా చర్చ మళ్లిస్తాను.
ప్రశ్న: జ్యోతిష్యమనేది నిజమేనా! దీనికి ఏమన్నా కొంత విజ్ఞానశాస్త్ర ఆధార ముందా?
జవాబు: ఈ రెండు ప్రశ్నలకు జవాబు “అవును'' అని.

ప్రశ్న: మనం పుట్టే సమయంలో ఉన్న నక్షత్రాలు, గ్రహ గతులు నిజంగా మనపై ప్రభావం చూపిస్తాయా?
జవాబు: జ్యోతిశ్శాస్త్ర సంబంధమైన జాతక చక్రమూ జీవన నిర్మాణ ప్రణాళికలోని రహస్య భాగాలను స్వీకరిస్తుంది. జీవితంలో జరుగబోయే శక్తిమంతమయిన సంఘటనలను చూపిస్తుంది. ఆకర్షణీయ శక్తి గల ఆస్తులు, గ్రహగతులూ జీవియొక్క కాల గడియారపు చక్రాన్ని నిర్దేశిస్తూ, తమంతట తామే జీవితంలోకి రాబోయే ఉజ్జ్వలమైన అవకాశాలను సూచిస్తాయి. నీ అంతట నువ్వు నియంత్రించలేని సన్నివేశాలను, సందర్భాలను కూడా ఈ జాతక చక్రములోని గ్రహగతులు చూపుతాయి.

ప్రశ్న: రాబోయే జీవితానికి సంబంధించి- తప్పక జరుగుతుందనే దృష్టితో ఎవరయినా

జ్యోతిష్యం మీద ఆధారపడవచ్చా?
జవాబు: వద్దు. అలా ఆధారడవద్దు. జ్యోతిష్యమనేదానికి కూడా కొన్ని పరిమితులుంటాయి. మిగతా దైవసంబంధమైన, భవిష్యత్తును చెప్పే (భవిష్యవాణి) పద్ధతులవలె- జ్యోతిష్యం కూడా కొన్ని హద్దులు కలది. మొట్టమొదటి ప్రశ్న జ్యోతిష్కుని యొక్క అర్హత, అనుభవం మరియు నిజాయితీలకు సంబంధించినది. ఏ రకమైన భవిష్యవాణి పద్ధతుల్లో కూడా నూటికి నూరు పాళ్లు అమోఘమైన నేర్పుకల పండితుడు ఉండడు. ఇది ఎప్పుడూ దట్టమైన మంచులో డ్రైవింగ్ (నడిపించుట) వంటిది. ముందు కనిపించని బాటపై ఒక్కొక్కరికి ఒక్కొక్క అభిప్రాయం ఉంటుంది. రెండవది- జ్యోతిష్యము లాంటి భవిష్యవాణి పద్ధతి ఒక మార్గ దర్శిని. మార్గం ఎలా చూపిస్తుందో-
అలా శక్తిమంతమైన మార్గాన్ని చూపించగలదు. మన స్వేచ్ఛ, మన అభీష్టాలు మొదలైన మన చరరాశులను అది పరిగణనలోకి తీసుకోదు.

ఇప్పుడు వివాహానికి ఈ జ్యోతిష్యాన్ని జోడిద్దాం. జ్యోతిష్కుడు వధూవరుల యొక్క జాతక చక్రాలను బాగా అధ్యయనం చేస్తాడు. ఇద్దరికి సంబంధించి ఎన్ని లక్షణాలు లేదా గుణాలు సమానంగా ఉన్నాయో లెక్కించి ఇద్దరికి సరిపోయిందో లేదో అనే తన నిర్ణయాన్ని చివరికి ప్రకటిస్తాడు. జ్యోతిష్కుడు బాగా సమర్థుడని, అతను నిజంగానే ఆ ఇద్దరు వధూవరులయొక్క నక్షత్రాల, గ్రహాల శక్తుల గమనాన్ని చూసాడని భావిద్దాం. అంతమాత్రము చేత ఆ ఇద్దరు వ్యక్తులు బాగా కలిసి పోతారని, లేదా ఆ ఇద్దరి బంధుత్వము విపత్తు కోసం సిద్ధమవుతుందని తొందర పడి నిర్ణయానికి రావద్దు.

**ఇద్దరి మధ్య ఉండే బంధుత్వము విజయమైనా వినాశనమైనా దానికి కారణము ఇద్దరు ఒకరితో ఒకరు ఎలా ప్రవర్తిస్తున్నారన్న దాని మీద ఆధారపడి ఉంటుంది. ఏ జాతక చక్రము దీనిని చెప్పలేదు.**

నేను ఇక్కడ చెప్పదలుచుకొన్నది ఏమిటంటే జాతక చక్రాలు వివాహము యొక్క విజయాన్ని కాని, వినాశనాన్ని కాని అడ్డుకోలేనివని. నిజంగా గనుక నక్షత్రాలు భవిష్యవాణి చెబితే విడాకులు ఇప్పించే వకీళ్లు మూటా ముల్లె సర్దుకొని వృత్తికి స్వస్తి చెప్పి ప్రభుత్వం వారి

జీవనభృతి పొందేవారు. కనుక జ్యోతిష్కుడు- ఈ జంటకి పెళ్లయితే బాగా ఉంటుందని కలకాలం కలిసి చక్కగా ఉంటారని
భవిష్యత్తు చెబితే ఆ జంటా ఆ సౌహార్ద్రము ఇద్దరి మధ్య ఉండటానికి కొంచెం కృషిచేయాలి. లేదా ఇద్దరి మధ్య సదవగాహన లేకుండా జ్యోతిష్కులు చెప్పిన అందమైన కలల వివాహము చేసుకొంటే, కొన్ని సంవత్సరాలూ లేదా నెలలోనే విడాకుల న్యాయస్థానంలోకి ప్రవేశించవలసి వస్తుంది. పెళ్లికి ముందు జ్యోతిష్కుడూ ఈ జంట జీవితము చాలా బాగుంటుందని, జాతకాలు బాగా కలిసాయని చెప్పి, చేసిన ఏర్పాటు వివాహాలలో ఎక్కువశాతం కూలి పోయాయి. లేదా వాళ్ల వైవాహిక జీవితంలో దంపతులు తీవ్రమైన బాధ పడుతున్నారు.

చివరిగా ఒక విషయంలో స్పష్టమైన వివరణ. నువ్వు విధిని మోసం చేయలేవు. నువ్వు బాధ పడవలసి ఉంటే, కర్మని కొంత పోగొట్టుకోవాలనుకుంటే పాఠాలు నేర్చుకో. ఇంకో దారి లేదు. కనుక అంజనాలు, జోస్యాలు పక్కన బెట్టి నీ హృదయం అంగీకరించిన వారిని పెళ్లి చేసుకో. ఎందుకంటే నీకు మంచి భాగస్వామి దొరికినా, చెడు యజమాని లభిస్తాడు.

## అతి బరువైన భవిష్యవాణి

భవిష్యవాణికి సంబంధించిన ప్రతిరూపాన్ని తిరస్కరించటం- ఈ వ్యాసం వ్రాయటంలో ప్రధాన ఉద్దేశ్యం కాదు. ఈ విషయం మీద ఒక అంతర్దృష్టి ని ఇచ్చి, ఈ భవిష్యవాణి స్పష్టమైన దృష్టికోణాన్ని పరిచయం చేయటమే ఈ వ్యాసరచన వెనకాల ఉ ద్దేశ్యం. ఇందువల్ల భవిష్యవాణి కి సంబంధించిన ఏరూపంపై ఆధారపడాలో పాఠకుడికి నిర్ణయశక్తి కలుగుతుంది. తన ఆలోచన మరియు నిర్ణయాలు తీసుకొనే విధానాలలో అతడు/ ఆమె- ఎంత వరకు ఈ భవిష్యవాణి కార్యక్రమాలకు విలువ ఇవ్వాలో - ఈ వ్యాసం తెలియజేస్తుంది. ప్రభావం చూపిస్తుంది.

*సాధారణమైన చేరిక :*

జ్యోతిష్కులు, సంఖ్యాశాస్త్రజ్ఞులు, హస్తసాముద్రికులు, చీట్ల పేక ముక్కల తో భవిష్యత్తు చెప్పేవారు. భవిష్యత్తుకు సంబంధించిన అవిషులు (మీడియమ్స్), మనస్సును చదివేవాళ్లు, (ఛానల్స్) మనస్సంబంధమైన జ్యోతిష్యం చెప్పే ఆధ్యాత్మికవేత్తలు- మొదలైన

వారి దగ్గరకు ప్రజలు మందలుగా ఎందుకు వెళతారో తెలుసుకోవటానికి దానికి రకరకాల కారణాలున్నాయి. ఇంకో మాటగా
చెప్పాలంటే వీరి దగ్గరికి వెళితే తమ భవిష్యత్తులోకి తొంగిచూడటానికి వీలుంటుందని ఆశ. అటువంటి భవిష్యవాణి సంస్థల దగ్గరికి వెళ్లటానికి కొన్ని బలవంతాలు ప్రేరేపిస్తుంటాయి. నీ ఆలోచన, నీ నిర్ణయశక్తి, నీ బంధుత్వాలు, వ్యాపారం, లేదా నీ సాధారణ జీవితంపై ఆ భవిష్యవాణులను ఎంత అనుమతి స్తున్నావన్నది. ఇక్కడ ముఖ్యమైన విషయం.

భవిష్యవాణులు రెండు రకాలు. మొదటి రకంలో ఒక ప్రత్యేకమైన ఖచ్చితమైన విధానం లేదా గణిత ఆధారంగా లెక్క తప్పకుండా ఉంటుంది. అయితే భవిష్యవాణికి సంబంధించి వెనుక ఉన్న తర్కము అందరికీ ఆమోదించ బడి ఉండదు. అనుభవాధారం లేదు కాబట్టి విజ్ఞాన శాస్త్రము వాళ్లు కూడా దీనిని ఒప్పుకోరు. అయితే భవిష్య వాణిలో ఉ న్న పద్ధతి కొంత విశ్వసనీయతను, శ్రద్ధను అభయమిస్తున్నప్పటికి అనుభవాధారం (యంపీరికల్ ప్రూఫ్) లేదు కాబట్టి విజ్ఞాన శాస్త్రం దీనిని అంగీకరించదు. నాకు తెలిసినంతవరకు విజ్ఞాన శాస్త్రం, సంఖ్యా శాస్త్రం (అంకెలను బట్టి భవిష్యత్తును చెప్పే శాస్త్రం - అనువాదకుడు) ఈ మొదటి రకం కిందికి వస్తాయి. సాముద్రిక శాస్త్రం (పామిస్ట్రీ) కొంతవరకు ఈ విభాగంలోకి చేరుతుంది. ఇక రెండో రకమైన భవిష్యవాణి పూర్తిగా అశాస్త్రీయమైనది. ఎందుకంటే ఇది చూడగానే తెలుసుకొనే బుద్ధి (ఇంటన్షన్) లేదా సోది చెప్పేవాడి యొక్క అలౌకిక సామర్ధ్యాల మీద  ఉంటుంది. అందువల్ల ఈ రెండో రకమైన భవిష్యవాణి అధికంగా ఆత్మ
శ్రయమైనది. మరియు విశ్వాసం లేనిది. చీట్ల పేక ముక్కలతో భవిష్యత్తు చెప్పే టారో రీడర్స్, ముఖాన్ని చూసి భవిష్యత్తును చెప్పేవాళ్లు, మనస్సును చదివేవాళ్లు (ఛానలర్స్) భవిష్యత్తుకు సంబంధించిన దళారులు (మీడియమ్స్), మనస్సంబంధమైన జోస్యం చెప్పే ఆధ్యాత్మిక వేత్తలు (సైకిక్స్) అలాగే - గాజు గోళంలో భవిష్యత్ దృశ్యాలను చూపిస్తామని చెప్పే వాళ్లు (క్రిస్టల్-బాల్-గాజర్స్) వీళ్లందరూ ఈ రెండో వర్గంలోకి వస్తారు.

నేను ఈ వ్యాసంలో రెండో వర్గం వారి గురించి వ్రాయబోవటం లేదు. కారణం ఏమిటంటే ఈ రెండో పద్ధతి వ్యక్తిని కేంద్రీకరించింది. జ్యోతిష్యం చెప్పుకొనే వ్యక్తికి జ్యోతిష్యం

చెప్పి వ్యక్తి రూపం మీద మరియు నిజాయితీ మీద పూర్తిగా నమ్మకం ఉండాలి. ఈ రెండో పద్ధతికి సంబంధించిన భవిష్య వాణి పూర్తిగా ఊహల ఆట. చీకటిలో తుపాకి గుండ్లు పేల్చినట్లు. ఎక్కడో ఒక చోట తుపాకి గుండు తగులుతుంది. వ్యక్తిగతంగా ఈ రకమైన "చదువుల" పద్ధతిని చాలా తేలికగా, మరియు అధిక వినోదాత్మకంగా స్వీకరిస్తాను. కనుక మీరు - ఇటువంటి రెండో పద్ధతి ద్వారా వచ్చే అవాస్తవ సమాచారం ఆధారంగా- జీవనమూలాలకి సంబంధించిన ముఖ్య నిర్ణయాలు తీసుకొంటే - మీ అర్హత కలిగిన దానిని బట్టి మీరు ఫలితాలు పొందుతారు. గత కొద్ది సంవత్సరంగా ఈ రెండో వర్గం వారు అలవాటుగా, వృత్తిగా అభ్యసిస్తున్న భవిష్యవాణి పద్ధతులను గమనిస్తుంటే నాకు చాలా నవ్వు వస్తోంది. ఈ అభ్యాసము చేస్తున్నవాళ్లు ముందు పూర్తిగా తమని ఆక్రమించిన గజిబిజిలో మునిగి పోతున్నారు. వాళ్ల సొంతజీవితాలు, సంబంధ బాంధవ్యాలు - వ్యక్తిగత విషాదాలకు ప్రదర్శనాయుతమైన పాఠాలవుతున్నాయి. తమ స్వీయార్జన శక్తులతో ఈ రెండో తరగతి భవిష్యవాణి ప్రవక్తలు- తమకు తాము ఎందుకు సహాయం చేసుకోరో - నాకు ఎప్పటికీ ఆశ్చర్యంగా ఉంటుంది.

నిజమైన అర్థం :

ఇక జ్యోతిష్యం, సంఖ్యాశాస్త్ర విషయాలకు వద్దాం. నా ప్రాథమికమైన దృష్టి ఇక్కడే ఉంది. అసలు ఈ భవిష్యవాణులు నిజంగా ఏమి చెబుతున్నాయి? వీటి నుంచి ప్రజలు ఏమి ఆశిస్తున్నారు? ఈ విషయాలపై నాకు ఆసక్తి ఉంది. ఈ రెండు ముఖ్యమైన పద్ధతులు మీ జీవన నిర్మాణ ప్రణాళికలోని (తలరాత) చాలా తక్కువ భాగాన్ని మాత్రమే బహిర్గతం చేస్తాయి. శుభాశుభ సమయాలు, శక్తులు, సంభావ్యాలు- వీటిల్లో కొన్నింటిని మాత్రమే ఇవి తెలియజేస్తాయి. గత్యంతరం లేదు. నేను జీవన నిర్మాణప్రణాళికలో కొంత భాగమని మాత్రమే ఎందుకన్నానంటే- మొత్తం తలరాత చాలా సంక్లిష్టమైనది. ఇంత వరకు విధి నిర్ణయించిన ఆ తల రాతని మొత్తంగా చదివే విధానం కాని, భవిష్యవాణి కాని లేదు.

జ్యోతిష్యం మరియు సంఖ్యాశాస్త్రానికి సంబంధించి సరియైన శ్రేయోదాయకమైన అనుసరణ ఒక్కటే. జ్యోతిష్యం మరియు సంఖ్యాశాస్త్రం చేప్పే విషయాలను **రోడ్ మ్యాప్** గా మాత్రమే స్వీకరించండి. (దీర్ఘమైన, సంక్లిష్టమైన కార్యక్రమానికి సంబంధించి చేసుకొనే ఒక ప్రణాళికను 'రోడ్ మ్యాప్' అంటారు - అనువాదకుడు) కార్ల ర్యాలీ పోటీలలో మార్గ

నిర్దేశకుడు చోదకునికి (డ్రైవర్) ఏ ఏ మలుపుల తీసుకుంటే మంచిదో చెబుతాడు. దూరమయ్యే ప్రయాణ పద్ధతులను విడిచి వేయమని చెప్పి, చాలా తక్కువ మరియు నిర్దేశిత సమయంలో గమ్యాన్ని ఎలా చేరుకోవాలో వివరిస్తాడు. అందువల్ల జ్యోతిష్కుడు లేదా సంఖ్యాశాస్త్రజ్ఞుడు నీ జీవిత "రోడ్ మ్యాప్" ని చదివి సూచనలు చేస్తాడు.

కాని ప్రయాణమంటే "రోడ్ మ్యాప్" కాదు.

"మ్యాప్" కొన్ని పరిమితులకు మాత్రమే లోబడి ఉండుంది. క్షేత్రస్థాయి వాస్తవాలను (గ్రౌండ్ రియాల్టీస్) పరిగణనలోకి తీసుకోదు. ఉదాహరణకి "మ్యాప్" ఒక నదిని మాత్రమే చూపిస్తుంది. కాని అది ఎంత లోతు ఉందో చెప్పదు. కఠినమైన మురికి తోవల గుట్టు చెప్పదు. రాత్రికి రాత్రి తెల్లవారు కురిసిన వానతో ఎన్ని మురికినీళ్ల ఉన్నాయో చెప్పదు. నేను ఇక్కడ చెప్పటానికి ప్రయత్నిస్తున్నది. ఏమిటంటే- గుడ్డిగా, పూర్తిగా - భవిష్యవాణి పై ఆధారపడకండి. రాలీ కారు (ర్యాలీకార్) ని నడుపుతున్నప్పుడు వాస్తవంగా రోడ్డుపైనే చూడాలి కాని, కారుకి అంటించి ఉన్న మ్యాప్‌ని కాదు. కారుకి అంటించిన 'మ్యాప్'ని చూస్తే- ఫలితం? **పెళపెళమనే ధ్వని, వినాశం**

నువ్వు ఈ 'భవిష్యవాణి' ని వాడుకొనే మంచి పద్ధతి ఒకటుంది. నువ్వు నియంత్రించగలవని భావిస్తున్నా, భవిష్యత్ సంఘటనలకు సంబంధించిన సమయాలను జాగ్రత్తగా గమనించు. దానికి సంబంధించిన సూచనలను స్వీకరించు. ఇక్కడ చాలా ముఖ్యమైన సంగతి. ఆ సంఘటనలు నీకు మాత్రమే ఎందుకు సంభవిస్తున్నాయి? నీకు మాత్రమే ఎందుకు సంభవించుటలేదు- అనేది అర్థం చేసుకోవటానికి భవిష్య వాణి సూచనలు సహకరిస్తాయి. నువ్వు కోరుకున్న రీతిలో ఆ సంఘటనలు ఎందుకు జరుగుతున్నాయో లేదా ఎందుకు జరుగుటలేదో తెలియటానికి ఆ భవిష్య వాణి సూచనలు తోడ్పడతాయి. ఈ సమాచారం ఆధారంగా నీ జీవితంలో నువ్వు నిర్ణయాలు తీసుకోవచ్చు లేదా శాంతంగా, హాయిగా ఉండవచ్చు.

వాదనలు, వైఖరులు :

అన్ని రకాల భవిష్యవాణులు జ్ఞానానికి సంబంధించిన, సహజమైన మరియు నిజాయితీ గల జ్యోతిష్కుని స్వాభావిక పరిమితులకు లోబడి ఉంటాయి. ఒక్క వ్యక్తిలో ఈ మూడు గుణాలు ఉండటం చాలాకష్టం, కాని అసాధ్యం కూడాకాదు. నువ్వు ఒక భవిష్యవాణిని ఆశ్రయించదలుచుకొంటే - ముందుగా చాలా జాగ్రత్తగా ఒక జ్యోతిష్కుని ఎన్నుకో. లేకపోతే నువ్వు ఎన్ని అశుభాల మలుపులు తిరగాలో అన్ని మలుపులు తిరిగి, నీ జీవిత చరమాంకంలో వాలతావు. ఆరు నెలలలోపు లోనే మూడు సార్లు నీ పేరు మార్చుకోమని చెప్పే వాళ్లని, చంద్రుడిని నీకు బహుమతిగా ఇస్తామని చెప్పే - తొందరపాటు సంఖ్యాశాస్త్ర వేత్తలను వదిలివేయి. అలాగే ఒకేచోట అన్ని రకాల భవిష్యవాణులు ఉన్నాయని చెప్పే వాళ్లకి దూరంగా ఉండు. వాళ్లకి ప్రతిదాని గురించి కొంచెం కొంచెం తెలుసు. కాని ఆ విషయాలలోని లోతు తెలియదు. అమ్మకానికి ఆధ్యాత్మికతని పెట్టిన ముని లేదా ప్రవక్త దగ్గరికి చేరుస్తానని చెప్పి మరియు వాళ్ల సందేశాలను వివిధ రకాల గొంతులలో వినిపించే వాళ్లను దూరం పెట్టండి. వీళ్లకి బదులు "వెంట్రిలాక్విస్ట్" వల్ల మీకు మంచిగా వినోదం ఉంటుంది. (వేరొక స్థలము నుండి వచ్చునట్లు, వినబడునట్లుగా మాట్లాడటం నేర్చిన వాడిని వెంట్రిలాక్విస్ట్ - ధ్వని విడంబకుడు- అంటారు. - అనువాదకుడు)

వ్యక్తిగతంగా నేను ఏరకమైన భవిష్యవాణిని ఎప్పుడూ ఆశ్రయించలేదు. ఎందుకంటే తనలో తాను ఆధ్యాత్మికతను వెతుక్కోవాలనే సిద్ధాంతంకంటే గొప్పది లేదని బాగా నమ్మిన వాణ్ణి కాబట్టి. జీవితంలోని ప్రతిక్షణంలో నీకు బలమైన సందేశాలు, సమయ సందర్భాలను బట్టి సూక్ష్మ సంకేతాలు అందుతుంటాయి. వాటిలో ఏ అంశాలను ఎంచుకోవాలి? ఏవి ఎంచుకొంటే జీవన సంక్లిష్టతలు తగ్గుతాయి. అనేది వివేచిస్తే- భవిష్యవాణుల అవసరం జీవితంలో నీకు ఉండదు. నీకు నువ్వే స్వయంగా నీ జీవితపు జ్యోతిష్కుడివి కావాలి. విశాల విశ్వాన్ని అర్థించు. మార్గ దర్శినుల వైపు దృష్టిపెట్టు. నువ్వు అపూర్వంగా ఏనాడు తప్పుతోవలో వెళ్లవు.

## అస్థిర నివాసులు (ద రోలింగ్ స్టోన్స్)

మీరు ఈ వ్యాసం మైక్ జాగర్ లేదా కీత్ రిచార్డ్స్‌కు సంబంధించినదని భావిస్తే, రాక్ అండ్ రోల్ అభిమానులందరిని నిరాశ పరుస్తున్నందుకు క్షమార్పణలు

కోరుకుంటున్నాను. (మైక్ జాగర్ మరియు కీత్ రిచార్డ్స్ ఇద్దరు కూడా ఆంగ్ల పాటగాళ్లు. హెవీబీట్ మరియు తక్కువ మెలోడీ ఉన్న ప్రఖ్యాతమైన డాన్స్‌ని రాక్ అండ్ రోల్ డ్యాన్సు అంటారు.- అనువాదకుడు) నేను ఇప్పుడు రాయబోయే వ్యక్తులు సామూహికంగా ఒకచోటికి చేరినవారు. "ఎ రోలింగ్ స్టోన్ గేదర్స్ నో మాస్" అను సామెతను వాడుకలోకి తెచ్చినవాడికి - ఒక ముఖ్యమైన ఆధ్యాత్మిక సత్యాన్ని అతడు/ఆమె ప్రపంచానికి అందజేస్తున్నట్లు తెలుసో, లేదో అని నాకు సందేహము. (ఎప్పుడూ ఒకలోటు ఉండక సంపదలు, హోదాలు, బాధ్యతలు మొదలైనవి పట్టించుకోని వ్యక్తిని "ఎ రోలింగ్ స్టోన్ గేదర్స్ నో మాస్" అంటారు.- అనువాదకుడు) ఈ పరిశీలనకు సంబంధించిన కొంత భూమికను మీకు అందజేయటానికి ప్రయత్నిస్తాను.

గత పన్నెండేళ్లుగా నేను బోధన, మార్గదర్శనం, సహాయం, స్పష్టత చేకూర్చటం, చొరవ తీసుకోవటం మొదలైనవి చేసి **మార్గము** మీదికి ప్రజలను తీసుకురావటానికి ప్రయత్నిస్తున్నాను. అందువల్ల వారికి సంబంధించిన బాధ, ఒత్తిడి మరియు అజ్ఞానము మొదలైనవి తొలగి వాళ్ల వాళ్ల జీవితాలలో కొంత నిజమైన ఆనందాన్ని అనుభవిస్తున్నాను. అందువల్ల వారికి సంబంధించిన బాధ, ఒత్తిడి మరియు అజ్ఞానము మొదలైనవి తొలగి వాళ్ల వాళ్ల జీవితాలలో కొంత నిజమైన ఆనందాన్ని అనుభవిస్తున్నారు. ఇదంతా న్యాయమైన విజయలబ్ధితోనే చేసాను. ఇలా చేయటం ద్వారా - ఇదివరకెప్పుడూ కలుసుకోని అనేకమంది వ్యక్తులతో సన్నిహిత సంబంధం ఏర్పడింది. ఇది మానవుల ఆధ్యాత్మిక అభిలాషలు ఎలా ఉంటాయనే విషయం మీద, దైవత్వాన్ని వారు అన్వేషించే పద్ధతులమీద అవగాహన ఏర్పరచుకోవటానికి ఒక అపూర్వమైన అవకాశాన్ని ఇచ్చింది.

ఇటువంటి విస్తృతమైన ఆధ్యాత్మిక అన్వేషకులు - వర్గ, జాతి, మతాలకు అతీతంగా ప్రత్యేకంగా స్పష్టమైన సమూహంగా ఉన్నారు. కాని విచారం కలిగించే అంశం ఏమిటంటే- వీళ్లలో ఆధ్యాత్మిక శ్రద్ధలోను, హోదాలోనూ చాలా తక్కువ స్థాయి ఉన్నవారికి (ద బాటమ్ ఆఫ్ ది లాడర్) నేను అస్థిర నివాసులు(ద రోలింగ్ స్టోన్స్) అని పేరు పెట్టాను. ఈ విభాగంలోకి వచ్చే వ్యక్తి సాధారణంగా ఈ క్రింది లక్షణాలు కలిగి ఉంటాడు. తన జీవితంలోను తన చుట్టు పక్కల ఉన్నవ్యక్తులందరూ జ్ఞానాన్ని పొందారని భావించి, తనకు

జ్ఞానోదయం చాలా తొందరగా కావావలని అతి సాహసయత్నం చేస్తుంటాడు.

ఎక్కడెక్కడ ఆధ్యాత్మిక సమావేశాలు, కార్యక్రమాలు జరుగుతుంటాయో వాటన్నింటికి సాధ్యమైనంత తక్కువ సమయంలో హాజరవుతారు. బోధలు వినివిని, వాటిని పీల్చుకొనే (అవగాహన చేసుకొనే) ప్రయత్నంలో పూర్తిగా తన సామర్థ్యాన్ని జ్ఞప్తిలో లేకుండా చేసుకొంటాడు.

ఆధ్యాత్మిక అభ్యాసాలు మళ్లీ మళ్లీ చెప్పబడుతున్నా, సమయాన్ని బాగా హరిస్తున్నా చాలా తేలికగా విసుగును పొందుతాడు. ఎక్కువ కాలం తనను శిష్యునిగా ఉంచుకోడు; తొందరగా బోధ చెప్పేసి పంపించేస్తాననే ప్రమాణాన్ని, అంగీకారాన్ని ఏగురువు చేస్తాడో, ఆ గురువు పట్ల చాలా మర్యాదగా ఉంటాడు. భక్తి ప్రపత్తులు ప్రదర్శిస్తాడు.

ఒక ఆధ్యాత్మిక కార్యక్రమం పూర్తయిన తర్వాత లేదా ఒక కొత్త పద్ధతిని తెలుసుకొన్న తర్వాత, వాళ్లు జ్ఞానోదయం కలిగించా ఆ బోధ పరిపక్వత కావాలంటే కొన్ని నెలలు దీనిని అభ్యాసం చేయాలని చెప్పారనుకోండి. వెంటనే ఈ అస్థిరనివాసి "పైప్ డ్రీమ్" (ఆ చెప్పిన పద్ధతి/ఉపాయము చేసి అనుకొన్నది సాధించటం చాలా కష్టము) అని చెబుతాడు

పై లక్షణాలున్నవ్యక్తిా సమస్యలకు పరిష్కారంగాా తొందరగా లక్ష్యం చేరటానికిా రకరకాలా ఆధ్యాత్మికా కార్యక్రమాలకు వరుసగా హాజరవు తుంటాడు. వీళ్ల (అస్థిరనివాసుల) మాయ చాలా గొప్పది. కొత్త కొత్త మార్గాల నుండి ఏవో కొత్తకొత్త ఉద్వేగాలు పొందాలని తపన. ఇటువంటి పలురకాల ఆధ్యాత్మిక గవేషణా సున్నా ఫలితాలను అందించే ఆటా అనే విషయాన్ని వాళ్లు అర్థం చేసుకోరు. ఆధ్యాత్మిక అభ్యాసాలలో ఆరోగ్య సమస్యలకు సంబంధించిన తీవ్రశక్తి బాధలు లేకపోతే నువ్వు చాలా అదృష్టవంతుడినని భావిస్తావు. అయితే నువ్వు ఎటువంటి ఆధ్యాత్మిక అభివృద్ధిని ప్రదర్శించటానికి సిద్ధంగా లేవని దాని అర్థం. ఆ ప్రయత్నానికి పెట్టిన నీ డబ్బు, నీ సమయం అన్ని కూడా వృధా. కాని అస్థిర నివాసిా అవాంఛనీయమైన నమ్మకాన్ని కలిగంచే ఉపాయాల మోసగాడిని మానవరూపంలోని దేవునిగా/గురువుగా త్రికరణశుద్ధిగా నమ్ముతారు. అతడు తన బ్యాంక్ ఎకౌంట్‌ని పూర్తిగా శుభ్రం చేసినా సరే ఆ గురువుకు సర్వస్వము అర్పిస్తాడు. గతంలో నువ్వు ఇలాంటి

'అస్థిరనివాసి' గా ఉన్నా, లేదా ప్రస్తుతం అలా ఉన్నా ఇప్పటికయినా వాస్తవ పరిస్థితి గ్రహించు. లేకపోతే ఈ జీవితకాలం మొత్తం మీద నీకు ఎటువంటి ఆధ్యాత్మికపు 'నాకు' అంటుకోదు. ఉన్నతమైన ఆధ్యాత్మిక ఉన్నతిని కోరుకునే వారి పట్ల నాకు ఎటువంటి ఫిర్యాదు లేదు. కాకపోతే నేను కోరుకునేది ఒక్కటే నేల మీద ఎప్పుడు వాళ్ల కళ్లు ఉండాలని, కాకపోతే మీ మంచికోసం ఈ క్రింది చెప్పబోయే వాటిని ఒకసారి చూడండి. గుర్తుపెట్టుకోండి.

ఆధ్యాత్మిక అభ్యాసములో వచ్చే అన్ని మార్పులు, భౌతికమైనవి, ఉద్వేగపూరితమైనవి, మానసికమైనవి అన్నికూడా నెమ్మదిగా వస్తాయి. ప్రత్యేకమైన ప్రయత్నంతో నెమ్మదిగా జరుగుతాయి. ఎందుకంటే ఆత్మ - ఇప్పటికి ఎన్నో జన్మలనుంచి- మౌలికాధార గుణాలను కలిగి ఉన్నది. మనము పోవాలను కొంటున్న పాతుకొని పోయిన ఈ వ్యతిరేక వాసనలు పోవటానికి కొన్ని రోజులు లేదా వారాలు పట్టవచ్చు. అందువల్ల తెలివి తక్కువ వ్యక్తి కావద్దు. (డోన్ట్ కిడ్ యువర్ సెల్ఫ్) మార్పు అనేది చాలా సమయము తీసుకొనే పద్ధతి. మీ వ్యక్తిత్వాని కి తగిన ఆధ్యాత్మిక అభ్యాసాన్ని ఎన్నుకోండి. బాగా పరిశీలించండి. దీనికోసం మీలోని అంతర్దృష్టిపై ఆధారపడండి. లేదా విశ్వవ్యాప్తంగా ఉన్న మార్గదర్శినులు చదవండి.

దాదాపుగా అన్నిరకాల ఆధ్యాత్మిక అభ్యాసాలు పునరుక్తి కలిగనవే. ఉద్వేగాలు లేనివి. కనుక నీకు ఉద్రేకం కావాలనుకొంటే దూరదర్శిని (టివి) చూడండి లేదా చలన చిత్రాలకు వెళ్లండి. రెండు మూడు రోజులకొకసారి, కొత్త రకమైన కార్యక్రమంలో మీపేరు నమోదు చేసుకోవద్దు. రోజువారి పద్ధతి మీద- ఏవో అద్భుతమైన ఫలితాలు ఆధ్యాత్మిక అభ్యాసం ద్వారా - వస్తాయని ఎదురు చూడకండి. నువ్వు అద్భుతమైన ఫలితాలు చూడాలనుకొంటే - గాఢతరమైన విస్తృతమైన సమయాన్ని, ప్రదేశాన్ని ఎన్నుకోవాలి. రోజూ పాడిబారి పోవాలి.

నీ వ్యక్తిత్వం ఆమోదించిన ఒక ప్రత్యేకమైన పద్ధతిని - అభ్యాసాన్ని మంచి ఫలితాలకోసం మొదలు పెట్టిన తర్వాత- కొత్త ప్రకటన వచ్చిందని- వెంటనే విడిచి పెట్టేయకండి. నిగనిగ లాడే పేకేజీలు (కట్టు,మూట), వివేకపు అమ్మకాలుఉన్న శకంలో మనం జీవిస్తున్నాం. ఉత్సాహపు అన్వేషకులను పీల్చి పిప్పి చేయటానికి ప్రతిదీ రీసైకిల్ (మళ్లీ ఉపయోగించు) అవుతున్న కాలమిది.

ఏ ఆధ్యాత్మిక మార్గంలో అయినా - సర్వసాధారణంగా సాధికారికత ఉన్న **గురువే** కీలకమైన ఆధారము. ఒక గురువు గారి యొక్క గురుశిష్య సంబంధ వ్యవహారశైలి నీకు బాగా నచ్చి-

వారిని- నీ గురువుగా అంగీకరించిన తర్వాత ఆ గురువు యొక్క శక్తుల మీద విశ్వాసముంచు. నువ్వు ఆమెని/అతనిని కలుసుకొన్న తర్వాత నీలో ఉన్న గుర్తించదగిన అభివృద్ధిని చూస్తావు. వెంటనే **చైతన్య భరితమైన గురువు యొక్క అన్వేషణ ఆపు.** (స్టాప్ గురుహోపింగ్) ఇది ఎలా పని చేయదంటే- ఒక అల్పాహారశాలకి (పబ్) వెళతావు. అక్కడి డి జె (డిస్క్ జాకీ- రికార్డయిన సంగీతాన్ని వివరించి ప్లే జేసే వాడు డి జె- అనువాదకుడు) వినిపించే పాటలు నీకు విసుగు కలిగించి, ఇంకొక అల్పాహార శాలకి, ఇంకో తడవ పానీయాలు (డ్రింక్స్) తాగటానికి వెళ్లినట్లుగా ఉంటుంది. ఒక గురువును నమ్ముకొని ఆయన దగ్గర నేర్చుకొనే అలసట పద్ధతికి ఒక గురువు నుండి ఇంకొక గురువుకు గబ గబా మారుతూ నేర్చుకొనే పద్ధతికి చాలా తేడా ఉంటుంది. ఎప్పటికప్పుడు కొత్త పద్ధతులను అనుసరిస్తూ ధ్రువ పత్రాలను (సర్టిఫికేట్స్) సమీకరించుకొంటూ, బిరుదులు లెక్క పెట్టుకొంటూ, అలౌకికమైన జ్ఞానము మరియు అనుభవాల వాసనతో గెంతవద్దు. జ్ఞానోదయము, దయ, శక్తి- ఇవి - కేవలం- కేవలం (గురూజీ రెండుసార్లు ఈ పదం వాడారు- అనువాదకుడు) ఒక సాధికారత కలిగిన గురువు నుండి మాత్రమే లభిస్తాయి. కాని ఇవి వెంటనే- రాత్రికి రాత్రే పొందలేవు. నీ స్వంత ప్రయత్నాల నేపథ్యంలో - ఓపిక, నిజాయితీ, అంకిత భావము - ఇవన్నీ బహుమతులు నీకు అందజేసే అర్హతలుగా పరీక్షింపబడతాయి. నీ యొక్క గురువును మార్చి మార్చి వెతికే కార్యక్రమాల మార్గంలో ఏనాడు పైన చెప్పినవి నీకు దక్కవని నిర్ధారించుకో. ప్రతి నిజమైన, జ్ఞాన పూర్ణుడైన గురువు- ప్రజలు ధరించిన మాస్కుల (ముసుగుల) వెనకాల ఉన్నదానిని గమనిస్తాడు. వాళ్లకి నిజమైన, నమ్మకమైన, విషాదగీతాల గురించి తెలుసు. నిజమైన సమర్పణ
భావము ఎవరికి ఉందో వారికి తెలుసు. ఎవరికి ఎటువంటి చర్చనీయాంశాల పట్టికలు (ఎజండాస్) ఉన్నాయో వారికి తెలుసు. వారికి విశ్వాసము లేనివారెవరో తెలుసు. వాళ్లకి కపట వేషధారులెవరో తెలుసు.

వ్యాఖ్యలు

ప్రశ్న :

శిష్యుడు **గురువు యొక్క నిజమైన ప్రేమని, దయని ఎలా**

## పొందుతాడు?

గురూజీ జవాబు :

నిజమైన గురువు యొక్క దయని పొందటానికి చాలా రకాలైన మార్గాలు ఉన్నాయి. ఒక స్థిరమైన, అనుసరణీయమైన పద్ధతి అంటూ లేదు. నేను దేనిని ఎలా నిర్వహించానో, ఎలా పొందానో, నేను చెప్పను. నీ గురువు యొక్క హృదయము నుండి స్వతస్సిద్ధంగా ప్రవహించే ప్రేమ ప్రవాహాన్ని పొందటానికి, నువ్వు తీవ్రమైన ప్రయత్నం చేయాలి. నీ అంతట నువ్వే మార్గం కనుగొనాలి. అయినప్పటికి నువ్వు ఈ దయని పొందే అర్హత సంపాదించటానికి ఒక ఉపాయం చెబుతాను. ఒక చిన్న రహస్యం మీకు తెలియజేస్తాను. నేను నా గురువును చూడటానికి వెళ్లినప్పుడల్లా నా వివేకాన్ని, అహాన్ని నా చెప్పులతో పాటుగా, బయట విడిచి పెట్టి లోపలికి వెళతాను. నేను ఆయనకు సంపూర్ణ శరణాగతి పొందిన నా హృదయాన్ని కానుకగా అందజేస్తాను.

**జీవిత కథ**

ఒకరి జీవితంలోని చాలా కష్టభరితమైన సందర్భమొకటి కింద ఇవ్వబడినది. కొద్దో, గొప్పో- చాలామందికి అటువంటి పరిస్థితితో - సందర్భముతో సంబంధముంటుందనే విషయం నాకు తెలుసు. మీరు చదవబోయే జీవిత కథ యొక్క మార్గాన్ని మార్చి, ఒక సరియైన పరిష్కారాన్ని ఇవ్వాలనేదే నా ప్రయత్నం.

ఒకరు వ్రాసారు.

నా జీవిత వ్యవహారంలోని ప్రతి అంశంలోను మీరు ఇస్తున్న మార్గదర్శకత్వానికి ధన్యవాదాలు. ప్రేమ ఆనందం, అవగాహన, భాగస్వామ్యం, పోషణ- ఇలాంటి వేవి లేకుండా ఉన్న దాంపత్య జీవితం ఎలా గడపాలనేది నా సమస్య. ఆలోచనలతో- అనివార్యంగా ఉక్కిరి బిక్కిరవుతున్నాను. పిల్లలు, సమాజం బాధ్యత కలిగిన అంశాలయ్యారు. తరచుగా అప్పుడప్పుడు నేను ఒత్తిడికి గురవుతుంటాను. ఒక్కక్షణం కూడా సంతుష్టి, సంతోషము, పరిష్కారం దొరకటంలేదు. అటువంటి బంధుత్వంతో జీవితం కొనసాగించి తట్టుకొని నిలబడాలంటే ఎటువంటి శక్తి కావాలి? నాకొక కారణం చూపించండి.

నా జవాబు:

పై రకంగా ఉన్న సందర్భాలగురించి అనేక సార్లు నేను మాట్లాడి ఉన్నాను. వందల సార్లు విశదంగా సలహాలిచ్చాను. కాని అవి ఆంతరంగికంగా మాత్రమే. ఇప్పుడు నేను మొదటి సారిగా బహిరంగంగా మధురగతి తప్పిన, కష్టభరితమైన వివాహాలగురించి వ్రాస్తున్నాను. ఇది ప్రపంచం మొత్తానికి అన్వయించదగినదని అర్థం చేసుకోండి. మీరు ఈ స్థితిని ఈ రోజు ఎందుకు ఎదుర్కొంటున్నారో అర్థం చేసుకొంటే తెలుస్తుంది. ఒక్కొక్క వ్యక్తిగత జీవితానికి సంబంధించి ఉన్న పరిణామాలు వేరువేరుగా ఉంటాయి. కనుక వ్యక్తిగత జీవితాల వివరాలు తెలియకుండా ప్రత్యేక పరిష్కారాలు నేను సూచించను. ఒక్కో వ్యక్తిగత జీవితానికి ఉన్న పరిణామాలు పూర్తిగా తెలిస్తేనే ప్రమాణ సూత్రం రూపొందించగలం.

పైన చెప్పిన చదువరి వివరాలు అనుసరించీ కారణం ఏదయినప్పటికీ ఈ క్షణంలో విడిగా ఉండమనో లేదా విడాకులు తీసుకోమనో చెప్పలేను. నేను ఇప్పుడు చేయబోయే ప్రతిపాదనా చాలా కాలంనుంచి అనుసరిస్తున్న మీ సంబంధాన్ని అనుసరించి ఉంటుంది. నేను అనుకొంటానూ నన్ను ప్రశ్నించిన ఆ వ్యక్తి ఇంతవరకు సాధికారికమైన నా కార్యక్రమాలకు లేదా ఆధ్యాత్మిక తరగతులకు హాజరయి ఉండడు అని. ఒకవేళ హాజరయి ఉంటేా అతనికి తప్పకుండా స్పష్టంగాా ఇటువంటి పరిస్థితులలో ఎలా ఉండాలో ఎదుటివారితో ఎలా ప్రవర్తించాలో తెలియజేసే పరిష్కారం లభించి ఉండేది. అయినప్పటికి నా సమాధానం రెండు విభాగాలుగా ఇవ్వదల్చుకొన్నాను. ఒకటీ నీకు ఇలా ఎందుకు సంభవించింది? రెండూ అటువంటి సందర్భాలలో ఎలా ప్రవర్తిస్తే బాగుంటుంది?

ఎందుకో తెలుసుకో :

మన జీవితంలో పెద్ద లేదా చిన్న ప్రతినాయక పాత్రలు (విలన్) పోషించేవారు మనం ఎన్నుకొన్న వారై ఉంటారు. మన అంగీకారంతోనే, పరస్పర సమ్మతితోనే ఆ ప్రత్యేకమైన పాత్రను వారు పోషిస్తుంటారు. బాధాకరమైన సన్నివేశాలలో చాలామటుకు- ఒకరికొకరు చేసుకొన్న అంగీకారాలు, ఒప్పందాల వల్లనే జరుగుతాయి. ఇదంతా మన జీవన నిర్మాణ ప్రణాళిక (తలరాత) విశదీకరణం.ఇది అంతా- విధిరాసినట్లే నూటికి నూరుపాళ్లు జరుగుతుంది. నన్ను నమ్మండి. ప్రతి ఒక్క బంధుత్వము, సంఘటన, బాధ- మీ జీవన నిర్మాణ ప్రణాళికాంశాలు- మీ అంగీకారంతోనే, మీ జీవితంలోకి అలా జరగ

టానికి మీరు అనుమతించటంతోనే - మీ ఉద్దేశ్యాలకు అనుగుణంగానే జరుగుతాయి. అయితే మీరు వేసుకొన్న ఈ ప్రణాళిక అంతా ఇంచుమించు మీ అభౌతిక అస్తిత్వ స్థాయిలో (నాన్ ఫిజికల్ లెవల్ ఆఫ్ ఎగ్జిస్టెన్స్) రూపు దాల్చుతుంది. (ఆస్ట్రల్ చదవండి) మనము ఈ భౌతిక లోకంలోకి జ్ఞానమును కప్పివేసిన అజ్ఞానము యొక్క దట్టమైన ముసుగులు వేసుకొని వస్తాము. ఈ ప్రణాళిక అంతా మనకు తెలియదు. నిజానికి - మన మానవులకు- ప్రేతలోక సంబంధాల గురించిన జ్ఞాపకాల పరామర్శకు అనుమతి లేదు. అందువల్ల- మన జీవితాల మధ్య ఏమి జరిగిందో మనకు గుర్తు ఉండదు.

ఆత్మ స్థాయిలో (స్పిరిట్ లెవల్) మరియు గమనాత్మక శక్తులు (డైనమిక్స్) ఊహించటానికి అలవికాని సంక్లిష్ట పరిస్తితిలో ఎలా ప్రయాణిస్తాయో వీటినేపథ్యంలో జీవితాన్ని మనం ఎలా రచించుకుంటామో- ఈ తికమకగా ఉన్న వివరాలు నేను చెప్పబోవటంలేదు. ఇవి బాధపడే ఆత్మకి కొంచెం పాటి ఓదార్పు. ఎందుకు నీకు నీవుగా గాయాలను, బాధలను ఈ జన్మలో సృష్టించు కొంటావనేది తెలుసుకోవటం ఇప్పుడు ప్రస్తుతానికి సంబంధించిన విషయం. ఎవరైనా జీవితాన్ని ఆనందం, సంపద, వినోదం, అందం మరియు చక్కటి ఆరోగ్యాలతో రచించుకోవాలని అనుకొంటారు గాని, కావాలని ఎవరైనా బాధలను జన్మలో కల్పించుకొంటారని చెప్పటం- ఒక పిచ్చిగా- అనిపిస్తోంది కదూ! అవును. ఇదే మానవునికి మరియు అదృశ్యమయిన ఆత్మకి- ఆత్మల ప్రపంచంలో ఉన్న తేడా.

మన జీవన నిర్మాణ ప్రణాళికలో- మనము స్వయంగా కష్టాలను ఎందుకు ఎన్నుకొంటామో- తెలియజేసే ముఖ్యమైన కారణాలున్నాయి. విశ్వాకారణ సిద్ధాంతం- దీనినే 'కర్మ' అంటుంటారు. దీని ప్రభావం నుంచి ఎంత అవతార పురుషుడయినా, సాధారణ వ్యక్తి అయినా తప్పించుకోలేడు.

ఒక వ్యతిరేక ఋణకర్మ ఉంటే అది తప్పనిసరిగా పేద, బాధ, నష్టం మొదలైన వాటిలో జీవిత కర్మ శేషంతో సంబంధం లేకుండా ప్రతిఫలిస్తుంది. కాని ఇదొక్కటే కారణంకాదు. ఆధ్యాత్మిక అభివృద్ధిలో ఉండే అవరోధాలను తొలగించుకోవటానికి వ్యతిరేక గుణాలు లేదా విశిష్టలక్షణాల ఫలితాలను అనుభవించటానికి జీవాత్మా బాధలనే కొత్త పాఠాలను నేర్చుకొంటుంది. విచారకరం ఏమంటే మానవులమైన మనము ఉదాహరణలకంటే

బాధలతోనే పాఠాలు బాగా నేర్చుకొంటాము. తనని తాను దిద్దుకోవటానికి, తెలుసుకోవటానికి జీవాత్మ భౌతికరూపంలో ఒక ప్రత్యేకమైన అనుభవశాలలో అడుగుపెడుతుంది. జీవనామరణ చక్రం నుండి బయటపడటానికి ముందు ప్రతి మానవ జీవనానుభవాన్ని భద్రపరచటం (రికార్డ్) చేయటం జీవాత్మకు తప్పనిసరి. అందువల్లా ఈ బాధని అనుభవించటానికి ఇది కారణంగా అని ప్రత్యేకంగా విడమరిచి చెప్పలేం కానీ తప్పనిసరిగా పైన పేర్కొన్న కారణాలలో ఏదో ఒకదానికి ఈ జన్మలోని బాధలు చేరతాయి.

ఇప్పుడు కథలో 'మెలిక' వచ్చింది. మనము బాధ పడటానికి మనకు ప్రతినాయకులు (విలన్లు) కావాలి. కనుక- దర్శకుడు- ఈ పాత్రకి - ఇతను బాగా సరిపోతాడని- ఒక నటుడిని తన చిత్రానికి ఎలా ఎన్నుకొంటాడో- మనం కూడా- ఒక జీవాత్మని- మనల్ని గాయపరచి- బాధపెట్టడానికి ముందుగానే నిర్ణయించుకొని ఉంటాం. ఒక దాంపత్య భాగస్వామి (స్పౌస్) కంటే ఆ పాత్రని బాగా పోషించ గలిగిన వారు ఇంకా వేరే ఎవరు ఉంటారు? దయచేసి నన్ను తప్పుగా అర్థం చేసుకోకండి. నేను భార్యా/భర్తలకు, వివాహాలకి వ్యతిరేకిని కాను. బాగా సన్నిహితంగా ఉండే వ్యక్తి మాత్రమే, వీలయినంత ఎక్కువగా మనలను బాధ పెట్టగలడు(దు) అని చెప్పటం మాత్రమే నా ఉద్దేశం. దీనికి తలకిందులుగా ఉండే విషయాలు కూడా నిజమే. భార్య/భర్త అపరిమిత సంతోషాన్ని తన తోటి భాగస్వామికి అందించగలడు(దు) కాకపోతే ఆ పాత్ర

నీజీవితంలో ఎలా నర్తించాలి అనేవిషయం మీద అది ఆధారపడి ఉంటుంది. ఒక్కొక్క సారి ఈ పాత్రలు వ్యతిరేకమవుతాయి. ఎందుకంటే ఒప్పందం చేసుకొన్న సమయంలో - మనము ప్రతినాయక (విలన్) పాత్రను అంగీకరిస్తే- ఆ పాత్రనే ఈ భౌతిక జన్మలో కూడా పోషిస్తాం.

ఈ మొత్తం సృష్టి సమీకరణములో చాలా ఆశ్చర్యకరమైనది ఏమిటో మీకు తెలుసా? ఈ భౌతికలోకంలో చాలా సందర్భాలలో మిమ్మల్ని తీవ్రంగా బాధ పెట్టే అత్యంత దుర్మార్గులయిన ప్రతి నాయకులూ ప్రేత లోకంలో మీకు చాలా దగ్గరయిన, ఆప్తులయిన స్నేహితులు. ఎందుకు ఇలా అవుతుంది....??? ఎందుకంటే నీ క్షేమం కోసం ప్రతినాయక పాత్ర పోషించటానికి సాధారణ ఆత్మలు ఒప్పుకోవు. నాకు తెలుసూ నేను చెబుతున్న ఈ

మాటలు వింతగా ధ్వనిస్తున్నాయనీ కాని నన్ను నమ్మండి. ఇది చాలా నిజాయితీగల సత్యం....

గమనాగమనము : (ద నావిగేషన్)

మన జీవితంలో బాధలను అనుభవించటానికి ఒకకారణం మన ఆధ్యాత్మిక అభివృద్ధి. కాని నువ్వు బాధాకరమైన సన్ని వేశాలను ఎలా ఎదుర్కొంటున్నావన్నది ఇక్కడ చాలా ముఖ్యమైనది. చాలా సందర్భాలలో మనము ఒప్పందంలో లేని విధాయకమైన ఉద్దేశ్యపూర్వక బాధల పట్ల ప్రతి స్పందిస్తారో దానివల్ల కర్మఋణం పెరుగుతుంది. కాని అటువంటి సన్నివేశాలను ఎదుర్కోవటానికి చాలా మెరుగైన, ఆధ్యాత్మిక పరమైన మార్గం కూడా ఉంది.

ఏడవటం కంటె, ఇతరుల విధిని నిందించటంకంటె, నీవు స్వంతంగా చేయగలిగిన కొంతయినా చాలా మంచిదని నేను వ్యక్తిగతంగా నమ్ముతాను.
నీజీవితంలో ఎలా నర్తించాలి అనేవిషయం మీద అది ఆధారపడి ఉంటుంది. ఒక్కొక్క సారి ఈ పాత్రలు వ్యతిరేకమవుతాయి. ఎందుకంటే ఒప్పందం చేసుకొన్నా సమయంలో - మనము ప్రతినాయక (విలన్) పాత్రను అంగీకరిస్తే- ఆ పాత్రనే ఈ భౌతిక జన్మలో కూడా పోషిస్తాం.

ఈ మొత్తం సృష్టి సమీకరణములోనా చాలా ఆశ్చర్యకరమైనది ఏమిటో ఎలాను తెలుసా? ఈ భౌతికలోకంలో చాలా సందర్భాలలో మిమ్మల్ని తీవ్రంగా బాధ పెట్టే అత్యంత దుర్మార్గులయిన ప్రతి నాయకులూ ప్రేత లోకంలో మీకు చాలా దగ్గరయిన, ఆప్తులయిన స్నేహితులు. ఎందుకు ఇలా అవుతుంది....??? ఎందుకంటే నీ క్షేమం కోసం ప్రతినాయక పాత్ర పోషించటానికి సాధారణ ఆత్మలు ఒప్పుకోవు. నాకు తెలుసూ నేను చెబుతున్న ఈ మాటలు వింతగా ధ్వనిస్తున్నాయనీ కాని నన్ను నమ్మండి. ఇది చాలా నిజాయితీగల సత్యం....

గమనాగమనము : (ద నావిగేషన్)

మన జీవితంలో బాధలను అనుభవించటానికి ఒకకారణం మన ఆధ్యాత్మిక అభివృద్ధి. కాని నువ్వు బాధాకరమైన సన్ని వేశాలను ఎలా ఎదుర్కొంటున్నావన్నది. ఇక్కడ చాలా ముఖ్యమైనది. చాలా సందర్భాలలో మనము ఒప్పందంలో లేని విధాయకమైన ఉద్దేశ్యపూర్వక బాధల పట్ల ప్రతి స్పందిస్తారో దానివల్ల కర్మఋణం పెరుగుతుంది. కాని అటువంటి సన్నివేశాలను ఎదుర్కోవటానికి చాలా మెరుగైన, ఆధ్యాత్మిక పరమైన మార్గాలున్నాయి. వాటిల్లో నీ జీవితంలోని ప్రతినాయకుని (విలన్) నుంచి దూరంగా తొలగి పోయే మార్గం కూడా ఉంది.

ఏడవటం కంటె, ఇతరుల విధిని నిందించటంకంటె, నీవు స్వంతంగా

ఇక ప్రత్యేకంగా దురదృష్టకరమైన వివాహాల విషయానికి వద్దాం. నువ్వు నిజంగానే నీ సంబంధాన్ని పునరుద్ధరణ చేసుకోదలుచుకుంటే, నీలో, నీ భాగస్వామిలో మార్పు తీసుకువచ్చే కొన్ని శక్తిమంతమైన ఉపకరణాలను నేను నేర్పుతాను. ఈ ఉపకరణాల ద్వారా సంబంధాల గాయాలు మానుతాయి. ఇందులో కొన్ని ఉపకరణములు శక్తిని ఉపయోగించుకొంటాయి. మరికొన్ని ఆత్మ శక్తిని ఉపయోగించుకొంటాయి. నేను సాధారణంగా చెప్పేదేమిటంటే మార్పు కొరకు బాగా కష్టపడండి. మీ సంబంధాలను రక్షించుకోండి. అయితే గాయం మరీ తీవ్రంగా ఉంటే, లేదా సంబంధము నిందా పూర్వకమయితే- రాజీలకి, సమాధానాలకు బాగా దూరంగా చిన్న విషయాలు వెళ్లిపోతే- అటువంటి సంబంధాలను మూసివేసే క్రమంలో తప్పక ఆలోచించాలి. కొత్త సంబంధాన్ని ప్రారంభించాలి. దీనికి నీకు నువ్వే బాధ్యత వహించాలి.

సమస్యకి సంబంధించి విడాకులు అనేది తార్కికమైన, చట్టబద్ధమైన పరిష్కారము. కాని అది చాలా కష్టభరితమైన అంశము- ముఖ్యంగా చాలా తక్కువగా అభివృద్ధి చెందుతున్న తూర్పు దేశాలలో, ఊరుపేరు రాయని ఆ చదువరి - పిల్లలు, సమాజం- అనే రెండు విషయాలు వివాహానికి బద్ధుడయ్యేటట్లు చేస్తున్నాయని పరిశీలించాడు. ఇక్కడ ఒకరి భయాలను మించిన ప్రశ్న కనబడుతోంది. విడాకుల న్యాయస్థానం ఎప్పుడూ పిల్లలకు సంబంధించి ఆర్థికపరమైన భద్రత కలిగిస్తుంది. అయితే తల్లి/తండ్రి- ఈ ఇద్దరిలో ఒక్కరిదగ్గరే సంతానం పెరగవలసివస్తే? అనేది ప్రశ్న ఇది నాకు కూడా చాలా

గందరగోళమనిపించింది. అయితే- లక్షలకొద్దీ పిల్లలు తల్లి లేదా తండ్రి దగ్గర మాత్రమే పెరుగుతున్నారు. అద్భుతమైన, విజయవంతమైన మానవులుగా రూపొందుతున్నారు. భవదీయులకి (యువర్స్ ట్రూలీ) కూడా. నా మటుకు
నాకు తల్లి మరియు తండ్రి ఇద్దరూ బిడ్డకు కావాలి అనే విధానాన్ని మరీ అతిగా, అనవసరంగా ప్రచారం చేస్తున్నారనిపిస్తోంది. ఒకరినొకరు దూషించుకొనే శత్రుత్వమున్న తల్లి దండ్రుల సంబంధంకంటె- తల్లో లేదా తండ్రో - ఒక్కరి దగ్గరే బిడ్డ ఉత్తమంగా పెరగగలడు.

అది సమాజంలో వదిలి వేయబడింది. ఈ 21వ శతాబ్దంలో విడాకులనేది ఒక సామాజిక కళంకం కాదు. అది ఒకప్పుడు ఉపకరిస్తుంది. ప్రజలు ఇప్పుడు దీనిని గూర్చి మాట్లాడుకొంటున్నారా?

అవును. ఆధారంలేని పుకార్లు - ఒక వార్తా పత్రిక లాంటిది. ఒక్కక్షణం అలా బయటకు వచ్చిన తర్వాత పాతబడిపోతుంది. కనుక ఈ పుకారు కాలం ఒక వారం లేదా నెల. ఆ తర్వాత నువ్వు జీవితంలో కొత్త ఒడంబడిక చేసుకొంటావు.

అయితే ఇక్కడ ముఖ్యమైన విషయరా చాలా బాధాకరమైన కర్మ సంబంధాలనుండి నువ్వు ఎలా వేరుపడతావు? ఆ చిక్కును ఎలా విడదీస్తావనేది. ఇంకా నీ కర్మ శేషముంటే ఎన్ని బంధాలతో నీ అనుబంధాలో వాటిని అనుసరించివచ్చే వాటిని బాధతో కొనసాగనీయి. విడాకులు అనేవి నీ ప్రతి నాయకుని (విలన్) యొక్క ముఖాన్ని మాత్రమే మారుస్తుంది. బాధని పూర్తి చేయదు. అందువల్ల సంబంధాన్ని ఆధ్యాత్మిక నేపథ్యంలో, భౌతికంగా అది అలా ముగిసేటంతవరకు పూర్తి చేయి. నీ విలన్ (ప్రతినాయకుడు) పట్ల నీకు వ్యతిరేక భావాలయిన ద్వేషం, బాధ, నేరారోపణా ఇలాంటివి పూర్తిగా లేకుండా పోతే అలా అని నీకు బాగా అనిపిస్తే నీ కర్మ శేషరా నువ్వు పూర్తి చేసుకొన్నట్టు లెక్క. నేను ఇక్కడ చెప్పటానికి ప్రయత్నిస్తున్న అంశం ఒక్కటే బూరెల మూకుడులోనుంచి నిప్పులోకి గెంతవద్దు.

ఇదంతా నాకు కవిఋషి అయిన కబీరు వ్రాసిన ఒక ద్విపదని గుర్తుకు తెస్తోంది.

తు చలే లాక్ కరే చతురాయిరే
కరమ్ క లేక్ మిటే నారే భాయీ

(అర్థం : నువ్వెంత తెలివితేటలు ఉన్నవాడివైనా, వంచకుడివైనా నీ కర్మఋణాలను చెరిపేవేయటానికి ఇంకో మార్గం లేదు.)

**పూర్తయిన ఒక సంబంధం**

జీవిత కథకు సంబంధించిన పూర్వ కథలో, నేను ఆధ్యాత్మిక పరమైన పూర్తయిన సంబంధాలు గురించి పేర్కొన్నాను. ఈ విభాగములో దానిని ఎలా పూర్తిచేయాలో వివరిస్తాను.

వ్యక్తికి సంబంధించిన జీవ నిర్మాణ ప్రణాళిక (తలరాత) లేదా విధి అనేది ఎటువంటి పరిస్థితుల్లోనూ సాధారణంగా మారదు. నిర్దేశించిన జీవాత్మకు సంబంధించిన వీలయినంత పెరుగుదల అవకాశాన్ని అది స్వీకరించి, తయారు చేయబడుతుంది. అయినప్పటికి వివిధ సన్ని వేశాలు లేదా బాధాకరమైన కర్మల ఫలితాలనుండి బయటకు రావటానికి - ఒకరికి ఉ పయోగపడే ఆధ్యాత్మిక ఉపకరణాలు, విజ్ఞానము, ధైర్యము, స్వేచ్ఛ - మొదలైన అనేక శక్తి దాయినులు- ఈ జీవననిర్మాణ ప్రణాళికలో (తలరాత) పొందుపరచబడిఉన్నాయి. ఇది మన జీవన నిర్మాణ ప్రణాళికలో ఒక భాగము. అది జీవన నిర్మాణ ప్రణాళికలను గురించి రకరకాలుగా మారుతుంటుంది. జీవన పరిణామాలను అనుసరించిన ప్రమాణాలు ఒక జన్మ తర్వాత మరో జన్మకు మారుతుంటాయి.

అర్థమేమిటంటే నువ్వు నీ బాధాకరమైన సన్నివేశాల మార్పుకు ఏమి చేయలేదంటే ౼ నీ కర్మ పూర్తి అయ్యేవరకు నీ జీవితము ఏమీ మారదు. లేదా నీకు ఈ జన్మలో నిర్దేశింపబడ్డ బాధల లోపాలు పూర్తయ్యేవరకు నీ జీవితము ఏమి మారదు. అయితే నీకొక అవకాశం ఉ ంది. జీవితంలో నీకు ఎదురయ్యే సవాళ్లను నీ ప్రతిస్పందన ఎలా ఉంది? ఆ అవకాశాన్ని నువ్వు ఎలా వినియో గించుకొంటున్నావు? నువ్వు నీ కర్మను పూర్తిగా అనుభవించాలనుకొంటున్నావా? లేదా వ్యతిరేకంగా స్పందించాలనుకొంటున్నావా! లేదా ఒకవేళ కొత్తగా కర్మఋ ణాన్ని పొందాలను కొంటున్నావా? వీటిపై నీ అవకాశం ఆధారపడి ఉంటుంది.

ఇప్పుడుకర్మఫలితాన్ని పూర్తి చేయాలనుకొన్నప్పుడు - నువ్వు ఆలోచించు. బాధ యొక్క కాలాన్ని తగ్గించుకోవాలనుకొంటున్నావా? లేదా బాధ యొక్క సాంద్రతని, గాఢతని

తగ్గించాలనుకొంటున్నావా? లేదా రెండు చేయాలనుకొంటున్నావా? అయితే కర్మ ఫలితం పూర్తవటమంటే- దానర్థం - నిన్ను శారీరకంగా, మానసికంగా హింసించే వ్యక్తి- నీ జీవితం నుండి తొలగిపోయినట్లు కాదు. అలా జరగాలి అంటే, ఆయా సమయాల్లో నువ్వు నీ ధైర్యాన్ని, నీ స్వేచ్ఛని ఉపయోగించి- అటువంటి పరిస్థితిని తీసుకురాగలగాలి.

కర్మ సంబంధాలను పూర్తి చేయాలంటే రకరకాల పద్ధతులున్నాయి. సాధనాలున్నాయి. ఉదాహరణకి, క్షమాయుతమైన ప్రార్థన, కర్మ బంధాల విముక్తి కొరకు ఆత్మ సంభాషణ, అభివ్యక్తి (మానిఫెస్టేషన్), తటస్థమైన అంటుకట్టు న్యూట్రల్ ఇమ్ప్లాంట్) మరియు ప్రేమశక్తి, ఇవన్నీ - అద్భుతమైన, ఆశ్చర్యకరమైన ఫలితాలను అందిస్తాయి. ఈ పద్ధతులన్నీ పదేపదే గొప్ప దీక్షతో చేస్తే బాధాకరమైన సంబంధాలకు విజయవంతమైన ప్రత్యామ్నాయాలవుతాయి. ఈ భౌతిక లోకంలో నీ కర్మలను పూర్తి చేయటానికి ప్రేతలోకం నుండి నువ్వు ఎంచుకొన్న "విలన్" (ప్రతినాయకుడు) యొక్క మాటలు, చేతలవల్ల నీకు ఎటువంటి బాధ కలగటం లేదంటే- పైన చెప్పిన సాధనాలు ఫలించాయని నిర్ధారించుకోవచ్చు.

పై సాధనాల ద్వారా నీకు వ్యాప్తి నిరోధక (ఇన్సులేషన్) అనుభూతి కలుగుతుంది. దాని అర్థం ఏమంటే నీకు కర్మబంధం ఆధ్యాత్మిక నేపథ్యంలో విస్తృతమవుతోంది అని. అంతే కాని దానిద్వారా బాధపడమనికాదు. నీ కర్మ ఈ భౌతికలోకంలో మొత్తం పూర్తయింది అన్నదానికి పరీక్ష ఏమంటే ఇంతకు ముందు చెప్పినట్లుగా - ఎవరైనా నిన్ను శారీరకంగా - మానసికంగా హింసిస్తున్నా నువ్వు తటస్థంగా ప్రతి స్పందించకుండా ఉంటావు. వాళ్ల తిట్లకు, హింసకు

సానుకూలంగా స్పందించాలని కూడా అనిపించదు. నిన్ను తిడుతున్న, హింసిస్తున్న వారిపట్ల చాలాకాలము నుంచి ఉన్న ద్వేషం, కోపం, భయం, మానసిక గాయం- అవే వ్యతిరేక భావనలు ఇంకా నీలో తొలగి పోలేదంటే- నీ కర్మ బంధాలు ఇంకా పూర్తికాలేదని సూచన.

## 'ప్రతినాయకుని' పాత్ర (రోల్ ఆఫ్ ద 'విలన్')

ఒకరు అడిగారు :

ఈ వ్యాసంలో మనలిని బాధపెట్టి, గాయపరిచే ప్రతినాయకులు ప్రేత

లోకంలో(ఆస్ట్రల్ ప్లాన్) మన స్నేహితులని పదేపదే చెప్పారు. వాళ్లు మనకు కీడు కలిగించటానికి అంగీకరించారని, అందువల్ల నేర్చుకొన్న పాఠం తిరిగి నేర్చుకోవటానికి వీలవుతుందని అన్నారు.

ఇక్కడ నా మనస్సులో ఒక గొప్ప ప్రశ్నార్థకం మొలకెత్తింది. ప్రేతలోకంలో, మనతో అంగీకారం చేసుకొని, ప్రతినాయక పాత్రని ఈ భౌతికలోకంలో పోషించటానికి సిద్ధపడి, మనలిని తీవ్రంగా గాయపరచి, హింసించి, కర్మ విముక్తి కొరకు - కేవలం దానికొరకు మనకి కొన్ని పాఠాలు నేర్పుతుంటారుకదా! ఇలా మనలిని బాధ పెట్టడం వల్ల- ఆ ప్రతినాయకులు వారి సొంత కర్మలను పాడు చేసుకొంటున్నారు కదా!

ఇంకా నేను వివరంగా చెప్పవలసివస్తే నాకు చాలా ప్రియమైన స్నేహితుడున్నాడనుకొందాం. అతడు కొన్ని పాఠాలు నాకు చెప్పటానికి అంగీకరించి, ప్రతి నాయక పాత్రని నా జీవితంలో పోషించాడనుకుందాం. అందువల్ల అతడు తన సొంత కర్మలను పాడుచేసుకొన్నట్లే కదా! ఇంకా కొత్తగా, తాజాగా కర్మలను ఈ లోకంలో పొందుతాడు కదా! అందువల్ల అతడి స్థాయిలు కాని, కదలికలుగాని ఇంకా అధమస్థితికి వెళతాయి కదా....? (అంటే ప్రతి నాయిక పాత్రని పోషిస్తే అనవసరంగా దుష్కర్మ ఫలితా లను అతడు కోరి తెచ్చుకొన్నట్లు అవుతుందని భావన - అనువాదకుడు)

నా జవాబు

ఇది చాలా తగినటువంటి, సంబంధం ఉన్నటువంటి ప్రశ్న, చాలా మంది పాఠకులకి కూడా ఇటువంటి ప్రశ్నే తలెత్తి ఉంటుంది. ఆత్మలు "ప్రతినాయక" పాత్రలను అంగీకరించి, బాధ పెట్టడానికి ఒప్పుకొంటే, మళ్లీ వాళ్ళకు తాజాగా కొత్త 'కర్మలు' చేరతాయి కదా? దీనికి జవాబు వెంటనే మొఖం మీద చెప్పేసేటంత సులభమైనది కాదు. అలా అది అర్థం చేసుకోలేనంత కష్టమైనది కాదు.

జీవన నిర్మాణ ప్రణాళిక (తలరాత) లో సంబంధించిన మరియు అంగీకరించిన బాధ లేదా గాయాలు - ఆవ్యక్తిని మళ్లీ కొత్త బాధలను / గాయాలను విధించవు. కొత్త

కర్మలను జతపరచవు. ఇది పాతదానికి సంబంధించిన వ్యతిరేక కర్మల సంపూర్తి. ఒకవేళ బాధకు కారణమైన ప్రతి మాట లేదా చేతా - కర్మఋణాలను పెంచుకొంటూ పోతే- ఇక వ్యతిరేక కర్మల అనుభవము పూర్తి అవటమంటూ ఉండదు. ఈ కర్మల ఖాతాలను పూర్తిగా పరిష్కరించటానికి ఒక సాధనమో, పద్ధతో ఉండాలి. అందువల్లనే ప్రతినాయకుడు (విలన్) జీవన నిర్మాణ ప్రణాళికను (తలరాత) అనుసరించి పాత్ర నిర్వహించటానికి ఒప్పుకొన్న తర్వాత, ఇక కొత్తగా వ్యతిరేక కర్మలు పోగవటమంటూ ఉండదు. ఈ పాత్ర ఇద్దరి చేత ఉద్దేశ్యపూర్వకం మరియు అనుద్దేశ్య పూర్వక గాయాలవల్ల నిర్వహించబడుతుంది.

అయితే ఇక్కడ కీలకమైన పదాలు ఏమంటే- జీవన నిర్మాణ ప్రణాళిక (తలరాత) ను అనుసరించి పాత్ర నిర్వహణకు అంగీకారం ఉంటుంది. ఇక్కడ సమస్య ఏమిటంటే తలరాతని అనుసరించి, ఒప్పుకొన్న పాత్ర పరిధులను
ప్రతినాయకుడు (విలన్) కాని, బాధితుడుకాని తగ్గించుకోవటం. అది ఇష్టపూర్వకంగా వ్యక్తి పట్ల- సహజమైన మానవ ప్రవృత్తితో ప్రవర్తించటము మరియు వ్యతిరేకంగా ప్రవర్తించటము. అందువల్ల నువ్వు బాధపడిన సమయం లో - నువ్వు- మానవులందరూ స్పందించే సహజమయిన పద్ధతిలో ఎదురు తిరుగుతావు. ఇది నువ్వు కొత్తగా పొందుతున్న కర్మఋణము ఇది ఒప్పందానికి (కాన్‌టాక్ట్) సంబంధించింది కాదు. ఇదే రకంగా ప్రతినాయకుడు (విలన్) - నీతలరాత గూర్చి ఏమీ తెలియని వాడు - నీ చర్యలకు స్పందిస్తాడు. నీ బాధలకు కారణమవుతాడు. ఈ సందర్భంలో ప్రతినాయకుడు కూడా కొత్తగా కర్మని పొందుతాడు. ఇది కూడా అతని 'ఒప్పందం' లో లేనిదే. ఈ రకంగా- పరిపూర్ణమయిన అజ్ఞానంతో - మనము వ్యతిరేక కర్మలకు సంబంధించిన పర్వతాన్ని కుప్ప చేస్తాము. ఇక్కడ మనము బాధితులమా లేదా ప్రతినాయకులమా అనే దానితో సంబంధం లేదు.

ఇప్పుడు మళ్లీ ఇంకో స్పష్టమైన ప్రశ్న పుడుతుంది. కర్మ పెరిగి పోకుండా ఉండటానికి- బాధితులమైన మనము, మీద తొక్కించుకొంటూ ఉండే తలుపు దగ్గర ఉండే తుడుచుకొనే పట్టాలా మీద తొక్కించుకొంటూ ఏమి చేయకుండా ఉండాలా!

దీనికి జవాబు "కాదు" ఆధ్యాత్మికమైనా, భౌతికమైనా ఏమయినా- గాయాల నుంచి-

బాధలనుంచి- నిన్ను నువ్వు కాపాడు కొనే హక్కు ఉంటుంది. అయితే హక్కు ఉన్నది కదా అని అదొక అనుమతి పత్రంలా తీసుకొని ఇతర మానవులను ఉద్దేశ్యపూర్వకంగా, ఉపయోగకరంగా భావించి బాధ పెట్ట కూడదు.

నిన్ను నువ్వు రక్షించుకోవటానికి, దాడి చేయటానికి మధ్య ఒక సున్నితమైన రేఖని నువ్వే సృష్టించుకోవాలి. మొదటిది నిన్ను కర్మనుంచి విముక్తి కలిగిస్తుంది. రెండవది కర్మను పెంచుతుంది.

ఈ మొత్తం సిద్ధాంతం "ప్రతినాయకుని" (విలన్) యొక్క సందేహాస్పదమైన పాత్రని వివరిస్తుంది. నీ కర్మని పూర్తి చేయటానికి, నీకు సాయం చేయటానికి, ప్రేతలోకం నుండి ఆ ఆత్మ ఈ భూలోకానికి వస్తుంది. సృష్టి శాసనాన్ని తెలియని అజ్ఞానంతో, మళ్లీ మళ్లీ వ్యతిరేక కర్మల ప్రతి చర్యలతో, తాజా కర్మల ఋణాల బరువును అనుభవించటానికి సిద్ధమవుతుంది. ప్రేత ప్రపంచంలో (ఆస్ట్రల్ వరల్డ్) లో ప్రతినాయక పాత్రని పోషించటానికి చాలా దగ్గరయిన, ప్రేమాస్పదుడయిన స్నేహితుడు ఎందుకు కావాలో- ఈ వ్యాసం- బహుశా- మీకు వివరించిందని భావిస్తాను .

### వ్యాఖ్యలు :

ప్రశ్న :

ఒప్పందాన్ని అనుసరించి- మనలను శారీరకంగా, మానసికంగా హింసించే వ్యక్తి- తన పరిధిని దాటాడని- మనకు ఎలా తెలుస్తుంది? నిప్పుల మార్గం నుండి (లైన్ ఆఫ్ ఫైర్) దూరంగా ఉండటానికి ఏమయినా సలహాలు ఉన్నాయా? నేను అన్ని రకాల సాధనాలను వాడాను. నేను "వాటిని తిరిగి అందజేయాలని'' అనుకోలేదు. ఎటువంటి ఉద్వేగాలు లేవు. మంచి లేదు చెడు లేదు. కేవలం నా ప్రతి నాయకుని పట్ల పశ్చాత్తాపము (సారీ) మాత్రమే ఉంది. నేను ఇప్పుడు వీటినుంచి బయటికి రావాలనుకొంటున్నాను. ఏమి చేయాలి. దయచేసి సాయం చేయండి.

గురూజీ జవాబు :

ప్రతినాయకుడు (విలన్) తను ఒప్పుకొన్న పాత్ర పరిధిని మించి వ్యవహరిస్తే "ఆపు'' (కట్) అని చెప్పటానికి - నిజ జీవితంలోని ప్రతినాయకులకు సంబంధించి దర్శకులు ఉ

ండరు. ఇది సమస్య. నువ్వు ఏది చేయాలనిపించ నప్పుడు, నిన్ను హింసిస్తున్నవానిపట్ల ఎటువంటి బలమైన అనుభూతులు నీకు
రానప్పుడు, అప్పుడు ఆ పాత్ర దాదాపుగా పూర్తయినట్లే ఇక్కడ నువ్వు నీ స్వాతంత్ర్యాన్ని అవసరమైతే రక్షించుకోవటానికి నీ స్వేచ్ఛని, సంకల్పశక్తిని మరియూ అటువంటి ఉ పకరణాలను వాడుకో. అయితే రోజు చివర నువ్వెలా భయం లేకుండా ఉంటావనేది దాని మీద ఆధార పడి ఉంటుంది. **నీ భయాలే నిన్ను ఖైదు నుంచి సంరక్షిస్తాయి. నీ బాధలను విస్తరిస్తాయి.** నీ ఆత్మకి ఈ జన్మలో అది పెద్ద పరీక్ష. కలహాశీలత్వం లేకుండా స్థిరంగా ఉండు. కాని **నీ బాధ పూర్తి కావాలంటే నువ్వు కొంత చర్య తీసుకోవాలి.**

ప్రశ్న :

నాకొక ప్రశ్న గురూజీ! చాలా సార్లు మేము ప్రజలను లేదా అపరిచిత వ్యక్తులను కలుసుకొన్నప్పుడు- వాళ్లు మాకు తెలియకపోయినా ఇదివరకెప్పుడో వాళ్లతో పరిచయం ఉ న్నట్లుగా అనిపిస్తుంది. లోపలి నుంచి ఏదో పిలుస్తున్నట్లని పిస్తుంది.

ఉదాహరణకి- ఈ జీవత్మలను (మానవులను) కలుసుకొన్నప్పుడు ఒక్కొక్కసారి చిరాకు, కోపం వస్తుంది. కొన్ని సార్లు ఆకర్షణ లేదా పరాభవభావం అనిపిస్తుంది. ఇంకొన్ని సార్లు ఒక రక్షణాత్మకమైన అనుభూతి లేదా గుండెలనిండా సంతృప్తి అనిపిస్తుంది. ఈ అనుభూతులు ఒక్కొక్కసారి నన్ను సందేహాలతో లోబరుచుకొన్నట్లు, కొన్నిసార్లు ఏదో బలమిస్తున్నట్లు అనిపిస్తుంది.

మేము అనుభవిస్తున్న ఈ అనుభూతులకు పూర్వజన్మలతో సంబంధముందా? చాలాకాలం నుంచి వీటి గురించి నాకు చాలా ఆశ్చర్యంగా ఉంటోంది. ఈ విషయం మీద దయచేసి మాకు సూచనలు ఇవ్వండి.

గురూజీ జవాబు :

కొత్త వాళ్ళని కలుసుకొనేటప్పుడు బలమైన లేదా సూక్ష్మమైన అనుభూతులు రావటానికి రెండు రకాల కారణాలున్నాయి. అది పూర్వ జన్మ సంబంధం కావచ్చు. ఒకటి లేదా రెండు జీవాత్మలు తమ సూక్ష్మ శరీరాల స్థాయిలో ఈ విషయాన్ని గుర్తిస్తాయి. దాదాపుగా ఎటువంటి స్పష్టమైన కారణం లేకుండానే బలమైన భావోద్వేగాలు కలుగుతాయి. లేదా - ఆసమయంలో అది ప్రకంపన సామరస్యం (వైబ్రేషనల్ హార్మని) కావచ్చు లేక ఒకరిని చూచిన వెంటనే బాగా తెలుసుననిపించినా ఉపరితలాలు తెలియకపోవటం వల్ల ఆకర్షణ, చిరాకు-ఇలాంటి వాటికి కారణాలు తెలియవు.

గతజన్మజ్ఞాపకాలు ఈ జన్మలో బాధించకుండా చక్కగా మూత పెట్టబడతాయి. కాని బాగా బలమైన లేదా గాఢమైన సంబంధాలు ఆ ఆత్మతో - నీ ఆత్మకు ఉన్న నేపధ్యాన్ని ఒక్కొక్కసారి గుర్తింపజేసి బలమైన భావోద్వేగాలు రేపుతాయి.

ప్రశ్న :

గత కొన్ని నెలలుగా నా కార్యాలయ (ఆఫీస్) వాతావరణం బాగా వ్యతిరేకంగా తయారయింది. కొంతమంది కొత్తగా ఉద్యోగంలో చేరినవారు - రాజకీయ కార్యకలాపాల్లో మునిగిపోయి ఆధిపత్యాన్ని, శక్తిని ప్రదర్శిస్తున్నారు.

ఈ కొత్త వాళ్లలో ఒకడు మధ్య నన్ను అనవసరంగా ఒక రాజకీయంలోకి ఈడ్చాడు.

ఇది నన్ను బాగా కలవరపెట్టి, ఆ కొత్త సహచరునితో వ్యతిరేక భావనలు పెరిగాయి. కాని మీరు చెప్పిన ఉపకరణాలు, జ్ఞానం- నన్ను బాధనుండి పరిష్కారం వైపుకి మళ్లించాయి. అందుకు మీకు ధన్యవాదములు. నేను నా
బలమైన ప్రేమ శక్తిని ఆ వ్యక్తికి మరియు వాతావరణానికి పంపించసాగాను. నేను ఆవ్యతిరేక సన్నివేశాన్ని ఒక సాక్షిగా, ఆ వ్యతిరేక వ్యక్తులను ఆత్మలు గా చూడటం మొదలుపెట్టాను. వ్యక్తులుగా చూడలేదు. ఇది సన్నివేశంలో ఒక గొప్ప నాటకీయమైన మార్పును తీసుకువచ్చింది. మరుసటి రోజు అదే వ్యక్తి నా దగ్గరకు వచ్చి, తన దుష్ట ప్రవర్తనకి నాకు క్షమార్పణలు చెప్పాడు. ఆపకుండా మీరు చెప్పిన ఉపకరణాలతో అభ్యాసాన్ని నిరంతరంగా కొనసాగించటం

వల్ల ఒక ఆరోగ్యకరమైన వాతావరణం మీ కార్యాలయంలో తిరిగి పునరుద్ధరించ బడింది. ఈ విధంగా ఈ ఉపకరణాలు కేవలం వ్యతిరేక దిశ నుండి నన్ను రక్షించటమే కాదు- నా చుట్టూ ఉన్నవారికి కూడా ఒక సానుకూల వాతావరణాన్ని ఏర్పరిచింది. మీకు అనేక ధన్యవాదములు.

గురూజీ జవాబు :

ఒక ఊరు, పేరు లేని అనామక వ్యక్తి (అనోనిమస్) ప్రేమ శక్తి ఉపయోగం గురించి వ్రాసిన టపా (పోస్ట్)కు సంబంధించినదిది. నేను గత కొన్ని సంవత్సరాలుగా ఏది చెబుతున్నానో - దానిని మీరు- చాలా ప్రభావవంతంగా ఆచరణలో పెట్టారు. ఉపకరణాల గురించి తెలియటం కన్నా - ఆ గాఢత కల్గిన ఉపకరణాలను వాడుకలోకి తెచ్చుకోవటం చాలా ప్రధానం. బాధలు కలిగిస్తున్న మీ చుట్టు ఉన్న ప్రజలపట్ల ప్రేమశక్తిని ప్రదర్శించటం- ఎంత కష్టమో నేను అంచనా వేయగలను. కాని ఒకసారి మీరు గాఢమైన పరిణిత స్థితికి చేరారా- ఇంక చెప్పక్కర్లేదు.- అంచనాలు చాలా ఆకట్టుకొనేటట్లు ఉంటాయి బాధ నుండి పరిష్కారం వైపుగా వెళ్లాలనుకొనే ప్రజలకు- ఈ సందేశం అందాలని నేను ప్రయత్నిస్తున్నాను. నేను చెప్పిన రకరకాల పద్ధతులు చాలా శక్తిమంతమైనవి. మరియు విశ్వవ్యాప్తమైనవి. అభ్యాసంలో తీవ్రతను పెంచుతున్నా- నువ్వు ఉపయోగించే ఉపకరణాలతో ఫలితాలు రాకుంటే - ఉపకరణాలను మార్చకు. వ్యవస్థను నిందించకు. దారుణమనకు. ఏడుస్తూ కూర్చోకు. ఏమి చేయకుండా ఉండకు.

నా రిట్రీట్‌లలో మాకు మరియు వాటికి సదస్సులు, సమావేశాలలో, చర్చలలో తప్పకుండా నమ్మకంగా వచ్చే అంశం ఒకటుంది. అదీ మానవ జాతితో జంతువుల ఆధ్యాత్మిక సంబంధము మరియు జంతువుల పరిణామము. ఇంకొక ప్రశ్న కూడా తరుచుగ అడుగుతుంటారు. మనము రాబోయే జన్మల్లో జంతువులు గా పుడతామా? పుడితే ఎటువంటి పరిస్థితుల్లో? ఇది చాలా ఆసక్తిదాయకమైన అంశము, చాలామంది జంతుప్రేమికులూ నేను దీన్ని గూర్చి ఎప్పుడు వ్రాస్తానా అని ఎదురు చూస్తున్నారు. ఇక్కడొక విషయం. మిగతా అంశాల్లా ఇది ఇంకో పుస్తకం నుంచి కొంత సమాచారం సేకరించి చెప్పే విషయం కాదు. ఒకసారి నాకు కూడా ఈ జంతువుల పరిణామాన్ని తెలుసుకోవాలనే ఆసక్తి కలిగింది. ఈ విభాగములో నేను చెప్పబోయే విషయజ్ఞానమూ నాకూ "ప్రత్యక్ష ప్రసారం" వల్ల చాలా సంవత్సరాల క్రితం లభించింది.

ఈ భూగ్రహం మీద ఉన్న ప్రతిజీవి కూడా ఆధ్యాత్మిక పరిణామం పొందుతుందని తెలుసుకోవటం చాలా ముఖ్యమైన విషయం. కాకపోతే- పరిణామ నిబంధనలు ఒక జీవినుండి ఇంకొక జీవికి - అలాగే ప్రత్యేకంగా - మానవులలో ఒకరి నుండి ఇంకొకరికి చాలా విభిన్నంగా ఉంటాయి. సులభంగా అర్థం కావటానికి ఎగిరేవి, కాళ్లతో పాకుతూ పోయేవి, ఈదేవి, జారుతూ అడ్డదిడ్డంగా పోయేవి, నాలుగుకాళ్లతో నడిచేవి మొదలయిన జంతువులకు సంబంధించిన వాటన్నింటిని - జంతువులుగానే పరిగణిస్తున్నాను. విడివిడిగా చెప్పటంలేదు.

అయితే జంతు సామ్రాజ్యానికి సంబంధించిన రకరకాల జాతులకు, పునర్జన్మల విషయంలో కొంచెం విభిన్నమైన నిబంధనలు ఉన్నాయి. నేను వాటన్నింటిని చెప్పి విషయాన్ని క్లిష్టతరం చేయదలుచుకోవటంలేదు. ఈ వ్యాసం
జంతుపరిణామానికి సంబంధించిన మానవపరిణామము.

ప్రాథమికంగా ప్రారంభించి, జంతు సామ్రాజ్యాన్ని తయారుచేసే ప్రతి జీవి "ఆత్మ" గా పరిశీలించబడుతుంది. కొన్ని వందల కోట్ల ఆత్మలు- ఆ విధంగా జంతువుల జన్మలు పొందుతాయి. మానవులల్లానే- ఈ జంతువులు కూడా భూమ్మీద ఎత్తే వాటి వాటి జన్మల మధ్యలో పేరు కలిగిన ప్రేత లోకాలలో నివసిస్తుంటాయి. ఇక్కడ ప్రశ్న ఏమిటంటే - ఎలా ఈ జంతువుల ఆత్మలు తమ ఉనికిని రక్షించుకొంటాయి? మరియు ఎందుకు? ఇక్కడ మనం భౌతిక జీవితానికి సంబంధించిన రెండు ముఖ్యమైన అంశాలను ప్రయత్నించి అర్థం చేసుకోవాలి. ఒకటి- సంసారజీవితంలో పుట్టే రూపం, అది తప్పనిసరిగా గర్భధారణలోనే జరగాలి., ప్రేతలోక పరిణామంతో రూపు దిద్దుకోవాలి. రెండవది- అనేక కోటానుకోట్ల ఆత్మలు- ఒక నిర్థిష్ట గ్రహానికి సంబంధించి- భౌతిక రూపాలలో జీవితాన్ని మలచుకొంటాయి. ఇంకా మీకు తేలికగా అర్థం కావటానికి- అన్ని రకాల జీవితాలతో నిండిన ఈ గ్రహాన్ని ఒక ఉమ్మడి వ్యాపారం అనుకోండి. ఒక్కో వ్యాపార భాగస్వామి ఒక్కో గ్రహం లాంటివాడు. ఇంకొక వ్యాపార భాగస్వామి అనేక కోటానుకోట్ల ఆత్మల సమూహ రూపం లాంటివాడు. అతడు గ్రహంలోనే కాపురముంటాడు.

భూమికీ ప్రేత లోకానికి సంబంధించిన పరిణామాలకోణంలో లెక్కలేనన్ని కోటాను కోట్ల ఆత్మలు భూమితో భాగస్వామిగా నివాసముండ టానికీ బాధ్యతను స్వీకరిస్తాయి. జంతువులుగా జన్మనెత్తటానికి తమకు సంబంధించిన వ్యక్తిగత పాత్రలనుండి కొంత శాతాన్ని ఇస్తాయి. భూమి మీద ఎత్తే జంతు జన్మలకు వివిధాంశాల పరిశీలనలో ఒక ప్రత్యేకమైన ఉపయోగం కనబడుతుంది. భూమి మీద జీవితాలను సమకూర్చుకొని శక్తి సమతుల్యత ( ఎనర్జీ బ్యాలన్స్) ఇస్తాయి. పునరుత్పత్తికి సంబంధించిన పర్యావరణ సమతుల్య తను ఇస్తాయి. ఆహారపు గొలుసును అందిస్తాయి. భారం కలిగించే మృగాలుగా, పెంపుడు జంతువులు మొదలైన వాటిగా తమ పాత్రను పోషిస్తాయి.

అయినప్పటికి ఇక్కడొక ముఖ్యమైన విషయం ఏమిటంటే జంతువుల జీవన నిర్మాణ ప్రణాళికలో ఆహారం కొరకు ఒకరికి మాంసాహారమయ్యే నియమం ఉంటుంది. **ఒక జంతువు ఆహారపు గొలుసులో ఒక భాగంగా ఒప్పందమయినా, ఆహారం కొరకు వధించబడిన, ఇంకొక జంతువు లేదా మానవుని కొరకు వినియోగించ బడినా, అప్పుడు కర్మ ఋణానికి సంబంధించిన సంభవమేమీ ఉండదు. ~~ఈ~~ భూ గ్రహం మీద మనుగడ కోసం క్లిష్టమైన ఆహారపు గొలుసులో భాగస్వామ్యం కొరకు జంతువుల యొక్క పరిణామ చక్రం ఉంటుంది.**

అయితే నేను ఇంతకు ముందే చెప్పినట్టు ఒక మినహాయింపు ఉంది. ఒకవేళ ఒక జంతువు తన జీవన నిర్మాణ ప్రణాళికలో ఆహారపు గొలుసుగా లేని పక్షంలో, ఆ జంతువుతో నువ్వు స్నేహంగా ఉండి, తర్వాత ఆ జంతువుకు ఆహారం కొరకు కాని, మరే ఇతర ఉ పయోగం కొరకు గాని చంపితే - నువ్వు తప్పకుండా పెద్దదయిన కర్మ ఋణానికి గురవుతావు. సంక్షిప్తంగా చెప్పాలంటే- ఒక జంతువు నిన్ను బాగా నమ్మింది. ఒక మానవుని దగ్గర రక్షణగా ఉంటుందని మనస్ఫూర్తిగా భావించి ఆ ఆత్మీయతకు సంబంధించిన గుర్తులను ఆ వ్యక్తిపట్ల చూపిస్తుంటుంది. కాని ఆ మానవుడు తన ఆహారం కొరకు తనను నమ్మిన ఆ

జంతువును చంపాడనుకొందాం. ఆ మానవునికి తప్పకుండా వ్యతిరేక కర్మ వచ్చి తీరుతుంది.

## మాంసాహారుల అకర్తృకం (మీట్ ఈటర్స్ ఎనానిమస్)

ఈ విభాగము పూర్వపు వ్యాసమైన "మాకు వారియు వాటికి" అని ఇంతకు పూర్వము చెప్పిన వ్యాసానికి పొడిగింపు. ఆ వ్యాసం మలినాల పెరుగుదలకు ఉపయోగపడే లేదా ఆధ్యాత్మిక జీవితానికి దూరంగా ఉండే వివిధ రకాల మాంసాహారాల గురించిన ఒకసాధారణ దురభిప్రాయాన్ని విశ్లేషించింది. నిజంగా చెప్పాలంటే- కేవలం శాకాహారానికే అంకితమయిన వారు- మాంసాహారం తినేవాళ్లని ఆధ్యాత్మిక మార్గంలో రెండవ తరగతి పౌరులుగా లెక్కిస్తుంటారు. ఇది నాకు వినోదం కలిగిస్తుంటుంది. కాని ఈ రకమైన ఆలోచనా పద్ధతి వంచబడింది. గాలిని ఇంకా శుభ్రపరచవలసిన ఆవశ్యకత ఉంది. ఈ విషయాలను విశ్లేషించ బోయే ముందు ఒకమాట చెప్పదలుచుకొన్నాను. నాకు ప్రజలు తినే మాంసాహారము మీద అనుభవంతో కూడిన సంక్షిప్త సమాచారములేదు. అలాగే నేను శాకాహార పద్ధతికి ఎటువంటి ప్రచారకుడిని కాను. నేను కేవలం మీ ముందు నిజాన్ని ఉంచుతున్నాను. దీన్ని బట్టి జీవితానికి పనికి వచ్చే మంచి మీకు మీరే నిర్ణయించుకోండి. నేను ఇంతకు ముందు వ్యాసంలో జంతువులను చంపి తినే మాంసము గూర్చి, తద్వారా వచ్చే కర్మల చిక్కుల గురించి చెప్పాను. కనుక మళ్లీ ఆ అంశాలను ఇక్కడ ప్రస్తావించను.

ఇప్పుడు నువ్వు ఏ ఆవరణములో కూర్చోవాలో, ఖచ్చితంగా తెలిసిపోయింది. మాంసాహారమును మూడు ముఖ్యమైన అంశాల ద్వారా మనము పరిశీలించాలి. అవి 1. వైద్యపరమైన చిక్కులు 2. మత పరమైన విశ్వాసం 3. ఆధ్యాత్మిక అభ్యాసాలు

వైద్యపరమైన చిక్కులు:

శరీరానికి అవసరమైన కీలకపోషక పదార్థాలకు ఒక మంచిదయిన పెద్దదయిన అవకాశము - మాంసము తినటం- అనే దాంట్లో ఎటువంటి సందేహం లేదు. అయితే అదృష్టవశాత్తు శాకాహారంలోని రకరకాల పదార్థాలలో కూడా కండరాల పోషణకు సంబంధించిన పోషక పదార్థాలను అందజేసే తత్త్వం ఉన్నది. మాంసాహార ప్రభావ

విషయంలో- అందునా ఎర్ర మాంస ప్రభావ విషయంలో రకరకాల అధ్యయనాలు జరిగాయి. పరిశోధనా పత్రాలు వచ్చాయి. అయితే ఇవి ఎంత వరకు నమ్మవచ్చు అనేది వ్యక్తిగతమైన ఊహ. అయితే రకరకాల వ్యాధులు- మాంసాహారంతో - జతపరచబడియున్నాయనేది మాత్రం స్పష్టం. నేను చివరిగా స్పష్టంగా తెలియచేసే దేమిటంటే - మాంసాహారం కనుక తింటే - శరీరంలో విష శాతాల స్థాయి సుదీర్ఘకాలం పెరుగుతుంది. దీనికి ప్రాథమికమైన కారణం- జంతువును చంపబోయే ముందుగా - సహజంగానే తీవ్రమైన చావు భయం- దాని ఒంట్లో పాకుతుంది. చావబోయే ముందు ఇలా భయపడిన సందర్భంలో చాలా ఎక్కువస్థాయిలో విషాలు దాని రక్త ప్రవాహంలో కలుస్తాయి. ఈ విషాలు ఆ మాంసంలో అలా ఉండిపోతాయి. తర్వాత ఆ మాంసం తిన్నవారి శరీరంలోకి చేరతాయి. అయితే ఎంత వరకు అవి ఆ మాంసం తిన్న వ్యక్తి ఆరోగ్యానికి కీడు చేస్తాయనేది చర్చనీయాంశము. కాని వ్యక్తిగతంగా ప్రతికూల ప్రభావాన్ని ఆరోగ్యం మీద - ఆ విషాలు చూపిస్తాయని నాకున్న ఒక చిన్న అనుమానం.

మతపరమైన విశ్వాసం :

ప్రతిమతానికి- జంతువుల మాంసం తినటంపై- తనదయిన సొంత అభి ప్రాయం ఉంది. నేను ఇప్పుడు ప్రతిమతంలో ఆ మతాన్ని పాటించేవారికి అనుమతులు, నిషేధాలు విడివిడిగా చెప్పను. కాని మొత్తం మీద ఉనికి లోకి వచ్చే- ఆ మతాలు చెప్పే అంతర్గత సందేశాన్ని మీకు అందిస్తాను. ఒక గొప్ప
మతాన్ని స్థాపించిన ప్రతి ప్రవక్త కూడా మాంసాలు తినే కుటుంబం నుంచి లేదా సమాజం నుంచి వచ్చాడు. వారు వ్యక్తి గతంగా జంతుమాంసం తిన్నారా లేదా అనేది- మనకు ఎప్పుడో తెలుస్తుందని నేను ఎప్పుడూ అనుకోను. దీనికి కారణము చాలా స్వల్పమైనది. కొన్ని వందల సంవత్సరాల క్రితం, ఆహారానికి- మాంసమనేది- ఒక గొప్ప మూలమైన పదార్థం. వ్యవసాయం కూడా నేటి అవకాశాలతో పోలిస్తే బొత్తిగా ఆదిమ మానవదశలో ఉంది. వ్యావసాయిక ఉత్పత్తులు ప్రాంతీయంగా వినియోగంలో ఉండేవి. వాడకపోతే తొందరగా పాడైపోయేవి. ఆయా వాతావరణ పరిస్థితులను అనుసరించి- కొన్ని కొన్ని రకాల ఆహార పదార్థాలు- ఆ- ప్రాంతాలలోనే దొరికేవి. వేరే చోట్ల దొరికేవికావు. ఈ అధునాతన ప్రపంచంలో ఇది అంతా మారి పోయింది. కఠినమైన పరిస్థితుల్లో కూడా వ్యవసాయ

విజ్ఞాన పద్దతులు అద్భుతమైన దిగుబడి ఫలితాలను ఇస్తున్నాయి. కొన్ని గంటలలోనే ఆహారము రవాణా చేయబడు తోంది. థాయ్‌లాండ్‌లో పొద్దున పండి, కత్తిరించిన కూరగాయలు, - లండన్‌లో రాత్రి విందుకు లభిస్తున్నాయి. నేను ఇప్పుడు చెప్పబోయే అంశం ఏమిటంటే ఆ వందల సంవత్సరాల క్రితం ఉన్న స్వచ్ఛమైన శాకాహారాన్ని ఇప్పుడు కొన సాగించటం అసాధ్యమని. ఇంకా కూడా ఆ మత ప్రవక్తలు వాళ్లకాలంలో ఆధ్యాత్మిక వ్యక్తిత్వాలతో పాటుగా ప్రభావ వంతమైన సాంఘిక మార్పులకు కారణమయ్యారు. అందువల్ల ఆ కాలంలో తక్షణమే లభించే ప్రపంచంలో తామే ప్రాంతంలో ఉంటున్నారో - ఆ ప్రాంతానికి సంబంధించిన ఆహారాన్ని తినమని తమ సహచరులకు వాళ్లు చెప్పి ఉంటారు. ఏ మతం కూడా - కొంచెం కూడా- పూర్వకాల సిద్ధాంతాలను కాలానుగుణంగా ప్రగతిశీలకంగా మారాలని సవాలు చేయలేదు. మత సిద్ధాంతాలను అనుసరించేవాళ్లు- ఏమి ప్రశ్నించకుండా - ఆ మతాచార్యుల ఆజ్ఞలను - గొర్రెల మందలా అనుసరిస్తుంటారు. నువ్వు ఒకమత చట్టాలకి సంబంధించి నమ్మదగిన, విధేయుడవైన పరిశీలకుడవయితే, నీ ఇష్టం వచ్చిన అంశం ఎంచుకోవటానికి నీకు స్వాతంత్ర్యం లేదు.

ఆధ్యాత్మిక అభ్యాసాలు:

బహుశా ఈ విభాగం మాంసాన్ని తినటం మంచిది కాదని చెప్పేవారికి లేదా మాంసాన్ని నిషేధించిన వారికి సంబంధించిన మానవజాతికి సంబంధించి నదయి ఉంటుంది. కాని మతపరమయిన విశ్వాసం లా కాకుండా, ఈ విభాగంలో గుడ్డిగా ఆచరించరు. ఇక్కడ మాంసాన్ని ఎందుకు తినటంలేదో- దానికి సంబంధించిన జ్ఞానము, మరియు ప్రత్యేక కారణాలు ఉంటాయి. శాకాహారం ఆధ్యాత్మిక అభ్యాసాలకు ఎలా చక్కగా సరిపోతుందో తెలియచేసే కారణాలు ఈ విభాగంలోని వారికి తెలుసు. నాకు మొత్తం కారణాలు తెలియవు కాని- కాని నాకు తెలిసిన కొన్ని పెద్ద కారణాలను మీతో పంచుకొంటాను.

ఎ. మాంసం తినేటప్పుడు విషాన్ని కూడా సేవించవలసివస్తుంది. ఆరోగ్యానికి మాంసాహారం హానికలిగిస్తుంది. కీలకమైన అంతర్గత స్రావాలను లేదా గ్రంథులలో ఊరు రసాలను (హార్మోన్స్) మరియు రసాయనిక పదార్థాలను స్రవింపచేసే ఎండోక్రైనల్ వ్యవస్థకు మాంసాహారం అడ్డు తగులుతుంది. ఈ కీలకమైన ఊటలు (సెక్రియేషన్స్) అసాధారణమైన

సామర్థ్యాలను మరియు మనస్సుకు అతీంద్రియ శక్తిని కల్గించటానికి సహాయ పడతాయి.

బి. జంతు మాంసాన్ని తినటం వలన భారీగా శక్తి అవశేషాలు మిగులుతాయి. అయితే ఇవి గాఢమైన ఆధ్యాత్మిక అభ్యాసాలకు సహాయకారులుకావు. ప్రధానంగా అన్నిరకాల కుండలినీ యోగానికి సహాయకారులు కావు. నేను ఇక్కడ మాంసాహారాన్ని తినే వ్యక్తి ఆధ్యాత్మికంగా పురోగమించడని చెప్పటం లేదు. అయితే ఒక స్థాయికి చేరిన తర్వాత- ఆ మాంసాహారపు అలవాటు- ఆధ్యాత్మికంగా నిర్ణయించుకొన్న దానికి విరుద్ధంగా పనిచేస్తుంది.

సి. శాకాహారపు భోజనం అరగడానికంటె, మాంసాహారపు భోజనం చాలా నెమ్మదిగా అరుగుతుంది. ఒక్కొక్కసారి మాంసాహారం అరగటానికి 48 గంటల దాకా పడుతుంది. ఇది శరీరాన్ని నెమ్మదిగా కదిలిస్తుంది. నీరసం కల్గిస్తుంది. రకరకాల ధ్యానాలు అభ్యసించటానికి కష్టమవుతుంది.

డి. నీకు తెలియకపోయినాా నువ్వు తినే జంతువు నీ ఆహారపు గొలుసులో లేదనుకొందాం. ఇంకొకరి పెంపుడు జంతువు అయిందనుకొందాం. అటువంటి జంతు మాంసాన్ని నువ్వు తింటే ఏరకంగా అయినా కొంత కర్మపు చిక్కును నువ్వు భరించవలసి వస్తుంది. చాలా మంది "ముందుకు వెళ్లిన" జీవాత్మలు (మానవులు) ఈ రకంగా కొంచెం కూడా కర్మ శేషాన్ని భరించాలని భావించరు. (ఎందుకంటె మోక్షానికి తాము దగ్గరగా ఉన్నామని భావించబట్టి అనువాదకుడు)

ఇ. జంతుమాంసం తినటం వలన ప్రేత శరీరం (ఆస్ట్రల్ బాడీ) భౌతిక శరీరంపై పట్టును కోల్పోవటం నిరోధిస్తుందని నా ముఖ్యమైన భావన. ఇది కొంత సాంకేతికమైనది. ఆత్మ పరిపూర్ణత రావాలంటే (సెల్ఫ్ రియలైజేషన్) - ప్రేత శరీరం తప్పనిసరిగా చాలినంతగా స్థూల శరీరం నుండి విడిపోవాలి. అప్పుడే దైవిక పరమైన శక్తిని సంపాదించుకొని, ఈ స్థూలశరీరం బలపడుతుంది.(మాంసాహారం తినటం వల్ల ప్రేత శరీరం (ఆస్ట్రల్ బాడీ) స్థూలశరీరం నుండి విడివడదని గురూజీభావన - అనువాదకుడు) ఇప్పుడిప్పుడే ఆత్మ పరిపూర్ణతను సంపాదించుకొంటున్న చాలా మందికి ఈ ఆపద వచ్చేస్తోందని నేను ప్రత్యేకంగా చెప్పబోవటం లేదు.

చివరిగా, నేను చెప్పేది ఏమిటంటే నీ ఆరోగ్యము మీద ఎటువంటి ప్రభావము లేకపోతే, నీ మతపరమయిన స్పందనలను ఉల్లంఘించకుండా
ఉండాలని నువ్వు భావిస్తే - నువ్వు మాంసాహారిగా కావటానికి, ఉండటానికి ఎటువంటి అపరాధ భావన నువ్వు పొందవలసిన అవసరంలేదు. కాని నువ్వు గాఢమైన ఆధ్యాత్మిక అభ్యాసాలను అనుసరిస్తున్నట్లయితే - ఎప్పుడో- ఒక సమయంలో నువ్వే మాంసాహారం మానేయవలసిన అవసరం వచ్చిందని అనుకొంటావ్- లేదా గురువు చే సూచింపబడతావు. అప్పటిదాకా "మాంసాహారుల అవరసం'' అనే ఈ వర్గీకృత వ్యాపార ప్రకటనల పేజీలను (ఎల్లో పేజెస్) నువ్వు పట్టించుకోనవసరం లేదు.

## వ్యాఖ్యలు

ప్రశ్న :

గురూజీ, మాంసాహారాన్ని వండటం వల్ల తినటంవల్ల ఆ ఇంటిలో ఏమన్న ప్రకంపనలు ఉంటాయా? ఒక ఇంట్లో ఆధ్యాత్మిక అభ్యాసాలు చేసేవాడు ఉన్నాడనుకొందాం. అతడు ఎప్పుడూ శాకాహారమే తింటాడు. కాని ఇంట్లో అప్పుడప్పుడే మాంసాహారం వండుతున్నారు. ఇది అతని ఆధ్యాత్మిక అభివృద్ధికి అవరోధమా?

గురూజీ జవాబు :

నేను జవాబులు ప్రశ్నలను అడిగిన పద్ధతిలోనే వరుసగా చెబుతాను. మాంసాహారం వండటం లేదా తినటం - ఇంటికి సంబంధించి ఎటువంటి కంపనలు (వైబ్రేషన్స్) కలిగించవు. కాని అది- చాలా మంది శాకాహారుల స్పందనలను అస్తవ్యస్తం చేస్తాయి. మీ ఇంట్లో ఒక చిన్నపాటి పూజగది లేదా హోమగుండం ఉన్నదనుకోండి. మీరు మాంసాన్ని వండటానికి/ తినటానికి ఒకరకంగా ఇబ్బంది పడతారు. కాని అది పూర్తిగా వ్యక్తిగతం

శాకాహారం తినేవాళ్ళు ఉన్న ఇంట్లో మాంసాహారం కూడా వండితే
దానివల్ల ఆధ్యాత్మిక పరమైన చిక్కులేమీ ఉండవు. నీ పొట్టలోకి వెళ్లే దాన్నిబట్టి పర్యవసానం ఉంటుంది.

ప్రశ్న :

మీ ప్రేమపూర్వకమైన సూచనలకి ధన్యవదాలు. చాలామటుకు దురభిప్రాయాలు తొలగిపోయాయి. మా ఆధ్యాత్మిక అభివృద్ధికి ఇంకో ఆధారం కూడా చేర్చబడింది. నేను ప్రస్తుతానికి దీనితో సంబంధం లేని- మూసకు భిన్నంగా ఉండే (ఆఫ్ బీట్) ప్రశ్న ఒకటి అడగవచ్చా!? జడమైన, నిర్జీవమైన వాటికి కూడా ఒకవిధమైన జీవితం ఉంటుందా? వాటికి కూడా ప్రకంపనశక్తి (వైబ్రేషనల్ ఎనర్జీ) ఉంటుందా? అవికూడా మన జీవన నిర్మాణ ప్రణాళికలో (తలరాత) లో ముందుగానే ఉపయోగానికి నిర్ణయించబడి ఉంటాయా? ఉదాహరణకి ప్రత్యేకంగా చెప్పాలంటే మన ఇళ్లు, వాహనాలు మొదలైనవి. తోటి జీవులతో పోలిస్తే - అవి మన సహవాసంలో చాలా చిన్నవి. అయినప్పటికి వాటికి కూడా పెరుగుదల / అనుభవంలో పాత్ర ఉంటుందా?

గురూజీ జవాబు :

మీరు చెప్పింది నిజమే. వాటిలో "జీవం" లేకపోయినా, నిర్జీవమైన పదార్థాలు ప్రకంపన శక్తిని వెలువరిస్తాయి. తోటి జీవులను అర్థం చేసుకొనే మార్గంలో దానిని అర్థం చేసుకోవాలి. మీరు నమ్మండి నమ్మకపోండి. మీకు సొంతమయిన లేదా మీరు ఉపయోగించే, మీతో సంబంధముండే ప్రతి నిర్జీవ పదార్థము మీ జీవన నిర్మాణ ప్రణాళిక (తలరాత) లో ముందుగానే రాయబడి ఉంటుంది. జీవన నిర్మాణ ప్రణాళిక ఎంత సంక్లిష్టమో మీరు ఊహించగలరా?

ప్రశ్న :

ఒక త్వరిత ప్రశ్న. గుడ్డు అనేది దేనికి చెందుతుంది? శాకాహారమా? మాంసాహారమా?

గురూజీ జవాబు:

ఒక త్వరిత జవాబు. గుడ్డు అనేది "గోడమీద పిల్లి" లాంటిది. శుచిగా ఉండేవాళ్లకి అది మాంసాహారమూ కానీ నామటుకు నాకు అది శాకాహారము. గుడ్డులో పోషక పదార్థాలు, జీవన నిర్మాణానికి సంబంధించిన పదార్థాలు కిణ్వాలు (ఎంజైమ్స్) ఇవన్నీ కేంద్రీకరించబడి ఉన్నాయి. అయినప్పటికి మతపరమయిన నిబంధనా దాన్ని శక్తిమంతమయిన మాంసాహారంగానే మీకు చూపెడుతుంది. అందువల్ల అది మాంసాహారమే.

అయినప్పటికి మాంసం యొక్క పరిధులతో గుడ్డు ఏరకంగానూ బాధించదు.

## ప్రేమంటే ఏమిటి?

ఒక పాతదయిన భావోద్వేగం... హృదయం పగిలిపోతుందని తెలిసి హృదయం ఎవడికి కావాలి? ఆర్ & బి కళాకారుడు టీనా టర్నర్ బాగా అమ్ముడవుతున్న తన ఆల్బమ్‌లో (పాటల సంపుటి) తనతో ఈ ప్రేమ ఏమి చేయాలని వచ్చింది?'' అని పాడారు (ఆర్ & బి అంటే రిథమ్ ఎండ్ బ్లూస్ - లయ మరియు విషాద గీతాలు - రిథమ్ అండ్ బ్లూస్ చాలా ప్రసిద్ధమైన  ఆఫ్రికన్ - అమెరికన్ పాప్ సంగీతము - అనువాదకుడు)

నన్ను ఆకర్షించటంలో ప్రేమ ఎప్పుడు విఫలం కాలేదు. అలా ఎందుకంటే ప్రేమలో చాలా రంగులు ఉన్నాయి. ఒక్కో రంగులో మళ్లీ రకరకాల రంగులు ఉన్నాయి. ఈ ప్రపంచము చుట్టూ నిర్మాణము చేస్తున్న దానిని చూసి నాకు తరచూ ఆశ్చర్యము కలుగుతుంటుంది. డబ్బు, లైంగిక ఆకర్షణ (సెక్స్) లేదా ప్రేమ - ఇవేవీ నిజానికి ఖచ్చితంగా దేవుడు కాడు. ఇప్పుడు గంభీరంగా ఒక విషయం ప్రస్తావిస్తున్నాను. ఈ ప్రేమ మీద ఇప్పటికే కోటానుకోట్లుగా పాటలు, పద్యాలు, వచనాలు రాసారు. కనుక ఇప్పుడు కొత్తగా ప్రేమ మీద కొత్త సిద్ధాంతము నాదగ్గర లేదు. అందుకే - మీ జీవితాలతో సంబంధం ఉన్న కేవలం కొన్ని పరిశీలనలను మాత్రమే నేను చేస్తున్నాను.

నవ్వు పుట్టించే విషయం ఏమిటంటేా ప్రేమ అనేది పరోక్షంగా ప్రతివ్యక్తికి తనజీవితమంతా ఉద్వేగ పూరితమైన బాధకి మూలకారణమవుతుంది. ఇప్పుడు మనరా బాధలకు మూలకారణమైన ప్రేమ జోలికి నేను వెళ్లనూా అని చెప్పం. ప్రేమవల్ల మనం బాధను పొందుతాం. కాని కొద్దిసేపట్లోనే ఆస్థితినుంచి పక్కకి వెళ్లి పోయి, మళ్లీ మళ్లీ ప్రేమను ప్రేమిస్తూనే ఉంటాం.

అవధులులేని ఆనందం, ప్రేమ యొక్క బాధ - ఈ రెండు కూడా భాగస్వామి లేదా సహచరుల యొక్క సంబంధాలలో నిస్సందేహంగా ఉంటాయి. ఇది చాలా సామాన్యమైన విషయం. ఎందుకంటే సంబంధాలతో కూడు కొన్న ఉద్వేగాలను - అంతర్గత స్రావాలు (హార్మోన్స్) మరియు రసాయనిక పదార్థాలు నడిపిస్తుంటాయి. ఇక్కడ కూడా మన ఆశలు, నిరీక్షణలు (ఎక్స్‌పెక్టేషన్స్) వాటి గరిష్ఠ స్థాయిలో ఉంటాయి.

స్పష్టంగా ప్రేమ రెండు విభాగాలలోకి వస్తుంది. మన భాగస్వామి లేదా సహచరునితో "ప్రేమలో" ఉన్నామని చెబుతాం. ప్రతివారితో, ప్రపంచంలో ఉన్న ప్రతిదానితో విశాల దృక్పథంలో సాధారణంగా మనకు ఉండే ఉద్వేగము కూడా 'ప్రేమ' అని పిలుస్తాం. మీలో చాలామందికి ఇది అనుభవమయ్యే ఉంటుంది. "ప్రేమలో పడటమనేది అద్భుతమైనది, అవసరం కలిగినది, ప్రపంచంలో చాలా ఉన్నతం అనిపించే సుఖభ్రాంతి సంబంధమైనది. (ఎఫోరిక్) సమగ్రమైన, లోపం లేని ఈ ప్రపంచంలో - ఇద్దరు మాత్రమే ఉంటారు. విచారకరమైనది ఏమిటంటే ఈ సుఖభ్రాంతి సంబంధ భావనకు సంబంధించిన ఆయుస్సు కొన్ని గంటలనుంచి తొమ్మిది నెలల వరకు మాత్రమే ఉంటుంది. చాలా అరుదైన సందర్భాల్లో - 36 నెలల వలకు - మనుగడ ఉంటుందని గుర్తించబడింది. కానీ ఎప్పుడూ ఆ సమయం దాటి పోలేదు. నేను, హాస్యమాడు తున్నానని మీరు అనుకొంటున్నారా? విజ్ఞాన శాస్త్రము ఈ పరిశీలనకు సమర్థించింది. మెదడులో పుట్టిన ఒక రసాయనికి పదార్థము వల్ల 'ప్రేమలో పిచ్చి" పడుతుంది. రక్తప్రవాహము మొదట సాధారణంగా సాగిన పిమ్మట, మెదడులో క్రమ క్రమంగా తక్కువ మోతాదులో ఈ రసాయనం విడుదలవు తుంది. తరువాత దానంతట అదే ఆగిపోతుందని శాస్త్రజ్ఞులు కనుగొన్నారు. నువ్వు ఇంకొక మానవ జీవితో ప్రేమలో పడిన తర్వాత, మెదడు ఈ కొంటె తతంగాన్ని మళ్లీ ప్రారంభిస్తుంది.

ఇప్పుడు ఇది నాకు రెండు ముఖ్యమైన ముగింపులను ఇస్తోంది. తాము సుదీర్ఘకాలం ప్రేమ ప్రియులమని చెప్పుకొంటున్నప్పటికి, భాగస్వాములు శాశ్వత ప్రేమ తత్వాన్ని చూపుతున్నప్పటికి - ప్రేమ భాష యొక్క శాశ్వతత్వం 36 నెలలని తెలుసుకోండి. ఇది మొదటిది. ఇక రెండవది, మీకు ఇష్టమున్నా లేక పోయినా ఇది నిజం. మీరు అదే వ్యక్తితో రెండుసార్లు ప్రేమలో పడరు. ఇది ఎవరి పొరబాటు కాదు, మెదడు యొక్క క్లిష్టమైన పరస్పర మనోచర్య (బ్రెయిన్ కెమిస్ట్రీ)

మీరు ఆత్రుత లేదా ఒత్తిడిని ఎదుర్కొంటున్నప్పటికి - మీరు మొదటి ప్రేమ ప్రవాహాన్ని ప్రవహింపచేసిన భాగస్వామితో ప్రేమను ఆపివేయకండి. నేను మీకు హామీ ఇస్తున్నాను. ఎవరిపై ప్రేమ ఉందని 'లోలోపల' మీరు భావిస్తున్నారో ఆ విపరీతమైన ప్రేమను కొనసాగించండి. తేడా ఏమిటంటే- ఒకసారి మెదడులో రసాయనిక చర్య - ఇంకిపోయిన

తర్వాత - స్వయం చాలక విమానం (ఆటో - పైలట్) పై ఉన్న మీ సుఖ భ్రాంతి మీ ముఖ్య సంబంధాలను నిలబెట్టుకోవటానికి స్వయంగా నడుపుకోవలసిన పరిస్థితిలోకి వస్తుంది. ఇందుకే చాలా మంది ప్రజలు సహాయమడుగుతుంటారు. ఎందుకంటే - ఆ ప్రేమ బంధం తెగిపోకుండా ఉండటానికి చాలా శ్రమించాల్సి వస్తుంది కాబట్టి.

## గురువంటే ఒక అంతుపట్టని అంశం

## మొదటి భాగం

గురువనే ఒక పదం చాలా నిందార్హమవుతోంది. దుర్వినియోగం చేయబడుతోంది. తప్పుగా చెప్పబడుతోంది. అవాస్తవంగా నిరూపించ బడుతోంది. గురువు మరియు గురువు చుట్టూ ఉన్న పరిస్థితులు - వీటిపట్ల ఉన్న ఎక్కువ గందరగోళాన్ని తొలగించటమే నా ప్రధాన లక్ష్యం. ఇది కేవలం ఆ ఒక్క పదముపట్ల మాత్రమే కాదు. దాని చుట్టూ వివరణ కోరుతున్న వ్యాఖ్యానాలకు కూడా అన్వయిస్తుంది. గురువుకి సంబంధించిన అనేక విషయాలను విస్తృత పరిధిలో వ్యాఖ్యానించటమే నా ఉద్దేశం. అందుకే ఈ శీర్షికను మూడు భాగాలుగా చేసాను.

అందరికి తెలిసిన, లేదా నిఘంటువుల పరిశీలనను అనుసరిస్తే గురువంటే అరుదైన అనుభవం గల వ్యక్తి అని, లేదా అనుభవ పూర్వకమైన వృత్తి నైపుణ్యత కలవాడని అర్థాలు వస్తాయి. ఈ అనుభవ నైపుణ్యాలు విద్యా రంగంలో కావచ్చు. కళారంగంలో కావచ్చు. కాని నేను ఈ సామాన్య వ్యాఖ్యానాల దగ్గర ఆగి, నా సమయాన్ని వృధా చేయదలుచుకోలేదు. నా ప్రధాన దృష్టి **ఆధ్యాత్మిక గురువు** మీద ఈ పదం మొదటి సారి ఎక్కడ పుట్టిందో తెలుసుకొందాం.

ప్రారంభంలో ఈ పదం సంస్కృత భాషలో కనబడుతుంది. 'గు' అంటే వైపు (టువార్డ్స్) మరియు 'రు' అంటే 'కాంతి' అని అర్థాలు కనబడతాయి. అందువలన ఎవరయితే నిన్ను కాంతివైపుకి తీసుకు వెళతాడో, అతడు గురువని చెప్పబడతాడు.
వేలాది సంవత్సరాలనుంచీ దక్షిణ ఆసియా దేశాలలో మరీ ముఖ్యంగా భారత దేశంలో గురువు అంటే మత సంబంధమైనా ఆధ్యాత్మిక సంబంధమైన హద్దులలో నిర్వచింపబడే

వాడు. ఈ ఇరవయ్యవ శతాబ్దంలో 'గురు' పదం ఆంగ్ల భాషలోకి ప్రవేశించింది. ఇప్పుడు గురువంటే నేర్పరి, అధికారి లేదా నాయకుడు అనే పదాలకు పర్యాయ పదంగా వాడబడుతోంది.

చారిత్రికంగా, ఆధ్యాత్మిక గురువుకి భారతీయ సంస్కృతి మరియు తత్త్వజ్ఞాన పరంగా చక్కటి ప్రాముఖ్యత ఉండేది. దీనర్థం - ఇతర సంస్కృతులు, నాగరికతలలో ఆధ్యాత్మిక గురువులను, బోధకులను గుర్తించలేదని కాదు. ఏదో ఒక పేరుతో పిలిచి, వారు కూడా గౌరవించేవారు కాకపోతే ఆధ్యాత్మిక గురువు నిర్వహించే పాత్రలో మాత్రమే తేడా ఉంది.

భారతదేశంలో యోగశాస్త్రానికి సంబంధించి వివిధ రకాలు ఉన్నాయి. వేదము యొక్క వివిధ పద్ధతులలో ఉన్న తత్త్వం ఆ యోగశాస్త్రంలో నిర్దేశించబడింది. ఆ తత్త్వమే - జ్ఞానోదయ దశకు వెళ్లటానికి వివిధ స్థాయిలను సూచిస్తుంది. వీటన్నింటిని కలిపి మన వాళ్లు ' సనాతన ధర్మము' అన్నారు. ఇక్కడ గురువు యొక్క ప్రత్యేకత స్పష్టంగా తెలియజేయబడింది. ఆ సనాతన ధర్మము వివిధ రకాల ఆధ్యాత్మిక అభ్యాసాలు చేయించే బాధ్యతను గురువు మీద ఉంచింది. ఆ ఒక్కడు అత్యవసరంగా తీర్పరిగా తలచబడ్డాడు.

ఇప్పుడు ఒక ప్రశ్న. జవాబును హక్కుగా భావించి అడుగుతోంది. 'గురువు' అనే బిరుదును ధరించటానికి ఎవరికి నిజమైన హక్కు ఉంది? గురువు వాస్తవంగా చేసేదేమిటి? దీనికి సంబంధించి బ్రహ్మాండమైన గందరగోళం ఉంది. ఈ 21వ శతాబ్దంలోని విషయాలకు ఇది సహాయం చేయదు. ఎందుకంటే ఈ 21వ శతాబ్దంలో పదికి తొమ్మిది మంది గురువులు నకిలీ గురువులు. మోసగాళ్లుగా, పబ్బం గడుపుకొనేవాళ్లుగా, ఒకరిని అనుకరిస్తూ భ్రాంతులలో ముంచే వాళ్లుగా నేటి గురువులు కనబడుతున్నారు.

నిజమైన ఆధ్యాత్మిక గురువు ఎప్పుడూ సాధికారికంగా జ్ఞానకారకునిగా ఉంటాడని తెలుసుకో. ఇంకోమాట చెప్పాలంటే గురువు ఎప్పుడూ ఒక సన్యాసి అయితే ప్రతి సన్యాసి కూడా గురువు కాడు.

సామాన్య ప్రజల జ్ఞానాన్ని పెంచేవాళ్లు, మానవత్వాన్ని దైవత్వం వైపు నడిపించేవాళు ్ల అయిన మునులు, ఋషులు, ప్రవక్తలు మరియు ఇతర జ్ఞాన బోధకులు- వీళ్లందరూ కూడా గురువు లాంటి వాళ్లే. అయితే తేడా ఏమిటంటే - గురువు - వ్యక్తిగతమైన స్థాయిలో తన పాత్రని నిర్వహిస్తాడు. గురువు తనశిష్యుల మధ్య వ్యక్తిగత స్థాయిలో బోధ చేస్తాడు వ్యక్తి గతంగా వారికి జ్ఞానము యొక్క అభివృద్ధిని, మార్గదర్శకత్వాన్ని శక్తిని, దయను అందచేస్తాడు. ఒక ఋషి సాధారణంగా తన కార్యక్రమాలను సామూహిక ఉపయోగానికి వినియోగిస్తాడు. అయితే ఒక్కొక్కసారి వ్యక్తిగత స్థాయిలో కూడా అతని బోధ ఫలిస్తుంది. తద్వారా సామూహిక, వ్యక్తిగత స్థాయిలు రెండింటిలోనూ ఒక్కొక్కసారి ఋషి బోధలు ఫలిస్తాయి.

ఇంకో విషయం కూడా ఇక్కడ గ్రహించాలి. ఎవరు కూడా గురువుగా జన్మించరు. కనుక పుట్టుకతో వచ్చిన బలం చేతకాని, కుటుంబం వల్లకాని, వంశంలో ఉన్న సన్యాసిత్వం వల్ల కాని - గురువులమని చెబుతూ, ఎవరూ ప్రజలను మోసం చేయలేరు. ఒక గురువు కావాలంటే- ఆ పట్టా ప్రదానం కావాలంటే ఇంకొక జ్ఞానోదయం పొందిన గురువు వల్లనే సాధ్యమవుతుంది. అది ఆధ్యాత్మిక గురువుల వంశానుక్రమంలో కావచ్చు. లేదా ఇంకొక కొత్త గురువు కావచ్చు. ఒక గురువు నుంచి ఇంకొక గురువుకి జరిగే ఈ అధికారదండ మార్పిడి కార్యక్రమానికి ఎలాంటి వేడుకలు కాని, బాకాలు ఊదటం కాని, మద్దెలలు, తప్పెటల మోతలు కాని అవసరం లేదు. ఒక్కోసారి జ్ఞాన పరిపూర్ణుడయిన గురువుకి తన శక్తిని, దయను ఇంకొకరికి ప్రదానం చెయ్యటానికి కొన్ని నిమిషాలు సరిపోతుంది. తద్వారా ఆ కటాక్షము పొందిన వ్యక్తి భవిష్యత్తులో ఒక శక్తిమంతుడైన గురువు అవుతాడు.

ఈ ఆధ్యాత్మిక శక్తి మరియు అధికారాలు మార్పిడి ఖచ్చితంగా తప్పనిసరి. సొంతంగా తనకు తానే నియమింపబడిన లేదా స్వీయ ప్రకటితమైన గురువు - సొంతంగా అల్లికతో కూడి ఉన్న పైన ధరించే దుస్తులను (జెర్సీ) కొనుక్కొని, ధరించిన వాడితో సమానం. నువ్వు విజయవంతంగా ఆట పూర్తి చేసిన ఆటగాడిని అవుతావు (అంతే గురువువి కాలేవు)

ఇక్కడ గురువులని పిలువబడే వివిధ వర్గాల వారి గురించి వివరిస్తాను. వీళ్లు వాస్తవంగా నిజ జీవితంలో మంచి ఉపాధ్యాయులు వక్తలు. ఈ వర్గంలో వచ్చే మొదటి వారు మతాన్ని గురించి బోధిస్తారు. ప్రచారం చేస్తారు. ఒక్కొక్క సారి కథల రూపంలో కూడా చెబుతారు. వాళ్లు మత సంబంధమైన విషయాలు పురాణాలు, గ్రంథాలు, తత్త్వశాస్త్రాలలో నేర్పరులు. వీళ్లలో కొంతమంది అధి భౌతిక (మెటాఫిజికల్) విషయాలమీద పరిశోధించి, రచనలు చేసినవారు. కొంతమంది అతీంద్రియ లేదా మానసిక విషయాలమీద చదువుకొన్నవారు. జ్ఞానాన్ని విస్తృతపరచటంలోను, మేధాశక్తిని అర్థం చేసుకోవటంలోను, ప్రాచీన గ్రంథాలను చదవటంలోను, మానవాతీత విషయాలను బోధించటంలోను వీళ్ల పాత్రని కొట్టి పారేయలేం. తనకు సంబంధించిన విషయంలో అతనికి ఎంత అధికారమున్నా, ప్రత్యేక అధ్యయనం చేసినప్పటికి, అటువంటి వ్యక్తిని గురువు అని పిలవలేము. వాళ్లకు వ్యవహరించిన పదం "పండితుడు" (20వ శతాబ్దంలో ఆంగ్ల భాషలో చేరిన అదనపుపదం) తేలికగా అర్థమయ్యేటట్లు చెప్పాలంటే పై
వర్గానికి చెందిన వ్యక్తులు, మస్తిష్కస్థాయిలోనే (సెరెబ్రల్ లెవల్) తమ కార్య కలాపాలు నిర్వహిస్తారు. నిజమైన గురువు మస్తిష్క మరియు ఉన్నతమైన ఆధ్యాత్మిక విలువల స్థాయిలో తన కార్యకలాపాలను నిర్వహిస్తారు.

ఇక రెండో రకం వ్యక్తులు. తమకు అర్హత లేక పోయినా వాళ్లు తమకు తామే గురువులుగా ప్రకటించుకొంటారు. వాళ్లు అన్నిరకాల భవిష్యవాణులు, ఆధ్యాత్మిక సమాచారము, దైవ మాధ్యమాల అమరిక, ఆధ్యాత్మిక వాహికలు, తాంత్రిక అభ్యాసాలు, మరియు దానికి సంబంధించి అతీతభావనల కార్యక్రమాలు - ఇలాంటి వాటిలో పైపైకి కన్పించే జ్ఞానం మాత్రమే కలిగి ఉంటారు ఈ పట్టికలో అద్భుతమైన మాయలు చేసే ఆశా పరులైన సాధువులను కూడా చేరుస్తున్నాను. ఇలాంటి మాయలన్నింటిని వీధులలో తిరిగే గారడీ వాళ్లు లేదా ఇంద్రజాలికులు చేస్తారు. నేను అంగీకరిస్తాను - ఇలా మహిమలు చూసే సాధువులు కొందరు మానవులకు ఉపయోగపడే అనేక మంచి పనులను రకరకాల పద్ధతులలో చేస్తున్నారు. కాని ఇటువంటి వ్యక్తిని నీ ఆధ్యాత్మిక గురువుగా గ్రహించటం వల్ల నీకు కష్టము కలిగే అవకాశం ఉంది. నీ సమయము కూడా వృథా.

ఇక మూడవ వర్గానికి వచ్చే గురువు - గురువు కాడు- మృత గురువు భౌతిక శరీరములో ఉండటమా - లేదా - అన్నది గురువుకి సంబంధించిన తప్పనిసరి అంశము. (వేరే వాళ్ల ఇష్టం ఉండదని భావం) చాలా సంవత్సరాల క్రితం భౌతిక శరీరాన్ని వదిలివేసిన ఒక సన్యాసిని / మునిని - చాలామంది భక్తులు - అతని యొక్క ఛాయాచిత్రం (ఫొటోగ్రాఫ్) లేదా చిత్రము ద్వారా గురువుగా భావిస్తుంటారు. క్షమించాలి. ఇది కూడా సరిగా పనిచేయదు. కాకపోతే ఈ ఛాయాచిత్ర / చిత్ర ఆరాధనవల్ల నువ్వు కష్ట సందర్భాలలో కొంత దయను లేదా ఆ దయా సూచనలను పొందవచ్చు. కాని అది సజీవుడైన గురువు ఇచ్చే జ్ఞానానికి, మార్గదర్శకత్వానికి, దయకు ప్రత్యామ్నాయం కాదు. ప్రజలు ఇలా ఒక చనిపోయిన సన్యాసిని / మునిని గురువుగా అంగీకరించటానికి కారణముంది. ఎందుకంటె సన్యాసికి తన జీవితకాలం కంటె చనిపోయిన తర్వాత జీవితము చాలా పెద్దది. అతని శక్తుల గురించి చిన్నచిన్న కథలు "చైనీస్ విస్పర్స్" లా (చైన్స్ విష్పర్స్) దైవత్వం వైపు అడుగులు వేసే సంచలన నిష్పత్తిలో వ్యాప్తి చెందుతాయి. (చైనీస్ విస్పర్ అనేది ఒక ఆట. ఒక గుంపులో మొదటివ్యక్తి పక్కవాడికి ఒక సందేశం చెబుతాడు. అది అలా ఒకరొకరి ద్వారా చివరి వాడికి చేరుతుంది. చివరి వాడు ఆ సందేశమేమిటో మొత్తం గుంపుకి చెబుతాడు- ఈ గుసగుసల ఆటని చైనీస్ విస్పర్ అంటారు. - అనువాదకుడు) ఇంకొకటేమిటంటే ఈ గురువుగారి ఛాయాచిత్రానికి కాని, విగ్రహానికి కాని, చిత్రానికి కాని గురుదక్షిణ లేదా ద్రవ్య సమర్పణ చేయటంలో ఎటువంటి బాధా ఉండదు. ఇంకొక ఆకర్షణీయమైన అంశం ఏమిటంటే - గురువు యొక్క మానవతా దృక్పథం వైపు ఇంకొకరెవరూ సంబంధం కలిగి ఉండరు. విచారకరమైన అంశం ఏమిటంటే- ఇటువంటి తొందరకలిగిన బంధము - జీవించి ఉన్న గురువుకి ప్రత్యామ్నాయం కాదు.

ఇప్పటి వరకు మనం రకరకాల గురువుల గురించి చెప్పి, వాళ్లందరూ కాదూ కాదూ అని చెబుతున్నాం. ఇక అర్హత కలిగిన గురువెవరు? సరిగ్గా నా అభిప్రాయము అదే! ఇటువంటి మానవజాతిలో ఉన్న అర్హతగల గురువులు చాలా తక్కువ. ఒక్కొక్కసారి గుర్తు పట్టడం కూడా చాలా కష్టం. బాధాకరమైన అంశం ఏమిటంటే ఇటువంటి విశిష్ట గురువులు తమ తమ జీవిత కాలాలలో చాలా అరుదుగా ప్రసిద్ధి పొందుతారు.

ప్రజారంజకులవుతారు. ఈ గురువులు తమ స్థానాన్ని ఒక నిధిలా దాచుకొంటారు. ప్రఖ్యాతికి చాలా దూరంగా ఉంటారు. వీళ్ల శిష్యులూ వీళ్లనుంచి వెలువడే అంతర్గతకాంతి ప్రసారమువల్లా వీళ్లకు శిష్యులవుతారు. అంతే కాని వివేక ప్రకటనల ప్రచారాల వల్ల లేదా అందమైన వ్యాపార వ్యూహాల వల్ల శిష్యులు కారు. చాలా గొప్ప గురువులు చాలా సామాన్యమైన దుర్భర దారిద్ర్య జీవితాన్ని గడుపుతారనే విషయం - నాకు చాలా సంతోషం కలిగిస్తుంది. వాళ్లు చనిపోయిన తర్వాత జీవితకాలంలో సంపాదించ లేనిదాన్ని సంపాదిస్తారు! వాళ్ల జ్ఞాపకాలను శాశ్వతం చేయటానికి ఘనమైన దేవాలయాలు- ఏర్పాటు చేయబడతాయి. వాళ్ల పేరు మీదుగా ఘనమైన విరాళాలు వసూలు చేయబడి ధర్మనిధులు (ట్రస్ట్) ఏర్పడతాయి. ఇదివరకు ఆ పేద గురువు నివసించిన - అప్రసిద్ధ ప్రదేశానికి - ఆయన చనిపోయిన తర్వాత గుంపులు గుంపులుగా ప్రజలు నడుస్తుంటారు.

మానవ స్వభావరా మరణాన్ని నమ్ముతుంది. సజీవత్వాన్ని అనుమానిస్తుంది. తీవ్రమైన అన్వేషణాపరుడూ ఒక నిర్దుష్టమైన గురువును కనుక్కోవటం ఎలా ఉంటుందంటే వీధులలో నివిసించేవాడిని ఒక లాటరీ (అదృష్టయోగంపైన ఆధారపడిన జూదం లాంటి ఆట) ని పొందినట్లు. గురువు యొక్క శక్తి మరియు దయా జీవితాన్ని కేవలం సులభతరం చేయటమే కాదు. గురువు యొక్క ప్రచోదకశక్తి (ప్రొపల్లింగ్) ఎక్కడైతే నిజమైన సంపద ఉందో, ఆ జ్ఞానపు అంచుల వరకు తీసుకు వెళుతుంది.

కాని నిజమైన గురువు ఎప్పుడు అవసరపడతాడనేది ప్రశ్న. దీనికి జవాబు గమ్మత్తైనది. ఎందుకంటే నువ్వు ఏమి చూస్తున్నావు? నువ్వు ఎక్కడికి చేరాలని అనుకొంటున్నావ్? అనే అంశాల మీద ఇది ఆధారపడింది. ఎవరి ఆధ్యాత్మికత- మత గ్రంథాల మీద ఆచారాల మీద, సిద్ధాంతాలమీద ఆధారపడి ఉంటుందో- వాళ్లకి 'పండితుడు' లేదా మత ప్రచారంలో నేర్పరి - 'గురువు' అనేపేరుతో సరిపోతాడు. ఈ విశ్వంలో వివరింపబడని అనేక రహస్యాలను తెలుసుకోవాలనే గాఢమైన తపన ఉన్నవారికి, ఎవరి ఆధ్యాత్మిక అభ్యాసము శుద్ధమైన మానసిక వ్యాపారంలో ఇరుక్కొని పోయి ఉందో - వారికి - గురువు యొక్క అవసరము లేదు. వాళ్లకి కోటానుకోట్లుగా ఉన్న పుస్తకాలు వాళ్ల విజ్ఞాన దాహాన్ని తీరుస్తాయి. వాళ్లు అక్కడితో సంతృప్తి పడతారు. వ్యక్తి పరిణామ యాత్రలో ఒక స్థాయికి చేరే వరకు -

పుస్తకాలు- చాలా ముఖ్యమైన పాత్రని వహిస్తాయని ఇక్కడ నేను చెప్పదలుచుకొన్నాను. ఆ స్థాయి దాటిన తర్వాత - వచ్చే శూన్యాన్ని భర్తీ చేయటానికి - నీ తపనని పోగొట్టడానికి - జీవించి ఉన్న గురువు మాత్రమే సమర్థుడు.

కొంతమంది వ్యక్తులు తమ ఆధ్యాత్మిక అభివృద్ధిలో కష్టాలు, ఆసక్తి లేని తనం, గందరగోళం పడుతుంటారు. కోపపు అంగలతో కొంతమంది అభివృద్ధికోసం - తెగిస్తుంటారు. ఇటువంటి వారందరికి ఒక సత్యమైన గురువు కావాలి. కొంతమందికి వాళ్ల విధిరాత ప్రకారం ఒక శుద్ధమైన గురువుని కలుసుకొనే అవకాశం ఉంటుంది. కొంతమందికి ఉండదు. కొంతమంది కలుసుకొంటారు. వదిలిపెడతారు. కొంతమంది నిజమైన గురువును కలుసుకొంటారు. కాని ఆయన పాదాలను శరణు వేడే వినయం ఉండదు. కాని నువ్వు శాశ్వతంగా నీ బాధల నుంచి బయటకు రావాలనుకొంటే- జ్ఞానపుకాంతులయొక్క ఉన్నత స్థాయిలను నువ్వు చేరుకోవాలనుకొంటే - నీ నిలువెల్లా నిండిన ఆధ్యాత్మిక కాంతితో - అద్వైత దయాప్రేమలు నిండిన అద్భుతమైన అనుభవాన్ని పొందాలనుకొంటే నువ్వు గురువును ఆశ్రయించవలసినదే. ఆ గురువొక్కడే పైన చెప్పిన మార్గంలో వెళ్లటానికి నీ 'వీసా' పై ముద్ర వేస్తాడు.

(పాస్ పోర్ట్ మీద అంటే విదేశ ప్రయాణ అనుమతి పత్రం మీద అధికారులు మళ్లీ ఇచ్చే ఎండార్స్‌మెంట్ ని - అంటే అనుమతిని "వీసా" అంటారు. దీనివల్ల విదేశంలోకి ప్రవేశించటానికి, నిర్దేశిత కాలం వరకు నివసించటానికి వీలవుతుంది. (అనువాదకుడు)

## వ్యాఖ్యలు

వ్యాఖ్య :

ఓ గురూజీ! మేమందరం మీ ఆలోచనాపరిధిలో సురక్షితంగా ఉన్నాం. ఈ ఘనమైన గురువు భావన అనే గొడుగుకింద ఉండటం వల్ల వానలు తుఫాను మొదలైన వాటివల్లే కాదూ భవిష్యత్ రహదారులు కూడా ప్రకాశితమవుతున్నాయి. ఇది వరకు నన్ను బాధించిన నక్షత్రాలకు నేను కృతజ్ఞతలు చెబుతున్నాను. ఎందుకంటే వాటివల్లౌ మీ దగ్గరకు వచ్చే అదృష్టము అజ్ఞానబాష్పధారల మధ్యా నాకు కలిగింది. ఆ అదృష్ట స్పర్శ మీ పాదాల చెంత నాకు కలిగింది. గురూజీ, ఇప్పటివరకు నేను చెప్పిన విషయాన్ని తేలికగా మార్చి చెబుతాను.

తన జీవితకాలంలో వేయి లాటరీలు గెలిచిన వాడి కంటె, మీకు శిష్యుడయిన అదృష్టం కలవాడు చాలా గొప్పవాడు. నాలోని ఈ వినయపు ముడి పదార్థాన్నిా బలవత్తరంగా, వాస్తవజ్ఞాన సమేతంగా తీర్చిదిద్దిన మీకు అనేక ధన్యవాదాలు. మీరు మా పై ప్రసరింపచేసిన ప్రేమ దివ్యకాంతిలోా చాలా కొద్ది భాగాన్ని ఇప్పుడు ఇలా ప్రతిఫలింపచేస్తున్నాను.

## రెండవ భాగము

### కష్టాల్లో ఉన్నవారికి ఆశ్రయము ( )

ఇప్పటి వరకు మొదటిభాగంలో గురువని ఎవరిని పిలుస్తారో, రకరకాల గురువులు ఎవరో మీరు వెతుకుతున్నా అతీంద్రియ శక్తులు గురువు ద్వారా ఎలా లభిస్తాయో - ఇలా ముఖ్యమైన కొన్ని అంశాలు తెలుసుకున్నాం. ఇక ఈ ప్రస్తుత వ్యాసం- గురు శిష్యుల అనుబంధ సారాంశాన్ని వివరిస్తుంది. ఇందులోని శిష్యుడు తీవ్రమైన అన్వేషకుడు. ఒక నిజమైన గురువును వెదకటంలో మాత్రమే కాదు నీ జీవితాన్ని మరియొక ఆకారంలో మార్చగలిగే గురువును వెతకటంలో కూడా కష్టం ఉంది.

నిజమైన గురువును వెతకటానికి ఒక ప్రాథమిక సూచిక (చెక్‌లిస్ట్) అంటూ ఏమీలేదు. నువ్వు గబగబా ప్రాథమిక సూచికలో గుర్తులు పెట్టుకొనే అవకాశం లేదు. బాధాకరమైన అంశం ఏమిటంటే, ఈ గురువు- **నీ గురువు** అని చెప్పగలిగే నీకు సహాయం చేయగలికే సమర్థవంతమైన విధానము అంటూ ఏమీ లేదు. అయితే నేను ఇప్పుడు ఇవ్వబోయే మంచి సూచనలను నీవు అనుసరిస్తే - అనేక ఉపాయాలతో - నిన్ను వేటాడి చంపుకు తినే వ్యక్తులనుంచి నిన్ను నువ్వు రక్షించుకోగలవు. అందువల్ల ఈ జీవితకాలంలో - విధి - నీకు మంచి ఆధ్యాత్మిక గురువును పొందే అవకాశం ఇవ్వకపోయినా - నేను చెప్పే సూచనలతో నీకు రక్షణ కలుగుతుంది.

నువ్వాా నీా ఆధ్యాత్మిక అభివృద్ధినిా ఇకపై కోరుకోవాలని అనుకొంటే ఈ ముఖ్యమైన నిబంధన పాటించాలి. ఒక గురువును నీ మెదడుతో వెతుకు. అలాంటివాడు దొరికిన తర్వాతా నీ హృదయం సమ్మతిస్తేా అతనిని గురువుగా స్వీకరించు. లోకంలో చాలా మంది చెడు గురువులు లేదా ఒక మంచి వ్యక్తిని గుర్తించలేక పోవటం ఎందుకు జరుగుతుందంటే సరిగ్గాా నేను చెప్పిన దానికి వ్యతిరేకంగా చేస్తారు కాబట్టి. అంటే

హృదయాలతో వెతుకుతున్నారు. తమ మెదడు నుంచి అంగీకారాన్ని పొందుతారు.

నేను మెదడుతో గురువును ఎందుకు వెతకమన్నానంటే ఇక్కడ నా ఉద్దేశరా మీ అవగాహన చేసుకోగలిగిన శక్తిని, వివేకాన్ని వాడుకొనిా సాకులు చెప్పే తన నుంచిా వాస్తవం గుర్తించండి. నాకు తెలుసూ ఇది పలచని మంచుమీద నడవటం లాంటిదిా కాని నువ్వు సన్యాసి సన్నిధిలో ఉన్నావా? లేదా మోసాలు చేసే వాడి దగ్గర ఉన్నానా అనే విషయాన్ని తేట తెల్లం చేసే కొన్ని సూచనలూా మీ మెదడుతో వెతకటం వల్లాా మీకు లభిస్తాయి.

గత యాభై సంవత్సరాలనుంచిా గౌరవించదగిన గురువుగారి యొక్క చిత్రము ఆలోచించదగిన రూపపరివర్తన చెందింది. ఇప్పుడు వందలు వేలుగా అందరూ ఆ గురువులను విశ్వ గురువులని గొప్పలు చెబుతున్నారు. ఇప్పుడు ఆ గురువులకు రాజకీయాలతో బాగా సంబంధముంది. ఫైవ్ స్టార్ హోటల్స్‌ను (నాణ్యతగల అల్పాహారశాలలు. నాణ్యతలకు ఇచ్చే పాయింట్లను స్టార్లు అంటారూా అనువాదకుడు) తలదన్నే సొంత ఆశ్రమాలు ఉన్నాయి. ఊహించటానికి వీలులేనంత సంపద కలిగి ఉన్నారు. ఈ గురువులు చక్కగా వ్యాపారాలు చేసుకొంటున్నారు. కృతజ్ఞతలు. ఇప్పుడు నువ్వు నీ మెదడుకు బదులు హృదయం చెప్పినదానిని మొదటగా వింటే, నువ్వు కూడా ఈ కోటీశ్వరులైన గురువులను అనుసరించే మందలో ఒకడివి అవుతావు. వాళ్ల ఇచ్చే దానితో నీ జీవితాన్ని ముగించుకొంటావు. ముఖ్యమైనది ఏది దారిలో  ఉండదు.

సరిగ్గా ఇటువంటి అద్భుతమైన మరో విషయమే వ్యక్తిత్వం తో సంబంధం లేని గురువు యొక్క భావనకి ఊపిరి పోసింది. నువ్వు ఇటువంటి వ్యక్తిత్వముతో సంబంధంలోని గురువును - ఒక రంగస్థలములోని వేదికపై సంవత్సరములో కొన్నిసార్లు చూస్తావు. నీ నెల జీతాన్ని అతనికి నువ్వు స్వాధీనము చేయకపోతే అతను ప్రసాదించే "దైవ సాన్నిధ్యంలో" కొన్ని నిముషాలు కూడా గడపలేవు. అసలు అలాంటి విషయం ఊహించలేవు. ఈ కథంతా నీకు ఆంతరంగికంగా స్పష్టంగా, పెద్దగా వినబడుతుంది.

కోటీశ్వరులైన గురువులకు ఆటాడటానికి తమ సొంత ఆట ఉంటుంది. ఒక్క ఆధ్యాత్మిక మోక్షము తప్పించి మిగిలినవన్నీ మీకు ధరలు పెట్టి అమ్మేస్తారు. గురువుకి

అసలు సంపద ఉండకూడదని - లేదా - భౌతిక సౌకర్యాలు - అన్నింటిని వదిలివేయాలని - నేను ఏరకంగాను సూచించటం లేదు. కాని నా
ప్రశ్న ఏమిటంటే ఒక గురువు ప్రపంచ వ్యాప్తంగా విలాసవంతమైన ఆశ్రమ రిసార్టులతో (ఆశ్రయము) కూడిన అభివృద్ధి చెందిన వాణిజ్యవ్యాపారాలు నిర్వహిస్తుంటే యంత్రశాలలు (ఫ్యాక్టరీలు) ప్రత్యేక అనుమతులతో కూడిన కార్యక్రమాలు, రాజకీయ బ్రోకింగ్, (వస్తువులను కొనే అమ్మే ఒక సేవను లేదా వ్యాపారాన్ని బ్రోకింగ్ అంటారు.- అనువాదకుడు) ధనప్రవాహం కోసం ఉద్దేశించబడిన మానవ కారుణ్య కార్యక్రమాలు (ఫిలాంత్రఫిక్ పర్స్యూట్) లాభం కొరకు ఉద్దేశించబడిన ఇతర వ్యాపారాలు- ఇవన్నీ చేస్తుంటే నిన్ను ఆ గురువు ఎలా సంతోషపెడతాడు? నీ ఆధ్యాత్మిక కోరికలను ఎలా తీరుస్తాడు? వాళ్ల వ్యాపార నమూనాను అనుసరించి నువ్వు నీ తెరిచిన డబ్బు సంచితో (మనీ పర్స్) అటువంటి వ్యక్తులతో సంబంధం పెట్టుకోవటానికి అర్హుడవవుతావు.

ఇక కొంతమంది మొగమాటములేని గురువులుంటారు. వీరు కోటీశ్వరులైన గురువుల క్లబ్ (సంఘం) లో సభ్యులు కారు. వీళ్లకి యుక్తులు, మహిమలు, మత ప్రచార పోరాటాలు- ఇలాంటి వాటిని ఆశ్రయించి- మన శ్రద్ధను పట్టుకోవాలని చూస్తారు. ఇటువంటి గురువు ఎంతగా - బహిరంగంగా తన మాయలు, మహిమలు చూపిస్తుంటాడో- అంతగా నువ్వు అతని చేష్టలపట్ల జాగ్రత్తగా ఉండాలి. ఇప్పటి వరకు నేను చెప్పదలుచుకొన్నది ఏమిటంటే - నువ్వు నీ గురువును వెతికేటప్పుడు నీ విచక్షణాయుతమైన తెలివిని ఉపయోగించు. రూప సౌందర్యం, ఇతరులను ఆకర్షించే అందం, అధికమైన ప్రచారం, వదంతి లేదా మత పరమైన మానసిక భావం (సెంటిమెంట్) ఇలాంటి వాటికి విలువ ఇవ్వద్దు. మళ్లీ చెబుతున్నాను... నీ ఇంగితజ్ఞానాన్ని (కామన్‌సెన్స్) మతపరమైన మానసిక భావం (రిలీజియస్ సెంటిమెంట్) కప్పివేస్తుంది. జాగ్రత్త.

ఒక నిజమైన గురువు ఒదిగి పోయే ఒక ప్రామాణికమైన నమూనా
అంటూ ఏమీ లేదు. సాధారణంగా వారి బోధనలతోపాటు, వారి జీవనశైలి కూడా వారి విలువను తెలియచేస్తుంది. ఒక జ్ఞాన పరిపూర్ణుడు ఏనాడు ఒక గొప్ప వ్యాపారంతోకాని, రాజకీయ కార్యకలాపాలతో కాని సంబంధం కలిగి ఉండడు. ఉన్నతంగా వికాసము పొందిన

మానవుడు అంగీకరించని కార్యకలాపాలలో ఈ గురువు మునిగిపోయి ఉంటాడు. ఈ గొప్ప వాళ్లయిన గురువులు తమ ఆలోచనలలో సరళత యొక్క అంతర్లీన భావాన్ని ( ) కలిగి ఉంటారు. (ఆలోచనలు చాలా సరళంగా ఉంటాయని భావం) వాళ్ల జీవితం, వాళ్ల ఉనికి అంతా కూడా ప్రతివారికి పూర్తి పారదర్శకంగా ఉంటుంది. దీనికి విరుద్ధంగా టి.వి. కథన నిర్మాతలయిన ( ) గురువులు ఉంటారు తెరపైన తమని చూసే వాళ్ల కోసం వీళ్లు ఎప్పుడు నిష్ఠగా నిజ జీవితంలో చూడలేని విధంగా నృత్యదర్శకత్వ ( ) జీవితంలో ఉంటారు. ఏకాంతంలో దీనికి విభిన్నంగా గొప్పగొప్ప గోడలు, అనేక మలుపులు ఉన్న భద్రతా కాపలాదారులతో ( ) ఉండే నివాసాలలో ఉంటారు.

నీ రకరకాల అనుబంధ ప్రమాణాల ద్వారా ( ) ఒక గురువు నీకు బాగా సరిపోయాడని నువ్వు ఊహించి, గుర్తించావనుకొందాం. ఇప్పుడు ఆధ్యాత్మిక మోక్షానికి ఆ వ్యక్తి సరిపోయాడని ఎలా తెలుసుకొంటావు? ఇక్కడే హృదయం విశిష్టస్థానాన్ని ఆక్రమిస్తుంది. నువ్వు ఒకరిని నీ స్వంత ఆధ్యాత్మిక గురువుగా అంగీకరించాలంటే, ముందు నీ హృదయంలో నేరుగా, వ్యక్తిగతంగా, సహజమైన భావన కలగాలి. హేతుబద్ధత ( ) వద్దు. ఆ గురువును చూసిన వెంటనే బలంగా తక్షణమే ఒక దగ్గరితనం అనిపించాలి. గురువు నువ్వు ఊహించుకొన్న పాత్రలో సరిగ్గా సరిపోయినట్లు ఒక హాయైన భావన నీకు కలగాలి. తాళం చెవి తెరిచేటప్పుడు కుడివైపుకు మీటలు ( ) తేలిగ్గా కదిలే అనుభూతి కలగాలి. నువ్వు గురువును కలిసిన మొదటి సందర్భాలలో ఇటువంటి అయస్కాంత ఆకర్షణ కలగటానికి నీకు ఇబ్బంది
కలుగుతుంటే కీలకమైన అనుబంధం ఏదో మీ ఇద్దరి మధ్య లేదని భావం. ఇటువంటి పరిస్థితిలో ఆ గురువు నిజమైన, మరియు శక్తిమంతుడైనప్పటికీ నీకు సంబంధించిన వాడు కాదని అర్థం చేసుకో.

నువ్వు నీ గురువును గుర్తించిన తర్వాత బంధం ఏర్పడిన తర్వాత అతడు నిన్ను శిష్యునిగా అంగీకరించాడా? లేదా? అనే ప్రశ్న కలుగుతుంది. సాధారణంగా ఏ గురువు కూడా తనను అనుసరించే వారిని నిరోధించడు. తన బోధలు వినవద్దని చెప్పడు. కాకపోతే ఆ శిష్యుడు మాటి మాటికి విసుగు కలిగిస్తూ ఇబ్బంది పెడుతూ తన పనికి అడ్డు తగులుతుంటే- గురువు అభ్యంతరం చెబుతాడు. గురువు యొక్క నీడ కింద ఆధ్యాత్మిక

అన్వేషణకల ఏ వ్యక్తికి అయినా స్వాగతమే. ఆ శిష్యుడు బాగా చదువుకొన్న మేధావి లేదా నిరక్షరాస్యురు కావచ్చు. అంతులేని ఐశ్వర్యం ఉన్నవాడు లేదా కటిక దరిద్రం అనుభవిస్తున్నవారు కావచ్చు. శాంత జీవనం గడుపుతున్న మంచి వాడు లేదా నేరస్థుడు కావచ్చు. అందరికి స్వాగతమే. తన శిష్యునిగా చేరిన తర్వాత మాత్రమే శిష్యుని యొక్క సత్తా ఏరకమైనదో గురువు నిర్ణయించుకొంటాడు. ఆధ్యాత్మిక బహిరంగ రహదారిపై (హైవే) వెళ్లటానికి 'వీసా' మీద ముద్ర వేయాలా వద్దా అనేది నిర్ణయిస్తాడు. ఆ కాని ఆ ప్రత్యేక దయను శిష్యుడు ఎప్పుడు సంపాదించుకోవటానికి ప్రయత్నించాలి. ఊహించండి. వేరొక చోట అటువంటి దయను సంపాదించలేవు. నీ ఆధ్యాత్మిక, భౌతిక జీవితాలలో గురువు యొక్క ఆశీర్వచనములు, మార్గదర్శనముల లాభాన్ని పొందటానికి ప్రయత్నించాలి. వాటికోసం అధికశాతం ప్రజలు ఏరకంగానైనా తమ గురువు నుంచి సంపాదించటానికి ప్రయత్నిస్తుంటారు.

గురు శిష్యుల మధ్య అనుబంధం ఎలా ఉంటుందని, నన్ను చాలామంది అడుగుతుంటారు. నా స్వీయ అనుభవం నుంచి చెబుతున్నాను. నువ్వు 'శరణము' అనే పదము యొక్క అర్థం బాగా తెలుసుకుంటే నువ్వు అధిక శాతం ఆధ్యాత్మిక సంపదను సంపాదిస్తావు. శరణము అంటే నేను దృఢపరచటానికి మళ్లీ చెబుతున్నాను. <u>శరణము అంటే నీ స్వేచ్ఛని నిర్ణయం తీసుకొనే హక్కుని గురువుకి అప్పజెప్పటం కాదు. ఇది శరణము కాదు. ఇది పలాయనవాదం. నీ అహంకారాన్ని గురువుయొక్క పాదాల దగ్గర ఉంచటమే నిజమైన శరణాగతి. ఇది భారీస్థాయిలో అనేక ఆధ్యాత్మిక లాభాల పంపకాలను (డివిడెండ్) నీకు ఫలింపచేస్తుంది.</u>

అందువల్ల దేవుడు, గురువు మరియు నువ్వూ వీటికి సంబంధించిన మార్గదర్శనాలు ఇవి.
నీ కోరికను దైవ సంకల్పానికి అప్పగించు, నీ అహంకారాన్ని గురువుకి అప్పగించు

మనము దీనికి విరుద్ధంగా చేస్తుంటాం. మన అహంకారాన్ని దేవునికి అప్పగించటం - మనకు చాలా తేలిక. ఎందుకంటె మన ఎదుట ఒక భౌతిక రూపంలో దేవుడుండడు

కఠినమైన నిర్ణయాలు చెప్పి మనలను బాగు చేస్తాడని భావిస్తాం కాని ఒకటి గుర్తుపెట్టుకో....... నువ్వు ప్రపంచాన్ని, నీ గురువును మోసం చేయలేవు.

గురు శిష్యులకు సంబంధించిన ఇంకొక విషయము ఉంది. ఇది గురువుయొక్క చురుకుతనం (గురు హాపింగ్) దీనిని గురించిఇదివరకు వ్రాసాను. కాని ఇది అర్హత కలిగిన గురువులకే వర్తిసుంది. నీ జీవితకాలంలో ఒకరి కంటె ఎక్కువ గురువులుండటంలో ఎటువంటి ఇబ్బంది లేదు. తప్పు లేదు. ఒక్కొక్కసారి అలా ఎక్కువ సంఖ్యలో గురువులుండటం తప్పనిసరి
అవుతుంది. అయితే ఇక్కడ గమనించదగిన అంశం ఏమిటంటే - నువ్వు ఒక గురువు నుంచి ఇంకొక గురువు దగ్గరికి వెళుతున్నప్పుడు - ఆ కార్యక్రమం ఎలా చేస్తున్నావనేది ముఖ్యమైన విషయం. చాలా మంది అన్వేషకులు తమ ఆధ్యాత్మిక స్థాయిని చాలా హెచ్చుస్థాయిలో ఊహించుకొంటారు. దేవుని పథకాలకు సంబంధించిన విషయాలలో తమకు తాము ప్రత్యేకత కలిగిన వారిగా భావిస్తుంటారు. గురువు దగ్గరికి వీళ్ళు వెంటనే జ్ఞానోదయం కావాలని వెళతారు. తమకు జ్ఞానోదయం కలిగించటం గురువుయొక్క దైవిక బాధ్యతగా భావించి తక్షణమే నెరవేరాలనుకొంటారు. కొన్నిసార్లు ఆ తప్పుదోవ పట్టించు జీవాత్మలు తమ కర్మల పలకపై ఉన్న రాతలు గురువు వెంటనే తుడిచివేయాలని కోరుకుంటారు. అన్నిరకాల ఆధ్యాత్మికపు మేళ్లు, శక్తులు మొదలయినవన్నీ - ఒక "దైవ పక్షపాతిగా" గురువు వెంటనే తమకు ప్రసారం చేయాలని, ఆ అర్హత తమకు ఉందని భావిస్తారు. ~~ఈ~~ అత్యుత్సాహ వెర్రి భావాలు ఫలించకపోతే వాళ్ల స్పష్టంగా అసహనానికి గురయి - ఇంకొక కొత్త గురువు కోసం కొత్త దుకాణానికి పోతుంటారు. దానివల్ల వచ్చే ఫలితము స్పష్టము. అది ఏమిటంటే ఆధ్యాత్మిక స్తబ్ధత.

ఒక శిష్యుడికి గురువు నుంచి లభించే భావధార వ్యక్తికి సంబంధించి విడివిడిగా ఉంటది. అలాగే గురువు కూడా శిష్యునికి అనుగ్రహించే భావధార వ్యక్తి, వ్యక్తికి మారుతుంది. అందుకనే ప్రత్యక్షంగా మరియు వ్యక్తిగతంగా బంధం అనేది తప్పని సరి అని చెప్పటం. ఒక గురువు సరి అయిన వ్యక్తి అని నీకు అనిపించినప్పుడు, ఆయనని చూసినప్పుడు నీకు భక్తి కలిగితే, ఆయన మాటలను పరిపూర్ణంగా నమ్ము. అలా చేస్తే ఆయన బోధలు ఒక్కొక్కసారి ఆయన దయ- నీ వ్యక్తిగత భౌతిక జీవితంలో ప్రత్యేకంగా ఆధ్యాత్మిక

జీవితంలో గొప్ప మార్పుకి కారణమవుతుంది. నీ గురువు - నీ ఆలోచనలను లేదా నీ జీవితాన్ని ప్రత్యేకంగా, గుర్తింపదగినట్లు మార్పు చేయకపోతే- నువ్వు తప్పుడు సంఖ్యకు (రాంగ్‌నంబర్) ఫోను చేసినట్లు.

తనమాటలలో నూటికి నూరు పాళ్లు అపరిమితమైన ప్రేమను గురువు పంచిపెడతాడు. తనలోని శాంత గుణానికి బలవర్థకంగా ఆ గురువు యొక్క మాటలు ఉన్నాయనే ఒక స్థిర భావాన్ని - శిష్యుడు పొందగలగడం - శిష్యుని మీద ఆధారపడి ఉంటుంది. ఒక తండ్రి తన పిల్లవాడికి ఈత నేర్పినట్లు, నీ మంచి కోసం గురువు నిన్ను కష్టపెడతాడు. అంతే కాని నీళ్లలోకి తోసేయడు. అతని మార్గదర్శకత్వం ఎప్పుడు స్వార్థ దృక్పథం లో లేదా వ్యక్తిగత ప్రయోజనాల పట్టికతో ఉండదు. ఒక సాధికారికత కలిగిన గురువు యొక్క దయ ద్వారా నీకు గొప్ప నిధి లభిస్తుంది. ఒక శిష్యుని పై అమితమైన ప్రేమను గురువు గుండెల్లో నిల్పుకొన్న క్షణంలో, - అతను శిష్యునికి ప్రతిదీ ఇవ్వగలడు. ఏదీ అసాధ్యం కాదు. కాని గురువు యొక్క దయను సంపాదించుకోవాలి. ఆ దయను ఎలా సంపాదించుకోవలనేది భక్తి, అంకితభావం, మరియు నీ శరణాగతిల స్థాయి మీద ఆధారపడి ఉంటుంది.

## ప్రశ్నలు

ప్రశ్న :

మీరు అడిగిన దానికి పొడిగింపుగా నేను ఒక ప్రశ్న అడగాలను కొంటున్నాను.నీ ప్రేమను మరియు భావాలను, అంకితభావాలను గురువు యెడల చూపించే సందర్భం ఎలా ముఖ్యమైనది? శిష్యులలో కొంత మందికి గురువు మీద అంతులేని ప్రేమ, భక్తి భావం ఉంటాయి. కాని వాటిని బయటకు చెప్పలేరు. ఇది గురువును చేరుతుందా?

గురుజీ జవాబు :

మీరు ప్రతిసారి గురువుపట్ల మీకున్న గాఢమైన ప్రేమను, భావాలను వ్యక్తీకరించనవసరం లేదు. చర్యల ద్వారా కూడా చెప్పనక్కరలేదు. ఒకసారి గురువు నీ కళ్లలోకి చూసాడంటే, నీ హృదయం ఆయనకి తెరచిన పుస్తకం అవుతుంది. నీ భక్తి ఏ పాటిదో గురువు ఎంత దూరంలో ఉన్నా ఊహించగలడు, గుర్తించగలడు. నువ్వు దానికోసం గురు సమక్షంలో ఉండనక్కర్లేదు. ఇంకా చెప్పాలంటే ఆమె/ఆతని యొక్క ఉ

ద్వేగాలను ఏ రకంగా గురువుకి చెప్పట మనేది పూర్తిగా వ్యక్తిగత విషయం.

ప్రశ్న :

ఈ కొత్త వ్యాసం చాలా సమాచారయుక్తంగా ఉంది. నా సందేహాలలో చాలావాటిని పోగొట్టింది. గురూజీ! "శరణము" "ఆధ్యాత్మిక స్తబ్దత" - ఈ విషయాలమీద ఇంకొంచెం చెప్పగలరా? వాటిని ఎలా గుర్తించాలి? వాటిని అధిగమించటానికి ఏమి చేయాలి?

గురుజీ జవాబు :

పై వ్యాస నేపథ్యంలో నిజమైన, సాధికారికత కలిగిన గురువుయొక్క "శరణము" నకు సంబంధించిన త్వరిత వివరణ చేస్తాను.

ఎ. గురువు ఏదైనా సలహా లేదా సూచన ఇచ్చినప్పుడు- ఆయన ప్రేరణలను సందేహించవద్దు. నువ్వు వినదలుచుకోని మాటలను ఆయన చెబుతున్నప్పుడు మనస్తాపం చెందవద్దు. అది నీకు చిట్టచివరికి మంచిదే అవుతుంది.

బి. గురువును ఓడించటానికి ప్రయత్నించవద్దు. ఆయనకంటె ఎక్కువగా తెలుసునన్నట్లుగా టెక్కుచూపద్దు. (షో - ఆఫ్) తను చూపించిన దానికంటె ఎక్కువగా గురువుకి తెలుసు. ఇతరులకు తెలియని విషయం చెబుతున్న దానివల్ల ప్రయోజనాన్ని ( ) ఆయన ఎప్పుడూ పొందాలని అనుకోడు.

సి. గురువును బయటకు కనిపించే ఆయన పనులద్వారా మాటలద్వారా అంచనా వేయవద్దు. ఒక్కొక్కసారి గురువు యొక్క పనులు చాలా అసాధారణంగా మరియు అసంబద్ధమైనవిగా, పనికి మాలినవిగా అనిపిస్తాయి. వాటిల్లో ఎంతో లోతైన అర్థముంటుంది.

డి. నువ్వు అడక్కుండానే గురువు నీకేదన్నా ఒక ప్రత్యేక సూచన ఇస్తే దానిని జాగ్రత్తగా, ఖచ్చితంగా అమలు చేయి. నీకు తెలియనిది ఆయనకు తెలుసు.

ఇ. గురువు ఎదుట ముఖస్తుతి చేయవద్దు. ఆయన పరోక్షంలో నీ చెడు నోరు వడద్దు. ఆయనకు తప్పనిసరిగా తెలుస్తుంది.

ఎఫ్. చాలా ముఖ్యమైన విషయం. నీ ఆధ్యాత్మిక ఆకస్మిక పరిణామానికి వేచియుండు. శాంతంగా ఉండు. గురువు నీ విధేయత, ప్రేమ, అంకిత భావం మరియు సంస్కారం - ఇలాంటివాటిని నిధిని తెరవబోయే ముందు పరీక్షిస్తాడు.

ఇక 'ఆధ్యాత్మిక స్తబ్ధత' - ఇది చాలా సామాన్య విషయం. నీ అమాయ కత్వం వల్ల, అజ్ఞానం వల్ల, అసహనం వల్ల - ఒక గురువు నుంచి ఇంకొక గురువు దగ్గరికి వెంటవెంటనే వెళ్లి తొందరగా వారసత్వం మార్చాలని చూస్తావు. దీనివల్ల నువ్వు ఆ గోళాలలో అలానే తిరుగుతూ ఉంటావు. ముందుకు అడుగు పడదు. నువ్వు ప్రతివారి దగ్గర ఎంతో కొంత నేర్చుకుంటావు- అంతేకాని- గణనీయమైనా, ప్రాధాన్యత కలిగిన దానిని ప్రతివారి దగ్గర నేర్చుకోలేవు.

## మూడవ భాగము

## గురుదక్షిణ యొక్క బాధ

మీలో చాలామంది ఆశ్చర్యపోయి ఉంటారు. నేను బాధని గురుదక్షిణతో (సాధారణంగా గురువుకి డబ్బురూపంలో ఇచ్చేది) కలిపినందుకు. ఎందుకంటే ఆ భావాన్ని స్పష్టంగా చెప్పాలంటే అంతకంటె మంచి పదాల పోహళింపు నాకు కనిపించలేదు. చాలామంది శిష్యులు గురుదక్షిణగా డబ్బు ఇచ్చే సమయంలో ఈ భావాన్ని పొంది ఉంటారు. ఆధ్యాత్మిక అన్వేషకులకి డబ్బును గురువుకి ఇవ్వటం అనేది ఎందుకు విచారకరమైన అంశంగా మారింది? తమ సొంత పనులకోసం, లేదా- ఇతరులకి ఇవ్వటం కోసం చాలా పెద్ద మొత్తంలో డబ్బు ఖర్చు పెడతారు. కాని గురువుకి ఇచ్చే విషయంలో ఎందుకు బాధపడుతున్నారు? ఈ వ్యాసం ఇలాంటి విషయాలను చర్చిస్తుంది.

ఈ సున్నితమైన భావాలతో కూడిన ఈ అంశాన్ని పూర్తిగా అర్థం చేసుకొనబోయే ముందు - నేను అవాస్తవాలను, కల్పితాలను సమూలంగా నాశనం చేయదలుచుకొన్నాను. ఈ కల్పితాలు - శిష్యుని మనస్సులోని చీకటి గుళ్లలో నివాసమేర్పరుచుకొని, అసంబద్ధంగా శబ్దం చేస్తుంటాయి.

ఒకటవ కల్పితం :

ఆధ్యాత్మికంగా, సాధికారికత కలిగిన గురువులు- భౌతిక వాంఛలకు అతీతులు కనుక - వారికి ధన విషయంలో అవసరం చాలా తక్కువ లేదా ధనం యొక్క అవసరమే

లేదు. ఒకవేళ ఈ గురువులలో కొందరికి అవసరమే ఉంటే శూన్యమైన గాలిలో తమ శక్తులను ఉపయోగించి- డబ్బు కట్టలు, ఆహారము, బట్టలు మొదలైన వాటిని సృష్టించుకోవచ్చు.

వాస్తవము :

ఎవరైనా పై విషయం నిజంగా నమ్ముతుంటే ఆయన తప్పకుండా బుద్ధిహీనమైనవాడు (మొరన్) అయి ఉంటాడు. మొదటగా ఒక విషయం - సన్యాసి కాని, పాపాత్ముడుకాని, ఈ నాటి భౌతిక ప్రపంచంలో డబ్బును ఉపయోగించకుండా బతకలేడు. ఒక సాధారణ వ్యక్తికి డబ్బుతోటి ఎంత అవసరం ఉంటుందో, మానవ రూపంలో ఉన్న గురువుకి కూడా ఉంటుంది. ఆయన కూడా సాధారణ అవసరాలు తీర్చుకుంటూ బతకాలి. మౌలికమైన జీవితావసరాలకి, ఉపయోగించిన బిల్లుల (కొనన వస్తువుల మొత్తం విలువను తెలిపే పట్టీ - బిల్) చెల్లింపుకి డుబ్బు కావాలి. ఇది గురువును భౌతిక వాదిగా- ధనం నిండిన మనస్సు కలవానిగా చేయదు. రెండవది- కొంతమంది గురువులు భౌతిక వస్తువుల కోసం శూన్యమైన వాతావరణంలో తమ శక్తులను ఉపయోగించి వాటిని సృష్టిస్తున్నారు. అటువంటి నిరుపయోగకరమైన వాటికొరకు విలువైన శక్తులను వృధా చేసుకొంటున్నారు.

రెండవ కల్పితం :

ఆధ్యాత్మికంగా ప్రతిదీ కూడా దేవుని నుంచి వస్తోంది. అందువల్ల ఎటువంటి ఖర్చులేకుండా ఆధ్యాత్మికత నేర్చుకొన బడాలి, పంపిణీ చేయబడాలి, పంపకంచేయాలి, సమాచారంగా అందివ్వాలి ప్రకృతిలో దైవికంగా, అందంగా ఉన్న ఆధ్యాత్మికతను డబ్బుతో పాడుచేసి, పవిత్రతకు భంగం కలిగించకూడదు.

వాస్తవము :

డబ్బు వినియోగానికి ఉద్దేశింపబడిన సులభమైన స్వరూపం- ఒక గురువు కఠినమైన ప్రయత్నంతో - ఎంతో గొప్ప త్యాగాలు చేసి- తను సంపాదించుకొన్న దానిని నీకు అందజేస్తున్నాడు. **నిజమే- ప్రతి దానికి ఈ లోకంలో వెల ఉంటుంది.** ఈ లోకంలో ఉచిత భోజనాలు

ఉండవు. నువ్వు పొందబోయే ఫలితం కనిపించనిది. కనుక దేనినీ నువ్వు ఉచితంగా ఆశించకు

ఇప్పుడు కల్పితాలకు సంబంధించిన కొంత గందరగోళాన్ని మీకు దూరం చేసానని భావిస్తున్నాను. గురుదక్షిణకి, విరాళానికి రెంటికీ తేడా ఉంది. మనవాళ్లు రెంటిని పర్యాయపదాలుగా వాడుతున్నారు. కాని భేదముంది. విరాళమనేది చాలా విస్తృతమైన అర్థం కలది. ధార్మిక సంస్థలకు ఇచ్చేటప్పుడు ఈ విరాళపదాన్ని వాడుతుంటారు. కాని- దురదృష్టవశాత్తు - దూరదర్శన్ కొరకు నిర్మింపబడిన గురువులున్న కాలంలో, (మేడ్ ఫర్ టివి గురూస్) - విరాళము చాలా ఆచరణాత్మక పదమయింది. చాలా మంది సన్యాసులు మరియు గురువు చాలా పెద్దపెద్ద ధార్మిక సంస్థలను నడుపుతున్నారు. అవన్నీ కూడా మానవుల బాధలను ఒక పద్ధతిగా లేదా ఇంకే రకంగా నిర్మూలించటానికి ప్రయత్నిస్తున్నాయి.

తన వ్యక్తిగత అవసరాలు గడవగా మిగిలిన ధనాన్ని నిజాయితీ పరుడు ప్రపంచానికి తిరిగి ఇవ్వాలనుకుంటాడు. నిజాయితీ లేని వ్యక్తులు ఇటువంటి ధార్మిక సంస్థలను నెలకొల్పుతారు. తమ విస్తృతమైన వ్యాపారపు పనులు చక్కబెట్టుకోవటానికి, ధనాన్ని ప్రవహింప చేయటానికి ఇటువంటి సంస్థలను వాడుకొంటారు. రాజకీయ అధికారాన్ని కొనుక్కుంటారు. ఈ సంస్థలద్వారా నగదు బదిలీ ( ) చేసుకొంటారు. విచారకరమైన అంశం ఏమిటంటే - గతకొన్ని దశాబ్దాలుగా చాలా మంది గురువులు మరియు మతసంస్థలు ఈ బాట పట్టాయి. <u>ఇక్కడ గమనించదగిన ముఖ్య విషయము ఏమిటంటే విరాళము అనే పదం గురుదక్షిణ అర్హతను పొందదు.</u>

గుహుదక్షిణ అనేది ఇంత మొత్తం అనే దానితో సంబంధం లేకుండా గురువుకి ఇచ్చే వ్యక్తిగత బహుమతి. ఈ క్రింది వాటిలో ఒకటికాని లేదా ఎక్కువ కాని గురుదక్షిణ ఇవ్వటానికి కారణాలు.

శక్తియొక్క పరస్పర మార్పిడి :

ఒక గురువు తన శిష్యునికి - జ్ఞానము, బోధ, నివారణ, శిక్షణ, ప్రారంభము లేదా ప్రత్యేక ఆశీర్వచనము - ఇలా ఏదో ఒక రూపంలో అనుగ్రహిస్తాడు. ఇలా అనుగ్రహించటం వల్ల అది కర్మ బాధ్యత ( ) అవుతుంది. ఇంకో జన్మ తర్వాత ఈ కర్మ ఋణాన్ని తన శిష్యుడు తీర్చు కోవాలని గురువు అనుకోడు. అందువల్లనే శక్తి యొక్క మార్పిడి

అవసరమవుతుంది. అది ఎక్కువగా ధనరూపంలో ఉండి, గురు శిష్యుల మధ్య ఋణాను బంధాన్ని చెరిపివేస్తుంది. తన నిత్యావసరాలనిమిత్తం శిష్యుని నుంచి గ్రహించిన ధనం వల్ల ఏర్పడిన ఋణానుబంధాన్ని కర్మ అనే పలకపై చెరిపివేసి శుభ్రంగా ఉంచుకోవటం - గురువుకి చాలా అవసరం

ప్రేమ మరియు కృతజ్ఞత :

చాలా సందర్భాల్లో శిష్యుడు ఇచ్చే గురుదక్షిణా ఒక ప్రత్యేక కారణం అంటూ ఏమీ లేకుండా ఉదాహరణకి శక్తి మార్పిడి ఇలాంటివేవీ లేకుండా స్వచ్ఛందంగా గురువుకి ఇవ్వబడుతుంది. ఇది శిష్యుడు తన ప్రేమను, భక్తిని గురువు పట్ల ప్రదర్శించినప్పుడు మాత్రమే సాధ్యమవుతుంది. కష్టాలలో గురువు తనకు కనబడకుండా చేసిన సహాయానికి, పరిస్థితులను సానుకూలంగా మార్చినందుకు గురువుకి తన కృతజ్ఞతను ఆయనను కలిసినప్పుడు శిష్యుడు తెలియజేయవచ్చు. ఇది ఏరకంగా అయినప్పటికి ఇటువంటి గురుదక్షిణ గురువుకి చాలా ఇష్టమవుతుంది. ఇది పెద్దదా? చిన్నదా అన్నదానితో సంబంధం లేదు.

కర్మ సంపూర్తి :

మీరు రకరకాల మునుల కథలు చదివి ఉంటారు. లేదా విని ఉంటారు. అందులో ఒక గురువు ఒక శిష్యుడిని ప్రత్యేకించి - ఒక పెద్ద మొత్తంలో ధనాన్ని అడగటం జరుగుతుంది. శిష్యుడే ఆ ధనాన్ని స్వయంగా సంపాదించి ఇవ్వాలి కాని, వేరొకరు ఇస్తే గురు దక్షిణగా గురువు ఒప్పుకోకపోవటం - ఇదంతా కథల్లో విన్నాం. ఇదంతా ఎందుకంటే - శిష్యుడి యొక్క భావి జీవితంలో జరగబోయే దుష్పరిణామాలను పోగొట్టడానికి. లేదా - శిష్యుడి జీవితాలలో ముందుకు కదలనివ్వకుండా ఉన్న అభివృద్ధికి కారణమైన కర్మను గురుదక్షిణ రూపంలో తుడిచి వేయటానికి. కొంత పెద్ద మొత్తంలో శిష్యుని నుంచి గురుదక్షిణగా తీసుకొని గురువు - శిష్యునికి ఇప్పట్నుంచి లేదా రాబోయే నిరోధాలను, సష్టాలను, విపత్తులను - తీసివేస్తాడు.

నాకు అప్పుడప్పుడు వినోదం కలుగుతుంటుంది. వాళ్ళు విడిగా, సహజంగా ఉదార

స్వభావులైనప్పటికి గురుదక్షిణ ఇవ్వాలి అనేసరికి ఎందుకో అందమైన బాధపడతారు. ఆశ్చర్యకరమైన విషయం ఏమిటంటే ప్రఖ్యాతి కలిగిన గురువు పేరు మీద లేదా సన్న్యాసి మీద (వారిలో ఎక్కువమంది ఇటీవలే చనిపోయిన వారు) ఏర్పడిన మత సంస్థలకి, కార్యలయాలకి భారీవిరాళాలు ఇస్తారు. ఈ రకమైన నడవడికని - ఒక మానవ పరమైన కారణము మూలమని నేను భావిస్తాను. నేను దీనిని చనిపోయిన సన్న్యాసి లక్షణసంపుటి (డెడ్ సెయింట్ సిండ్రోమ్) అని పిలుస్తాను. దీనిని నేను వివరిస్తాను.

ఒక చనిపోయిన సన్యాసి లేదా దేవాలయంలోని దేవతతో పోలిస్తే జీవించి ఉన్న గురువు కొంత స్వాభావిక ప్రతికూలతను (ఇన్‌హరెంట్ డిస్‌అడ్వంటేజ్) ఎదుర్కొంటాడు. గురువు కూడా మామూలు మానవులలా నడుస్తుంటాడు,
తింటాడు, తాగుతాడు, నిద్రపోతాడు, మలవిసర్జన చేస్తాడు (డెఫికేటింగ్) దూరదర్శన్ చూస్తాడు - ఇలా జీవించి ఉన్న గురువులో శిష్యులు సామాన్య మానవులకు సంబంధించిన రకరకాల అవస్థలు, స్వభావాలు గమనిస్తారు. ఏమయినా, చనిపోయిన సన్యాసి లేదా చనిపోయిన గురువు కంటే - దైవత్వ ప్రకాశం - జీవించియున్న గురువులో తగ్గుతుంది. చనిపోయిన సన్యాసి అన్నిరకాల ఆకర్షణ, తన చుట్టూ ఉన్న గొప్పదయిన ఆధ్యాత్మిక సౌరభం (మిస్టికల్ ఆరా) అనుభవిస్తాడు. ఎందుకంటే అతను భౌతికంగా ప్రాణముతో లేడు కాబట్టి. తమ సొంత ఆలోచనలను, ఇష్టమైన వాటిని - గురువు యొక్క సందేశాలుగా - చనిపోయిన వారి విషయంలో చెప్పవచ్చు. ఎందుకంటే గురువు చనిపోయారు కాబట్టి - వాళ్ళు మాట్లాడలేరు కనుక. దీనికి చోడు, కొన్ని సంస్థలు చాలా తెలివిగా చనిపోయిన గురువుల భక్తులకు - వెర్రిభక్తితో రెచ్చిపోయే సాహిత్యాన్ని అందజేస్తున్నారు. మొత్తంగా అబద్ధం కాకపోయినా - ఆధ్యాత్మిక దోపిడీలకు సంబంధించిన విస్మయస్ఫూర్తి, కథలు, మహిమలు ప్రచురిస్తుంటారు. దీంట్లో ఉన్న ఒక సౌలభ్యం ఏమిటంటే ఈ భక్తులు ప్రచురిస్తున్న సాహిత్యము నిజమో కాదో చెప్పటానికి ఆ గురువు ఇప్పుడు సజీవులు కారు. కొన్ని దశాబ్దాల క్రితమో, శతాబ్దాల క్రితమో వాళ్లు చనిపోయి ఉంటారు కాబట్టి.

వాస్తవికంగా ఉన్నదానికంటె ఎక్కువ అందంగా వర్ణించే పద్ధతిలో (ఎయిర్ బ్రష్షింగ్ ప్రాసెస్) ఈ చనిపోయిన గురువులు ప్రత్యేకంగా చిన్న చిన్న ఛాయాచిత్రాలలో

ఇమిడిపోతారు. ఈ పద్ధతిలో వాళ్లని ఎక్కువ దైవత్వ భావనలోను, తక్కువ మానవత్వ భావనలోను చూపెడతారు. అందరు మత ప్రవక్తలు ఈ "ఛాయాచిత్ర నిర్మాణము" లో ఇమిడి పోతారు. మొదట ఉన్న కథల కంటే వాళ్ల కథలు కాలం గడిచే కొద్దీ ఎక్కువ నాటకీయంగా, విశేషంగా పెరిగిపోతాయి.

నిజమైన గురువు ఎవరుకూడా తనగురించి ఇటువంటి తప్పుడు ప్రచారానికి వినోదాత్మక వ్యాపారాన్ని ఒప్పుకోరు. నువ్వు ఇటువంటి గురువును అతని మార్గంలోనే చూడాలి. లేదా ఇంకొకరి దగ్గరికి వెళ్లాలి. అందుకనే కొంత మంది ఆధునిక గురువులు, తమ చుట్టూ ఉన్న జీవనవ్యక్తిత్వం కంటే అధికంగా పండించుకొంటున్నారు. జాగ్రత్తగా అందరూ చూసే నృత్య దర్శకత్వ కార్యక్రమాలలో (కొరియోగ్రాఫ్డ్ ఫంక్షన్స్) - వీళ్ళు వేదికలపై చాలా తక్కువగా బైటికి కనబడుతుంటారు. వాళ్ల దైవత్వభావన ముఖభాగం అంతా అసూయతో నిండిపోయి ఉంటుంది. వాళ్లతో కలిసే వ్యక్తిగత సమావేశాలు చాలా ప్రత్యేకము మరియు ఖరీదైనవి. ఇంకా చెప్పాలంటే చాలా తక్కువ మందికి మాత్రమే వాళ్లని కలిసే అవకాశముంటుంది. ఆ గురువులయొక్క మానవ పార్శ్వము ప్రజలనకు తెలిసే అవకాశం లేదు. ఎందుకంటే వాళ్ల పేరు, జ్ఞానము - వ్యాపారాత్మకంగా శాఖోపశాఖలుగా ఉంటుంది కాబట్టి.

ఇంకొక వైపుగా ఆలోచిస్తే చాలా మంది ఉత్సాహవంతుడైన ఆధ్యాత్మిక అన్వేషకులు ా గురువుని సరియైనవాడు అనుకొంటేనో తాము సంతృప్తి పడితేనో గురుదక్షిణ ఇవ్వటానికి సిద్ధపడతారు. జాగ్రత్తపడతారు. ఈ మానసిక భావము పూర్తిగా న్యాయబద్ధమైనది. ఒక్కొక్కసారి గురువు నీకు ప్రసాదించిన అనుగ్రహము పనిచేయటానికి కొంతకాలం పడుతుంది. కాని ఒకటి గుర్తుంచుకో ఒక నిజమైన గురువూ నీ దగ్గర గురుదక్షిణగా తీసుకొన్న దానికంటే ఎక్కువ విలువ కలిగిన దానిని నీకు అనుగ్రహిస్తాడు.

నిజం చెప్పాలంటే - జ్ఞానపరిపూర్ణమైన ఆత్మకలవానికి ధనము ఒక ప్రవహించే నదిలాంటిది. దీనికి ఆధారం నిత్యమైనది. అది ఏనాడు ఎండిపోదు. ఆ ప్రవాహం స్థిరమైనది. లోపలికి వచ్చే ప్రతిదీ బయటికి పోతుంది. వంతెన కట్టి సంపద పేరుకుపోయిందా - సందర్భము వాసనకొడుతుంది. (ద రాట్
సెట్స్ ఇన్) ఆ వాసనని భరించటం కష్టము. అందువల్ల జ్ఞాన పరిపూర్ణుడైన ఒక గురువును వెతుకు. గురుదక్షిణ ఎక్కువగా ఉందని వేదన పడకు. నువ్వు గురుదక్షిణ రూపంలో

ఆయనకు ఇచ్చిన సంపద - ఆ గురువు నీపై చూపించే అనుగ్రహం తో పోలిస్తే వెలవెల బోతుంది.

### "ఉద్దేశ్య పూర్వకంగా మీదే"

ఎప్పుడూ తరచుగా ఈ వాక్యాలు నేను వింటుంటాను. "నాజీవితానికి ఉన్న ఒకేఒక ప్రయోజనం ఇంతేనా?! ఒక భార్య/భర్తగా, తల్లి/తండ్రిగా ఉండి, తొమ్మిదినుంచి అయిదుదాకా బాధ్యతలు నిర్వహిస్తుండాలా? నేను భౌతిక సుఖాలలోని ప్రతి అంశాన్ని ఆస్వాదించకుండా, నేను ఎందుకు విశ్రాంతి లేకుండా, ఖాళీ లేకుండా ఉంటున్నాను?! నా నిజ ప్రయోజనం అక్కడ ఎక్కడో పొందాలని అనుకొంటున్నాను. కాని దాని సారాంశాన్ని, స్థితిని నేను తేలికగా అందుకోలేక పోతున్నాను.

ఇటువంటి ప్రశ్నలు, మరియు సందేహాలు ఈ రోజుల్లో సర్వసాధారణం. ఒక వ్యక్తికి బాధాకరమైన సంబంధం ఉంటే, లేదా నిరుత్సాహకరమైన ఉద్యోగం ఉంటే అతని బెంగ ఇంకా అధికమవుతుంది. కొద్దిపాటి ఆధ్యాత్మిక పథంలో ఉంటే, అతని బెంగ, శిఖరాగ్రస్థాయికి చేరుతుంది. నువ్వు పొందుతున్న ఆధ్యాత్మిక ఆనందం - జీవితంలోని తినటం - తాగటం - వ్యభిచారం - సంపాదన, భోగం - మరణ ధృవపీఠం కంటె గొప్పదా? అనే అభిప్రాయం మీకు ఈ సందర్భంలో కలుగుతుంది.

నేను సాధ్యమైనంతవరకు పైన చెప్పిన హృదయాల ఘోషకి జవాబులను చెప్పటానికి ప్రయత్నిస్తాను. నేననుకొంటాను - ఈ సమస్య - ఉపయోగము యొక్క దృష్టిమీద ఆధార పడిఉంటుంది. అతను జీవితాన్ని ఏ రకంగా
గడుపుతున్నాడనే దాని మీద ఈ సమస్య ఉండదు. నేను దీనిని ఎంత విశదంగా వివరించటానికి వీలయితే, అంత వివరంగా విశదీకరిస్తాను.

ప్రముఖమయిన ఉపయోగము యొక్క రెండు కథనాలు అవసరము మేరకు విడగొట్టదగినవి ఒకటి జీవితము యొక్క ఉపయోగము. రెండవది జీవితములో ఉపయోగము. ఇప్పుడు మొదటి దానిని విశదీకరిస్తాను.

జీవితము యొక్క ఉపయోగము :

జీవితము యొక్క ఉపయోగము విశ్వవ్యాప్తమైనది. మానవ రూపాన్ని ధరించిన ప్రతి జీవాత్మకి ఇది వర్తిస్తుంది. నువ్వెవరివి? నువ్వు ఎటువంటి జీవితాన్ని గడుపుతున్నావ్? అనే దానితో సంబంధం లేకుండా ఇది తప్పించుకో లేనిది. అందువల్ల ఐశ్వర్యము, కీర్తి, శక్తి, మేధాశక్తి, విద్య, ఆనందం, తృప్తి, పేదరికం వైపు ఉన్న మానవసమతుల్యత, ఆకలి, బలహీనత, భయము, మూగతనం, నిరక్షరాస్యత, గందరగోళం, దుఃఖము, అమానవీయత - ఇలాంటి వన్నీ మానవులందరూ ఏదో రూపంలో కలిగి ఉంటారు. ఈ గ్రహంపై జీవించే ఉపయోగానికి ప్రాథమిక ఉద్దేశ్యం ఒకటే. మొదటి ఉపయోగము ఆత్మ యొక్క పరిణామము మరియు పరిశుద్ధి (రిఫైన్‌మెంట్) ఇది అజ్ఞానము యొక్క పొరమీద పొరలో చుట్టబడింది. ఈ అజ్ఞానములో ప్రధానంగా ఉన్నది ఇదే. ఆత్మయొక్క వాస్తవ స్థితి, దాని సత్యస్థితి మరియు సంబంధము - ఆత్మకి మరియు మానవునికి మధ్య సంబంధము. అజ్ఞానము ఈ ప్రపంచంలో రకరకాల మార్గాలలో పనిచేస్తుంటుంది. దాని చట్టాలు మనలిని పరిపాలిస్తు న్నాయి. అజ్ఞానము మానవునికి, దేవునికి మధ్య ఉన్న సంబంధాన్ని తెలియ జేస్తుంది. ఈ అజ్ఞానము మానవసంబంధాల గూర్చి, అవి వాస్తవంగా ఏమి చెబుతయో తెలియచేస్తుంది. ఈ అజ్ఞానము వాస్తవంగా - జీవితంలో జరిగే బాధకి, దుఃఖానికి కారణమవుతుంది. ఇంకొక మాటల్లో చెప్పాలంటే మన ఉనికికి
ప్రధానమైన ఉపయోగం ఏమిటంటే ఆత్మకి జ్ఞానం నేర్పటం, పరిశుద్ధి చేయటం.

పైన చెప్పిన వాటితోటే జీవితము యొక్క ఉపయోగము పూర్తికాదు. మనమందరం కూడా కర్మకి సంబంధించిన సానుకూల, వ్యతిరేక కర్మ ఋణాలను పూర్తి చేయటానికి వచ్చాం. ఇది కార్యకారణ సంబంధం (లా ఆఫ్ కాజ్ ఎండ్ ఎఫెక్ట్) మళ్లీ ఒకసారి చెబుతున్నాను అజ్ఞానము లేదా ప్రకృతికి అనుకూలమైన సృష్టి చట్టాలు - పని చేయవని కాదు.

ఇంకొక జీవితావసరాన్ని గురించి తెలియచేసే పెద్ద విషయము ఉంది. ఇది చాలా తక్కువగా తెలుసు. మానవరూపాన్ని ధరించిన తర్వాత - బాధాకరమైన, ఉత్సాహభరితమైన అనుభవాలు రెండూకలిసినా - ప్రతి - ఆస్వాదయోగ్యమైన అనుభవాన్ని వీలయినంతగా

జీవాత్మ గ్రహిస్తుంది. ఇది లెక్కలేనన్ని రూపాలు ధరించిన తర్వాత జరుగతుంది. మానవరూపాన్ని శాశ్వతంగా వదిలిపెట్టే అంతిమ సమయానికి సంబంధించిన అర్హత ఆత్మకి అప్పుడే కలుగుతుంది.

పైన చెప్పిన ఎక్కువ లేదా తక్కువలు "జీవితము యొక్క ఉపయోగాని"కి సంబంధించిన మొత్తం వర్ణ చిత్రాన్ని రచిస్తాయి. శబ్ధ, స్పర్శ, రూప, రస, గంధాలకు సంబంధించిన మానవ ఇంద్రియ జ్ఞానాలకు ఒకవైపు తృప్తిని కలిగిస్తూ - అది లోతైన అర్థాన్ని కూడా ఇస్తుంది. ప్రతి వ్యక్తి యొక్క తలరాతను అనుసరించి లేదా విచక్షణా జ్ఞానం పై ఆధారపడి (ఇంకో మాటలో చెప్పాలంటే స్వేచ్ఛ) ఆధారపడి ప్రతి జీవాత్మ తన జీవితపు ఉపయోగాన్ని పూర్తి చేసుకొంటుంది.

జీవితములో ఉపయోగము :

పైన వివరించిన జీవితము యొక్క ఉపయోగము ఏ ఒక్క వ్యక్తికీ మినహాయింపు లేదు. అందరికీ వర్తిస్తుంది. కాని జీవితములో ఉపయోగము ప్రతి జీవాత్మకి వ్యక్తిగతమైనది. విశిష్టమైనది. ప్రత్యేకమైనది. ప్రతి వ్యక్తి యొక్క జీవననిర్మాణ ప్రణాళిక (తలరాత) తో పాటు - వ్యక్తి యొక్క వ్యక్తిత్వము, బలము, తెలివి తేటలు, ఆలోచనా విధానము మరియు ముఖ్యంగా సాంఘిక/తల్లిదండ్రుల స్థితి - వీటిపై వ్యక్తి యొక్క 'జీవితములో ఉపయోగము' అనే అంశం ఆధారపడి ఉంటుంది.

నేను ఈ "జీవితములో ఉపయోగము" అనే విషయముపై ఇంకా వ్రాయబోయే ముందు ఒక విషయం గట్టిగా చెప్పదలుచుకొన్నాను. ఇది మన సమాచార పత్రికలలో వచ్చే పెద్ద పెద్ద సంఘటనలకు సంబంధించిన మెరుపు వార్తల సంపుటి కాదు. ఇది ఏమీ ఒక వృత్తిని నిర్ధారించేది కాదు. అలాగే ప్రతి అవకాశములోను ప్రశంస (చప్పట్లు) పొంది గొప్పది, విలువ కలది అని - అనిపించుకొనేది కాదు. జీవితంలో నీ ఉపయోగం చాలా వరకు ప్రాపంచికమైనది - ఇది చాలా సాధారణమైనది. దీనిలో ఎటువంటి దోషం లేదు.

ఇప్పుడు మనం ప్రశ్నించుకొందాం: జీవితంలో నీకు ఏమన్నా ఉపయోగం ఉందా అని. ఒక వేళ ఉంది అని నువ్వు అనుకొంటే నువ్వు దానిని ఎలా గుర్తిస్తావ్? జీవితాన్ని ఆ

అవసరం కొరకు ఎలా కొనసాగిస్తావ్? ప్రారంభదశలో - ఒక ఉపయోగం లేనిదే ఏ మానవునికి జీవితం లేదు. ఇది వాస్తవం. జీవితంలో ఉపయోగం ఏమిటో వ్యక్తిగత జీవన నిర్మాణ చిత్రం (తలరాత) లో ప్రతివ్యక్తి కి విడివిడిగా నిర్దేశితమయి ఉంటుంది. అయితే అందులో ఉపయోగము - విసుగుగా, అనాసక్తిగా, ఉత్కంఠ లేకుండా ఉంటే - అప్పుడు అటువంటి జీవితం గడపటంలో పెద్ద ఉపయోగం లేదని చెప్పవచ్చు.

కాని ఆగండి. మీ తలరాత (జీవన నిర్మాణ ప్రణాళిక) ఒక గతిశీలమయిన (డైనమిక్) పత్రం. దీంట్లో - మీ జీవితంలో మార్పులు తెచ్చుకోవటానికి వీలయిన అసంఖ్యాకమైన అవకాశాలు, సామర్థ్యాలు - బయటి సరిహద్దులో రాయబడి ఉంటాయి. కనుక విధి ఇలా నన్ను చేసిందేమిటా అని విచారపడనక్కర లేదు. ప్రతి రోజూ ఉపయోగం లేకుండా జీవితంలో ఉన్నామేమిటని నిరాశగా బాధపడనక్కరలేదు. మూత తీయని అనేక ఉ త్సాహాలు, సంభ్రమాశ్చర్యాలలో ముంచెత్తే శక్తులు - మీ జీవన నిర్మాణ ప్రణాళికలో ఉ న్నాయి. వాటి మూత తీసిన వెంటనే నీకు అవి తృప్తి కలిగిస్తాయి. నీ జీవితపు లక్ష్యమేమిటో చెబుతాయి. లక్ష్యాన్ని వెతికిస్తాయి.

కనుక మొట్ట మొదటగా నువ్వు చేయవలసిన పని - నీకు ఏది పరిపూర్ణమయిన తృప్తిని కలిగిస్తుందో - దానిని గుర్తించు. ఇంట్లో వాళ్లకి వండిపెట్టడం, పిల్లల్ని పెంచటం - నీకు ఆ తృప్తిని కలిగిస్తే - ఇక ఎటువంటివి చూడకండి. నువ్వు చేసే ఉద్యోగంలో స్పష్టత, ఆనందం, ఒక ఆటలో పాలుపంచుకోవటం, ఒక తీవ్రమైన అలవాటు, మేధా పరమైన ముసుగు (ఇంటలెక్చువల్ పర్స్యూట్), సాంఘిక జాలకీకరణం (నెట్ వర్కింగ్), విచ్చలవిడితనం - ఇవి మొత్తంగా కాని - లేదా వీటిలో కొంత భాగంగా గాని నీకు మంచిది అన్న భావనను కలిగిస్తే - జీవితంలో ప్రయోజనమేమిటో నీకు తెలిసినట్లే. నీ జీవితపు ప్రయోజనము ఎప్పుడు ఆధ్యాత్మికంగా, దాతృత్వంగా, మానవసేవా భరితంగా ఉండనవసరం లేదు. కొసమెరుపు........ నువ్వు వెళుతున్న మార్గంలో నీకు ఆనందం కలుగుతున్నదంటే, జీవితంలో ఉపయోగము కూడా నెరవేరినట్లే.

నువ్వు గడుపుతున్న జీవితంలో అసంతృప్తిని నువ్వు అనుభవిస్తే, అన్నిరకాల సంపదలు - సుఖ జీవనకారకాలు - ఎన్ని ఉన్నప్పటికి ఒత్తిడిని

నువ్వు పొందుతుంటే చుట్టూ కుటుంబ సభ్యులు అనేకమంది స్నేహితులు ఉన్నప్పటికీ నేను ఒంటరిని అనే భావనని నువ్వు కలిగి ఉంటే నువ్వు అప్పుడు తప్పకుండా నీ జీవన నిర్మాణ ప్రణాళిక (తలరాత) కలిగి ఉన్న ఇతర శక్తులను గురించి తప్పకుండా అన్వేషించాలి. అలా చేస్తే నువ్వు సరియైన తలుపులను తెరవటానికి కావలసిన జ్ఞానాన్ని పొందినట్లు. నువ్వు ఇక్కడ రెండు నిబంధనలు పాటించాలి.

1వ నిబంధన :

ఎప్పుడు కూడా నీ ఎదుటకి వచ్చే, నిన్ను పలకరించే అవకాశంకోసం ఎదురు చూడు. అర్థం ఏమిటంటే - నీ జీవన నిర్మాణ ప్రణాళిక (తలరాత) లో లేనివి, ఎప్పుడూ ఆ కోర్కెలను సాధించుకోవాలని ప్రయత్నిస్తే ఓటమిని, ఒత్తిడిని ఇచ్చేవి - అయిన కోర్కెలను - నీ జీవితంలో సాధించాలనుకొంటున్న వాటిని - అవి నీ దగ్గరకు వచ్చేదాకా ఆగు. విధి నీ దగ్గరకు ఆ కోర్కెల సాధనను తీసుకురాగానే, ఆ అవకాశాన్ని రెండు చేతులతో గట్టిగా పట్టుకో.

2వ నిబంధన :

చాలా ముఖ్యమైన విషయం. ఇప్పుడున్న విషయాలతో కట్టుబడి ఉండకుండా, ఇంకా కొన్ని కొత్త విషయాలను నీ జీవన నిర్మాణ ప్రణాళికలో నువ్వు వెతకాలని అనుకొంటే - దయచేసి తెలుసుకో - నువ్వు వెతుకుతున్న ఆ శక్తి విషయాలు ఎప్పుడూ నీకు సుఖకరమైన ప్రదేశంలో (కమ్‌ఫర్ట్ జోన్) బాహ్యంగానే ఉన్నాయని. ఇది గమనించవలసిన చాలా పెద్ద విషయం. అయితే మనలో చాలా మందిమి - ఈ జీవన తృప్తినిచ్చే విషయాలను పట్టించుకోము.

మానవ ధోరణి ఎలా ఉంటుందంటే గొప్ప ప్రయోజనం కోసం కలలు కంటుంది. అభిరుచికి అనుగుణంగా జీవించాలని ఉంటుంది. రాబోయే సంవత్సరాలలో ప్రజలందరూ గుర్తుపెట్టుకొనే మంచి పనులు చేయాలని ఉంటుంది. సమాజానికి ఉపయోగపడే పని - విభిన్నంగా మనం చేయటంలో ప్రేమని పొందాలి. ప్రత్యేకంగా అణగదొక్కబడిన సమాజం పట్ల ప్రేమ కలిగి ఉండాలి. నువ్వు నిద్రలేచిన వెంటనే, అడుగు వేస్తున్నప్పుడే, ఏదోఒకటి చేయాలి అని భావించు. ప్రేమతో దాన్ని చేయి. అప్పుడే నీ జీవితము

యొక్క ప్రయోజనము నెరవేరినట్లుగా నువ్వు భావించు. కలలు కనటమనేది చాలా చెడ్డదిగా మారుతుంది. అజ్ఞానంలో చాలా ఉన్నత శిఖరాలు అందుకొన్నట్లు, అతీతమైన శక్తులు పొందినట్లు, సంపూర్ణజ్ఞానం పొందినట్లు నిరంతరం దయని పొందుతున్నట్లు - ఇలా రకరకాల ఆధ్యాత్మిక ఊహా చిత్రాలు ఉంటాయి. ఇలాంటి కలలు అసహ్యంగా ఉంటాయి. మానవ జాతిని ఉద్ధరిస్తున్నట్లు, బాధని పోగొడుతున్నట్లు ద్వేషాన్ని ఈ భూగ్రహం మీద తుడిచివేస్తున్నట్లు - చివరికి తియ్యటి మోక్షాన్ని పొందినట్లు - కలలు కనాలి.

సమస్య ఏమిటంటే ఇవన్నీ ఊహా చిత్రాలు (ఫాంటసీస్) ఎప్పుడూ అవి స్థిరంగా ఉంటాయి. అందువల్ల మనలని సుఖకరమైన ప్రదేశం (కమ్‌ఫర్ట్ జోన్) నుంచి ఒక్కడుగు ముందుకు వేయనీయవు. మన నిత్య ప్రపంచ సంబంధాలల్లోకి వచ్చి ఇవి మనల్ని చీకాకు పరచకుండా ఉంటే, స్థిరత్వాన్ని రక్షించుకొంటే మనం తప్పని సరిగా ఈ అవకాశం వైపు ఒక్క గెంతు గెంతగలం. మౌలికంగా నువ్వు ఇంట్లోను, కుటుంబంలోను, ఆర్థిక రక్షణ, సామాజికవ్యవస్థా ఇలాంటి వాటిల్లో రక్షణాయుతంగా ఉండగలిగితే కలలను వేటాడమనే విషయాన్ని నువ్వు పట్టించుకోనవసరం లేదు.

కాని అనుకొన్నట్లుగా ఆ రకంగా జరగదు. నువ్వు మారాలనుకొంటే, సవాళ్లను ఎదుర్కోవాలంటే, సంతృప్తిని పొందాలంటే - లేదా ఆ విషయాలతో ఉండే జీవితాన్ని పొందాలంటే - నువ్వు తప్పని సరిగా ఆ బలిసిన పెద్దదయిన
అవకాశాలనూ కిటికీలోనుంచి బయటికి తోసేయ్. బలంతో, నిశ్చయంతో ఉండు (థో యాస్ నెయిల్స్) ఏరకమైన సందర్భాన్నయినా ఎదుర్కోవటానికి సిద్ధంగా ఉండు. నిజమైన సంతృప్తి అంత తేలికగా రాదు. నీకు సుఖకరమైన ప్రదేశంలోకి అసలు రాదు.

చివరిగా నన్ను చెప్పనివ్వండి ఉపయోగకరమైన జీవితము పట్ల కలలు కనటము నుండి కలలలో నిజంగా జీవించటానికి - చాలా ధైర్యం కావాలి. చాలా కఠినమైన ఎంపికలు ఉంటాయి. బాధల పోరాటాలు ఉంటాయి.

## స్వర్గానికి పెద్ద రహదారులు

ఒక తెలియని గమ్యస్థానానికి - వేగం ధ్వనిస్తూ - ఉద్రేకాలు ఆనందాలు నిండిన జీవితాన్ని - రచయితలు - సంగీతజ్ఞులు - ఒక్కోసారి "నరకానికి వెళ్లే ఉత్సాహము (హైవే టు హెల్- అనేది ఒక రాక్ మ్యూజిక్ గీతం- అనువాదకుడు) చెబుతుంటాయి. ప్రత్యామ్నాయంగా స్వర్గానికి ఉన్న దారి ఒక రకమైన మెట్లతో కూడుకొని ఉంటుందని, చాలా నెమ్మదిగా, శ్రమతో, విసుగు కలిగించే స్వారీతో ఉంటుందని చెబుతారు. బయటికి ఎంత ఉద్రేకంగా కల్పించినప్పటికి - పరిశీలనగా చూసిన వాడెవడూ నరకంలో నివాసానికి సంబంధించిన "వీసా'' (రెసిడెంట్ వీసా) తీసుకోవాలని అనుకోడు. అందువల్ల నరకాన్నుంచి వెనక్కి తిరిగి వచ్చేటప్పుడు లేదా దైవం వైపుకు నువ్వు వెళ్లాలని నిశ్చయించుకొన్నప్పుడు నీకు ఆ ప్రయాణము "స్వర్గానికి ఉన్న పెద్ద రహదారుల'' మీదనే అందంగా ఆనందంగా సాగుతుంది. నా ఉద్దేశము ఏమిటంటే - ఈ వ్యాసంలో నేను దైవత్వానికి సంబంధించిన రెండు పెద్ద రహదారుల యొక్క ''గూగుల్ భూమి వీక్షణ'' (గూగుల్ ఎర్త్ వ్యూ) ఇవ్వబోతున్నాను. (ఇదివరలో ఉపగ్రహాలు కనిపెట్టక మునుపు'' పక్షుల యొక్క దీర్ఘదృష్టి కూడా ఇలానే ఉండేది.)

ఈ మొదటి పెద్ద రహదారి పేరు మతపరమైన పెద్ద రహదారి. రెండవది ఆధ్యాత్మికపరమైన పెద్ద రహదారి. ఒక్క నిముషం ఊహించండి. రెండు రహదారులు సమాంతరంగా పక్కపక్కనే వెళుతున్నాయి. ఒకే దిక్కుగా వెళుతున్నాయి. ఒకే గమ్యస్థానానికి నిన్ను చేరుస్తాయి. ఆ గమ్యస్థానానికి దేవుడని, లేదా ప్రపంచంలోని సృజనాత్మక శక్తి అనో - నీ ఇష్టమొచ్చిన పేరుతో పిలు. ఈ రెండు రహదారులలో నువ్వు వెళ్లబోయే ముందుగా - నేను - ఫలానా రహదారి ఈ రెండింటిలో బాగుంటుందని నీకు ఎటువంటి తీర్పు ఇవ్వను. నేను కేవలం నీ ముందు సంపూర్ణ వాస్తవికతను ఉంచుతాను. కొన్ని నగ్న సత్యాలకు పోలికలు చెప్పే రూపకాలంకార శైలిలో చెబుతాను. దీని వల్ల మీకు అంశాలు స్పష్టంగా తెలుస్తాయి. మీరు ఏ రహదారిలో వెళ్లాలో, ఏది ఇష్టమో మీకు మీరే నిర్ణయించుకొంటారు.

మతపరమైన పెద్ద రహదారి :

ఈ మతపరమైన పెద్ద రహదారి పూర్తిగా రహదారి పన్ను లేనిది. చాలా పెద్దది. ఒక పదో, లేదా పన్నెండో లేన్లు (రెండువరుసల మధ్య త్రోవను రహదారులకు సంబంధించిన

లేన్ అంటారు. -అనువాదకుడు) ఉంటాయి. అన్ని దారులలోని రాకపోకలు పుష్కలంగా ఉండి, ఏడాది పొడుగునా శాశ్వతంగా నత్త వేగంతో కదులుతుంటాయి. ఈ రహదారికి ఎటువంటి మరమ్మత్తులు ఉండవు. నిర్వహణము లేదా పైన కనిపించే పని - మొదటి సారి ఈ రహదారి వేసినప్పుడే జరిగి ఉంటుంది. యాజమాన్యము పూర్తిగా అవినీతిలో కూరుకొని పోయిన వాళ్లు, ఈ రహదారిలో వృద్ధిపొందే సూచనల గురించి మాట్లాడు కొంటుంటారు. కాని వాళ్లెప్పుడూ కనబడరు. ఈ రహదారిలో లెక్కలేనన్ని గుంతలు ఉన్నాయి. ఎగుడు దిగుడుగా అసంపూర్తిగా ఉన్న అతుకులు ఉన్నాయి. నిత్య విరామాల మధ్య విసుగు కలిగించే వేగ నిరోధకాలు (స్పీడ్ బ్రేకర్స్) ఉన్నాయి. ప్రమాదవశంగా జరిగే చిన్న చిన్న సంఘటనలు (మైనర్
యాక్సిడెంట్స్), దురదృష్టకరంగా జరిగే సంఘటనలు (మిషప్స్) రోజువారి నిబంధనల ప్రకారం జరుగుతుంటాయి. చిన్న పాటి తగాదాలతో రెచ్చగొట్టుకొనటం ద్వారా ఒక కారు (రథం) ఆక్రమించుకొన్నవారు తమ ఇరుగు పొరుగు వారితో ముష్టియుద్ధంలోకి చొరబడతారు లేదా క్రూరమైన ఘర్షణలు చేస్తారు. రకరకాల నిర్వహణ సంస్థలు - తమకు తామే ఈ పెద్ద రహదారికి రక్షకత్వ బాధ్యతను తీసుకుంటాయి. అందువల్ల గందరగోళ పరిస్థితి మరియు నెమ్మదైన అభివృద్ధి జతపడుతుంది. వాళ్లు రూపొందించిన చట్టాల ఉల్లంఘనంచేయటంలో వాళ్లకు ఎటువంటి సహనం ఉండదు.

చాలా మంది కార్లు నిండటానికి ఎంత సామర్థ్యముందో, అంత వరకు కుటుంబ సభ్యులతో నిండిపోయి ఈ పొడవైన, ప్రయాసపూర్వకమైన యాత్ర చేస్తాయి. ఈ మతపరమైన రహదారిలో రెండు పక్కలా విశాలమైన మౌలిక సదుపాయాల నిర్మాణాలు- పుట్టగొడుగుల్లా అనేక సంవత్సరాల నుంచి ఉన్నాయి. పెద్దవైన వాహనాలకు ప్రవేశం లేని విపణులు (హ్యూజ్ మాల్స్) బేరమాడే శాలలు (షాపింగ్ ఆర్కేడ్స్), వినోదాత్మకమైన ఉద్యానవనాలు (అమ్యూజ్‌మెంట్ పార్క్స్), నీళ్ల ఉద్యానవనాలు, నక్షత్రాల గుర్తులు ఉన్న విడుదులు (స్టార్ హోటల్స్), బాట పక్కనే ఉండే భోజనశాలులు (హోటల్స్), ఫలహార శాలలు (కేఫ్ టేరియాస్), వసతిగృహాలు (ఇన్స్), అల్పాహారశాలలు (పబ్స్) పాప్ సంగీతంతో నృత్యముచేసే ప్రజల వసతి గృహాలు (డిస్కోస్), నాటక శాలలు (థియేటర్స్), చలనచిత్రాలు, వినోదాలు కలిసిన శాలలు (ఫెయిర్స్), క్రీడాంగణము, రంగస్థలము, జెట్టీలు, గుర్రము మీద మొగ్గలు మొదలగు విద్యలు చేయు స్థలాలు (సర్కస్) - ఇవన్నీ వాస్తవంగా

వినోదింపచేయటానికి ఉన్నాయి. నత్తనడకగా ఉండే దారిలో విసుగు, వేదన కలిగిన ప్రయాణీకులు ఈ వినోద స్థలాలు హాయి కలిగిస్తాయి. నిజానికి మనం నెమ్మది అనుకొంటాంగాని - అదే వారి దృష్టిలో వేగము. చాలా కొద్దిమంది మాత్రమే
గమ్యం చేరటానికి ఆ లక్ష్యం ఎంచుకొంటారు. ప్రతి వాళ్లు ఆ ప్రయాణంలో ఆనందాన్ని అనుభవి స్తున్నట్లు కనిపిస్తారు. రహదారికి రెండు పైపులా ఉన్న శాశ్వతమైన సంబంధాలతో వారు ఆనంద ఛాయ పొందుతారు. ఒకే విడిదిలో (హోటల్) లేదా వినోదాత్మక మైన ఉద్యానవనంలో (అమ్యూజ్ మెంట్ పార్క్) లెక్కలేనన్ని వాహనాలు నెలల తరబడి నిలిచి ఉంటాయి. ఈ పెద్ద రహదారిపై ఇంకో చిన్న దూరంగల తోవను వెతుక్కొనే వరకు ఆ విడిదిలో వాహనాలు అలానే ఉంటాయి.

చేరే గమ్యస్థానము తక్కువదూరం కలిగినదా? లేదా ఫలితమేమిటి అనే దానితో సంబంధం లేకుండా - సర్వసాధారణంగా ప్రయాణభత్యము ఒకే రకంగా ఉంటుంది. ప్రయత్న పూర్వకంగా లేని ఈ ప్రయాణంలో సారం ఉంటుంది. మందకొడి వేగము మరియు పరధ్యానము రెండూ కలిసిన ఈ ప్రయాణంలో ఎక్కువగా ఎవరూ ప్రయణం చేయలేరు 'అప్పుడప్పుడు కొంతమంది గమ్యస్థానం చేరాలని ఒక వదంతి వినబడుతుంది. కాని ఎవరూ కూడా చేరినట్లుగా నివేదిక ఇవ్వలేదు.

ఇది పన్నులేని రహదారి కనుక, చాలా ప్రాంతాలలో ప్రవేశము (ఎంట్రీ) నిర్గమకాలు (ఎగ్జిట్) ఉన్నాయి. కొంతమంది ఔత్సాహికులు ముందుకు సాగుతుంటారు. పాత వాళ్లయిన అలసిపోయిన ప్రయాణీకులు దిగిపోతారు.-ఈ ఉచిత మార్గం మీద కొంత దూరం వెళ్లిన తర్వాత రెండుగా విభజించ బడిన ముఖ్యమైన సమద్విఖండన (బైఫరకేషన్) దారి కనిపిస్తుంది. ఇది ఆధ్యాత్మికపు పెద్ద రహదారి. నీ ప్రయాణపు దారిని నువ్వు మార్చుకోవటానికి అవకాశముంది.

ఆధ్యాత్మికపు రహదారి :

ఈ పెద్ద రహదారి మతపరమైన పెద్దరహదారి నుండి కలవటానికి
వీలుంది. కాని దీనికి సొంత లక్ష్యాలున్నాయి. కాక పోతే ఇది పన్ను కలిగిన రహదారి. దీనిలో అడుగుపెట్టాలంటే పెద్ద ధర చెల్లించాలి. రెండవ రహదారితో పోల్చిచూస్తే - ఈ ఆధ్యాత్మిక

రహదారిపై కార్లు చాలా వేగంగా పరిగెడతాయి. ఒక కేంద్రీకృత వ్యవస్థ లేకపోయినప్పటికి ఈ రహదారి నిర్వహణ అద్భుతమైన వాతావరణంలో నిర్వహించబడుతుంది. గత కాలపు మరియు వర్తమానకాలపు స్వతంత్ర సంస్థలు ఈ రహదారిని అద్భుతంగా తీర్చిదిద్దుతుంటాయి కాలానుగుణంగా స్థిరమైన అభివృద్ధి మరియు కొత్త సాంకేతిక విధానాలు ఈ రహదారిలో రక్షణాత్మకంగా జరుగుతుంది. అయితే అప్పుడప్పుడు విపరీతమైన వేగాల ఘర్షణవల్ల ప్రమాదాలు కూడా జరుగుతుంటాయి. నడిపే చోదకులు (డ్రైవర్స్) చాలా వేగంగా వెళ్లటం వల్ల లేదా విపరీతమైన వేగాన్ని అదుపు చేసే సామర్థ్యము లేక పోవటం వల్ల ఈ ప్రమాదాలు జరుగుతాయి. చాలా మంది చోదకులు పక్క వాళ్లని దాటి పోవాలనే ప్రయత్నం వల్ల - ఒక్కొక్కసారి చీలిన పెంటకుప్పలపై పడతారు. రహదారి గుర్తులను ఉద్దేశ్యపూర్వకంగా లేదా తెలియకుండానే నిర్లక్షం చేయటంవల్ల తరచుగా ఈ ప్రమాదాలు జరుగు తుంటాయి.

ఈ రహదారి పక్కన కొన్ని కొన్ని పరధ్యానాలు - సుదీర్ఘ విరామాల తర్వాత ఏర్పడుతుంటాయి. ఇంధన ప్రదేశాలు (గ్యాస్ స్టేషన్స్) మరియు ఫలహార శాలలు (రెస్టారెంట్స్) ఈ రహదారి పక్కగా ఉండి ప్రయాణీకులను మళ్లీ ఇంధనం (రీ ఫ్యూయల్) ఇస్తూ, చక్కటి విశ్రాంతిని ఇస్తాయి. సాధారణంగా వాహనాలలో చోదకుడు (డ్రైవర్) ఒక్కడే ఉంటాడు. అయితే చాలా సార్లు తనవెంట ప్రయాణీకులను కూడా తీసుకొని వెళుతుంటాడు. ప్రతి ప్రయాణీకుడు సాధ్యమయినంత త్వరగా తన గమ్య స్థానాన్ని చేరుకోవాలని అనుకొంటాడు. ఇవ్వబడిన సమయంలో - కనీసం- ఆ గమ్యస్థానానికి దగ్గరగా నయినా వెళ్లాలని అనుకొంటాడు. ఇలా చెప్పటం వల్ల నెమ్మదిగా వెళ్ళే
ప్రయాణీకులు లేరనికాదు. ఇది కేవలం ఎంత వీలైతే అంత దూరం అంత వేగంలో చేస్తారని చెప్పటానికి మాత్రమే.

ఈ రహదారికి సంబంధించినంతవరకు ఒక అద్భుతమైన విషయము ఏమిటంటే - చాలామంది ప్రయాణీకులు ఈ రహదారిపై ప్రయాణించి గమ్య స్థానాన్ని చేరుకొన్నారు. అక్కడికి చేరుకొన్న తర్వాత చాలామంది ప్రయాణీకులు చేరిన విషయాన్ని తెలియచేసారు. అలాగే ఎలా చేరుకోవాలో చెప్పటంతో పాటు రహదారి నిబంధనలు మధ్య మధ్య విరామాలు కూడా కొత్త ప్రయాణీకులకు చెప్పారు. ఈ అత్యంత వేగమైన రహదారిపై చాలా నేర్పుకలిగిన

వారు లక్ష్యస్థానాన్ని చేరుకొని మళ్లీ తిరిగి వచ్చి, ఎవరికి సహాయం కావాలో వారికి శిక్షణా కేంద్రాలు కూడా ఏర్పాటు చేస్తున్నారు. చాలా మంది ప్రయాణీకులు ఈ అవకాశాన్ని వినియోగించుకొంటున్నారు.

ఈ పెద్ద రహదారిపై ఎలా రాయబారాలు చేయాలో (నెగోషియేట్) తెలియచేసే అభ్యాస సహాయము కల్పించబడింది. విపరీతమైన వేగంతో వెళ్లి దెబ్బతిన్నవారికి, మతపరమైన రహదారిలో వెళ్లి నాశనమయ్యామని భావించిన వారికి సహాయకేంద్రాలు వారి శారీరక, మానసిక గాయాలకు స్వాస్థత కలిగిస్తాయి.

ఇక్కడ ఒక ప్రహేళిక. (పజిల్) ఇప్పుడు నేను ఉపయోగించిన రకరకాల సారూప్యాలను లెక్కించండి ఒక సంస్థాగతమైన మతపరమైన రహదారి గురించి మరియు ఒక ప్రత్యేక గురువు పర్యవేక్షణలో పరిశుద్ధమైన ఆధ్యాత్మికత గల రహదారిని గురించి తెలియచేసి, వాటి మధ్య తేడాలు తెలియచేయటానికి వ్యాసం వ్రాసాను.

**దేవుని కొరకు రెండు మెట్లు**

దేవుని గురించి చాలా మంది వ్రాసారు. అలాగే మానవుడు దైవత్వాన్ని పొందటానికి చేసే ప్రయత్నాల గురించి కూడా చాలా మంది వ్రాసారు. ఇప్పుడు నేను వ్రాయబోయేది ప్రపంచములో దాచిపెట్టిన పెద్ద రహస్యమేమీ కాదు. కాక పోతే మీ ఆధ్యాత్మిక తపనకి, దృష్టికోణానికి - ఇంతకు ముందెన్నడు చూడని - కొత్త కోణాన్ని తప్పకుండా జతచేస్తాయి. ఇతర రచయితలు చెప్పిన ఆధ్యాత్మిక సమాచారాన్ని మళ్లీ చెప్పిందే చెప్పి మిమ్మలిని విసిగించను. అలాగే తత్త్వశాస్త్ర పుస్తకాల వ్యాఖ్యానించను. నేను వ్రాయబేయే ప్రతిమాట నా సొంతమయిన మాట. పుస్తకాల్లోని జ్ఞానానికి విరుద్ధంగా - నేను చెప్పబోయే జ్ఞానము నా అనుభవం ద్వారా సంపాదించింది.

ఇక్కడొక చిన్న తప్పుని నేను ఒప్పుకోవలసిన సమయము వచ్చింది. సర్వత్రా విస్తరిస్తున్న, దశాబ్దాల నుండి అన్నివైపులకు ప్రసారమవుతున్న నా జ్ఞానమనండి, సమాచారమనండి - ఇందులో లెక్కించదగిన భాగము నాదికాదు. తప్పనిసరిగా అది నా అధిక గౌరవనీయులు, ప్రేమ మూర్తి, సలహామూర్తి అయిన గురుదేవులు, ప్రతి విషయంలోను

నాకు వెలుగును దర్శింపజేస్తున్నవారు, చిరంజీవులై హిమాలయాల్లో ఉంటున్న యోగి పుంగవులు **శ్రీమహావతార్ బాబాజీ** గారి ప్రత్యక్ష బోధన, సూచన, మార్గ దర్శకత్వము. నా అదృష్టవశాత్తు 2010లో వారిని ప్రత్యక్షంగా కలుసుకొనే అపూర్వమైన అరుదైన అవకాశం లభించింది. నేను ఈ సత్యం బహిరంగంగా ఎందుకు చెబుతున్నా నంటే - ఇలా చెప్పకపోతే - నేను చెప్పే ప్రతి అంశం నాదే అనే లాభాన్ని - కపట కీర్తిని పొందుతాను కాబట్టి - ఈ పుస్తకంలో వచ్చిన అధికశాతం సమాచారం ఎక్కడి నుంచి పొందానో నేను గుర్తు చేసుకోవటం అత్యవసరం.

ఇప్పుడు వ్యాసంలోకి వద్దాం. నిజమైన ఆధ్యాత్మిక అన్వేషకునికి అంత రాంతర తపన ఏమి ఉంటుందనేది మీకు చాలా ఆశ్చర్యం కలిగిస్తుంది. దీని జవాబు చాలా విస్తృత పరిధి కలది. అసలు వ్యక్తి దైవత్వం వైపు ఎందుకు ఆకర్షించబడతాడనే విషయం మీద విభేదాలు కూడా ఉన్నాయి. కొంత మంది బాధ, దుఃఖాలతో, కొంత మంది వాళ్ల ప్రపంచం హఠాత్తుగా నలిగిపోయినప్పుడు, కొంత మంది తమ మతనిర్వాహకసంస్థ ద్వారా పొందిన భ్రమ యొక్క కొలతలను గుర్తించటానికి, కొంతమంది పరిపూర్ణమైన కుతూహలంతో దైవత్వం వైపు మళ్లుతుంటారు. కాని మనలో చాలమందిమి పూర్వ జన్మల బంధాల మంచి ఉద్ధరించుకోవటానికి దైవత్వం వైపు మళ్లుతాము. మార్గమేదైనప్పటికి, ప్రతి అన్వేషకునికి అంతర్లీనంగా ఉండే లక్ష్యము స్పష్టంగా ఒకటే

మొదట ఈ విశ్వం చేసే రహస్యపు పనులగురించి కొన్ని జవాబులు మనం తెలుసుకోవలసి ఉంది. ఇంకా చెప్పాలంటే మనం నడిచే జీవన మార్గం తెలుసుకోవాల్సి ఉంది -సృష్టికర్త, స్థితికారకుడు, లయకారుడు అనే రూపాల్లో ఉన్న మనం దేవుడని పిలిచే శక్తిమంతుడిని గురించి తెలుసుకోవటానికి ప్రయత్నిస్తుంటాం. ప్రధానంగా పుస్తకాల ద్వారా కొంత ప్రాథమిక జ్ఞానాన్ని పొందుతాం. ఈ మార్గం ద్వారా మనం వెళితే - అది మనకి ఎరుక కలిగిస్తుందని తృప్తి కలిగిస్తుందని, అన్ని బాధలనుండి, అజ్ఞానం నుండి విముక్తి కలిగిస్తుందని- మనం గ్రహిస్తాం. ఇంకా మనం గట్టిగా ప్రయత్నిస్తే - మనం అద్భుతమైన అసాధారణమైన శక్తులను అనుభవిస్తామని! రకరకాల యోగస్థితులను పొందుతామని పుస్తకాల్లో మాత్రమే చదువుతున్నాం. చివరికి అయిదు ఇంద్రియాలను మించిన ఒక తన్మయత్వాన్ని కూడా పొందుతామని చదువుకున్నాం.

చాలామంది ఆధ్యాత్మిక రచయితలు ఈ లక్ష్యాన్ని స్వీయ పరిపూర్ణత (సెల్ఫ్‌రియలైజేషన్) అన్నారు. అత్యాధునికులు దీనిని స్వీయ వాస్తవికత (సెల్ఫ్‌యాక్చువలైజేషన్) అన్నారు. (నిజం చెప్పాలంటే ఈ రెండు రకాలైన పదబంధాలు ఈ పరీవాహక (వాటర్ షెడ్) అనుభవాన్ని వివరించటంలో, తగిన పేరు పెట్టడంలో విఫలమయ్యాయి.

నాకు తెలిసి దీనికి తగిన చక్కనైన పదబంధం ఆత్మద్యోతనం. స్వీయ వాస్తవికతకు ఈ కొత్త పేరు పెట్టడంలో కారణం చాలా చిన్న విషయం. ఈ ఆధ్యాత్మిక అన్వేషకులలో కొంతమంది లేదా తమ ఆధ్యాత్మిక యాత్రలో కొన్ని స్థాయిలలో ముందుకు వెళ్లిన వాళు ్ల తాము స్వీయ వాస్తవికతను పొందినట్లుగా తలుస్తారు. ఇలా ఎందుకవుతుంది అంటే విపరీతంగా ఆధ్యాత్మికంగా ఆధ్యాత్మిక పుస్తకాలు చదవటంవల్ల. అలాగే ధ్యానము, ప్రాణాయామము, యోగ, ఆత్మ విద్య (ఛానలింగ్), ఆత్మలతో సంబంధము- ఇలాంటివి అభ్యసించటం వల్ల కూడా స్వీయ వాస్తవికతను పొందినట్లు భావిస్తారు.

తత్త్వశాస్త్రజ్ఞానానికి సంబంధించిన - ఈ మేధోశక్తి పరమైనట్టు - భవిష్యవాణికి సంబంధించిన ఒక రూపానికి తోడవుతుంది. సాధారణంగా అటు వంటి జీవాత్మలు- “నేను ఉన్నాను” “మేము ఉన్నాము” “అందువల్ల అది నువ్వు” అది అదియైయున్నది” - ఇటు వంటి గంభీర ప్రకటనలు చేస్తుంటాయి. ఇందులో కానిది ఏది ఉందో దేవునికి తెలుసు. ఇటువంటి ప్రకటనలు సాధారణ ప్రజానీకాన్ని బాగా ఆకట్టుకోగలవు. వాళ్లని తొందరగా మోసగించగలవు. కాని ఆత్మ- అన్వేషకునికి- వాస్తవంగా “నేను” “నాకు” “అది” “నువ్వు” మొదలైన వాటి గురించి ఏ మాత్రం కూడా ఆధారము ఇవ్వరు. చాలా కొద్ది మంది జ్ఞాన పరిపూర్ణులయిన జీవాత్మలు మాత్రమే - ఈ అనుభవం రావటానికి వాస్తవికంగా ఏంకావాలో, ఎలా పొందారో చెప్పగలరు. మిగిలిన వారి విషయంలో అజ్ఞానము అలాగే అంటిపెట్టుకొని ఉంటుంది. అందువల్ల స్వీయవాస్తవికతను
అర్థం చేసుకొన్నవాళ్లూ దానిని అనుభవించినట్లుగా పొరబాటు అభిప్రాయాన్ని పొందా దానిని అలాగే దాచుకొంటారు. ఎప్పుడైతే మనం ఆత్మకి ద్యోతకం (రెవల్యూషన్) ఉందని చెప్పామో, అప్పుడు ఎటువంటి సందిగ్ధత ఉండదు.

ఆత్మయొక్క ప్రకాశస్థితి (రెవల్యూషన్ సోల్) రెండు దశల ప్రక్రియ. వీటిని గురించి చెప్పబోయే ముందు ఒక స్పష్టీకరణము కావాలి. గాఢమైన మరియు అంకిత భావం కలిగిన ఆధ్యాత్మిక అన్వేషకునికి మాత్రమే ఈ దేవుడు లేదా దైవత్వానికి సంబంధించిన రెండు దశల ప్రక్రియ వర్తిస్తుంది. నీ నిజమైన దైవ స్వభావాన్ని, లేదా నమ్మశక్యం కాని ఆత్మ శక్తిని కాకుండా వేరొక కారణంతో బాట మీద కనుక నువ్వు నిలబడితే - మిగిలిన ఈ వ్యాసమంత నీకు చాలా తక్కువ భావాన్ని అందజేస్తుంది.

మొదటి దశ వీణ (హార్ప్) :

నువ్వు దేవతలకు సంబంధించిన వీణని (హార్ప్) గురించి వినే ఉంటావు. హార్ప్ (హార్ప్) అనేది హెల్త్ (ఆరోగ్యము) అవేర్‌నెస్ (ఎరుక) రిఫైన్‌మెంట్ (శుద్ధీకరణ) ప్యూరిఫికేషన్ (శుభ్రపరచటం) భగవంతునికి చేరేటందుకు సంబంధించిన మొదటి దశలోని ప్రయత్నాలను, వాటి ప్రాముఖ్యతను సంక్షిప్తంగా వివరిస్తాను.

హెల్త్ (ఆరోగ్యము) :

మీ ఆధ్యాత్మిక అభివృద్ధిలో ఉన్నత శిఖరాలు చేరుకోవాలంటే ముందుగా కావలసినవి - రోగాలు లేక పోవుట సాపేక్షంగా సరిపోవుట (రెలటివ్లీ ఫిట్) మరియు ఆరోగ్యకరమైన భౌతిక శరీరం ఇది బాగా అర్థమయితేనే మనం రెండోదశలో - అభినందించబడతాం. అయినప్పటికి ఈ సందర్భంలో తృప్తి కలిగించే ఒక మాట ఏమిటంటే - వ్యక్తమయ్యే, సంపూర్ణమైన ఆత్మ వాహకత్వము
లేకుండా, మీ అన్వేషణలో బాగా ముందుకు వెళ్లకండి. మీరు వ్యాయామశాలలోకి కాని సౌందర్య ప్రదర్శనకి సంబంధించిన నమూన వ్యక్తిగా (మోడల్) కాని, వెళ్లమని మిమ్మలిని నేను తొందరపెట్టడం లేదు. మీ విధి మిమ్మలిని అనుమతించేవరకు - రోగరహిత - వైకల్యరహిత స్థితిని కాపాడుకోవటానికి మీరు ప్రయత్నించండి.

కర్మను అనుసరించి వచ్చే ఆరోగ్యసమస్యలను మనము ఎదుర్కోలేని మితిమీరిన మరియు నిర్లక్షపు జీవన శైలిని మనం పూర్తిగా వదిలివేయవచ్చు. చాలా వరకు ఆరోగ్య

సమస్యలు జీవితంలోని మన మానసిక, ఉద్వేగ గాయాల వల్ల ఏర్పడతాయి. ఈ గాయాలు రాకుండా ఉండాలంటే ధ్యానంతో పాటు ఒక రకమైన అవిభాజ్యతత్వ వైద్యం (హోలిస్టిక్ హీలింగ్) అవసరం ఉంటుంది. మోక్షాన్ని పొందటానికి ముందుగా కావలసిన ఈ ఆత్మ ధ్ఖనాశనాంశము గురించి ఏ ఆధ్యాత్మిక రచయితా ఇంత వరకూ వ్రాయలేదు. నీ లక్ష్యాన్ని నువ్వు పోగొట్టుకోవాలంటే మాత్రము - నువ్వు నీ భౌతిక శరీర ఆరోగ్యాన్ని నిర్లక్ష్యం చేయి. (నీ భౌతిక శరీర ఆరోగ్యాన్ని, నీ లక్ష్యం కొరకు కాపాడుకొమ్మని భావం- అనువాదకుడు)

ఎరుక (అవేర్‌నెస్) :

ఎప్పుడూ వెలిగే విద్యుద్దీపము (బల్బ్) లాంటిది ఎరుక. ఇది ఎన్నడూ ఆరదు. నీ జీవితంలోని నిర్థిష్ట అంశాలపై దృష్టిని కోల్పోవటాన్ని ఏ ఆధ్యాత్మిక అన్వేషకుడు కోరుకోడు. ఆ అంశాలు స్థిరంగా ఎండగా నీ ముందు ఉంటాయో, అంతగా నీ మనస్సు వెనకాల కూడా ఉంటాయి.

వ్యతిరేకమైన ప్రాప్తమైన నీ కర్మ ఋణాన్ని ఆపివేయి. ఇలా ఆపివేయాలంటే చేయవలసిన అంశాలు ఇవి : నీకు సంబంధించిన విషయాలలో,
సంబంధించిన వ్యక్తులపట్ల ఉద్దేశ్యపూర్వకంగా బాధ పెట్టడం, కీడు చేయటరా ఇవన్నీ ఒకటొకటిగా మానివేయి. ప్రతిచర్య కంటె ముందుగా ఆయా సన్నివేశాలను, వ్యక్తులను గురించి తెలుసుకో. అయినప్పటికీ నిత్య జీవితంలో సవాళ్లు, సందర్భాలు, అనివార్య సంఘటనలూ ఇలాంటి వాటి విషయంలో చేతనా ప్రయత్నం (కాన్సియస్ ఎఫర్ట్) అవసరం. నువ్వు ఆత్మవని దృఢమైన స్పృహ నీకు ముందు ఉండాలి. నేను కేవలం మానవానుభవాన్ని పొందుతున్నాననే వికసనము మనసెంతో ఉపయోగపడుతుంది.

చివరిగా, ఒక దృఢమైన నమ్మకం ఏమిటంటే నీ యొక్క వ్యక్తిగతమైన ఆధ్యాత్మిక అభివృద్ధికి ఈ మానవావతారము ఉపయోగపడాలి. భారంగాఉండే విధులు, బాధ్యతలు మరియు సూక్ష్మజ్ఞానాలూ ఇవన్నీ కేవలం ఇంకో మానవ జన్మకు సంబంధించిన అనుబంధోత్పత్తికి (బైప్రోడక్ట్) సహాయకారులు

వర్గీకరణ (కల్మషాలను తొలగించి, మలినాలను తీసివేయుట) (రిఫైన్‌మెంట్).

ఈ స్థాయికి చేరుకోవాలంటే జీవితంలో చాలా సమయం పడుతుంది. అదికొన్ని సంవత్సరాలు కావచ్చు. లేదా జీవితకాలం కూడా కావచ్చు. ఒక మానవశరీరాన్ని ధరించిన తర్వాత "ఆత్మ" ఎన్ని నేర్చుకోవాలో - అన్నింటిని ఈ పరిశుద్ధి ద్వారా - ఆత్మ నేర్చుకొంటుంది. ఈ ఆత్మ-వ్యతిరేక లక్షణాలు మరియు గుణములు తమయొక్క పూర్తి కోపోద్రేకాలు చూపటానికి వీలయిన భౌతిక ఆకృతిలో ఉంటుంది. కేవలం ఈ భౌతిక ప్రపంచంలోనే - ఈ కోపతాపాల పట్ల వాస్తవిక పరిస్థితిని అంచనా వేసి, వాటి వినాశనానికి కావలసిన సామర్థ్యాన్ని కలిగించే అవకాశం ఉంది. మన అంతరాంతర స్పృహలో - స్థిరంగా అంటిపెట్టుకొని ఉన్న ఈ కోపతాపాలను బయటకు తరిమి వేయటానికి కృషి చేసే అవకాశం కూడా ఉంది.

ఈ భౌతిక ప్రపంచంలోనే ఇది సాధ్యం. ఎందుకంటే ఈ ప్రపంచం బాధల రాజ్యం కనుక. ఆత్మగా తనచుట్టూ చదివినవాటిని, చూసిన వాటిని నిలుపుకొని ఉండదు. కాని పదేపదే జరిగే ఆనందాల బాధల అనుభవాలను శాశ్వతంగా నమోదుచేసుకొంటుంది. ఎందుకంటే ఈ బాధలు, ఆనందాల అనుభవాలు మన అంతరాంతర స్పృహవల్ల (ఇన్నర్ మోస్ట్ కాన్షియనెస్) పై గాఢంగా ప్రభావం చూపిస్తాయి కనుక. అందువల్ల అనేక జన్మపరంపరల తర్వాత ఈ బాధలు పడిపడి ఈ పరిశుద్ధి కార్యక్రమమూ ఒక కొలిక్కి వస్తుంది. అప్పుడు ఈ గర్వం, ద్వేషం మొదలైన వ్యతిరేకగుణాలు తొలగించబడతాయి.

శుభ్రపరచటం (ప్యూరిఫికేషన్) :

ఒక వరుసక్రమంలో శుభ్రపరిచే ప్రక్రియ (ప్యూరిఫికేషన్) శుద్ధీకరణలా (రిఫైన్‌మెంట్) లా ఒక వరుసక్రమంలో ఉండనక్కర లేదు. ఈ రెండు కూడా అనేకసార్లు ఒక దానితో ఒకటి కలుస్తుంటాయి. సాధారణంగా శుభ్రపరచటం అనే పద్ధతి విశేషమైన శుద్ధీకరణ తర్వాత మాత్రమే జరుగుతుంది. ఈ శుభ్రపరచటం (ప్యూరిఫికేషన్) అనే ప్రక్రియ తనలోనే వచ్చే మార్పు యొక్క ఒక చేతనా పరమైన కృషికి ఫలితము. దీంట్లో అంతర్గత నిర్లిప్తత (ఇన్నర్ డిటాచ్‌మెంట్) ఇమిడి ఉంటుంది. ఈ స్థితిలో జీవితంలో వచ్చే సమృద్ధిని, ఔదార్యాన్ని వ్యక్తి అనుభవిస్తుంటాడు కాని ఆ భావం మనస్సులో లేకపోవటం వల్ల చాలా ప్రశాంతంగా ఉంటాడు. ఈ నిర్లిప్తత తనకు బాగా సన్నిహితులైన బంధువులు, స్నేహితులు మొదలయిన వారి పట్ల కూడా వ్యక్తి కలిగి ఉంటాడు. ఆవ్యక్తి దృష్టికి జీవితంలో పాత్రలు ధరించటానికి వచ్చిన నటుల్లా సన్నిహితులు కనిపిస్తారు. కాని ఈ నిర్లిప్తత ఉండటం వల్ల- అతని ప్రేమకు,

ఆసక్తికి లోటు ఏమీ ఉండదు.

ఈ శుభ్రపరచటం (ప్యూరిఫికేషన్) లో వచ్చే ఇతర మార్పులు : చాలా ఉన్నతమైన దయ, చాలా ఎక్కువైన విశ్వవ్యాప్త ప్రేమ, ఏ జీవిపట్ల కూడా ద్వేషం లేక పోవటం. ఈ శుభ్రపరచటం అనే స్థితికి రావాలంటే ఆ వ్యక్తికి తప్పనిసరిగా దైవిక విజ్ఞానము మరియు దైవిక ప్రణాళిక మీద పూర్తి నమ్మకం ఉండాలి. నీ ఆత్మలోని ముఖ్యమైన కేంద్రభాగం నుండి అన్నిరకాల భయాలు నువ్వు  తీసెయ్యాలని దీని అర్థం. భయపడే స్థాయినుండి ప్రేమించే స్థాయికి ఎదగటం తప్పనిసరి. చివరగా అధికస్థాయిలో మానసిక ప్రశాంతత పొందటం జరుగుతుంది. నీ మనస్సులో చెలరేగే ఆలోచన ఒక జల్లెడ నుంచి బయటకు వస్తుంది. ఇది నీ జీవితానికి నువ్విచ్చే సహకారం. గాయాలు, బాధల ద్వారా వచ్చే జ్ఞాన సందర్భాలను తగ్గించటానికి - శుభ్రపరచటం (ప్యూరిఫికేషన్) శుద్ధీకరణ (రిఫైన్‌మెంట్) లకు సంబంధించిన అనేక రకాల పద్ధతులను వేగవంతం చేయాలి కాని ఒక గురువు కాని లేదా ఆ పద్ధతులు బాగా తెలిసిన మార్గదర్శకుడు కాని ఇక్కడ అవసరం. ఇక్కడ రకరకాల ఆధ్యాత్మిక అభ్యాసాలు ఉన్నాయి. ఇవి తప్పనిసరి. పూర్ణరూపాత్మక స్వస్థత (హోలిస్టిక్ హీలింగ్) పద్ధతులు, శక్తి కార్యములు, చక్కని ఆధ్యాత్మిక పుస్తకాలు, యోగ ధ్యానము, ప్రాణాయామము, క్రియలు, ఆధ్యాత్మిక ఉపన్యాసాలు, కుండలినీ యోగము మరియు దీక్షలు - ఇందులో ఉన్నాయి. ఈ రకమైన శుభ్రపరిచే ప్రక్రియతో (ప్యూరిఫికేషన్) అధ్యాత్మిక అన్వేషి దేవుని వైపు వేసే మొదటి అడుగు పూర్తి చేస్తాడు.

రెండవ అడుగు : తపస్సు (ఆస్టయిట్స్)

తపస్సును వర్ణించాలంటే కొండనెక్కేవాళ్ల భాషలో చెప్పటం మంచి మార్గం. అది మార్గం. అది ఇలా. నువ్వు పునాది శిబిరాన్ని (బేస్ కాంప్) వదిలావు. నువ్వు శిఖరాగ్రం (సమ్మిట్) చేరాలి. ఈ సుదూర ప్రయాణంలో ఒక నిలువు ఆరోహణ విపరీతమైన నిబంధనలతో, భారీ ప్రయత్నంతో చేయవలిసి ఉంటుంది. భౌతికంగా, మానసికంగా సరిపోయేవాడు బలవంతుడు మాత్రమే

ఈ శిఖరాగ్రం చేరగలడని మరోసారి చెబుతున్నాను. ఇలాగే ఆధ్యాత్మిక ప్రయాణంలో సమాధ్యవస్థలో (లాస్ట్ లెగ్) రకరకాల నిష్ఠలు చేయవలసి ఉంటుంది. ఇందులో కొన్ని చాలా తీవ్రంగా ఉంటాయి. ఈ సమయంలో శక్తిమంతుడైన, జ్ఞానపరిపూర్ణుడైన

గురువు వదిలివేయతగిన వాడుకాడు. ఎందుకంటే ఆ గురువు ఈ మార్గంలో నడిచాడు కాబట్టి, ఏం కావాలో అది ఆయనకు బాగా తెలుసు.

చాలా మంది ఈ చివరి అడుగు పూర్తిగా అనవసరమని చెబుతారన్న విషయం నాకు బాగా తెలుసు. దీనికి కేవలం మన మానవుల సోమరితనం కారణం. ఎందుకంటే ఈ పద్ధతిలో చిరాకు ఉంటుంది. మళ్లీ మళ్లీ చేయవలసి ఉంటుంది. సాధారణంగా పడక కుర్చీలో పడుకుని ఆలోచించే ఆశావాదులు ధ్యానంలో - తమ ఆలోచనలను వదిలివేస్తే - లేదా సృజనాత్మకంగా దైవరూపాన్ని ఊహిస్తే దేవుడు తమ ఒళ్లోకి వచ్చి వాలతాడని తలుస్తారు. ఆ ఆశ సర్వ సాధారణము. తేలిక.

ఆత్మ యొక్క ఆవిష్కరణ ఒకరకమైన మానసిక పద్ధతి ద్వారా వస్తుందని- తమ సురక్షిత ప్రదేశాలనుంచి కదలటానికి ఇష్టం లేనివారు - దృఢంగా నమ్ముతారు. ఆ భావనను ప్రచారము చేస్తారు. నిజం చెప్పాలంటే అది పూర్తిగా శక్తివంతమైన పద్ధతి. అందువల్లనే కుండలినీ శక్తి (నీయొక్క వ్యక్తిగతమైన దైవశక్తి) ఆహ్వానించ దగినది మరియు చివరకు చైతన్య పరచ వలసినది. నీ ఆధ్యాత్మిక ప్రయాణంలో చిట్టచివరికి లక్ష్యానికి లేదా ఉన్నతస్థితికి సంబంధించిన సత్యం ఒక్కటే నీ సమీకృతమైన శక్తి - సృష్టికర్త యొక్క శక్తికి రూపాంతరమైన పవిత్రశక్తి యొక్క అనుభవాన్ని పొందటం. గాఢమైన ధ్యానం ద్వారా పొందే ఒకానొక అద్భుతమైన గాఢ ప్రశాంతస్థితిని పొందటానికి మరియు అనుభవాన్ని పొందటానికి అనుమతించటానికి తప్పించి - మనస్సుకు ఇంకొకటి చెయ్యటానికి ఉండదు.

**అందువల్ల నీ శక్తిని బాగా పరిశుద్ధి చేయటానికి ఉన్నత స్థాయిలకు దానిని తీసుకొని వెళ్లటానికి దైవిక శక్తిలో నీ శక్తిని కలపటానికి తపస్సు చాలా అవసరము. శక్తి యొక్క పరిశుద్ధత కొరకు ఒక స్థాయి అవసరము. ఇది ఎప్పుడు జరుగుతుందంటే ఆత్మ యొక్క ఆవిష్కరణ జరిగినప్పుడు మాత్రమే.**

తపస్సుకు సంబంధించి దగ్గరి (మోసపు) దారులను ఎలాగోలా వెతికే వారికి, నేను

ఒకటే చెప్పదలుచుకొన్నాను. నాకు అవసరమైన తపస్సు అభ్యాసం  చేయకుండా ఎగిరే మునిని, సన్యాసిని, యోగిని లేదా ఉన్నత స్థాయికి చేరిన వారిని ఒక్కరిని చూపించండి. (తపస్సు అవసరమని గురూజీ భావన - అనువాదకుడు) ఇవన్నీ గురు శిష్య పరంపరాగతంగా వచ్చే అత్యంత రహస్యపద్ధతులు. ఈ పద్ధతులు ఎవరూ నమోదు చేయలేరు. అలా చెప్పిన వారి గురించి కొంత మాత్రమే తెలుసు.

కొంతమంది ఈ తపస్సు అనేది ప్రాచీన కాలపు ఆలోచన అని - 2012 తర్వాత కొత్త రకమైన శక్తిని కలుగచేసే పద్ధతులు వచ్చాయని. ఈ తపో పద్ధతులు వదిలివేయాలని చెబుతారు. నేను ఈ అవాస్తవాన్ని ఖండిస్తున్నాను. నీ వ్యక్తిగత శక్తి - మహా శుద్ధీకరణ (రిఫైన్‌మెంట్) మారటానికి పట్టే సమయంలో ఈ ఆధునిక కాలంలోని కొన్ని పద్ధతుల ద్వారా కనిపిస్తోంది. ఇది వరకు తపస్సులు చేసేకాలంలో దశాబ్దాలు పట్టేవి. ఇప్పుడు కొన్ని వారాల్లో సాధిస్తున్నారు. అంటే పవిత్రమైన దైవశక్తితో కలవటమనే మౌలిక సిద్ధాంతం - ఎప్పుడూ - ఎన్నడూ మారదు.
చివరగా నేను చెప్పేదేమిటంటే నేను ఈ విషయాన్ని పంచుకోవటంలో నా ఉద్దేశం ఆధ్యాత్మిక మార్గం నుంచి ప్రజలను దూరంగా వెళ్లమనికాదు. ఎంత వరకు కాంతి ప్రసరింపచేయాలో అంతవరకు కాంతి ప్రసరింపచేయాలి. అందువలన నిజమైన అన్వేషి ఏమిలేనిచోట హడావుడి చేస్తూ తన జీవిత కాలాన్ని వృధా చేసుకుంటాడు. (బీటింగ్ రౌండ్ ద ప్రొవర్బల్ బుష్)

## మనం వర్తమానంలో జీవిస్తున్నామా?
## కాని అది కూడా ఉనికి లో లేదు

వర్తమానంలో జీవించండి........ ఈ క్షణాన్ని ఆస్వాదించండి.. లేకపోతే అది వెంటనే ముగుస్తుంది. ఎప్పుడూ వర్తమానమే ఉనికిలో ఉంటుంది. నువ్వు అణచబడితే నువ్వు గతంలో జీవిస్తున్నట్లు.... నువ్వు ఒత్తిడికి గురయితే భవిష్యత్తులో జీవిస్తున్నట్లు" - కొత్తగా ఆధ్యాత్మిక జీవితంలో ప్రయత్నం మొదలు పెట్టిన వానికి ఈ అదుపు తెచ్చుకొన్న విజ్ఞాన రత్నాలను హృదయంలో తెలుసుకొంటాడు. ఇది అన్నిరకాల మానవులలో నెలకొన్న మానసిక భావోద్వేగ అంశాలకు చివరి పరిష్కారంగా కట్టుబాటుగా ఉన్నది. ముద్రణ పొందిన వ్యాసాలనుండి

బాగా అమ్ముడయ్యే పుస్తకాలవరకు - బ్లాగులనుండి వెబ్‌సైట్‌లు, ప్రతి ఆధ్యాత్మిక కార్యశాలలు (స్పిరిచ్యువల్ వర్క్‌షాప్) వరకు, ఒకటేమంత్రం ఝుమ్మని మోగుతోంది. అది **"ఇదే క్షణం"** ఇదే మీరెక్కలకింద ఉన్న గొప్పశక్తి.

ఒక్క నిమిషం ఊహించండి. ఒత్తిడి, విచారము, అణిచివేయబడిన స్థితి - వీటన్నింటికి ఒకే పరిష్కారం ఇదే క్షణమా? వర్తమానం నిందార్హమైనప్పుడు ఒకడు వర్తమానంలో స్థిరంగా ఎలా బతగ్గలడు! ఆచరణాత్మకంగా మాట్లాడితే, పూజ్యమైన, అతి పవిత్రమైన **ఇదే క్షణం** అనేది ఏ మాత్రం ఉనికిలో లేదు. గందరగోళ పడుతున్నారా? అలాగే దీనిని ప్రయత్నించండి.

ఒక్కొక్క అంకెను ఒక్క సెకను మాత్రమే విరామమిస్తూ ఒకటి నుంచి అయిదు వరకు అంకెలను వరుసగా లెక్కించండి. ఈ అయిదు క్షణాల విరామంలో ఏది **"ఇప్పటి** దానికి సంబంధించినది? నేను ''ఒకటి'' అని చెబుతుండగానే అది గతకాలానికి సంబంధించినది అయిపోయింది. రెండు దాని స్థానంలోకి వచ్చి కూర్చుంటోంది. నేను ''మూడు'' దగ్గరికి వచ్చేసరికి, ఒకటి మరియు రెండు కూడా గతంలోకి వెళ్లిపోతాయి. నాలుగు, అయిదు నేను లెక్కించవలసిన భవిష్యత్తుకు సంబంధించినవి అవుతాయి - ఇప్పటి కదలికను అనుభవిద్దామంటే అది నాకు కనబడలేదు. ఎందుకంటె ప్రతి కదలిక నా గతమవుతున్నది. అలాగే భవిష్యత్తు కూడా విరామం లేకుండా తీవ్రత తగ్గించుకుంటూ నా దగ్గరకు వస్తోంది. ఇప్పుడు నేను **"ఇప్పుడు"** ను అనుభవించమని చెప్పిన ఇంద్రజాల సలహాను ఎలా అనుసరించను? ఎందుకంటె రెప్పపాటు కాలంలో ప్రతిదీ గతంలోకి వెళ్లిపోతోంది కనుక. అయితే నేను గతంలో జీవించాలని కోరుకోను. నేను ఒక సునామీలా, గట్టిగా, వేగంగా నా ముందుకు వస్తున్న భవిష్యత్తును ఎలా బెదిరించి నిలపను?

ఇది అలంకార ద్రవ్యాలతో కూడిన ఆధ్యాత్మికతకు చెందిన ఉన్నత తరగతి. పైకి చూస్తే ప్రతిదీ గొప్పగా పలుకుతుంది. చూడటానికి బ్రహ్మాండం అనిపిస్తుంది. కాని కొంచెం దాన్ని చెక్కితే, గోళ్లతో గీరితే - అర్థంలేని పదాలు అవి అని నీకు తెలిసిపోతుంది. ఇప్పుడు వర్తమానం అంటూ ఏమీలేకపోతే, మనం తప్పనిసరిగా గతంలోనే దౌర్భాగ్యకరంగా జీవిస్తున్నామా? లేదా భవిష్యత్తును గూర్చి విచారపడుతూ, ఒత్తిడికి గురవుతున్నామా? లేదు,

నా ఉద్దేశం మిమ్మల్ని గందరగోళపెట్టి, తికమకకు గురిచేయాలని కాదు. **ఇప్పుడు** అని ఏదైతే ఉందో అది అవాస్తవమని చెప్పటమే నా ఉద్దేశం. నేను **కాలం**
యొక్క నిజమైన స్వభావాన్ని వర్ణించాలని అభిప్రాయపడుతున్నాను. అవైజ్ఞానిక దృక్పథంలో - కాలం యొక్క సంబంధాన్ని మానవజీవితంలో అది విడదీయరాని సంబంధం ఎలా ఏర్పరచుకుందో వివరిస్తాను.

భూత, వర్తమాన, భవిష్యత్తు కాలాలతో, సమయాన్ని రేఖాక్రమ పద్ధతిలో (లీనియర్ మేనర్) మానవులమైన మనము అర్థం చేసుకొంటాం. భూమి తన అక్షం పై తాను తిరుగుతూ, రాత్రి పగలు కల్పిస్తూ, సూర్యుని చుట్టూ తిరగడానికి 365 రోజులు పడుతుందనే వాస్తవాన్ని ఈ కాల బవన బలపరుస్తుంది. అందువల్లనే కాలాన్ని రోజులు, సంవత్సరాలుగా లెక్కపెడతాం. తరువాత - మానవులు - భౌతికంగా తమ జీవితకాలాన్ని లెక్కించటం ఈ పద్ధతిలో లెక్కించటం మొదలు పెట్టారు. కాని ఈ కాలము యొక్క భూతం నుంచి భవిష్యత్తులోకి అదే కదలిక ఏదైతే ఉందో అది భౌతిక కోణంలో మాత్రమే.

మిగతా కోణాలన్నికూడా, ఆత్మ యొక్క రాజ్యంలో ఉంటాయి. ఇవి రేఖాంశాలతో సంబంధం లేని కాలంతో ఉంటాయి. ఇవి రేఖాంశాలతో సంబంధం లేని కాలంతో ఉంటాయి. 20వ శతాబ్దానికి సంబంధించిన మేధావులైన శాస్త్రవేత్తలు - ఈ భౌతిక ప్రపంచానికి కాలానికి మధ్య సంబంధాన్ని లెక్కించి నిరూపించారు. మేధోపరంగా విజ్ఞానానికి కూడా ఒకహద్దుంది. అందువల్ల కాలము తో సంబంధం కల సిద్ధాంతం మానవులమైన మనకు స్పష్ట పడదు.

నేను కొంచెం కష్టభరితంగా ఉన్న ఈ సిద్ధాంతాన్ని - గణిత శాస్త్ర సాక్ష్యం లేకుండా, మీ మేదస్సుకు అందేటట్లుగా, కొంచెం అంతర్దృష్టితో - సామాన్యమైన ఆధ్యాత్మికపదాలలో వివరించటానికి ప్రయత్నిస్తాను. భూతకాలం, వర్తమానకాలం మరియు భవిష్యత్కాలం - ఈ మూడు వాస్తవంగా ఒకేచోట
ఉంటాయి. దీనిక నేను పెట్టిన పేరు గొప్పదయిన శాశ్వతము. (గ్రేట్ ఎటర్నల్) భూత, వర్తమాన, భవిష్యత్తులతో కలిపి ఉన్న **గొప్పదయిన శాశ్వతము** సరిగ్గా వివరించాలంటే

ఈ మూడు కాలాలు ఒకే సారి, ఒకే సమయంలో సమన్వయ రూపంలో ఉంటాయని చెప్పవచ్చు.

మానవులమైన మనము ఈ రేఖాంశాల సమయాన్ని ఎందుకు అవగాహన చేసుకోవాలంటే ఆత్మయొక్క "దిగువ మనస్సు" (అయిదు ఇంద్రియాలతో తృప్తిపడేది, కోరికలను సృష్టించేది, యాచించి తృప్తిపడేది) ఒక కాలంలో ఒకేఒక అనుభవాన్ని మాత్రమే స్వీకరించగలదు. దానియొక్క దిగువస్థాయిలో ఉన్న స్పృహతో అనగా భౌతిక స్పృహతో, అనేక రెట్లు ఉన్న అనుభవాలను విశదీకరించటానికి, నమోదు చేయటానికి సమర్థము కాదు. కనుక దిగువ మనస్సు ఆనందం, ఉత్సాహం, రాగం, ద్వేషం, ప్రేమ, అసూయ, భయము లేదా విచారము యొక్క ఒక్క కదలికకు సంబంధించిన భావాన్ని మాత్రమే పొందే అర్హత కలిగి ఉంటుంది. ఇది కూడా ఒకేసారి వరుస క్రమంలో ఒకదాని తర్వాత ఒకటిగా సంభవిస్తుంది. ఈ దిగువ మనస్సు యొక్క ఆలోచనా పద్ధతి కూడా అదే ప్రతికూలతతో బాధపడుతుంది. ఒకే సారి సమాచారాన్ని అంతటిని గ్రహించే శక్తి లేకుండా- ఒక ఆలోచన తర్వాత ఒక ఆలోచనను - చేస్తుంది.

మనమంతా కూడా ఈ దిగువ మనస్సుపై మన మానవ అస్తిత్వానికి సంబంధించి ఆధారపడి ఉన్నాం. ప్రతి అనుభవం ఆలోచన చేసిన వెంటనే గతమవుతుంది - అసంకల్పితమనస్సులో (సబ్‌కాన్షియస్ మైండ్) నమోదవుతుంది. ఈ అసంకల్పిత మనస్సు అనేది - చెరిపివేత మీట (ఎరేజ్ బటన్) లేకుండా దత్తాంశాలతో (డేటా) అన్నిరకాల అనుభవాలను నిల్వ

నువ్వు నీ భుజాలమీద వెల్కో యంత్రాన్ని (గుడ్డలను బిగించి చీల్చే ఒక యంత్రము - అనువాదకుడు) పెట్టుకొని నువ్వు గతాన్ని చీల్చలేవని మీ దృష్టికి తీసుకొస్తున్నాను. అది ఇప్పటికి కూడా సంబంధించినది. ఇక భవిష్యత్తు - రకరకాల శక్తుల అవకాశాల ద్వారా సంభవించేది. అందువల్ల నీ దిగువ మనస్సు ఈ మూడు స్థాయిలను ఒకేసారి అనుభవించ లేదు. ఇంకా వివరంగా చెప్పాలంటే నువ్వు గతాన్ని ముక్కలు చేసే యంత్రం (ష్రెడ్డర్) దగ్గరికి పంపలేవు. భవిష్యత్తును గాఢంగా గడ్డ కట్టేటట్లు (డీప్-ఫ్రీజ్) చేయలేవు. అందువల్ల గతం నుండి ఇప్పటికాలం వరకు (ఎవర్ ఆఫ్టర్) హాయిగా జీవించు.

నువ్వు గతంతో కొంత వ్యవహారం నడపవలసి ఉంటుంది. ఇది చాలా సున్నితమైన కార్యక్రమం. ఎందుకంటె గతంతో సంబంధించిన అనుభవాలను స్పష్టపరచాలి. కాని జ్ఞాపకాలు ఎప్పటికి పోవు. నువ్వు భవిష్యత్తుకు సంబంధించిన భయాన్ని పోగొట్టుకోవాలి. ఎందుకంటే భవిష్యత్తు అనేది **"గొప్పదయిన శాశ్వతము"** లో ఎప్పుడో ఉంది. కాకపోతే ఆ భవిష్యత్తుకు సంబంధించిన అనుభవము వరుస క్రమములో జరుగుతుంది. ఇది మన దిగువ మనస్సు యొక్క హద్దు. అందువల్ల నిన్ను తప్పుడు తృప్తిలో (కాంప్లసెన్సీ) ముంచే అలంకార ద్రవ్యాల ఆధ్యాత్మికతను అనుమతించి శాంతపరచుకోకు. తప్పుడు వర్తమానంలో కొన్ని గంటలు నీపనిలో జీవిస్తున్నట్లుగా, ఒకరకమైన తృప్తిని పొందుతున్నట్లుగా నీ మనస్సును తిప్పుకొంటే, నువ్వు జ్ఞానోదయం పొందిన, రూపాంతరం చెందిన మానవునిగా ఉదయించలేవు.

ఈ గతావర్తమానా భవిష్యత్తు గందరగోళ స్థితినుంచి బయటపడటానికి ఇంకో శాశ్వతమైన మార్గం ఉంది. అది **గొప్పదయిన శాశ్వతాన్ని** అనుభవించటం. అయితే ఇది దిగువ మనస్సు యొక్క ఉనికిని పూర్తిగా తెలుసుకోవటం ద్వారా జరుగుతుంది. ఉన్నతమైన చేతనల స్థాయిలలోనికి ప్రవేశించి చివరకు శూన్యమైన స్థితిలోకి చేరటం ద్వారా జరుగుతుంది. లేదా కొంచెంపాటి కలకలం కూడా లేకుండా, నూటికి నూరు పాళ్ల నిశ్చలంగా ఉన్న మనస్సు ద్వారా జరుగుతుంది.

ఆ స్థితిలోకి వెళ్లిన తర్వాత నువ్వు సమీకృత విశ్వసంబంధ చేతన (కలెక్టివ్ కాస్మిక్ కాన్షియస్‌నెస్) లో కలిసి పోతావు. నీ చేతనను విస్తరింప చేసుకుంటూ, అంతా గతమేనని అనుభవం పొందుతావు. అంతా అందులోనే ఉందని, ఎప్పుడూ అందులోనే ఉంటుందని తెలుసుకుంటావు. అవును, నేను ఇప్పుడు పరిమితిలేని సృజనాత్మక శక్తి (సృష్టి కారణ శక్తి - క్రియేటివ్ ఎనర్జీ) యొక్క అనుభవం గురించి మాట్లాడుతున్నాను.

ఇది మానవ రూపంలో అందుకోవటం సాధ్యమేనా? జవాబు "అవును", కాకపోతే ఈ జవాబులో భారీ ప్రయత్నం, అద్భుతమైన దృఢనిశ్చయం కలిసి ఉన్నాయి.

**వ్యాఖ్యలు**

ప్రశ్న :

ఇంతకంటె **కాలాన్ని** గురించి చక్కటి నిర్వచనం మనం చూడలేం

ఒకప్రశ్న ఎప్పుడు మానవుడు ఈ సమీకృత విశ్వసంబంధ చేతన (కలెక్టివ్ కాస్మిక్ కాన్సియస్‌నెస్) తో సంబంధం కలిగి ఉంటాడు? అది శక్తితో కూడుకొని ఉన్నదని చెప్పారు. భవిష్యత్తు తెలియజేయబడితే జీవితంలో కుతూహలము (థ్రిల్) ఉండదన్నారు.

ఇంకా, గురూజీ మగవాడిగా పుట్టాలా ఆడదానిగా పుట్టాలా అనే విషయంలో నిర్ణయం ఆత్మ ఎలా తీసుకుంటుంది? ఎవరు నిర్ణయిస్తారు? దయచేసి సూచించండి.

గురూజీ జవాబు

భవిష్యత్తు ఎప్పుడూ సమీకృత విశ్వసంబంధ చేతనలో లెక్కలేనన్ని శక్తులతో కలిసి ఉంటుంది. కాకపోతే ఒక్క విషయం ఆ శక్తులలో ఒకదానిని దీర్ఘకాలంలో మనం అనుభవిస్తే, అది మన గతమవుతుంది.

కాని ఈ శక్తులు మన గతంలోకి చేరినప్పటికి, అలాగే గొప్పదయిన శాశ్వతంలో మిగిలి ఉంటాయి. నేను కొంత అర్ధమయ్యేటట్లు చెప్పానను కుంటున్నాను.

ఇంకో జన్మను తీసుకోబోయే ముందు ఆడదానిగా పుట్టాలా - మగవాడిగా పుట్టాలా అనేది ఆత్మ యొక్క ఇష్టం మీదనే ఆధారపడి ఉంటుంది. దేవుడు ఈ విషయంలో ఎటువంటి పాచికలు వేయడు. అది మనయొక్క
వ్యక్తిగతమైన ఎంపిక. ఈ ఎంపిక మనం చేయవలసిన పనులపై లేదా పూర్తి చేయవలసిన కర్మల పై లేదా నేర్చుకోవలసిన పాఠాలపై ఆధారపడిఉంటుంది.

## విభజనలో ఏడు స్థాయిలు

చాలామంది ఆధ్యాత్మిక అన్వేషకుల మనస్సులలో కొన్ని ప్రశ్నలు పైకి తేలుతుంటాయి. నేను అనేవాడిని అలాగే పూర్వంలాగా ఉన్నప్పటికి, ఆధ్యాత్మికంగా ఎదిగానని ఎలా తెలుసుకుంటాను? ఈ జీవిత కాలంలో విముక్తి, మోక్షము, స్వీయజ్ఞానం

(సెల్ఫ్ రియలైజేషన్), జ్ఞానోదయం (ఎన్‌లైట్‌మెంట్) మొదలైనవి ఈ జీవితంలో పొందటానికి వీలవుతుందా?

ఇప్పటి వరకు వ్యక్తిగతంగా ఆత్మ ఇంత అభివృద్ధి పొందిందని చెప్పటానికి వీలయ్యే సూచిక ఇప్పటివరకు లేదు. సంతోషము మరియు సుఖం ఇలాంటి సాధారణమైన అనుభూతులు అప్పుడప్పుడు అభివృద్ధి విషయంలో తప్పుదారి పట్టిస్తుంటాయి. అయినప్పటికీ మరణములేని, చిరంజీవి అయిన నా గురువు మహావతార్ బాబాజీ ఇచ్చిన జ్ఞానంతో, ఈ అభివృద్ధి విషయంలో కొంత వెలుగును ప్రసరింపచేయటానికి ప్రయత్నిస్తాను. ఇది ఆధ్యాత్మిక యాత్ర ను పర్యవేక్షించటానికి సంబంధించిన ఒక సాధారణ కొలబద్ద.

ఈ సమాచారాన్ని ఉపయోగించుకొనే ముందు, ఒకరు తప్పనిసరిగా ప్రాథమికమైన, ఏనాటికి మారని నిత్యమైన సత్యాన్ని అర్థం చేసుకోవాలి, చాలాసాధారణమైన తేలిక భాషలో మనం చెప్పుకోవాలంటే - ఆత్మ యొక్క చివరి లక్ష్యము లేదా గమ్యం ఒక్కటే ఆత్మ తన శక్తిని తాను పరిశుద్ధం చేసుకోవాలి. ఆ పరిశుద్ధత విశ్వవ్యాప్తమైన పవిత్రశక్తితో తులతూగాలి. ఈ పవిత్రశక్తికి సంబంధించిన వాడిని సృష్టికర్త అనండి, దేవుడనండి ఆ ఉన్నతమైన, రూపంలేని వాడికి, నిత్యమైన వానికి మీ ఇష్టమొచ్చిన పేరు పెట్టుకోండి.

ప్రేతాత్మగా ఆత్మల ప్రపంచంలో ఉంటూ, అదే ఆత్మ జీవాత్మగా ఈ భూ గ్రహం మీద రకరకాల అవతారాలు ధరిస్తుంది. విశ్వవ్యాప్తమైన శక్తిలో లీనం కావటానికి - ఆత్మ చాలా ఉన్నతస్థాయి కల పరిశుద్ధతను పొందాలను కుంటుంది. (అందుకు చేసే ప్రయత్నాలే ప్రేతాత్మ - జీవాత్మలుగా రకరకాల రూపాలు ధరించటము - అనువాదకుడు) ఈ దీర్ఘమైన, కఠినమైన యాత్రలో ఒక్కొక్కరు మోక్షాన్ని, స్వీయజ్ఞానాన్ని, జ్ఞానోదయాన్ని లేదా స్వేచ్ఛ పొందుతాయి. ఇవి మాత్రమే నువ్వు చేరవలసిన లక్ష్యాలు కావు. పరిశుద్ధత యొక్క ఉన్నతమైన స్థాయిలను అందుకోవటానికి - ఇవన్నీ - కేవలం ఉద్వేగాల చలనాలు (మూమెంట్స్ ఆఫ్ ఎమోషన్స్) గా నిర్వచించుకోవచ్చు.

## విభజన యొక్క ఏడు స్థాయిలు

నీ జీవాత్మనూ ఈ ఉన్నతమైన విశ్వవ్యాప్త పరిశుద్ధతలో కలుపకుండా రక్షిస్తున్నాయి.

అందువల్ల నువ్వు ఏ మార్గాన్ని అనుసరిస్తున్నావని కాదూ ఏ యోగాభ్యాసం చేస్తున్నావని కాదూ ఏ తత్త్వశాస్త్రం లేదా ఏ గురువును నువ్వు నమ్ముతున్నావు?! ఏ మతాన్ని నువ్వు నమ్మి సంతృప్తి పడుతున్నావు?!ా ఇవన్నీ కాదూ ఏడురకాలైన స్థాయిలు నిన్ను విశ్వవ్యాప్త పరిశుద్ధతలో కలపకుండా అడ్డుపడుతున్నాయి. నిన్ను విడగొడుతున్నాయి. ఎందుకంటే ఆత్మ యొక్క విముక్తి ఈ విభజన స్థాయిలలో ఉంది. ముందుకు కదలటం లేదు.

నీకు, నీ సృష్టికర్తకు మధ్య అడ్డు గోడ లేకుండా చేసే హామీని పరిశుద్ధత ఇస్తుంది. విభజన యొక్క ప్రతి స్థాయి, వేరుగా లేదా ఏక కాలమందు పనిచేస్తుంది. ఈ పరిశుద్ధ స్థాయిమీద పనిచేస్తుంది. నేను ఇప్పుడు ఈ ఏడు రకాల విభజన స్థాయిలను, నేననుకొన్న ప్రాధాన్యతా క్రమంలో ఈ దిగువ వివరిస్తాను. ఇక్కడ నేను మీ లక్ష్యం నుంచి - ఇవి ఎలా మిమ్మల్ని దూరం పెడుతున్నాయో చెప్పటానికి ప్రయత్నిస్తాను. కాని ఈ అగాధాన్ని లేదా విభజనని
తగ్గించుకోవటానికి లేదా తొలగించుకోవటానికి తగిన పద్ధతిని లేదా అభ్యాసాన్ని చేయాలి. ఆ పద్ధతి లేదా అభ్యాసము మీ మార్గం, తత్త్వశాస్త్రం, యోగ లేదా నువ్వు ఎన్నుకొన్న గురువు మీద ఆధారపడి ఉంటాయి.

1. ధనం, సమృద్ధి మరియు భౌతిక సంపదలతో అనుబంధం :

నిజానికి ఇది మౌలికమైన అడ్డంకి. కాని చాలా మంది ఆధ్యాత్మిక అన్వేషకులు ఈ అడ్డంకిని దాటేశామని అనుకుంటారు. ఇది కనిపించేదాని కన్నా చాలా మోసం చేస్తుంది. సూక్ష్మరూపాలలో గుండు సూది దగ్గరి నుంచి విమానం దాకా (ఒకవేళ దీనిని నువ్వు కలిగి ఉంటే) ప్రతి భౌతికమైన వస్తువుమీద అనుబంధం ఉంటుంది. కీర్తి, సాంఘిక స్థితి, గుర్తింపు, అభినందన, ప్రజాదరణ - ఇవన్నీ కూడా అనుబంధంలో భాగాలే.

ఇక్కడ రెండు రకాల అనుబంధాలున్నాయని నన్ను చెప్పనివ్వండి. ఒకటి క్రియాశీల అనుబంధం (యాక్టివ్ అటాచ్‌మెంట్), రెండోది నిష్క్రియాను బంధం (పాసివ్ అటాచ్‌మెంట్) సాధారణంగా క్రియాశీల అనుబంధం డబ్బుకొరకు, సంపదకొరకు మానవుడు పొందే అదుపులో లేని లోభంలో ఉంటుంది. నిన్ను నువ్వు సంపన్నం చేసుకోవటానికి మోసం, దగా చేయటంలో ఎంత లోతుకయినా వంగిపోతావు. ఇత్తడికి బంగారపు రంగు వేసి చేసే

మోసాల్లాంటివి, కొల్లగొట్టడం - ఇవన్నీ నీ సంపన్నతకు వాడుకొంటావు. ఇంకోమాటల్లో చెప్పాలంటే నువ్వు కావాలని- నీకు తగని - దురాక్రమణ పద్ధతిని రచించుకొంటావు. ఇక్కడ నువ్వు ఒక్కడివి చేస్తున్నావా - నలుగురితో కలిసి చేస్తున్నావా అనేది చర్చించవలసిన విషయం లేదు. అది ప్రజలకు హాని కలిగించేదయినా సరే - విజయం పొందే ప్రతిపని చేయాలి - (డాగ్-ఈట్-డాగ్-వరల్డ్) అనేదాన్ని నమ్ముతూ, నువ్వు జీవించటానికి నువ్వు చేసే పనులతో నిన్ను నువ్వు సమర్థించుకోలేవు.

ఇంకొక మాటల్లో చెప్పాలంటే నిష్క్రియానుబంధం (పాసివ్ అటాచ్‌మెంట్) యొక్క ఉద్దేశరా భౌతిక సంపదలతో అంటి పెట్టుకొని ఉండటం. ఈ నిష్క్రియానుబంధం – సుప్త చేతన (సబ్ కాన్షియస్) లో ప్రదర్శితమవుతుంది. (మనస్సుకు పూర్తిగా ఎరుక ఉండదుకాని, ఒకరి చర్యలపై భావాలపై ప్రభావం చూపిస్తుంది. దీనిని సుప్త చేతన అంటారు – అనువాదకుడు) ఎటువంటి హేతుబద్ధమైన అవసరం లేకుండానే సిరిసంపదలను, ఆస్తులను తనవిగా చేసుకోవాలని ఈ నిష్క్రియానుబంధంలోని సుప్త చేతన తపిస్తుంది. ఈ అనుబంధం మనిషియొక్క లోభ గుణంలో బాగా తేటతెల్లమవుతుంది. అవసరమైన దానాన్ని కూడా ఇది చేయనివ్వదు. నీ భౌతిక సంపదలనూ లేదా ధనాన్ని ఇతరులకు ఇచ్చినప్పుడు ఇతరులకు పంచి ఇవ్వాలిసివస్తుంది అనుకొన్నప్పుడు ఈ నిష్క్రియానుబంధం పరిమాణం తెలుస్తుంది.

ఇక్కడ ఒక విషయం బాగా తెలుసుకోవాలి. సంపదలతో అనుబంధం పెంచుకోవటంలేదు. సంపదలను అనుభవించటం లేదు. ఈ రెండింటికి తేడా ఉంది. ఈ భూమి నీకు ఈ జీవితంలో ఇచ్చిన సంపదను హాయిగా అనుభవించు ఆ సంపదకు స్వాగతం పలుకు. కాని ఆ సంపద లేనప్పుడు నీకు మనోవేదన, అసూయ లేక బాధ కలిగిందనుకో. టోపీలు మార్చి మోసం చేసి ఇతరుల సంపదను అపహరించాలని అనిపించిందనుకో... ఇక నువ్వు పరిశుద్ధతకు కొన్ని కాంతి సంవత్సరాల (లైట్ ఇయర్స్) దూరంలో ఉంటావు. (కాంతి సంవత్సరానికి 9 లక్షల 50 వేల కోట్ల కిలో మీటర్ల దూరం ప్రయాణిస్తుంది. దీనిని కాంతి సంవత్సరం అంటారు. - అనువాదకుడు)

2. భయం :

విభజనకు సంబంధించిన రెండవ స్థాయి అయిన భయంకూడా మొదటి మౌలికమైన స్థాయిలాంటిదే. మానవులు మౌలికంగా భయస్థులు. సహజంగానే
భయంతో స్పందిస్తారు. ఇంకోరకంగా ఉండాలంటే అది భారీ ప్రయత్నము. ఆత్మకి సంబంధించిన చాలా లోతుల్లో ఉండిా ఈ భయమనేదిా తాకటానికి శక్యం కాదు. నీకు అనేక ఇబ్బందులు కలిగిస్తుంది. అందువల్ల ఈ భయాన్ని ఆత్మ లోతుల్లోంచి బలాత్కారంగా బయటికి లాగేయాలి. ఆధ్యాత్మికపు లక్షణమైన ప్రేమకి భయమనేది వ్యతిరేకపదం. అది నీ అభివృద్ధిని రెండుమార్గాల్లో పాడుచేస్తుంది.

ఇతర మానవ జీవులందరికి భయమనేది ప్రేమానురాగపు వేరుగా గుర్తించాలి. నువ్వు ఇతరులతో అనుబంధాన్ని ఎందుకు పెంచుకొంటావంటే నీ భయాన్ని పోగొట్టుకోవటానికి. మానవుల అనుబంధము జన్మజన్మల నుంచి వస్తున్న బాధ, ధ్ఖము, విచారము - ఇవన్నీ కలిపిన విజ్ఞాన సర్వస్వము. అందువల్ల ఎక్కడ భయముంటుందో అక్కడ అనుబంధముంటుంది. ఎక్కడ అనుబంధముంటుందో అక్కడ నిరీక్షణ ఉంటుంది. నిరీక్షణ ఉన్నచోట బాధ తప్పనిసరి.

అందువల్లా ప్రధానమైన 'వేరు' లా ఉన్న ఈ భయమనేదిా నీలోా ఆరిపోనంతవరకు
ా పోనంత వరకు నువ్వు మానవబంధాల బాధ నుండిా అనుబంధాల చక్రం నుండి ఎప్పటికీ బయటపడలేవు. భయమనేది నిన్ను గొలుసులతో కట్టి వేస్తుందనేది రెండవ అంశం. నువ్వు సవాళ్లను, ఇబ్బందులను ఎదుర్కోవటంలో భయపడేవాడివయితే నువ్వు ఏనాడు నీ నిజమైన పరిపూర్ణ శక్తులను ఏ రంగం లో కూడా బయట పెట్టలేవు అప్పుడు నువ్వు ఏ ఇబ్బందిలేదు
ా ఏ నష్టము లేదు (జీరోారిస్క్ాజీరోాలాస్) అనే పద్ధతిలో వెళ్లే వాళ్లలో ఒకడివి అవుతావు. ఆధ్యాత్మిక పరంగా, భయమనేది నిన్ను పుస్తకాల పురుగుగా కట్టిపడేస్తుంది. నన్ను నమ్మండి. భయము ఉత్సాహభరితమైన ఆధ్యాత్మిక సాధనా రెండూకూడా విభిన్నమైనవి. సంగ్రహంగా చెప్పాలంటోా భయము
మరియు దైవత్వము రెండూ కూడా నీ హృదయంలో కలిసి జీవించలేవు. ఒక దాన్ని తప్పనిసరిగా విడిచిపెట్టాలి.

3. తీర్పు :

విభజనలో ఒక స్థాయిగా "తీర్పు" ను చేర్చటం మీకు కొంత ఆశ్చర్యం కలిగించవచ్చు. ఒకవ్యక్తి ఉన్నతమైన, జ్ఞానము యొక్క పరిశుద్ధ స్థాయికి వెళ్లాలని అనుకుంటే - ఈ తీర్పు - అనే అంశం- నీ మనస్సుయొక్క శుద్ధతకు, నీ అభివృద్ధికి పెద్ద అడ్డంకి అని గ్రహించు. నూటికి నూరు పాళ్లు తీర్పుతో సంబంధం లేని స్వభావం ఒక వ్యక్తి అభివృద్ధి చేసుకుంటున్నాడంటే అందుకు రెండు కారణాలు ఉంటాయి. నువ్వు గాఢమైన ఆధ్యాత్మిక అన్వేషకుడివి అయితే కాలానుగుణంగా ఆ మైలురాళ్లను పొందటానికి చురుకుగా ప్రయత్నించు.

మొదటి సందర్భంలో, ప్రతి విషయంపట్ల, ప్రతివారిపట్ల ఒక విలువైన తీర్పును ఇవ్వాలంటేా అది జీవితంలో ప్రాథమిక సూత్రానికి సంబంధించిన అధిక అజ్ఞానాన్ని ప్రదర్శిస్తుంది. ప్రతి జన్మలోను మన ఆత్మ ఒప్పందం ద్వారా ఈ గ్రహంలో జన్మిస్తుంది. ఈ ఒప్పందరా మానవ జీవి ఏనాడు అర్థం చేసుకోలేనిా జ్ఞాన స్థాయిలోా ప్రణాళిక స్థాయిలో ఉంటుంది. వ్యక్తి జీవితకాలంలో అనుభవించబోయే దుఃఖము, సంతోషము, జ్ఞానం, బాధ, పొందేది, పూర్తిచేసేదిా మొదలయినవన్నీ ఈ ఒప్పందంలో నీ ఊహలతో కలిసి ఉంటాయి. ఆత్మ తనకు పరిమితమైన **స్వేచ్ఛ** ని (నిర్ణయము, మేథోశక్తి మరియు తెలివి తేటలు ఇవన్నీ కలిసినది) ఉపయోగిస్తూ వివిధ మార్గాలలో ప్రయోగిస్తూ వివిధ మార్గాలలో ప్రయాణించే అవకాశంకూడా ఈ ఒప్పందంలో కలిపి ఉంటుంది.

మన భౌతిక అస్తిత్వము అంతా ఒక గొప్ప ప్రయోజనం కోసం నటుడు/ నటి, రచన మరియు నాటక రూపాలలో ముందే రచింపబడింది. ఒకరి ప్రవర్తన లేదా చర్యల గురించి తీర్పు ఇవ్వటానికి ప్రయత్నిస్తే అది అనవసరంగా భావోద్వేగాలకు అడ్డంకి అవుతుంది. అది నీకు అసమతుల్యతన (ఇమ్‌బాలెన్సడ్) కలిగిస్తుంది. నీ మనస్సు స్థిరంగా చిరాకు, విసుగులకు నిలయమవుతుంది.

రెండవది, నువ్వు తీర్పు ఇవ్వటానికి ప్రయత్నిస్తే నీ వ్యతిరేక కర్మల ఋణాన్ని నువ్వు పెంచుకొనే పెద్ద ఇబ్బంది ఉంది, ఆ వ్యక్తి తను పుట్టుకకు ముందే అనుకొన్న పాత్రని

యధాతథంగా ఆచరిస్తున్నాడనే విషయం తెలుసుకోవటంలో నువ్వు నిర్లక్ష్యము వహించావనుకొందాం అప్పుడు నీకు తెలియకుండానే అతన్ని ప్రత్యక్ష్యంగా కాని పరోక్షంగాకాని నీ మాటలు, చేతలు ద్వారా బాధపెట్టిన వాడివవుతావు. (కర్మఋణాన్ని పెంచుకొంటావని భావం - అనువాదకుడు) తీర్పు ఇవ్వటం ద్వారా బంధుత్వాలలో సామరస్యం చెడిపోతుంది. ఇది నీ జీవితంలో గొప్ప ప్రతికూలత అవుతుంది. అంతర్గత శాంతి మరియు నిశ్శబ్దం కొరకు తాపత్రయ పడే నీకు అడ్డంకి అవుతుంది.

**4.** ప్రేమ :

ప్రేమ అనే పదబంధానికి ప్రత్యేకంగా వివరణ ఇవ్వనక్కర్లేదు. అది వ్రాయటానికి చాలా ఇబ్బందికరమైనది. కష్టతరమైనది ఎందుకంటే ప్రేమని రకరకాల వ్యక్తులు రకరకాల అర్థాలలో స్వీకరిస్తున్నారు. తమ తమ మార్గాలలో వారికి ఆ హక్కు ఉంది. ఆధ్యాత్మిక పరిణామములో ఈ ప్రేమ పదాన్ని ఉపయోగించినప్పుడు ఈ సమస్య బాగా వస్తోంది. దేవుని యొక్క ప్రేమ, దేవుని కొరకు ప్రేమ, దేవుని వంటి ప్రేమ, ప్రేమ దేవుడు - ఇంకా బాగా దూషింపబడిన, అపార్థం చేసుకోబడిన విశ్వవ్యాప్తమైన, నిబంధనలు ప్రేమ - ఇలా చాలా ఉన్నాయి. చాలా ఎక్కువ ఈ విషయం గురించి వ్రాసారు. చాలా మంది చాలా కాలంగా వ్రాస్తున్నారు. కనుక నేను ఈ సమయాన్ని దీర్ఘకాల దు్ఃఖంతో -
బెంగతో కృశించే దైవ ప్రేమ గీతాలతో వృధా చేయదలుచుకోలేదు. నువ్వు దేవునివి కాదలుచుకొంటే, ప్రేమను గురించిన ఒక సంగ్రహావలోకనం (గ్లింప్స్) మీకు తెలియజేయాలనుకొంటున్నాను. చివరిరోజున, సంబంధితమైనది జరుగు తుంది. దైవికమైన అవకాశాన్ని అనుసరించి, మీ శక్తి అంత పవిత్రమవుతుంది.

దైవికమైన ప్రేమ మన ప్రేమలా తియ్యగా, ఉత్తేజకరంగా, కాల్పనిక తీవ్రత (రొమాంటిక్ ఫర్వర్) తో ఉండదు. ద్వేషం, కోపం, అసూయ, వ్యక్తిగత సమాచారం, అహంకారం, కామం, అనుబంధం, మోసం, దుర్మార్గం, భయం, క్రూరత్వం, నిరర్థకం - ఇలా ప్రతి వ్యతిరేక ఉద్వేగం - నిబంధనాయుతంగా పూర్తిగా కనబడకుండా ఉంటేనే - దైవిక ప్రేమ వికసిస్తుంది.

ఇప్పుడు చెప్పిన వరుస పూర్తిగా సమగ్రమైనది కాదు. విభజనకి, సంబంధించిన కీలకస్థాయి దగ్గరకు వచ్చిన తర్వాత, నీకు ఇది కొంత ఆలోచనను ఇస్తుంది.

5 అయిదురకాల ఇంద్రియాలపై పూర్తిగా అదుపు :

ప్రత్యేకంగా భౌతిక ప్రపంచంలో అయిదు రకాల ఇంద్రియాలు అన్ని రకాల అనుభవాలను నీకు కలిగిస్తాయి. ఇది అర్థం చేసుకోవటం కొంచెం కష్టం. ఆ ఇంద్రియ జ్ఞానాలు ఇక్కడ పూర్తి అనుభవ వ్యక్తీకరణతో ఉంటాయి. గాఢమైన అజ్ఞానము లో నుంచి దిగువ మనస్సు యొక్క కార్యకలాపాలకు తోడయి, మనం ఈ ఇంద్రియ జ్ఞానాలను తృప్తి పరచటానికి బానిసలమవుతాం అవి చాలా బలంగా ఉండి మన ఆత్మని తాము కోరుకున్న ప్రతిదీ చేయమని బలవంతపెడతాయి. అందువలన చివరి లక్ష్యం చేరుకొనే ప్రయాణం ఆలస్యమవుతుంది. ప్రయాణం ఆటంకపరచబడుతుంది. ఇంద్రియాలను తృప్తి పరచేప్రక్రియ ఒక దురలవాటయి, మనం పీడించబడతాం. అందువల్ల ఆత్మ
ఈ జనన మరణ చక్రం నుంచి బయటపడదు. ఇంద్రియాలపై సంపూర్ణమైన అధికారం ఉండటమే ఒకే ఒక పరిష్కారం.

6. స్థిరమైన ఎరుక :

ఒక రకమైన మానసికస్థాయిని గురించి మీతో మాట్లాడుతున్నాను. ఇది ఒక్క క్షణం కూడా మిమ్మల్ని విడవదు. మొదట్లో దీనిని కొంత ప్రయత్నంతో అభ్యాసం చేయాలి. కాని తర్వాత్తర్వాత ఇది అలవోకగా, తక్షణమే, నిరంతరా యంగా మీకు కలుగుతుంది. విషయాలు తేలికగా అర్థమవటానికి నేను ఈ ఎరుకను అంశరూపంలో (పాయింట్ ఫామ్) మీ ముందు ఉంచుతాను.

– జీవిస్తున్న ఏ ఒక్కరికి/ఒక్కదానికి ఈ ఎరుక ఉద్దేశ్యపూర్వకంగా బాధ కాని, కీడు కాని కలిగించదు.

– జీవితానికి సంబంధించిన ఒప్పందనాటకంలో ఉండే రకరకాల మానవ సంబంధాలలోని పాత్రల గురించి ఈ ఎరుక చెబుతుంది.

–ఎరుక అనేది సృష్టికర్త గురించిన ప్రతి అంశాన్ని తెలియజేస్తుంది. మనం కేవలం జీవితానికి సంబంధించిన కొన్ని సంవత్సరాలకు ధర్మకర్తలం మాత్రమే

– నీ మనస్సులోకి ప్రవేశించిన ప్రతి ఆలోచనను ఎరుక వివరిస్తుంది. అది నువ్వు ఏం

చెయ్యాలో, ఏం మాట్లాడాలో చెబుతుంది.

— నూతన అన్వేషణకు సిద్ధమవుతున్న మీ ఆత్మతో కలిసియున్న అన్ని రకాల సామర్థ్యాలు, శక్తులు, తెలివి, జ్ఞానము మరియు బలము పట్ల ఎరుక అవగాహన కలిగిస్తుంది.

— మీ ఆత్మ ప్రయాణం గురించి ఎరుక కలిగి ఉండాలి. అజ్ఞానం నుంచి విద్య వస్తుంది. బాధకి పూర్తిగా బాధ్యత మీదే. ఇంకెవరిది కాదు.

— బాధ, గాయము మరియు కష్టాలు ఇవన్నీ మేల్కొల్పటానికి ఎరుకే ఉపయోగపడుతుంది. ఇందువల్ల ఎదుగుదల, పరిణామం కలుగుతుంది.

— సృష్టిలోని ప్రతి అణువులో బలంగా సృష్టికర్త యొక్క సారాంశం ఉంటుందనే ఎరుక ఉండాలి.

— జరిగింది, జరుగుతోంది, జరగబోయేదీ అన్ని కూడా ఏదో ఒక అత్యున్నత మేధాశక్తి వల్లా ఒక బలమైన కారణం కొరకూ ఉపయోగం కొరకూ జరుగుతున్నదనే ఎరుక కలిగి ఉండాలి.

— నువ్వు **ఆత్మ**వి. నువ్వు మానవ అనుభవాన్ని మాత్రమే పొందుతున్నావు. **ఆత్మ**తో ఉన్న మానవునివి కావనే ఎరుక కలిగి ఉండాలి.

7. దైవసంకల్పానికి (డివైన్ విల్) పూర్తిగా శరణాగతి :

దైవసంకల్పానికి పూర్తిగా శరణాగతి అయ్యాయని, తమతమ జీవితాలలోని కష్టాలను, సమస్యలను విన్నవించుకొంటూ గంటలు గడిపేవారిని చూస్తే నవ్వు కలుగుతుంటుంది. అవును, తమ సమస్యలకు స్వామి వారు సహాయం చేయాలని పరిష్కారం చూపించాలని కోరుకుంటారు. మానవుల అర్థంలో శరణాగతి అందమైన షరతులతో కూడి ఉంటుంది. ఎంతకాలం జీవితంలో సంఘటనలు సకారణంగా సహింపదగినవో, దైవసంకల్పం అంతవరకు అంగీకరించదగినది. సంఘటనలు చిరాకుగా మన చేతిని మించిపోతే, అప్పుడు పూర్తిగా శరణాగతి పొందుతాం.

బహుశా చివరి స్థాయి విభజనని సమన్వయించటం చాలా కష్టసాధ్యము. ఎందుకంటె అది సరిగ్గా అర్థంకాలేదు. గ్రంధాలలో మరియు ఆధ్యాత్మిక వ్యాసాలలో - దైవ సంకల్పానికి శరణు చెందుట- జీవితంలో ఎదురయ్యే సమస్యలకు, బాధలకు మౌన అంగీకారంగా

చెబుతారు. దేవుడు నిన్ను బాధ అనుభవించమని చెబితే - దానిని నెమ్మదిగా ఎటువంటి ఫిర్యాదు లేకుండా అనుభవించమని నేర్పుతారు. ఇది వక్రీకరణ. దీనికి నేను అంగీకరించను.

దేవుడు ఎవరికీ బాధలను అనుభవించమని వాటిని అందించడు. ఇది మొదటగా తెలుసుకోవలసిన అంశం. మన ఒప్పందం ప్రకారం మన బాధలను మనమే ఎంచుకొంటాం. ఇప్పుడు ఈ కఠోర వాస్తవాన్ని నిర్ణయాత్మక బుద్ధితో అంగీకరించు. (గ్రిట్టింగ్ యువర్ టీత్) బాధను అంగీకరించటం వల్ల బలవత్తరమైన, చైతన్య భరితమైన ఆత్మ తయారవుతుంది. కాని ఇది దైవికంతో, మరియు దైవసంకల్పంతో సంబంధం లేదు. కొంత మంది తమ సమస్యలకు ఎదురొడ్డి లొంగదీసుకొని పోరాడాలనుకుంటారు. కొంతమంది నిశ్శబ్దంగా అంగీకరిస్తారు. కొంత మంది బకెట్ల కొద్ది కన్నీరు కారుస్తారు. శరణ సాన్నిధ్యంలో లొంగిపోయేందుకు ఎటువంటి మూలకం లేదు.

దైవ సంకల్పానికి శరణాగతి పొందటమనేది దయ యొక్క ఒక స్థాయి. అటువంటి ఆంతరంగిక సామీప్యతలో - ఆ వ్యక్తికి సంబంధించిన స్పృహలో - బాధకి కష్టాలకి సంబంధించిన అంశమేదీ చొరబడదు. ఆ వ్యక్తి యొక్క తీవ్రమైన దారిద్ర్యము, శుద్ధమైన ఒంటరితనం, తీవ్రమైన వ్యాధి యొక్క వడబోత, పరాయి వ్యక్తిని తిట్టుట శిక్షించుట (నెయిల్డ్ టు క్రాస్) ఇలాంటి వాటితో సంబంధము లేదు. ఈ శరణాగతిలో ఆనందం ఉంది. అది మానవ నాటకానికి సంబంధించి బాధ, భౌతిక పరిస్థితులు, మానసిక పరిస్థితి, ఉద్వేగము - ఇలాంటి వాటిని శరణాగతి తనవిగా చేస్తుంది.

ఇప్పటికి మీరు చేరిన లక్ష్యానికి, ఇంకా మిగిలిఉన్న ప్రయాణానికి - నేను వ్రాసిన ఈ ఏడు రకాల విభజన స్థాయిలు లోతు చూడటానికి, ప్రమాణాలకి సహకరిస్తుందని నమ్ముతున్నాను.

## ఈ సత్వర మార్గాన్ని ప్రయత్నించండి

నేను ఆత్మని పరిశుద్ధి చేయటం గురించి చాలా సార్లు వ్రాసాను. ఉన్నతస్థాయి పరిణామానికి ఈ పరిశుద్ధి ఎంత అత్యవసరమో కూడా చెప్పాను. కాని నాకు అనిపిస్తోంది. నన్ను అనుసరించే వారు ఈ వంతెన చాలా దూరమని, అనుకొన్న స్థాయిలకు దగ్గరవాలంటే చాలా జన్మల కాలం ప్రయత్నించవలసి వస్తోందని అనుకుంటున్నారు. అయినప్పటికి ఇది

అంత అవసరమయిన విషయం కాదు.

ఈ జన్మ పరంపరల చక్రపు ముగింపు మరియు అజ్ఞానమూ చిన్న పిల్లల ఆటకాదు. ఇది ఒక్క క్షణంలో నేను సూచించేది కాదు. కాని ఎవరైనా సత్వరమార్గాల ద్వారా మీకు మార్గదర్శనం చేయగలిగితే, అది కనిపించేటంత కఠినమైనదీ కూడా కాదు. నా మనస్సుకు తోచే, అద్భుతాలు సృష్టించగలిగే ఒక చక్కటి పద్ధతిని నేను కింద ఇవ్వబోతున్నాను. నా స్వీయ భావాలను గాయపరచని నిజాయితీతో (బ్రూటల్లీ హొనెస్ట్) ఇది చెబుతున్నాను. ఆత్మ యొక్క ప్రకాశాన్ని మీరు అనుభవంగా పొందాలన్నా లేదా దైవికమైన స్పృహలో ఆత్మని కలిపి వేయాలన్నా మీకు ఇంకో మార్గం ఖచ్చితంగా లేదు. మీ ఆత్మని రకరకాల జల్లెడలలో జల్లించి, అవసరమైన పరిశుద్ధతను దానికి అందచేయాలి. ఇంతకంటె మరో మార్గంలేదు. యోగ, తత్త్వశాస్త్రం, మతము, సిద్ధాంతము, గురువు, ముని, సన్యాసి, దేవుడు ఏ మార్గమయినా సరే మీరు దానిని అనుసరించండి. చివరి అర్హత మాత్రం ఒక్కటే. నువ్వు ఏ సిద్ధాంతాల బడి నుంచి వచ్చావన్న దానితో సంబంధంలేదు.

ఇప్పుడు మీ వ్యక్తిత్వానికి సంబంధించిన కొన్ని అంశాలు లేదా ఆ పరిశుద్ధికి అవసరమైన గుణాల దగ్గరికి వస్తాను. ఇవి కొంతమందిలో ఎప్పుడూ
ఎక్కువగా మరి కొంతమందిలో తక్కువగా ఉంటాయి. చర్మం మీద అనేక పొరలు ఒకదాని మీద ఒకటి ఉన్నట్లుగా ఆత్మపైన కూడా అనేక రకాలైన వ్యతిరేక సహజగుణాలు, ఉద్వేగాలు ఉన్నాయి. వీటిని శాశ్వతంగా ఒలిచివేసి, తీసేయాలి. ఇలా వీటిని తీసేయటం మీకు చాలా ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. కోపం, భయం దురాశ, కామం, అనుబంధం, అసూయ, అహంకారం, క్షేమం - ఈ తొమ్మిది మార్గాల మొత్తం పట్టికను తీసివేసే సామర్థ్యం నువ్వు కలిగి ఉన్నావు. ఈ భారీ ప్రయత్నంలో ఎక్కడైనా నువ్వు నిరుత్సాహం పొందావా - అప్పుడు ఇంకో జన్మలో నెరవేర్చటం కోసం వాయిదా వేయి. కాని ఇక్కడే మార్గం ఉంది.

శూన్యమైన కోరికలు కలిగిన వ్యక్తిగా (జీరో డిజైర్ పర్సన్) ఇకనుంచి ఈ పదబంధం జెడ్ డి పి గా వ్యవహరించబడుతుంది) మీరటానికి కల్పించుకొన్న, దృఢమైన మానసిక స్థితిని నువ్వు కలిగి ఉండాలి. దీని అర్థం ఏమంటే - దానికి తగిన బలమైన మానసిక స్పృహను పొందాలి. ఈ ప్రయత్నం నువ్వు ప్రారంభిస్తే అది నీ మానసిక, ఉద్వేగ స్థితికి

ఆకస్మికంగా, తీవ్రంగా కలిగిన కురుపు (షాక్) అవుతుంది. అసంఖ్యాకమైన జన్మల నుంచి నీ మనస్సు - ఇప్పుడు నువ్వు చేస్తున్న ఈ ప్రయత్నాలకు వ్యతిరేకంగా ఉంది. కాని నువ్వు చేసే ఒక చిన్న ప్రయత్నం - అద్భుతమైన ఫలితాలను ఇస్తుంది. నువ్వు జెడ్ డి పి కి దగ్గరిగా వస్తుంటే, చెప్పబోయే అద్భుతమైన ఫలితాలను పొందుతావు.

నమోదయిన ఒక బలమైన వాంఛ, నిర్ణయం మీ మనస్సులోనుంచి బయటకు, వచ్చి సంకల్పమవుతుంది. ప్రతి బలమైన అభిప్రాయం లేదా ఉద్దేశ్యం తప్పని సరిగా అనుభవింపబడాలి లేదా భౌతికరూపంలో నెరవేరక బాధనయినా అనుభవించాలి. నువ్వు ఏ జన్మలో ఆ కోరికను పూర్తి చేస్తావన్న దానితో సంబంధం లేదు. మనకు లెక్కలేనన్ని నెరవేరబడని కోరికలు మన
ఆత్మతో అనేక జన్మలనుండి అను సంధానింపబడియున్నాయి. అవి చాలక, ఇప్పటి ఈ జన్మలో మనం ప్రతిరోజు కొత్త కొత్త కోరికలను పెంచుకుంటున్నాం. ఇలా కోరికలు కూడబెట్టిన భారీ నిల్వగా పరిణమించి, ప్రతి జన్మలోను మనతో పాటు బతుకుతున్నాయి.

అందువల్ల ప్రారంభకులు చేయవలసిన మొదటి పని - బాధని లేదా సంతోషాన్ని తర్వాత కలిగించబోయే కోరికల ఉత్పత్తిని ఆపివేయటం. తర్వాత బకాయి (బ్యాక్ లాగ్) కోరికలకు కొత్తవి జతపడకుండా జాగ్రత్తపడటం నెరవేరని బకాయి (బ్యాక్ లాగ్) కోరికలను ఫలవంతం కాకుండా ప్రయత్నిస్తే - వ్యతిరేక కర్మ ఋణానికి సంబంధించి పెరిగే పరిస్థితులు, అవకాశాలు సమూలంగా నాశనమవుతాయి. అలాగే మరొక మానవ జన్మ భౌతికంగా ధరించే బలవంతం కూడా తగ్గిపోతుంది. అందువల్ల నువ్వు ఆధ్యాత్మిక అభివృద్ధికి కృషిచేసే వీలుంటుంది.

జెడ్ డి పి గా ఉండటం వల్ల జరిగే ఒక గొప్ప ప్రయోజనం ఉంది. నీలోనుంచి పుట్టే ప్రతి వ్యతిరేక గుణంతోను, ఉద్వేగంతోనూ నువ్వు పోరాటం చేయనక్కరలేదు. అన్ని రకాల వ్యతిరేక లేదా వ్యతిరేక సహజ గుణాలకు మూలంగా కోరిక ఉంటుంది. అందువల్ల కోరిక అనేది శూన్యమైనప్పుడు అన్ని రకాల వ్యతిరేక గుణాలు ఉన్న చెట్టు యొక్క వేరులను కత్తిరించిన వాడివవుతావు. ఆ తర్వాత చెట్టు ఎండిపోయి, తనంతట తానే కూలిపోతుంది. సంక్షిప్తంగా చెప్పాలంటే - నీ కోపము, ఉద్దేశ్యాలు, అనుబంధం, దురాశ, ద్వేషము, అసూయ

- ఇలాంటి వాటిమీద కట్టిన కట్టడం - ధ్వంసమవుతుంది. ఆహ్వానించదగిన పరిణామం ఏమంటే - ఒకేసారిగా భవనపు పునాదుల దగ్గర విస్ఫోటనం జరిగి, మొత్తం నిర్మాణం కూలిపోతుంది. అమాయకమైన ఆత్మకు సంబంధించిన సుప్తచేతనలో తీసి వేయటానికి కష్టంగా ఉండే వ్యతిరేక లక్షణాలు
అన్ని ఇప్పుడు ఒక్కదెబ్బతో - నిర్ణయాంతము వల్ల నశించిపోతాయి.

కోరికలు లేని దృశ్యాన్ని చూసి చాలా మంది వణికిపోతారు. వెంటనే మీ కళ్ల ఎదురుగా - నిరుపేదతనం, ఇల్లు లేని తనం, ఆకలి మరియు ఒంటరి తనం - ఇవన్నీ కళ్ల ఎదురుగా కదలాడతాయి. ఇక్కడే మనం దగ్గరితోవను కోల్పోతున్నాం. మీ జీవన నిర్మాణ ప్రణాళికలో (తలరాతలో) తెలియవచ్చే సాధారణ జీవితాన్ని మీరు కోరికలు లేకుండా గడపలేరు. కోరికలు లేకుండా మీకు ఇల్లు, కుటుంబం, సమృద్ధి, ఉద్యోగం, వ్యాపారం, వృత్తి లేదా సుఖదాయకమైన జీవనశైలి ఉండవని ఎవరు చెప్పారు మీకు?! వాటి మధ్య అన్యోన్య సంబంధము లేదు. విధిరాత లేదా అంతకంటె ఎక్కువ ప్రకారం మీకు ఏది పొందడానికి ఉద్దేశింపబడినదో అది తప్పక ఉంటుంది.

నువ్వు దానిని వెంబడించకపోయినా, నీకు ఏది ఎక్కువ రావాలో తప్పక నిన్ను వెంబడిస్తుంది. కాని ఆధ్యాత్మికంగా సంభవించే లాభాంశాలు - నువ్వు శూన్యమైన కోరికలు కలిగిన వ్యక్తిగా ఉంటే (జెడ్ డి పి) దిమ్మతిరిగేటట్టు చేస్తాయి. భౌతికాంశాలకు సంబంధించిన మీ జీవితము మీ మంచి కోసం 180 డిగ్రీల వైపుగా తిరిగితే, మలి అంచె రాకెట్ల వేగంతో మీ ఆధ్యాత్మిక ఉన్నతి జరుగుతుంది. (నువ్వు బయలు దేరిన దగ్గరనుంచి నువ్వు నిలబడి ఉన్న వ్యతిరేక దిశను 180 డిగ్రీలు అంటారు- అనువాదకుడు)

ప్రతి క్షణం ఏదో రకంగా, ఎవరో ఒకరి దగ్గర ఏదో ఒకటి కోరుకుంటున్న లోతుగా నాటుకు పోయిన పరిస్థితిని సమూలంగా పెకలించండి. ఈ రహస్య సూత్రం ప్రయత్నిస్తూ జీవించండి. ప్రతిదాన్ని అనుభవించండి ఏమీ కోరకండి

**వ్యాఖ్యలు**

ప్రశ్న :

ఈ మార్గంపై నడక చాలా కష్టసాధ్యమైనది. శూన్యమైనకోరికలు ! ఇది సాధ్యమా?

నిజం చెప్పాలంటే ఇప్పుడు అప్పుడు మనం ఏదో ఒకటి అడుగుతుంటాం. ఏదో ఒక విషయంలో మనకు కోరిక ఉంటుంది. ధ్యానం చేసేటప్పుడు కూడా - మోక్షం కావాలనేది మన కోరిక. దయచేసి మార్గదర్శనం చేయండి.

గురూజీ జవాబు :

నేను ఇటువంటి ప్రశ్న వస్తుందని భావిస్తున్నాను. ఇది విశదీకరించే అవకాశం నాకు ఇచ్చినందుకు ధన్యవాదాలు. మీరు కోరికలు మరియు లక్ష్యల మధ్య గందరగోళపడుతున్నారు. అవి సుద్ద మరియు జున్నులా (చాక్ యండ్ చీజ్) లా చాలా తేడా కలిగినవి. (పూర్తి వ్యతిరేక లక్షణాలు కలిగిన వస్తువుల మధ్య పోలికను చాక్ యండ్ చీజ్ అంటారు - అనువాదకుడు) లైంగిక ఆకర్షణ, గర్వం, ప్రచార కీర్తి (పాపులారిటీ) కీర్తి మొదలైన మౌలిక ప్రవృత్తులతో కలిసిన అయిదు ఇంద్రియాలను తృప్తి పరిచే అవసరాలనుండి ప్రధానంగా పుట్టేవి కోరికలు. జీవితం స్వీయగౌరవం (సెల్ఫ్ ఎస్టీమ్), ప్రయోజనాల నుండి పుట్టేవి లక్ష్యాలు. ఆమె/అతడు తన వైయక్తికమైన విలువను కాపాడుకోవటానికి - తప్పనిసరిగా కొన్ని లక్ష్యాలను కలిగి ఉండాలి. లక్ష్యలు భౌతికంగా, ఆర్థికంగా, వ్యక్తిగతంగా లేదా ఆధ్యాత్మికంగా ఉంటాయి.

లక్ష్యాలను, నిర్ణయాలను వేరు చేస్తూ చాలా అందమైన మందపాటి గీత ఉన్నది. కొన్ని సందర్భాలలో ఈ గీత సన్నంగా కూడా అవుతుంది. నెరవేరని కోరికలు అధిక సంఖ్యలో వ్యతిరేక భావాలను పెంచుతాయి. ఇది అయితే నెరవేరని లక్ష్యాలు - పరిష్కారానికి ఇంకాబలమైన శక్తి నిస్తాయి. అవి నెరవేర
టానికి మిమ్మల్ని మరింతగా శ్రమించేటట్టు చేస్తాయి. ఇది కోరికలకు, లక్ష్యాలకు మధ్య తేడా.

ప్రశ్న :

మిమ్మల్ని శూన్యమైన కోరికలు కలిగిన వ్యక్తులుగా ఉండమన్నారు. మనం కోరికలు లేకుండానే బ్రతుకుదామనుకొందాం. మరి పాత జన్మలలోని కోరికల మాటేమిటి? ఆ కోరికలు మన ఆధ్యాత్మిక అభివృద్ధికి అవరోధం కాదా? జవాబు అవును అయితే, బయట పడ్డానికి మార్గం ఏమిటి?

గురూజీ జవాబు :

పాత జన్మలలోని కోరికలగురించి మీరు ఏమీ చేయనవసరం లేదు. కాకపోతే మీరు బకాయి లెక్క (బ్యాక్‌లాగ్) కి కొత్తదేది జతచేయకండి. పాత జన్మలలోని కోరికలవాసనలు తమంతటతామె ఈ జన్మలోను, రాబోయే జన్మలలోను తమ పని తాము చేసుకుంటాయి. మీ అభివృద్ధి వేగంగా జరిగితే, ఒకశక్తిమంతుడైన గురువు యొక్క దయను మీరు పొందితే, పాతజన్మలలోని కోరికలు తక్షణమే నెరవేరతాయి.

ప్రశ్న :

గూరూజీ ! గురువు యొక్క అనుగ్రహాన్ని ఎలాసంపాదించాలి?

గురూజీ జవాబు :

ఇది ఎలా ఉందంటే గెలిచే లాటరీ టికెట్ సంఖ్య చెప్పమన్నట్టు ఉంది. అయితే నేను ఒక ఆధారం చెబుతాను. నీ గురువును బాగా దగ్గరగా పరిశీలించు ఆయన సాన్నిధ్యంలో కొంతకాలం గడుపు. నీకు ఆయననుండి లభిస్తున్న సహజమైన ప్రేమ ఏమిటో తెలుస్తుంది.

సంకేతపు మాట (పాస్ వర్డ్)

మీతో ఒక ఆసక్తిదాయకమైన పోలికను పంచుకోవాలనుకొంటున్నాను. వాస్తవంగా - ఈ రోజుల్లో ప్రతివాడు గణనయంత్ర అక్షరాస్యుడు (కంప్యూటర్ లిటరేచర్) కనుక నేను ప్రత్యేకంగా సంకేతపుమాట (పాస్‌వర్డ్) అంటే ఏమిటో, అది ఎలా పని చేస్తుందో చెప్పనక్కర్లేదు. నిషేధిత ప్రాంతాల ప్రవేశం కలిగిన, సమాచారపు నిల్వకలిగిన రక్షితమైన అధికార పరిధిలోకి (సెక్యూర్ డొమైన్) వెళ్లాలంటే ప్రతివారికి ఈ సంకేతపుమాట (పాస్‌వర్డ్) అవసరం. గాఢమైన ఆధ్యాత్మిక అన్వేషి ఇటువంటి పోలికగల సందర్భాన్నే ఎదుర్కొంటాడు.

గణన యంత్రంలా (కంప్యూటర్)ా ప్రతి జీవికూడా తనలో ప్రతి సమాచారాన్ని నిల్వ చేసుకునే శక్తి కలిగి ఉంటాడు. విశ్వం యొక్క విజ్ఞానము, జ్ఞానోదయం, శక్తులు, తెలివి మొదలైన వాటన్నింటికి మన ఆత్మ ఒక నిధిలాంటిది. మన సత్యమైన దైవిక మరియు శాశ్వత ప్రకృతులకు సంబంధించిన విజ్ఞానము మనలోనే కలిగి ఉన్నామని తెలుసుకోవడం

చాలా ముఖ్యమైన విషయం. ఇంకో మాటల్లో చెప్పాలంటే సృష్టికర్త ప్రకాశము యొక్క ప్రతిబింబాలు అని తెలుసుకోవటం చాలా ఆనందించదగిన విషయం. ఇవన్నీ మనలోనే పొదిగి ఉంటాయి. నిస్తంత్రీ గుర్తులను (వైర్‌లెస్ సిగ్నల్స్) అంతర్జాల సంబంధము (ఇంటర్‌నెట్ కనెక్షన్) కొరకు మీ గణనయంత్రము (కంప్యూటర్) ఎలాగ్రహిస్తుందో అలా జీవనప్రేరక శక్తిని గ్రహించే అంతర్గత నిర్మిత గణన యంత్ర పరికరాల్లాంటివి (ఇన్‌బిల్ట్ మోడెమ్స్) మన శరీరంలో ఉంటాయి. సామూహిక చేతన నుండి (కలెక్టివ్ కాన్షియస్‌నెస్) పరస్పర పరిణామాత్మ కాంశాలను పంచుకోవటానికి ఈ అంతర్గత నిర్మిత గణన యంత్రపరికరం (ఇన్‌బిల్ట్ మోడెమ్) ఉపకరిస్తుంది. బాగా లోడ్ చేయబడిన సాఫ్ట్‌వేర్‌తో ఉన్న హార్డ్ వేర్ ఈ జీవియొక్క తపనను తీర్చటానికి, శరీరంలోనే ఉంది. మన పని
ఏమిటంటే అజ్ఞానపు ముసుగును తొలగించటం, ప్రకాశాన్ని ఆరోపించటం, దయను చూపించటం - కర్మ బంధాలనుండి స్వేచ్ఛ కొరకు ప్రయత్నించటం.

మనలోపలే నెలకొల్పబడి ఉన్న ఈ విద్యుత్కేంద్రమును (పవర్ హౌస్) ను మనము ఎలా తెలుసుకుంటాం? వేలాది సంవత్సరాలుగా బాధపెడుతున్న మాయను ఎలా తొలగించుకుంటాము? ఇప్పుడు నీకు సంకేతపు మాట (పాస్‌వర్డ్) కావాలి. ఈ సంకేతపుమాట నీ స్పృహలో ఇదివరకే ఉంది. ఉపచేతన (సబ్‌కాన్షియస్‌నెస్) స్థాయిలో నీ విముక్తి కొరకు ఎలా తలుపులు తెరవాలో తెలుసుకుంటావు. ఇప్పుడు సమస్య ఎక్కడ ఉంది? కొన్ని వేలమంది జ్ఞానోదయం పొందిన బుద్ధులు మనకు ఎందుకు లేరు! ఎందుకంటే మాయకు సంబంధించిన అస్త్రం (ఫైల్) తెరవటానికి వీలయిన సంకేతపు మాటను (పాస్ వర్డ్) మనం మరిచిపోయాం. గణన యంత్రంలా (కంప్యూటర్), సంకేతపు మాటలో (పాస్‌వర్డ్) తప్పులుంటే, యంత్రం ప్రవేశాన్ని నిరాకరిస్తుంది.

ఇప్పుడు పరిష్కారము ఎక్కడ ఉంది? నువ్వు నీ స్వంతంగా సంకేతపు మాట (పాస్ వర్డ్) గుర్తుపెట్టుకోవటం. దీనివల్ల ఎప్పుడూ సుదూరపు (రిమోట్) అవకాశం ఉంటుంది. ఒకవేళ సంకేతపు మాట (పాస్ వర్డ్) గుర్తు లేక పోతే పదే పదే రకరకాల అక్షర, సంఖ్యల కలయికలతో ప్రయత్నిస్తూ ఉండాలి. చివరికి ఎప్పుడో అదృష్టవశాత్తు సరియైన దానిని నొక్కుతావు. చాలా మంది ఆధ్యాత్మిక అన్వేషకులు ఈ రెండో తరగతిలోకి వస్తారు.

అవతారాల (జన్మల) కొరకు అన్వేషకులు ప్రయత్నిస్తారు. వారి పని వృధా అవుతుంటుంది. మళ్ళీ రకరకాల సంకేతపు మాటలు (పథక పద్దతులు) వాడతారు. కాని సంకేతము యొక్క చీలిక (క్రాక్) తెలియక అపజయం పొందుతారు. అయితే కొద్ది మంది చురుకైన వారు మాత్రమే ఒక నేరుగా ఉన్న, సులభమైన పరిష్కారాన్ని గ్రహిస్తారు. మీకు తెలివి ఉంటే దానిని గ్రహిస్తారు. ఒకే ఒక్క వ్యక్తి మాత్రమే
మీకు 'సంకేతపు మాట' (పాస్‌వర్డ్) జ్ఞప్తి చేస్తారు. ఆ వ్యక్తి జ్ఞాన పరిపూర్ణుడయిన స్వీయావగాహన కలిగిన గురువు.

గురువుకి సంకేతపు మాట (పాస్‌వర్డ్) తెలియటమే కాదు, దానిని ఎలా జ్ఞప్తిలో ఉంచుకోవాలో కూడా తెలుసు. అందువల్ల నీ జ్ఞాపకం ఎంతకాలం ఊగులాడుతుందంటే - నీ గురువు నీకు జ్ఞప్తి చేసేటంతవరకు, నీ విజ్ఞాన కోశాగారంలో ప్రేమ, అనుభవంలో ఎలా ప్రవేశించాలో గురువు తెలియ జేసేటంతవరకు! అయితే ఇక్కడ ఒక సడలింపు ఉంది. చాలా తక్కువ సందర్భాల్లో గురువు తన స్వీయ మార్గాలను ఉపయోగించి, తక్షణమే శిష్యునికి ఈ విశ్వనుండి విముక్తి (మోక్షం) కలిగించవచ్చు.

మానవశరీరము, మనశ్వాస, ప్రేతశరీరము, ఉన్నతచేతనా స్థితి మరియు చివరకు ఆత్మ విముక్తిా ఇవన్నీ ఒకదానితో ఒకటి కలిసి ఉంటాయి. ఇవి జ్ఞానోదయం కాని అన్వేషికి పూర్తిగా గ్రాహ్యం కావు. అందుకే ఈ పోలిక గల వ్యాసం వ్రాసాను. నన్ను నమ్మండి. మీరు ఏ మార్గాన్ని అనుసరించండి! మీరు ఏ తత్త్వాన్నయినా పాటించండి! కాని చివరి స్థాయిలో గోడని పగల గొట్టవలసిందే. దీనికి తగిన సంకేతపు మాట (పాస్‌వర్డ్) లేక పోతే మీకు ప్రవేశము లేదు. ఈ సంకేతపు మాట ఎలా కనబడుతుందో, ఎలా అనుభవించ బడుతుందో తెలుసుకుంటే మీరు చాలా ఆశ్చర్యపోతారు. కాని నన్ను క్షమించండి దీనిని వివరించలేను. ఆ గోడని మీరే తాకండి! మీ అంతట మీరే దానిని తెలుసుకోండి.

ఏ పుస్తకము లేదా గ్రంథము ఇంతవరకు ఈ సంకేతపు మాట (పాస్‌వర్డ్) వివరం ఇవ్వలేదు. ఎప్పుడు ఇవ్వబోదు కూడా (అంటే ఎవరూ కూడా దీనిని గురించి వ్రాయలేదని గురూజీ ఉద్దేశం - అనువాదకుడు) ఈ సంకేతపు

మాటని జ్ఞానపరిపూర్ణత పొందబోతున్న శిష్యునికి జ్ఞానపరిపూర్ణుడైన గురువు మాత్రమే ఇవ్వగలడు.

ఈ కారణంగానే మునులు, సన్యాసులు, జ్ఞానపరిపూర్ణులు మరియు విశ్వజ్ఞానమును వివరించే అన్ని రకాల పురాతన గ్రంధాలు - గురువు ద్వారానే దేవుని చేరగలమని, మరియు గురువొక్కడే ఆత్మానుభవం కలిగించాడని పదే పదే చెప్పాయి. దురదృష్టవశాత్తు నిబంధనకు సడలింపులు ఏమీ లేవు.

## వ్యాఖ్యలు

ప్రశ్న :

ఒక వ్యక్తి సంకేతపు మాటను (పాస్‌వర్డ్) తెలుసుకొన్నానని ఎలా భావిస్తాడు? గురువు సంకేతపు మాట. చెప్పటానికి ఇది తగిన సమయమని ఎలా తెలుసుకుంటాడు? గురువు దగ్గరినుంచి అన్వేషి ఇది పొందటానికి ఎటువంటి అర్హత సంపాదించుకోవాలి?

గురూజీ జవాబు :

స్వీయ పరిపూర్ణత (సెల్ఫ్‌రియలైజేషన్) పొందడానికి తగిన అర్హత, పరిపక్వత వచ్చిన సమయంలో ఈ సంకేతపు మాట (పాస్‌వర్డ్) అవసర ఉంటుంది. ఈ స్థితిలో మీ ప్రశ్నకు తగిన జవాబు ఏ ప్రయత్నం లేకుండానే సిద్ధిస్తుంది. ఈ స్థితిలో మీ స్థితిలో ఏ ప్రాముఖ్యం లేనిది. ఎప్పుడు, ఎలా, ఏది పొందాలన్నది మీకు తెలుస్తుంది. నన్ను నమ్మండి.

ప్రశ్న :

మన జీవన నిర్మాణప్రణాళిక (తలరాత) లో గురువు ఇతనవుతాడని వ్రాసి పెట్టి ఉంటుందా? శిష్యుడు జ్ఞాన పరిపూర్ణత పొందే వరకు గురువు వేచిఉంటాడా?

గురూజీ జవాబు :

మీ మొదటి ప్రశ్నకు జవాబు"అవును'' అయితే అతనిని మీరు గుర్తించలేకపోతే, ఆ జన్మకి సంబంధించినంతవరకు మీరు అవకాశాన్ని కోల్పోయినట్లు. ఇక రెండవ ప్రశ్నకి జవాబు "లేదు'' ఒక బలమైన అనుబంధం కనుక ఉన్నట్లయితే గురువు అతని శిష్యుడు

అనేక జన్మలనుంచి కలిసే పుడతారు. అయితే ఇది తప్పని సరికాదు. జీవననిర్మాణ ప్రణాళికలో అనేక
అస్థిరత్వాలు ఉంటాయి. అయితే మీరు తగినంత సాధన చేస్తే ఈ జన్మలో మీరు తప్పక గురువును పొందుతారు. అతను మిమ్మల్ని గుర్తించి, శిష్యునిగా అంగీకరిస్తాడు.

ప్రశ్న :

ఒక అనుభవంలేని సాధకుడైన శిష్యుడు గురువును గుర్తించే జవాబుదారి తనాన్ని బాధ్యతను ఎందుకు తీసుకోవాలి? జ్ఞానపరిపూర్ణుడైన గురువే - (జీవన నిర్మాణ ప్రణాళిక ప్రకారం) స్వయంగా శిష్యుని గుర్తించి, తరువాత ఆధ్యాత్మిక యాత్రకు వెంట తీసుకొని వెళ్లవచ్చు కదా!?

గురూజీ జవాబు :

మంచి ప్రశ్న. ఆధ్యాత్మిక ప్రయాణ ప్రారంభంలో - గురువును గుర్తించే బాధ్యత నీ మీదే ఉంటుంది. ఇది నువ్వు తయారు చేసుకొన్న అభివృద్ధి యొక్క పరీక్ష. ఇది నీ స్వేచ్ఛకి (ఫ్రీ విల్) సంబంధించిన హక్కుకూడా. నువ్వు తగిన పరిశుద్ధత యొక్క ప్రవేశ మార్గంలో ప్రవేశించి- నీ లక్ష్యానికి దగ్గరయితే - గురువే - ఎటువంటి ప్రయత్నం లేకుండా నీ తలుపు తడతాడు. ఇప్పుడు మీరు విశ్వానికి సంబంధించిన ఒక పెట్టుబడి.

**అనుబంధాలు**

ప్రతి సంవత్సరం మొదటి వారంలో, నౌషిర్ గురూజీ – ఈ భూ గ్రహానికి – వ్యక్తికి సంబంధించిన విషయాలనూ ఆ సంవత్సరంతో ముడిపెడుతూ వ్యాసాలు వ్రాస్తుంటారు. 2010 నుండి 2013 వరకు ఉన్న ఆ వ్యాసాలను రాబోయే పేజీలలో వరుసగా ఇచ్చాము.

క్రీ.శ. 2010 – మార్పు రాబోతుంది

(తేది 28-12-2009)

క్రీ.శ. 2011 – జరుగటానికి వీలులేని సంఘటనల సంవత్సరం

(తేది 01-01-2011)

క్రీ.శ. 2012లో కాలజ్ఞానం (జ్యోస్యం)
(తేది 01-01-2012)

క్రీ.శ. 2013లో సంవత్సరం తర్వాత
(తేది 01-01-2013)

**క్రీ.శ. 2011**

**జరుగటానికి వీలులేని సంఘటనలు కల సంవత్సరం**

మరొకసారి ఈ సమయసూచిక సంవత్సరం (క్యాలండర్ ఇయర్) పూర్తయింది. ఉద్వేగాలు, అనుభూతులు కలబోసుకున్న కొత్త సంవత్సరరా కొన్ని రోజుల వరకయినా తాజాగా ఉండబోతోంది. ఉత్కంఠ, నమ్మకం, కొంచెం భయం, జాగ్రత్తలతో కూడిన ఆశావాదరా వీటితో పాటు చాలామందికి తమ జీవితాలు ఈ సంవత్సరంలో ఎటుపోతాయో, ఈ గ్రహం ఎలా నాయకత్వం వహించబోతోందో అని ఎదురు చూస్తుంటారు. అందువల్ల మీలో ఉన్న ఆ హింసను కొంచెమైన తగ్గించే 2011కి సంబంధించిన భూమిక (ప్రస్తావన) చేస్తాను.

మీరు ఈ సమాచారాన్ని చదవబోయే ముందు, ప్రతి ఏడాది చెబుతున్నట్లుగానే ఒక విషయాన్ని గట్టిగా చెప్పదలుచుకొన్నాను. నేను ప్రవక్తనికాను, సోది చెప్పేవాడిని కాను, బోధకుడిని గాను. ఈ వ్యాసంలో చెబుత్నుది. భవిష్యత్తుకాదు. రాబోయే అసాధారణచర్యల వివరణకాదు. నేను ఈ గ్రహంపై ఉన్న శక్తుల మార్గాన్ని మదింపును అనేక రకాల సంఖ్యల ఊహలతో మిళితం చేసి చెబుతున్నాను. కనుక దీనిని ఉదార బుద్ధితో చదవండి. తార్కికాలోచనతో విశ్వసించండి (జనరస్ పించ్ ఆఫ్ సాల్ట్)

ఒక చిన్న జాతీయంలో చెప్పాలంటే ఈ 2011 సంవత్సరం జరుగటానికి వీలులేని సంఘటనలు గల సంవత్సరం ముందుగా భావించుకొన్నట్లుగానే, నిరీక్షిస్తున్నట్లుగానే వేగంగా 2012 సంవత్సరం వైపు అడుగులువేస్తున్న ఈ 2011వ సంవత్సరము - ఎక్కువ చక్రాల లారీ భారపు (ట్రక్ లోడ్) ఆశ్చర్యాలను - ఈ భూగ్రహానికి, వ్యక్తికి మోసుకొస్తుంది. నేను ఇప్పుడు స్థూలస్థాయిలో మొదలు పెడతాను. ప్రపంచవ్యాప్తంగా ఆ నిర్ణయాత్మక మార్పులు

2012

చివరిలోగా చోటు చేసుకోబోయే ముందుగానే దానికి సంబంధించిన కదలికలు ముందుగానే (2011లో) మొదలవుతాయి. ప్రపంచ వ్యాప్తంగా నమ్మగూడని సంఘటనలను ఈ సంవత్సరం చూడబోతోంది. కొన్ని నెలల క్రితం దీనిని అసాధ్యమని భావించేవారు. చాలా తక్కువ కాలంలో చాలా తక్కువ ప్రాధాన్యత ఇచ్చిన సంఘటనలు మార్పులు జరుగబోతున్నాయి. కొత్త శక్తులు భూమిని కైవసం చేసుకోవటానికి వస్తున్నాయి. ఈ సంవత్సరపు పెద్ద సంఖ్య 11. అందువల్ల విశ్వ వ్యాప్త చేతనలో గ్రహణశక్తి మార్పువస్తుంది. ఇప్పటి దాకా ఇది స్పష్టంగాలేదు కాని, 2011లో ఆ మార్పును మనం చూడగలం. ఈ మార్పు సానుకూలమా వ్యతిరేకమా అనేది మీ వ్యక్తిగతా విశ్వాసాలపై ఆధారపడిఉంటుంది. తగిన సమయంలో ఆ అసాధారణ స్థితి తప్పకుండా 2011లో సరియైన సమయంలో ఉలికిపాటు కలిగిస్తుంది. అసాధారణమైన ఆలోచన, పాతసమస్యల మూలానికి చేరిన పరిష్కారాలు రోజువారి క్రమాన్ని అనుసరించి వస్తాయి. కత్తులు దూసుకొనే వారు ఇప్పుడు స్నేహితులవుతారు! పాత స్నేహితులు విడిపోతారు! పోలిక లేని విధంగా పొత్తులు మరియు భాగస్వామ్యాలు అన్నీ ఈ సంవత్సరంలో పునరుద్ధరించబడతాయి.

ఇలా చెప్పడంవల్ల మూకుమ్మడి గెరిల్లా యుద్ధాలు, కలహాలు, భయాలు మొదలైనవి తగ్గిపోతాయని కాదు. మార్పు, మరియు బాధ ఎప్పుడు విడివిడిగా ఉండవు. ప్రపంచవ్యాప్తంగా అంతిమ పోరు చేతిలో ఉన్నట్లుగా అనిపించే కొన్ని మెరుపు సంఘటనలు జరుగుతాయి. ఆర్థికసంబంధమైన, ద్రవ్య సంబంధమైన రాజకీయ స్థితిని కూడా ఇది సూచిస్తుంది. ఆర్థికపరంగా మరియు రాజకీయ పరంగా ప్రపంచం తప్పని సరి మార్పును ఆజ్ఞాపిస్తుంది. ఆశ్చర్యకరంగా ఒక వర్గానికి మద్దతివ్వటం (అలైన్‌మెంట్స్) ఎక్కువ నిష్పక్షపాతంగా మరియు ప్రపంచ స్థాయిలో జరుగుతాయి. ఇది గత 60 అసాధారణ సంవత్సరాల నుండి ప్రాబల్యం చూపిస్తున్న హెచ్చు ప్రమాణాలు గల శక్తి ప్రాబల్యం కంటె అధికమైన
పరిస్థితి మానవత్వానికి సంబంధించిన సామూహిక చేతన క్రమంగా ఆధ్యాత్మిక పథం వైపు పయనిస్తుంది. మానవ బాధలపట్ల ఎక్కువ అసహనం కనబడుతుంది. ఎరుకతో కలిసిన సాంకేతికత వేగంగా దురాగతాలను బాగా ప్రదర్శిస్తుంది అవి నశించటానికి తోడ్పడుతుంది. నిస్సందేహంగా మత పరమైన తీవ్రవాదం క్రూరంగా, తన విచక్షణా జ్ఞాన సమయాలను,

స్వయంగా రూపొందించుకొన్న కార్యక్రమాల పట్టికలను అన్ని రకాలుగా విడువదు. కాకపోతే తన బాధల రాజకీయాలకు చాలా చాలా తక్కువ మంది ధృవీకరణను పొందుతుంది.

పరిమితమైన ప్రదేశాలలో భయంకరమైన ప్రకృతి ఉత్పాతాలను ఊహించవచ్చు. మొత్తం ఈ భూమి అంతా కూడా మండుతున్న అగ్నిగోళం లాగానో, ఇంకోలానే అయిపోతుందనికాదు. కారణము ఏదైనప్పటికి కొన్ని ప్రదేశాలు చాలా గట్టిగా, కఠినంగా బలిఅవుతాయి. కాకపోతే, వాతావరణం ఎటువంటి దయను చూపించదు. వాతావరణపరంగా 2010 చాలా అసహ్యకరమైన సంవత్సరాలలో ఒకటిగా ఇటీవల ఒక జ్ఞాపకం "చాలా మంచిదైన, చాలా ఉద్వేగకరమైన భాగం రాబోతోంది" మీరు తప్పుడు ప్రదేశంలో తప్పుడు సమయంలో పట్టుబడ్డారని క్రితం సారి నేను చెప్పాను (యు ఆర్ నాట్ సీన్ నత్తింగ్ యట్ అనేది రండీబచ్ మన్ వ్రాసిన ఒక రాక్ సాంగ్ - అనువాదకుడు)

ఇక వ్యక్తి గతంగా చూస్తే ఈ సంవత్సరం చాలా ఉద్వేగకరంగా, ఒత్తిడిగా ఉంటుంది. అయితే అది మీలోని భయస్థాయిని బట్టి ఉంటుంది. నిర్ణయించుకొన్న చాలా ప్రణాళికలూ అల్లకల్లోలం కానున్నాయి. కనుక మీ ప్రణాళికలలో మార్పులకొరకు సిద్ధం కండి. దేని పట్లయితే మీరు బలంగా అనుబంధం కలిగి ఉంటారో అవి ఆలోచనలు, ప్రణాళికలు, స్వాధీనములు,
ప్రదేశాలు లేక ప్రజలు కావచ్చు వీటిలో మీరు చాలా సంక్షోభాన్ని ఎదుర్కోవాలిసి ఉంటుంది. ఏ మార్పు పట్ల యిలా స్వీకృతి లేదా భయం లేని విధానం ఉండటమే నీ శాంత లేదా విజయ మంత్రం. లేదా కొంత నియమ నిబంధనలు లేని సన్నివేశాలకు సిద్ధం కండి ఆత్మీయకుటుంబ సభ్యులు పనిచేస్తున్నచోట ఉన్న స్నేహితులు (రోగ్ ఎండ్ తంబుల్)ా ఇటువంటి వ్యక్తిగత సంబంధాలమధ్య అనుకోనిది జరగవచ్చు. ప్రపంచ వ్యాప్తంగా పూర్తిగా వ్యక్తిగతంగా కొత్త రకమైన పొత్తులు లేదా స్నేహాల అవకాశాలు ఉంటాయి.

ఇక్కడ నా సంబంధం ఏమిటంటే చాలామంది తమలాంటి స్పందనలు కలిగిన వ్యక్తులను కనుగొనటం జరుగుతుంది. లేదా వారి పట్ల బలంగా ఆకర్షింపబడటం జరుగుతుంది. ఇది సాంప్రదాయక కుటుంబ వ్యవస్థకు ఒక హెచ్చరిక అవుతుంది. కాని ప్రపంచం నీ జీవితంలో కోరుకోని నిర్ణయాలను ఒక్కసారిగా తనంతట తానే తోసివేస్తుందని

కలల సమూహాన్ని వాటిల్లో నింపుతుందని ఒక ఆలోచనను మనస్సులో పెట్టుకోండి.

దీని అర్థం ఒకటే - మీరు కొన్ని కఠినమైన నిర్ణయాలు తీసుకోండి. మీ హృదయం ఏది నిర్ణయిస్తుందో, దానినే కోరుకోండి. కొన్ని సందర్భాలుంటాయి, ప్రస్తుత పరిస్థితిని కలచివేసే పరిస్థితి తెప్పించే దురాకర్షణ వద్దు. (నే టెంప్టేషన్ టు రాక్ ద బోట్) అలాగే ఉన్న యథాతథ స్థితిని చెత్తగా పోగుపడేయాలనుకోకు. (డంప్ ద స్టేటస్ ). కాని ప్రాథమిక తాత్త్వికత (గ్రౌండ్ రియాల్టీ) అనుసరించి మరియు నువ్వు మానసికంగా, ఉద్వేగంగా బలంగా ఉన్న స్థితిపై ఆధారపడి నువ్వు పాతదాన్ని కొత్తదానితో మార్చుకోవటానికి ప్రయత్నించవచ్చు.

ఆధ్యాత్మికత అంటే ఇష్టమున్నవానికి - ఈ రకమైన ఆధ్యాత్మిక పెరుగుదలను అపేక్షించేవారికి - ఆ సంవత్సరం గొప్ప వాగ్దానం ఇస్తోంది.
చిన్నపాటి ప్రయత్నం గొప్ప ఫలితాలను సాధిస్తుంది. మీ అభివృద్ధి మీ ఊహలను తలదన్నుతుంది. శక్తికి అనుగుణంగా చక్కటి స్పందనలను మీరు కలిగి ఉన్నట్లయితే, అధిక సమయం సానుకూల దృక్పథంతో ఉన్నట్లయితే, కొద్ది పాటి ప్రయత్నంతోనే మీ ప్రయత్నాలు ఎంత సులభంగా నెరవేరతాయో మీరే చూడండి ఒకవేళ పరిస్థితి తలకిందులయితే మాత్రం, మీ స్పందన చాలా తక్కువగా ఉంటే, అంతా వ్యతిరేకమవుతుంది. గత రెండు సంవత్సరాలనుంచి ఇలాగే జరుగుతోంది. కాని ఇప్పుడు స్పందన మాత్రం ఎక్కువగా ఉచ్చరిస్తోంది.

చివరిగా, రాబోయే రెండు సంవత్సరాలకి ముఖ్యమైన భావికథనం ఏమిటంటే మీ జీవితంలోని ప్రతి అంశం - చాలా అనూహ్యంగా ఉంటుంది. వేగంగా పరివర్తనానికి ఏదైనా ప్రతిబంధము ఎదురైతే, ఒకదానితర్వాత ఒకటిగా భయాలు ఎదురైతే, నిన్ను విషణ్ణుడిగా (డిస్పోడెంట్), పరాజితునిగా నీ జీవితం తయారుచేస్తుంది. మీ ఆలోచన తీవ్రంగా దృఢంగా మార్పు పొందుతున్న ప్రపంచంలో మీరు కూడా వేగంగా అసంబంధీకునిగా, (సంబంధంలేనివానిగా) మారిపోవాలి.

## క్రీ.శ. 2012 కాలజ్ఞానం

ఎదురు చూడటం పూర్తయింది. ఇటీవల మానవచరిత్రలో 2012వ సంవత్సరం

నరాలు తెగేటట్లు ఉన్న ఉత్కంఠతో నిరీక్షించే సంవత్సరమని చెప్పటానికి నాకు ఎటువంటి సందేహం లేదు. ఏ ఇతర సంవత్సరం కూడా ఇలా- ఇంత విశేషాధికారం కలిగిన వార్తలతో, చర్చలతో, భయనకంగా, ఒక చలన చిత్రం తీయగలిగేటంతగా లేదు ఈ 2012 సంవత్సరము గురించి చాలా పుస్తకాలు వచ్చాయి. వాటిలో చాలా వరకు సంచలనాత్మకమైనవి.

ఈ సంవత్సరం గురించి మనకి చాలా మంది చెబుతున్నారు. ఈ 2012 సంవత్సరములో భూమి చరిత్ర ముగిసిపోతుంది. కాలను ఆగిపోతుంది. భూపటలం కూలిపోతుంది. భూమి అంతా కరగి పోతుంది. పైకి పేలి పోతుంది. సముద్రాలు పైకి లేస్తాయి. భూభాగం మునిగి పోతుంది. ఇది ప్రకటన గ్రంథం. అప్పుడు ఒక కొత్త ఉదయం కొత్త ప్రపంచంలోకి ప్రవేశపెట్టబడుతుంది. ఇది హాలివుడ్ వారికి ఎదుర్కోవటానికి చాలా మంచి వార్త అయింది. మానవుల మృత్యుభయాన్ని ఉపయోగించుకొంటు '2012' అనే పేరు మీదుగ ఒక చిత్రము కూడా తీసి, డబ్బు గడించారు. మరి హాలివుడ్ వాళ్ళ మరియు మృత్యుప్రవక్తలు చెప్పేది నిజమేనా? చదవండి.

నేను ఇప్పుడు మీకు పంచబోయే విషయం యొక్క నిజాయితీ, సాధికారికతలను గూర్చి మీకు ఒక అవగాహన కలిగించే విషయం చెబుతాను. ఇది మీకు ఆ సమాచారం ఎలా వచ్చిందో తెలియజేస్తుంది. ఇది ఇంకో ఆత్మసమాచారం కాదు. భవిష్యవాణుల విషయంలో నేను ఇటువంటి ఆత్మ సమాచారాలను మీ మీద ఎప్పుడూ చల్లలేదు. ఈ ప్రకటన, నా విజ్ఞప్తి మీద - దివ్యపరిధిలో ఉన్న మానవరూపంలో ఉన్న ఒక గాఢమైన జీవాత్మ - నుంచి

నాకు వచ్చింది. నేను ఎవరి పేర్లు చెప్పనవసరంలేదు. సత్యశీలి ఈ సమాచారాన్ని ఆత్మ ప్రపంచం నుండి పొందాడు. దాని గుర్తులు చెప్పలేదు. కాని ఈ సమాచారం లోని గొంతు, నిర్ధారణను బట్టి మీరు ఈ సమాచారాన్ని ఇచ్చిన వారెవరో ఒక అంచనా వేయవచ్చు. కాని ఒకటి మాత్రం స్పష్టం చేస్తున్నాను. ఈ సమాచారం ఒక మానవ మనస్సు నుండి రాలేదు. ఏమయినా నేను ఇప్పుడు చదువరికి స్పష్టత కోసం నాకు అందిన సమాచారాన్ని పెద్ద అక్షరాల్లో ఇస్తున్నాను. నా వ్యాఖ్యానం విడిగా ఇస్తున్నాను. ఇందు వల్ల మీరు సమాచారాన్ని

విడిగా మీకు మీరుగా చదువుకొంటే ఆ శక్తి ఏమిటో అనుభవించటానికి వీలవుతుంది. నేను ఇచ్చిన వివరణ కూడా మీకు ఆ శక్తి అనుభవానికి తోడ్పడుతుంది.

## సమాచారము

ఈ విశ్వంలో అనేక వేలవేల ప్రపంచాలు ఉన్నాయి. ఈ భూమి అందులో ఒకటి. ఈ భూ గ్రహం మొత్తం పరిధిలో ఒకటి దాని ఆకారం మరియు నిర్మాణం, ఇది కొండలు, నదులు, సముద్రాలు దాని భౌతిక శరీరము. ఈ భూమిపై నివసించే ప్రతి జీవి ఈ భూమి యొక్క ఆత్మగా మారుతారు. ఈ విశాల విశ్వంలో ఉన్న ప్రతి గ్రహము కూడా తన ప్రత్యేక ఉనికిని కాపాడుకుంటుంది. ఈ గ్రహాన్ని కాపాడటానికి మానవ జాతికి సేవ చేసే ఆత్మ జ్ఞానము కలిగిన గురువులు (అసెండెడ్ మాస్టర్స్) మరియు మార్గదర్శకులు ఉంటారు.

నేను పై సందేశం నుంచి గ్రహించినదేమిటంటే, మన విశాల విశ్వంలో అనేక రకాల జీవులున్న లెక్కలేనన్ని గ్రహాలున్నాయని, అయితే ఇప్పటికి మనకి దీనికి సంబంధించి, జీవులున్న గ్రహాలున్నాయని నిరూపించే విజ్ఞాన శాస్త్ర సాక్ష్యమేమీ లేదు. అయితే ఈ సంవత్సరం మంచి అవగాహన కలిగిన, తెలివైన ఒకవిధమైన సజీవ సాక్ష్యాన్ని లేదా మానవరూప జీవితాన్ని ఈ విశాల విశ్వంలో మరో చోట విసిరివేస్తే నేను ఏమీ ఆశ్చర్యపడను. లేదా ఇంకా మంచిగా గ్రహాంతర జీవితంతో మానవులమైన మనము ఒక విధమైన సంబంధం కూడా నెలకొల్పుకొనవచ్చు.

పై సందేశంలో ముఖ్యమైన విశేషభాగం ఉంది. ఈ భూగ్రహం, దానిపై నివసించే జీవితం- రెండూ కూడా ఒకే తత్త్వంగా భావించాలి. అందువల్లనే మనము తరచుగా జీవగ్రహంగా పిలువబడుతుంటాం. ఈ గ్రహము యొక్క ఆత్మకు సంబంధించిన సామూహిక రూపాన్ని ఈ గ్రహంపై నివసించే మనతో సహా, ప్రతిజీవి కలిగి ఉంది. వస్తు

నిర్మాణ ప్రణాళికలో ప్రతిజీవి ఎంత ముఖ్యమో ఇది స్పష్టంగా నిరూపిస్తుంది. ఈ భూ గ్రహానికి సంబంధించిన ఆత్మ నిరూపణకి ప్రతిజాతి దోహదం చేస్తుంది. అందువల్ల ఈ భూగ్రహంపై ప్రతి జాతి ముఖ్యమైనదే. ప్రతిదాన్ని తప్పనిసరిగా రక్షించుకోవాలి.

మనము పూర్తిగా అర్థం చేసుకోలేక పోయిన ఒక సంబంధ మార్గంలో ప్రతి జీవియొక్క స్పృహ జతపరచబడిఉన్నదని - పై సందేశం ద్వారా మనం తెలుసుకోవాలి. ఇంకా మానవజాతికి సేవచేసే ఆత్మ జ్ఞానము కలిగిన గురువులు (అసెండెడ్ మాస్టర్స్) ఈ గ్రహానికి సంబంధించిన అభివృద్ధికి, రక్షణకు కారకులనే విషయం మనలిని ధైర్యపరుస్తుంది. తమని తాము నాశనం చేసుకోవటమే కాకుండా, ఇతర జీవరూపాలను కూడా నాశనం చేస్తున్న మానవ ఇచ్ఛకు ఈ గురువులు కాపలా దారులు.

ఒకే ఆత్మ యొక్క వివిధ భాగాలుగా మానవులను దైవత్వం ఎలా పరిగణిస్తుందనేది - నాకు బలంగా తాకుతున్న ఇంకో అంశం. ఇంకో దృష్టితో ఆలోచిస్తే మానవులమైన మనం ఒక ఇంట్లో లేదా కుటుంబంలో బతుకుతూ ఒకరినొకరు బాధ పెట్టుకోకుండా, కీడు చేసుకోకుండా, ద్వేషించకుండా ఉండ లేము. ఇది మన మానవులము ఎంత తక్కువ వాళ్లమో తెలియజేస్తుంది. ఒకపక్క మనలో అంతులేని స్థాయి కలిగిన అజ్ఞానానికి చోటిస్తూ, మన ఉనికిని గురించిన వాస్తవాన్ని అర్థం చోసుకోవటానికి ప్రయత్నిస్తున్నాం.

**కాలాను గుణంగా, జ్యోతిశ్శాస్త్రం చెప్పిన నక్షత్ర, గ్రహ ప్రభావంతో మానవుడు ఎలాగా తన జీవితంలో కష్టాల దశలోకి అడుగుబెడతాడో అలా 2012 కూడా అడుగుపెట్టబోతోంది. గొప్ప మార్పుకూడా రాబోతోంది. కాని అర్థంగా ప్రతిదీ సర్వనాశనమయి పోతుందని కాదు. ఈ భూ గ్రహానికి సంబంధించిన ఆత్మ జ్ఞాన గురువులు (అసెండెడ్ మాస్టర్స్) చెప్పిన సూచనలమేరకు ఈ భూ గ్రహంలో మార్పులు రానున్నాయి. వాళ్లు అక్కడ ఉండి భూమిని రక్షిస్తుంటారు. అయితే కొన్ని విపత్తులు రానున్నాయి. అయితే భయ**

పడినంత రావు. ఆత్మ జ్ఞాన గురువులు, మార్గదర్శకులు, దేవుళ్లు చాలా బలవంతులు. వాళ్లు ఈ భూ గ్రహణ నిర్వహణ బాధ్యత తీసుకుంటూ రక్షిస్తారు.

ఆహా! (ఫెవి హాయిని వ్యక్తీకరించే ఒక బలమైన ప్రతిస్పదన) ఎంత హాయిగా ఉంది! దీన్ని బట్టి మృత్యు ప్రవక్తలు ఈ ప్రపంచం ముగిసిపోతోందని గురితప్పిన మార్గంలో ప్రకటించారని తెలుస్తోంది. ఈ సమాచారంలోని కొంత భాగం మనకు స్పష్టంగా చెబుతున్నది. కొన్ని శక్తులు ఈ గ్రహాన్ని నడిపిస్తున్నాయని, ఈ గ్రహానికి ఇదే అంతం కాదని స్పష్టంగా తెలుస్తోంది. ఆ భారీ శక్తులు మనవైపే మొగ్గు చూపుతూ పనిచేస్తున్నాయి. ఈ భారీ మార్పులో మనము వారి రక్షణ కలిగి ఉన్నాం. మానవత్వపు ఆలోచనలను మించిన మార్పులు ఉంటాయని, మిగతా జాతులతో కలిసి ఈ గ్రహవాసులు అందరూ చివరికి శాంతంగా, హాయిగా బతుకుతారని నా ఊహ. ఆ రకమైన చేతనలో మార్పు రావటానికి ఈ గ్రహం కొన్ని ప్రకృతి లేదా మానవుడు సృష్టించే కొన్ని ఉత్పాతాలను గురికాక తప్పదు.

పసిఫిక్ సముద్రము ఈ సంవత్సరం అత్యంత ప్రమాదకరమైన స్థలంగా మారబోతోంది. ఉల్కాపాతం (ఆకాశమునుండి రేఖాకారమైన కాంతి పుంజం కిందకు పడుట—అనువాదకుడు) కూడా ఉండబోతోంది. ఈ భూమిలో ఇద్దరు చంద్రులకు అవకాశం కలుగబోతోంది. భారతదేశము హాయిగా రక్షణలో ఉంటుంది. ఆత్మ జ్ఞాన గురువులు (అసెండెడ్ మాస్టర్స్) బాగా పనిచేస్తే వీటిలో కొన్ని సంభవించవు. మానవులందరూ తమ తమ హృదయాలలో ఒకటే అన్న సానుకూల భావనను కలిగి ఉంటే తప్పనిసరిగా సానుకూల పరిణామాలు వస్తాయి. ఇది ఆత్మ జ్ఞాన గురువులు భూమిని

**దిగజారిపోనీయకుండా చేసే కృషికి సమానమైనది.**

ఈ సందేశం చాలా స్పష్టంగా ఉంది కాబట్టి, వివరణకు కూడా చాలా చోటుంది. మిగతా ప్రపంచభాగాలకంటే, పసిఫిక్ సముద్రం చుట్టుపక్కల ఉన్న దేశాలూ ఎక్కువగా విపత్తులను పంచుకోవలసి ఉంటుంది. గత పదిహేను సంవత్సరాలలో ఉల్కాపాతాల ప్రమాదాలనుండి మనం కాపాడబడ్డాం. (క్లోజ్ షేవ్స్) కాని చాలా కాలం తర్వాత ఈ ఉల్కాపాతాలు రాబోతున్నాయి! ఈ భూ గ్రహానికి ఆ ఉల్కాపాతం (ఆస్ట్రాయిడ్ స్ట్రైక్) రావటం ఎంత దురదృష్టం! ఒకవేళ అదే గనుక సంభవిస్తే ఎక్కడో ఉన్న ఆత్మజ్ఞాన గురువులు ప్రవేశించి కాపాడతారు. కొంత ఎక్కువ ఖగోళసంబంధమైన కార్యక్రమాలు ఉంటాయని- భూమికి రెండు చంద్రులు అని చెప్పటంలో ప్రధాన ఉద్దేశ్యం. ఇది వాస్తవంగా ఎలా జరుగుతుందనేది ఖగోళ శాస్త్రజ్ఞుడు మాత్రమే చెప్పగలడు. నా ఆలోచనలకు ఒకవేళ ప్రతిస్పందనగా భారతదేశ పరిస్థితిగూర్చి చెప్పబడిందేమో! ఎందుకంటే ఆ సమయంలో భారతదేశ పరిస్థితులు ఎలా ఉంటాయని నేను ఆలోచిస్తున్నాను.

ఇంకొకటి చాలా స్పష్టంగా ఈ సందేశంలో చెప్పబడింది. ఒకవేళ మన సామూహిక చేతన (కలెక్టివ్ కాన్స్ యస్‌నెస్) మానవతాబంధంలో ఒకటిగా ముడివడితే, రాబోయే ప్రమాదాల సరిహద్దు మరియు పర్యవసానబాధలు ఆత్మ జ్ఞాన గురువుల సాయంతో తగ్గించబడతాయని చెప్పారు. వ్యక్తిగత స్థాయిలో మనం విశ్వవ్యాప్త ప్రేమ ఫలాన్ని (కోషంట్) పెంచగలిగితే, ఇతర మానవుల యొక్క అసమతుల్యత, అనిష్టము, ద్వేషము మొదలయినవి ఆపగలిగితే - అది ఉపయోగపడుతుందని నేను అభిప్రాయ పడుతున్నాను. అటువంటివ్యక్తి ఈ క్లిష్టపరిస్థితిలో అవలీలగా విజయం సాధించగలడు.

**అన్ని రకాల జాతులు ఈ భూమి మీద ఒకే ఆత్మగా ఉన్నాయి. ప్రతి జాతికి వివిధ రకాల ఉద్వేగాలున్నప్పటికి అవి ఒకే ఆత్మకి సంబంధించినవి. అందువల్ల ప్రతి ఆత్మ గ్రహానికి సంబంధించిన**

ఆత్మ వైపు అభివృద్ధి కొరకు
ప్రయాణించాలి. అన్నీ ఒకటే.

ప్రతి గ్రహము ఆత్మ కలిగి ఉంటుంది. దానిలో శక్తి అనుబంధితమై ఉంటుంది. దానిలో శక్తి అనుబంధితమై ఉంటుంది. విశ్వంలోని ఈ గ్రహాలను - వ్యతిరేక శక్తుల లొంగుబాటు నుండి ఆత్మజ్ఞాన గురువులు, మార్గదర్శ కులు రక్షిస్తారు.వాళ్లు అన్ని గ్రహాల శక్తుల సమతుల్యతను కాపాడతారు. పాఠశాలలో చక్కటి వాతావరణం ఉండేందుకు విద్యార్థులకు ఒక చక్కని స్థాయిని కల్పించే గురువుల్లా ఈ ఆత్మ జ్ఞాన గురువులు గ్రహాలను చక్కగా నిర్వహిస్తుంటారు.

మళ్లీ ఆత్మస్థాయిలో ఐక్యత మీద, ఏకరాగం మీద మళ్లీ అవధారణము (నొక్కిచెప్పడం) చెప్పబడింది. ఇది 2012వ సంవత్సరాన్ని విజయవంతంగా మరియు సురక్షితంగా దాటడానికి సంబంధించిన తాళం చెవి. ఈ సంవత్సరం లో ఒకరి యొక్క ఆధ్యాత్మిక అభివృద్ధి గుర్తించబడదు. బహుమానాలతో సత్కరింపబడదు. ఇది నా అభిప్రాయము. ఇలా కావటం వల్ల ఆత్మ జ్ఞాన గురువులు మార్పులను అతుకులు లేకుండా, నిరాటంకంగా సాధ్యమై నంతవరకు చేయగలరు. ప్రతిజీవి ఆమె/అతని యొక్క వ్యక్తిగత శక్తి తీవ్రతను సానుకూలంగా, అత్యధికంగా ఈ సంవత్సరం పొడవునా చేయటమే అత్యధికమైన ప్రాముఖ్యత కలిగిన విషయం.
తో స్వస్థత చేకూర్చే శక్తిని పంపే పద్ధతిని రేకి అంటారు- అనువాదకుడు) వాళ్లు చేస్తున్న పనిని పొగడండి. వాళ్లు మానవ జాతిని రక్షించటానికి భూమి కుంగి పోకుండా చేస్తున్న కృషికి కృతజ్ఞతలు చెప్పండి.

ఆత్మజ్ఞాన గురువులు (అసెండెడ్ మాస్టర్స్) మన గ్రహం యొక్క మహానిర్మాణం

ద్వారా చాలా క్లిష్టమైన పనిని నిర్వహిస్తున్నారని - దీని ద్వారా మనకు అర్థం అవుతుంది. చైతన్యంగా ఈ గురువుల కొరకు నువ్వు ప్రార్థించు. వాళ్ల పేర్లు నీకు తెలియకపోయినా వాళ్ల గురించి ప్రార్థించు. ఉదాహరణకు నాకు చాలా సంవత్సరాల క్రితం ఒక అదృశ్యగురువు ద్వారా లభించిన ఒక శక్తివంతమైన ప్రార్థనను మీకు అందజేస్తున్నాను. మీరు ఈ ప్రార్థనను కొంత చిరుమార్పుతో చేయండి అయితే మా సొంత ప్రార్థనగాని లేదా గానాన్ని కూడా చేసుకోవచ్చు. సదస్సులు జరిగే రక్షిత ప్రదేశాలలోనూ, (రిట్రీట్స్) సంగోష్ఠులలోను (సెమినార్) నేను నేర్పుతుండే ఓం కారము కూడా మీకు బాగా ఉపయోగపడుతుంది. ఎంత తరచుగా వీలయితే అంత తరచుగా **'రేకి'** చేస్తూ ఉండండి. వారానికి ఒక సారి సామూహికంగా చేస్తే చాలా ఉపయోగపడు తుంది.

ఈ సమాచారము అక్కడితో పూర్తయింది. నేను దీనినంతటిని సంక్షిప్తంగా ఒక చోట చేర్చాలనుకుంటున్నాను. దానివల్ల ఈ సంవత్సరంలో అద్భుతంగా జరగబోయే విషయాలు ఒకచోట తెలుసుకోవాలనుకునే వారికి, కర్తవ్యం చేయాలనుకొనేవారికి ఉ పయోగపడతాయి. ప్రాముఖ్యతను బట్టి ఆ గురువులు ఇచ్చిన సమచారం ఇలా :

1. కులం, మతం, సమాజం, జాతి, మతం, సమూహాలు, జాతులు తల్లిదండ్రులు పిల్లలను పెంచే పద్దతి, దేశాలు, లేదా మానవులను వేరు చేసే,
పక్షపాతం చూపించే తెగలూ వీటి గురించి ఆలోచింప చేసే అన్నిరకాల సాంఘిక, మత, విద్య, గోత్ర బంధనాలను భేదించండి. లక్షలాది కోట్లలో ఉన్న విశ్వవ్యాప్త మానవులందరిలో ఉన్న ఆత్మ ఒకటేనని నిజాయితీగా ఆలోచించండి ఈ 2012 సంవత్సరంలో ఖచ్చితంగా గొప్ప మార్పును ఈ రకమైన ఆలోచనావిధానం తెస్తుంది. ఆ ద్వేషం, అసూయ మొదలైన వాటికి మీ హృదయాలలో, మెదళ్లలో అంగుళం మేర కూడా స్థలం ఇవ్వకండి.

2. ఈ రకమైన ఐక్యత అనుభూతి కోసం రోజూ కొంత సేపు ధ్యానం చేయండి. ఆత్మ జ్ఞాన గురువుల కోసం సామూహికంగా ప్రార్థనలు చేయండి. మహాశక్తిని కూడా ఈ ఆత్మజ్ఞాన గురువుల విజయం కోసం ప్రార్థించండి. మీకు వీలయిన భాషలో మీ ప్రార్థనలను ప్రవేశ పెట్టండి నువ్వు ప్రార్థన చేసే టప్పుడు నువ్వు ఈ భూగ్రహం కోసం సర్వమానవాళికోసం

రక్షణ కోరుతున్నా వనేది ముఖ్యం. **కేవలం నీకుటుంబ సభ్యుల కోసమే ప్రార్థన చేయటం లేదు. మనమందరం కూడా ఒకే ఆత్మ అని గుర్తు పెట్టుకోవాలి.**

3. నీ ఆర్థికాభివృద్ధికోసం ఎంత తాపత్రయ పడతావో, నీ ఆధ్యాత్మిక అభివృద్ధి కోసం కూడా అంత శ్రద్ధ చూపించాలి. ఇది తర్వాత సంవత్సరం అదృష్టానికి వారసత్వంగా వచ్చే కూడబెట్టిన నిధి అవుతుంది.

4. ప్రపంచవ్యాప్తంగా కాని, దేశంలోకాని నువ్వు ఏదైనా ప్రయాణం చేసేటప్పుడు కాని, కదిలేటప్పుడుకాని - ప్రయాణం ప్రారంభించబోయే ముందు నువ్వు రక్షణ గురించి అడుగుతావు. ఒకవేళ ప్రకృతి ఉత్పాతములోకాని, మనిషి సృష్టించిన విపత్తులోగాని చిక్కుకు పోయి ఉంటే సాయం కోసం నీ రక్షకులను,
గురువులను, ఆత్మ జ్ఞాన గురువులను ఆర్తితో పిలుస్తాము.

5. అన్ని సందర్భాల్లోను చాలా సానుకూలంగా, భయం లేకుండా ఉండాలని గుర్తుపెట్టుకోవాలి. ప్రేమను, దయను నీకు వీలయినంతగా పంచు. అన్ని సందర్భాల్లోను సహనాన్ని అభ్యసించు.

పైన చెప్పినదంతా ఈ గందరగోళపు, క్రమము తప్పిన సంవత్సరా లలో నీ రక్షణకు సంబంధించిన పెద్ద దారి అని అనుకోవద్దు. ఇది ఆత్మ జ్ఞాన గురువులను (అసెండెడ్ మాస్టర్స్) ఆధారమయిన విషయం కూడా సహాయానికి సంబంధించిన ఒక చిన్న అంశం కూడా లెక్కపెట్టబడుతుంది.

మీకు ఈ సంవత్సరం ఉత్సాహపూరితంగా, రక్షణాత్మకంగా, ఆధ్యాత్మి కంగా ఉండాలని కోరుకుంటున్నాను.

## ~: ఒక చిన్న ప్రార్థన చేయండి~

2012 వ్యాసానికి సంబంధించి, నేను కింద ఒక ప్రార్థన మరియు ధ్యానము ఇస్తున్నాను. ఇది విశ్వవ్యాప్తంగా ఎంత ఎక్కువమంది వీలయితే అంత ఎక్కువమంది ఈ సంవత్సరం చేయాలి. ముందుగా ఈ ప్రార్థనను ఆత్మీయం (వో ఇట్) చేసుకోండి. అప్పుడు భూ గ్రహం మరియు శక్తులు మనవైపు చూసి, రక్షిస్తాయి

"ఈ సమస్త విశ్వానికి ఒక రూపం కల్పించిన సృష్టికర్తకు నా హృదయపు లోతుల్లోంచి కృతజ్ఞతలు తెలియచేస్తున్నాను. అతి శక్తిశాలి అయిన పరమాత్మను అధిక శక్తి ప్రసాదించవలసినదిగా కోరుతున్నాను. ఈ గ్రహానికి సంబంధించిన ఆత్మజ్ఞాన గురువులకి సాయం చేయవలసినదిగా, వాళ్లని వాళ్ల పనిలో విజయం సాధించేటట్లు చేయవలసినదిగా నేను ప్రార్థిస్తున్నాను. ఈ క్లిష్టమైన సంవత్సరంలో ప్రతిమానవునికి, జీవిస్తున్న ప్రతి జీవికి దైవానుగ్రహం సమృద్ధిగా ఉండాలని, ఆగని నిత్యమైన దయాప్రవాహం కలగాలని నేను కోరుకుంటున్నాను. ఈ గ్రహంపై జరిగే రూపాంతరము (ట్రాన్స్‌ఫారమేషన్) ఎంత వీలయితే అంతగా బాధ లేకుండా చేయాలని కోరుకుంటున్నాను.

ఈ 2012వ సంవత్సరంలో నన్ను, నా ఆత్మీయులను, సమస్త మానవ జాతిని ఆత్మజ్ఞాన గురువులు (అసెండెడ్ మాస్టర్స్) రక్షించాలని ఎలుగెత్తి పిలుస్తూ ప్రార్థిస్తున్నాను. మీరు సామూహిక విజయం కొరకు గ్రహము మీద తెచ్చే గొప్పమార్పులు తక్కువ బాధతో, నాశనముతో ఉండాలని ప్రార్థిస్తున్నాను. ఓ ఆత్మ జ్ఞాన గురువులారా! నాకు వీలయినంతగా మీరు చేసే భారీప్రయత్నంలో సహాయపడగలనని ప్రతిజ్ఞ చేస్తున్నాను. ప్రత్యేకించి నా స్పందనలను ఉన్నతంగా రక్షించుకొంటూ, ఐక్యతాసిద్ధాంతాన్ని నా హృదయంలో పదిలపరచు కొంటానని హామీ ఇస్తున్నాను. గ్రహము యొక్క చేతనతో నా చేతన కూడా కలిసేటట్లుగా నేను పని చేస్తాను. అందువల్ల మనమందరం ఒకటే ఆత్మ అనే భావన వస్తుంది.

భూమి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశము అనే పంచభూతాలు ఈ భూ గ్రహం పై నా ఉనికిని నిలబెడుతున్నాయి. అందుకు వాటికి కృతజ్ఞతలు ఈ కల్లోల వాతావరణంలో

ఈ భూగ్రహం ఈ సంవత్సరమంతా సరిగా నడవటానికి కావలసిన రక్షణ, శాంతము, జీవనాధారము - ప్రసాదించవలసినది గా పంచభూతాలను ప్రార్థిస్తున్నాను.

నా ప్రతి అవసరాన్ని తీరుస్తూ, ఎప్పుడూ సహాయపడుతుండే నా మార్గ దర్శకులకు, ఈ సందర్భంగా కృతజ్ఞతలు చెబుతున్నాను. మీ యొక్క నిరంత రాయమైన సహాయం, రక్షణ - నా జీవితంలోని ప్రతి క్షణంలో నాకు లభించాలని ప్రార్థిస్తున్నాను.''

నిండు హృదయంతో పైన చెప్పిన ప్రార్థన చేసిన తరువాత, కొన్ని నిమిషాల పాటు శాంతంగా కూర్చుని, స్వీయమార్గదర్శినియైన ఈ ధ్యానాన్ని చేయండి.

మీ శ్వాస మీద దృష్టిపెట్టండి (శ్వాసమీద ధ్యాస) . ప్రతి శ్వాసలో భూమి రూపం కంటె - నీ రూపం- చాలా పెద్దదిగా అయిపోతున్నట్లు, పెద్దదయినట్లుగా ఊహించుకో. తర్వాత బాగా పెద్దదయిన నీ రూపం యొక్క అరచేతులలో ఈ అందమైన భూ గ్రహం ఇమిడిపోయినట్లు తలచుకో. అరచేతులలో ఇమిడిన భూ గ్రహాన్ని ఎంతో ప్రేమతో చూడు. ఇప్పుడు నీలోపలికి నిన్ను చూసు కొనేందుకు ప్రయత్నించు. ఇతర మానవులు మరియు భూమిపై నివసిస్తున్న ప్రతిజీవి - నీ ఆత్మగా చూడటానికి ప్రయత్నించు. నీ అరచేతులలో ఉన్న భూమిని తెల్లటి వెలుగులో కాంతిమంతమైన బుడగగా కప్పిఉంచు. మనస్సులో భూమి మరియు నివాసులు అందరూ సంపూర్ణ రక్షణలో ఉన్నారని బలంగా తలచుకో. ఇప్పుడు ఆ తెల్లటి బుడగను యథాతథంగా ఉంచండి. మీ ఆత్మ తిరిగి తన ప్రదేశంలోకి వచ్చినట్లుగా మృదువుగా ఊహించుకోండి. ఆ ఆత్మని మీ హృదయ చక్రం మధ్యలోకి ఉ ంచండి. సుమారుగా అది మీ రొమ్ము మధ్య భాగంలో ఉంటుంది. ఈ ధ్యానము చేసినంతసేపు శాంతాన్ని ఉత్సాహాన్ని మీరు అనుభవించండి.

**2013 ఒక సంవత్సరం తరువాత**

మొదట అది 12-12-12, ఆ తరువాత 21-12-12 వచ్చింది. ఏమీ జరుగలేదు. భూమి ఉపరితల పొర గ్రహము యొక్క తోలు తీయలేదు. (ద క్రస్ట్ డిడ్‌నాట్ పీల్ ఆఫ్ ద ప్లాంట్) అగ్ని పర్వతాలూ అగ్ని కార్యక్రమాలు నిర్వహించలేదు. సునామీలూ ఖండాలను

మింగివేయలేదు. మాయా ప్రపంచాని కి సంబంధించిన జనులు చెప్పినట్లుగా 2012 సంవత్సరంలోనే ప్రళయం రాలేదని చాలామంది ఆశ్చర్యపోతున్నారు. ప్రతి ప్రళయ కాల కళాకారుడు మాయా జ్యోస్యాన్ని అద్భుతంగా, అలౌకికంగా ఈ సంవత్సరాంతం ఉండ బోతోందని తీవ్రంగా పరిశ్రమించి (వెంట్ టు టౌన్) వ్యాఖ్యానం చేసారు.

నిజంగా డిసెంబర్ 2012న ఏమైనా జరిగిందా! లేదా "ప్రపంచం అంతమైపోవటం" అనే పెద్ద నకిలీ మంత్రం సులభంగా నమ్మే వారి మనస్సులపై ఆటలాడుకొందా! ముందు మనం వాస్తవంగా ఏం జరిగందో చూద్దాం తరువాత 2013వ సంవత్సరము ఈ గ్రహానికి, మరియు వ్యక్తిగతంగా ఏం చేయబోతోందో తెలుసుకొందాం.

మన గ్రహము మరియు సౌరకుటుంబం పాలపుంత గుంపులో పోల్చి చూస్తే ఒకే వరుసలో ఉన్నట్లుగా మీలో చాలా మంది చదివి ఉంటారు. విని ఉంటారు. ఈ విజ్ఞానశాస్త్ర సత్యాన్ని చాలా మంది ఖగోళ శాస్త్రజ్ఞులు ధ్రువీకరించారు. అన్ని ఆనందకరమైన శరీరాలు బ్రహ్మాండమైన అయస్కాంత ప్రభావానికి ప్రయత్నిస్తాయి. ఇది క్రమంగా మన విధిలో ముగుస్తున్న సమయ పరికరాల పట్ల పాత్రను నిర్వహిస్తాయి. ఈ కొత్త అమరిక కూడా గ్రహము యొక్క భవితవ్యముపై ప్రభావాన్ని కలిగి ఉంటుంది. తత్ఫలితంగా వ్యక్తిగతం గా కూడా ప్రభావం ఉంటుంది. మన అదృష్టం కొద్ది మనకు ఈ ఖగోళ సంబంధ మైన అమరిక అత్యధికమైన సానుకూల ప్రభావాన్ని చూపిస్తుంది. మానవ పరిణామంలో చక్కటి ఉత్పత్తి శకానికి దారి సూపిస్తాయి. ఇంకో మాటల్లో చెప్పాలంటే, భూ గ్రహం అనేదాన్ని ఒక వ్యక్తిగా భావిస్తే, ఒక జ్యోతిష్కుడు దానిని సందర్శించి భవిష్యత్తును చెప్పమంటే - అది ఇలా ఉంటుంది.

"నక్షత్రాలను అనుసరించి, నీ జీవితంలో నువ్వు గొప్ప దశను పొందబోతున్నావు. అసహ్యాకరమైన, బాధాకరమైన కాలం వెళ్లి పోయింది. ఇంకా ముందు ముందు కూడా ఎప్పుడూ రాదు. నీ భవిష్యతు ప్రతి దశలో బ్రహ్మాండంగా వెలిగిపోతుంటుంది.

అలాగే 2012వ సంవత్సరం చివర్లో నక్షత్రాల అమరిక పూర్తయింది. అందమైన

భవిష్యత్తు వికసించటానికి దగ్గరి త్రోవ ఏర్పడింది. భూమి కూడా కొత్త దశలోకి ప్రవేశిస్తోంది. మొట్టమొదటిసారిగా విధికి సంబంధించిన అపరిచిత దశలోకి భూమి ప్రవేశిస్తోంది. ఈ దగ్గరి త్రోవ (కటాఫ్) సంవత్సరం ఎలా పని పూర్తి చేస్తుందో, (పానొట్) ఎలా ఈ మార్పు భౌతిక వాస్తవికతలోకి వికసిస్తుందో ఎవరూ సరిగా భావించలేరు. అందువల్ల కొన్ని గ్రంథాలు, మత పరమైన పుస్తకాల మాయావాదులకు సంబంధించిన వికసన సంస్కృతులు - రాబోతున్న ఈ మార్పును లెక్కపెట్టారు కాని, 2012 సంవత్సరం తర్వాత భవిష్యత్తు ఎలా ఉండబోతుందనే దాన్ని చెప్పటానికి సాహసం చేయలేదు 2012. చివరి వరకు అన్ని జ్యోస్యాలు ఇప్పటికి పూర్తయ్యాయి. మన మందరం కూడా మన జ్ఞానంలో - ఈ ప్రపంచం అంతం ఇది అని భావించాం. కాని మనం మార్పుకు సాక్షులమయ్యాము. చక్కటి వాతావరణంలో కొత్త సంవత్సరంలోకి అడుగుపెట్టాం. నేను ఈ సంవత్సరం భవిష్యత్తులోకి దృష్టిపెడతాను.

అసలు నిజంగా ఈ వదంతికి సంబంధించిన వివరాలేమిటి? నిజమైన దృష్టికోణంలో నీ జీవిత వాస్తవితకు సంబంధించి రోజు రోజుకి మార్పు ఎలా వస్తుంది? దీనిని వివరించబోయే ముందు 2012 మార్పుకి సంబంధించిన బ్రహ్మాండమైన కాల్పనిక విషయం గత పది సంవత్సరాలనుంచి విసుగు పుట్టించే టట్లుగా నలుగుతోంది. దానిని ముందు తుడిచి వేస్తాను. విశ్వవ్యాప్తవేగ సాధనాలు (గేర్స్) మనకి అకస్మాత్తుగా అధివాస్తవికమైన బంగారు శతాబ్దిని తీసుకొని వస్తాయని మనలిని ఊరిస్తున్నారు. డిసెంబర్ 21 మరియు డిసెంబర్ 23, 2012 మధ్య ఒక విప్లవాత్మకమైన పరిణామము రానున్నదని చెబుతున్నారు. $180^0$ డిగ్రీల కోణంలో - (వ్యతిరేక కోణంలో) అది ప్రతి వ్యక్తి మనస్సు అభిముఖమవుతుంది. **బింగో**.. (సానుకూలంగా జరిగినప్పుడు ఉచ్చరించే మాట - అనువాదకుడు) 2013 సంవత్సరం జనవరి మొదటి తారీఖున ఆరున్నర లక్షకోట్ల మంది జ్ఞాన పరిపూర్ణ గురువులు కొత్తగా ఉదయించిన గ్రహం మీద ఉత్సాహంగా, అవిశ్రాంతంగా తిరుగుతుంటారు. మనం దాన్ని పొందాం, దాన్ని గురించి భయపడ్డాం, చర్చించాం మరియు దాన్ని గూర్చి ఆనందం పొందాం. ఇప్పుడు దానిని పరిష్కరిద్దాం.

విశ్వస్థాయిలో నిజంగా ఉప్పుడు ఏం జరిగిందో, అది ఎలా జరిగిందో- ముందుగా మీకు ఇప్పుడు తెలియజేస్తాను. తరువాత అది వ్యక్తిగత స్థాయిలో ఎలా నాశనం చేసిందో

తెలియజేస్తాను. చాలా మటుకు శక్తిలో ప్రధానమైన మార్పు వచ్చింది. అది గత కొన్ని సంవత్సరాలుగా అభివృద్ధికరంగా పని చేస్తూనే ఉంది. గ్రహాల అమరిక సమయంతోనే మనం ఈ 2012 సంవత్సరం చివరి నాటికి ఒక రకమైన శక్తిని విశ్వం నుంచి పొందామని కొంతమంది వాదిస్తున్నారు. అవును! సామూహిక చేతనలో ఒక సమూలమైన మార్పు రావటానికి ఈ శక్తి మార్పిడి కీలకమైనది. సామూహిక చేతన లేకపోతే గ్రహము తన కాంతిమయమైన భవిష్యత్తును అనుభవించలేదు. కాని ఇది ఒక్క రాత్రిలో జరిగిపోదు. ఇది తీవ్రాతి తీవ్ర వేగంతో జరుగుతుంది. గతంలో జరిగిన ఒక వాస్తవాన్ని ఈ సందర్భంగా మనం మరిచిపోకూడదు. సామూహిక చేతన ఏదైనా తన ఫలితాలను చూపటానికి కొన్ని సంవత్సరాల పాటు సమయం పడుతుంది. ఇప్పుడు ఈ శక్తి మార్పిడి వలన, సామూహిక చేతన యొక్క ప్రధానమైన మార్పు కొన్ని దశాబ్దాల పాటు తగ్గించబడింది. దీని అర్థం ఏమంటే 2013 మొదలుకొని, విశ్వవ్యాప్తచేతన మార్పు చాలా భారీగా ఉచ్ఛరింపబడుతుంది. ఇది రాబోయే 20 నుంచి 30 సంవత్సరాల పాటు అద్భుతమైన వేగంతో కొనసాగించబడుతుంది.

మనము విశ్వవ్యాప్త ఆలోచన లోని మార్పు గురించి లేదా సామూహిక చేతన మార్పు గురించి ఆలోచిస్తున్నప్పుడు - నిజానికి దాని అర్థం ఏమిటో తెలుసుకోవాలి. ప్రపంచవ్యాప్తంగా ఎక్కువ మంది ప్రజలు అప్రయత్నంగా (ఎఫర్ట్‌లెస్లీ), మనస్సుకు తెలియకుండా (ఇన్‌వాలంటర్లీ) అవలీలగా (          ) ఆలోచించారు, నిర్ణయించారు, ప్రవర్తించారు.

ఒక దృష్టి కోణంలో 2013 ప్రారంభం నుంచి జరగబోయే పెద్ద ముక్కలు కాబోతున్న మానవతకు, ఎటువంటి సిద్ధాంతములను మనస్సుకు ఎక్కించు కోకుండా పరిశీలిద్దాం. పాత ఆలోచనా పద్ధతిని భర్తీచేస్తూ, ఉన్న మానవ క్రియా శీలత క్రింది విషయాలలో ఈ విధంగా ఉంటుంది.

— హింసాద్వేషాలకు బదులుగా వాటిస్థానంలో దయ, సహనాలు

— దురాశ, స్వార్థాలకు బదులుగా వాటి స్థానంలో దాతృత్వము మరియు సామూహిక బాధ్యతలు

– భయము, క్రూరత్వాకు బదులుగా జ్ఞానము, న్యాయము

– పక్షపాతము మరియు ద్వేషము (పగ) లకు బదులుగా ప్రేమ మరియు మానవత్వము

– మత సంబంధమైన మూఢ విశ్వాసమునకు బదులుగా తెల్ల కాగితం లాంటి మనస్తత్వము (ఓపన్ మైండ్‌నెస్) మరియు సహనము

– సంస్థాగతమైన మత దృష్టికి బదులు స్వీయసాధికారిక ఆధ్యాత్మిక జాగరూకత (సెల్ఫ్ాయంపవరీ నో స్పిర్చువల్ అవేర్‌నెస్)

– మత మరియు జాతీయ ఆసక్తులు బదులుగా విశ్వ మరియు సార్వత్రిక ఆసక్తి.

నేను ఆదర్శ ధామం (ఆటోపెయిన్) గురించి మాట్లడుతున్నానా? కొంచెం దానికి సంబంధించినదే కావచ్చు. మార్పుకు సంబంధించిన నిరోధక శక్తి ఇప్పుడే కదలటం మొదలుపెట్టింది. అందువల్ల ఆదర్శధామపు ఆలోచనలు మంచివే మళ్లీ ఒకసారి చెబుతున్నాను. రాబోయే 12 నెలల్లో నేరము, దోపిడి, కుంభకోణాలు, మానభంగం, హత్య, తీవ్రవాదం, యుద్ధాలు, రక్తపాతం, ఆకలి - ఇలాంటివన్నీ నెమ్మదిగా జరగటం ఆగిపోయి తగ్గిపోతాయని దాని అర్థం కాదు. 1990కి ముందు జన్మించిన వారు అపజయానికి సంతానం పుట్టే అవకాశం ఉంది కనుక - దాన్ని సమూలంగా నాశనం చేయగలగాలి. (స్టాప్ టు డై అవుట్) లేదా నిర్ణయాలు తీసుకొనే అధికారశక్తి అయినా పొంది ఉండాలి. అప్పుడే నాటకీయమైన మార్పు వస్తుంది. 1990 తర్వాత పుట్టిన జీవాత్మలు, ప్రత్యేకంగా - 2000కి తర్వాత పుట్టినవారు, ఖచ్చితంగా 2012 తర్వాత పుట్టినవారు - ప్రపంచస్థాయిలో తమ అధికారాన్ని అమలు చేస్తారు. స్పష్టమైన సామూహిక చేతన సైద్ధాంతికమవుతుంది (ఆబ్వియస్).

అందువల్ల 2013లో మనం ఏమి ఆశించగలం? శక్తియొక్క మార్పు దృఢసంకల్పంతో బలంగా వ్యతిరేక భావాలను తెల్పుతుంటే (కిక్స్ాఇన్), మనం
కొన్ని అద్భుతమైన, ఇంతకుముందు సంవత్సరంలో, ఆముందు సంవత్సరాలలోను చూడని అద్భుతమైన సన్నివేశాలను మనం చూడబోతున్నాం.

మరీ ముఖ్యంగా మనం అప్రయత్న పూర్వక స్వభావం కలిగిన సామూహిక చేతనగల భారీ సమూహాలను చూడబోతున్నాం. ఈ సమూహాలలోని వ్యక్తులు ఆర్థిక శాస్త్రం, వ్యాపారం, వాణిజ్యం, మతం, ప్రభుత్వం, విశ్వసంఘర్షణలు, మతాలు మరియు దేశాల భవిష్యత్తుకు సంబంధించిన శాఖోపశాఖలుగా కలిగిన విధానాలు, రాజకీయాలు, సన్నివేశాలు వీటిల్లో సానుకూల మార్పును తేనున్నారు. అయితే ప్రతి సందర్భాన్ని ఎవరూ జ్యోస్యం చెప్పలేరు. ప్రతి నెల ఏదో ఒక ఆశ్చర్యకరమైన మలుపు తెస్తుంది. అది విశ్వస్థాయిలో పెద్దది లేక చిన్నది కావచ్చు. ఆ మలుపు - ముందుకు వెళుతున్న మానవ చేతను నూతన దిశలో ప్రదర్శిస్తుంది.

ఇప్పుడు ప్రతి ఒక్కరికి వ్యక్తిగతంగా ఈ సంవత్సరం ఏం తెలియ జేయనుందో తెలుసుకుందాం. శక్తి దాయకమైన మార్పు కొందరి వ్యక్తిగత జీవితాలను తేలికగా, మరికొందరి జీవితాలను కష్టంగా మారుస్తుంది. అది ఎలా పని చేస్తుందో తెలుసుకోవటానికి ఇది చదవండి. ఆలోచనలో మీరు చేసే ప్రతి మానసికమైన మార్పు - రోజు వారి జీవితంలో మీరు చేసే కదలికలు - నూతన శక్తికి అనుగుణంగా చేయాలి. దానికి గాను నేను పైన రెండు రచనా పరిచ్ఛేదాలు (పేరాగ్రాఫ్స్) ఇచ్చాను. అవి బాగా చదివితే మీకు అనుగుణంగా, ఆశ్చర్యకరమైన శక్తిమంతమైన ఫలితం వస్తుంది. అర్థమేమిటంటే - నువ్వు చాలా వేగంగా మరియు శక్తిమంతంగా నీ వ్యతిరేక ప్రవృత్తులను తరిమివేయాలి - దానికి తోడు సానుకూల ఆలోచన జోడు కావాలి. నువ్వు ఇంకా ముందుకు భయంలేకుండా వెళ్లితే, ఎక్కువ విజయము మరియు ఆనందము అనుభవిస్తావు. నువ్వు ఏమీ మారకుండా ఉంటే, పాతశక్తితో కూడిన వ్యతిరేక ఉద్వేగాలు కలిగి, వాటినే నిత్యం అనుసరిస్తుంటే, ఇంకా ఎక్కువ కష్టాలు, ఒత్తిడి మరియు అసమతుల్యతను నువ్వు ఎదుర్కోవలసి ఉంటుంది. 2013వ సంవత్సరములోని ప్రధానమైన తేడా అది. నుప్రవ్వ సానుకూల ప్రవృత్తులు అనుసరిస్తుంటే, అవి నీకు వేగవంతమైన శక్తివంతమైన ప్రతిస్పందనను - పరిసరాలనుండి అంద చేస్తాయి. నీ వ్యతిరేక ప్రవృత్తులు నీకు - నీ అర్హత కలిగిన కష్టాలకంటే - ఎక్కువగా వైపరీత్యాలను కలుగచేస్తాయి. ఎందుకంటే - నువ్వు మార్పు తీసుకొన్న ప్రదేశంలోని శక్తితో నువ్వు జతకలవకపోవటం వల్ల ఎక్కువ వైపరీత్యాలు వస్తాయి.

నిజానికి మనందరికి వ్యక్తిగతంగా ఎవరి గమ్యాలు వాళ్లకి ఉన్నాయి. అలా జీవించాలిసి ఉంది. అయితే నువ్వు అనుభవించవలసిన కర్మల తీవ్రత తగ్గంచుకోవటం- లేదా - కఠినమైన

సవాళ్లను అధిగమించటం - ఇవి పూర్తిగా, సమగ్రంగా నీ చేతుల్లోనే ఉంటాయి. ఇదంతా నిన్ను పాలిస్తున్న వ్యతిరేక, సానుకూల ప్రవృత్తులకు నువ్వు అనుమతి ఇవ్వటం మీద ఉంటుంది. ఆ ప్రవృత్తులు నీ ఆలోచనలు, పనులు మరియు నిర్ణయాలపై ఆధారపడి ఉంటాయి. కర్మ స్వభావానికి అనుగుణమైన బంధుత్వాలు, ఒక్కసారిగా తీవ్రమైన, దీర్ఘకాల ఫలితాలను అందించే మార్పులను నీకు ఇస్తాయి. వాటిననుసరించే నీ మొదటి కదలిక ప్రేమ, ఓపిక, సహనము, మరియు ఆకర్షణవైపు నడుస్తుంది. అందువల్ల నీ కర్మ అనే పలక - పూర్తిగా చెరగకపోయినా, నీ బంధుత్వాల విషయంలో - నువ్వు బాగా బాధపడటం లేదా సంతోషించటం - అనేది - నీ చేతుల్లోనే ఉంది. నీ యొక్క సానుకూల దృక్పథం - నీకు బాధలో తగ్గింపును ఇస్తుంది. నీ వ్యతిరేక దృక్పథం అనేక రకాలుగా బాధను విస్తరింపచేస్తుంది. బహుశా జీవితం వాస్తవ వేగంతో నీ ఆలోచనా పద్ధతిని చివరి వరకు కఠినంగా మారుస్తుంది. చురుకుగా అనుసరించే ఆ ఆధ్యాత్మిక మార్గం చాలా వాటిని పొందవలసి ఉంటుంది. పెరిగేందుకు ఉన్న అవకాశాల పరంగా, స్వీకరించవలసిన అనుభవాల పరంగా, నువ్వు చేసే పరిపూర్ణ అభివృద్ధి - నీకు శ్వాస లోనుంచి కొంచెం సుఖం మిగిలిస్తుంది. (అమ్మయ్యా! అనే హాయిని నీకు కలిగిస్తుందని భావం - అనువాదకుడు) నువ్వు ఎవరిని అనుసరిస్తున్నావు లేదా ఏమి అభ్యాసం చేస్తున్నావు ... అనే దానితో సంబంధం లేకుండా - నీ ఉత్సాహాన్ని నిరోధించ టానికి అనుమతిని ఇవ్వకు నీ నమ్మకాన్ని సంకోచింపచేయకు అలా చేస్తే ఈ సంవత్సరం చివరకు నువ్వు పొందేదాన్ని చూసి నువ్వు చాలా ఆశ్చర్యపోతావు.

బ్యాక్ కవర్ పేజ్

శాశ్వతమైనది అను అర్థము కలిగిన సంస్కృత శబ్దమైన "అమృత" శబ్దము నుంచి 'అమృత్' అను ఆంగ్ల పదము పుట్టింది. "అమృతము" అనుపేరు తో మీ చేతిలోఉన్న ఈ పుస్తకంా మరణము లేని శాశ్వతయోగి మహావతార్ బాబాజీ చేత గురూజీ నౌషిర్‌కు పట్టుబడిన గాఢమైన ప్రేమ, జ్ఞానముల సంపుటి ఈ పుస్తకము నిశితమైన అంతర్దృష్టితో ప్రేమ, హాస్యముల సంచారములు కలిపినా ఆధ్యాత్మిక అభ్యాసాల మార్గదర్శిని, ఇది "లో" జీవితములోని అన్ని అంశాలను తడుముతుంది. ప్రపంచము "లో" ఎలా జీవించాలో, ఉండాలో చెబుతుంది. ప్రపంచము "తో" ఎలా బతకాలో చెప్పదు. ఈ గ్రహముపై మన జీవన యాత్ర సరితూగేటట్లు, సంతోషించేటట్లు, ఉన్నత పథాలు ఎక్కేటట్లా ఈ పుస్తకం చేస్తుంది.

1998 నుండి 2003 సంవత్సరముల వరకు ముగ్గురు మార్మికమైన యోగులను కలుసుకొనే దాకా - గురూజీ నౌషిర్ ఒక విజయవంతమైన వృత్తి నిపుణులు. ఆ ముగ్గురు మార్మికయోగులను కలుసుకోవటము ద్వారా గురూజీ నౌషిర్ జీవితము పూర్తిగా మారిపోవటమే కాకుండా శక్తిమంతమైన "లోపలి" ప్రయాణానికి దారి తీసింది. ఆ విచారణ నుండి వేళ్లు తన్నిన మానవుల బాధలకు మరియు కష్టాలకు సమాధానములు దొరికాయి. సరిగ్గా అదే సమయంలో 2000వ సంవత్సరము నుండి హిమాలయాలకు చెందిన మరణము లేని యోగి మహావతార్ బాబాజీ నుండి వ్రాతపూర్వకమైన సమాచారాన్ని అందుకోవటం మొదలు పెట్టారు. అప్పటి నుండి మహావతార్ బాబాజీ ఆయన యొక్క స్థిరమైన జ్ఞాన కేంద్రంగా, మార్గదర్శిగా మారారు. ఇది హిమాలయాలలోని నిర్జన ప్రదేశాలలోకి 2010 లో గురూజీ నౌషిర్ వెళ్లేటట్లుగా పరిణమించి, అరుదైన వాటిల్లో అరుదైన బహుమతులను పొందేటట్లు, చేసింది, మహావతార్ బాబాజీని వ్యక్తిగతంగా దర్శించి, వారి మాటలను వినటం జరిగింది.

గురూజీ నౌషిర్ "మహావతార్ బాబాజీ తదేకం" అను పేరుగల సంస్థ స్థాపకులు, మానవులను బాధలనుండి పరిష్కారంవైపు మరియు అజ్ఞానం నుండి జ్ఞానోదయం వైపు ఈ సంస్థ మార్గదర్శకత్వంతో నడిపిస్తుంది.

తన తపస్సు చేసే సమయంలో అసంఖ్యాకమైన తన అనుయాయుల కొరకు సమాచారాన్ని అందించటానికి గురూజీ నౌషీర్ వ్రాసిన వ్యాసాల సంపుటి ఈ పుస్తకం. అనేక మంది శిష్యులు ఆలోచనలను రేకెత్తించే వారి వ్యాసాలకు సంబంధించి ప్రశ్నలు అడిగారు. ఈ ప్రశ్న జవాబులతో కూడిన ఇటూ అటు సమాచారము కూడా ఈ పుస్తకంలో చేర్చబడింది. ఇది తాజా దృష్టి కోణాన్ని వెల్లడి చేయడమే కాకుండా, విషయాన్ని తేలికగా అర్థమయ్యేటట్లు చేస్తుంది.

స్వస్తి